


# INDIAN FREEDOM MOVEMENT: MUSLIM WOMEN.

Telugu name of this book is BHARATHA SWATHNTRODYMAM : MUSLIM MAHILALU.

In this Book total 61 Life sketches of those great Muslim women, who took very active role in the struggle for the independence of India is given. It starts form Begum Hazrath Mahal of 1857 and ends with the story of Nafis Aysha of 1948 who fought against Nijam in Andhra Pradesh and some other Women who took part in the Local Struggles.

This Book contains total 286 Pages. 1/8 the Demmy Size with Multi colour title. This same is published in the year 2006 with numbers of Photos and Sketches.

Actually this book is written and Published in 1999 with only 32 Pages later on it was rewised and rewritten in the year 2003 with 86 Pages and published second time in the same Year.

భారత స్వాతంత్ర్యోద్యమం

# ముస్లిం మహిళలు



సయ్యద్ నశీర్ అహమ్మద్



## సయ్యద్ నశీర్ అహమ్మద్

| | | |
|---|---|---|
| తల్లిదండ్రులు | : | సయ్యద్ బీబీజాన్, సయ్యద్ మీరా మొహిద్దీన్ |
| జననం | : | 22 డిసెంబరు 1955 |
| పుట్టిన ఊరు | : | నెల్లూరు జిల్లా పురిణి గ్రామం |
| వృత్తి | : | న్యాయవాది |
| ప్రవృత్తి | : | జర్నలిజం (రెండు దశాబ్దాలపాటు 'ఉదయం', 'వార్త' దినపత్రికలలో, 'సిటీ కేబుల్ నెట్‌వర్క్ ప్రైవేట్ లిమిటెడ్'లో పలు బాధ్యతల నిర్వహణ.) |
| జీవిత భాగస్వామి | : | షేక్ రమిజాబాను |
| సంతానం | : | సయ్యద్ జాస్మిన్ అహమ్మద్<br>అల్లుడు : డా॥ ఎస్.ఎం. తల్మీజుద్దీన్ |
| సాహితీ కృషి | : | ప్రముఖ తెలుగు పత్రికల్లో పలు కవితలు, కథానికలు, వ్యాసాలు |
| రచనలు | : | ఏడు చరిత్ర గ్రంథాలు ముద్రితం |
| ఆశయం | : | లౌకిక ప్రజాస్వామ్య వ్యవస్థ |
| వ్యాపకం | : | అధ్యయనం, రచన, ప్రచురణ, ప్రసంగాలు |
| నివాసం | : | శివప్రసాద్‌స్ట్రీట్, కొత్తపేట,<br>వినుకొండ-522 647, గుంటూరు జిల్లా.<br>Cell : 9440241727 |


TELUGU PUBLICATIONS
(Under TIP Trust)
SANDESHA BHAVANAM, CHATTA BAZAR,
HYDERABAD - 500 002.

ISBN 81- 88241 - 45 - 8

భారత స్వాతంత్ర్యోద్యమం

# ముస్లిం మహిళలు


సయ్యద్ నశీర్ అహమ్మద్

M.Com; LLB; D.P.M; D.L.L

Sahitya Ratna (Hindi)



తెలుగు పబ్లికేషన్స్

**( Under TIP Trust)**

సందేశభవనం, లక్కడ్‌కోట్,

హైదరాబాద్-500 002.



**Indian Freedom Movement : Muslim Women** (Telugu)

Written by : **Syed Naseer Ahamed**

**TIP Series No. 150**





| | | |
|---|---|---|
| First Edition | : | November, 2006 |
| Copies | : | 2000 |
| ISBN | : | 81-88241-45-8 |
| Published by | : | Telugu Publications<br>( Under TIP Trust)<br>Sandesha Bhavanam,<br>Lakkadkot, Chatta Bazar,<br>Hyderabad-500 002. India.<br>Phone: 24564583 |
| Typeset by | : | Geeturai Graphics<br>Lakkadkot, Hyderabad-2. |
| Printed at : | : | Cosmic Printers<br>Lakkadkot, Hyderabad-2. |
| **Price** | **:** | **Rs. 160** |

# ఇందులో....







**అబ్బాదుల్లా**
డైరెక్టర్
తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
సందేశభవనం, లక్కడ్‌కోట్
ఛత్తాబజార్, హైదరాబాద్-2

## ప్రచురణకర్త మాట

ప్రముఖ రచయిత సయ్యద్ నశీర్ అహ్మద్ రచించిన **భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లిం మహిళలు** అను ఈ పుస్తకం ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం నుండి ముస్లిం మహిళలు నిర్వహించిన పాత్రకు అద్దం పడుతుంది. చరిత్ర పరిశోధకుడు నశీర్ అహ్మద్ రాసిన ఈ పుస్తకం భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లిం మహిళలు పాత్రను అవగాహన చేసుకోవడానికి ఎంతగానో సహకరిస్తుంది.

ఈ పుస్తకం **ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్** ద్వారా 1999లో ప్రచురితమైంది. ఆ సందర్భంగా లభించిన పాఠకాదరణ వలన 2003లో మరింత సమాచారంతో పునర్ముద్రితమైంది. భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల భాగస్వామ్యం గురించి ప్రత్యేకంగా మహిళలు నిర్వహించిన పాత్ర గురించి తెలుగులో పుస్తకాలు లేని లోటును ఈ పుస్తకం తీర్చడంతో పాఠకుల, పండితుల విశేష ఆదరణ లభించింది. ఆ కారణంగా మరిన్ని మార్పులతో, ఎన్నో చేర్పులతో, పలు చిత్రాలు, ఫోటోలను సమకూర్చుకుని మూడవసారి ముచ్చటగా ప్రస్తుతం మీ ముందుకు వచ్చింది.

మన దేశంలో శతాబ్దాలుగా కలసిమెలసి సహజీవం సాగిస్తున్న వివిధ సాంఘిక జన సముదాయాలు తమ తమ పూర్వీకులు మాతృదేశ విముక్తి కోసం, ఆ తరువాత స్వంతగడ్డ ప్రగతి కోసం చేసిన త్యాగాలను, సాగించిన కృషిని పరస్పరం తెలుసుకుంటే ఒకరి పట్ల మరొకరికి గౌరవభావం ఏర్పడుతుంది. ఆ గౌరవభావం నుండి ఆయా ప్రజా సముదాయాల మధ్య సదవగాహన, సద్భావన పరిఢవిల్లుతాయి. ఆ సద్భావన నుండి సహిష్ణుత ఉద్భవిస్తుంది. ఆ కారణంగా మత సామరస్యం మరింత పటిష్టం కాగలదని ఆశిస్తూ...

**- అబ్బాదుల్లా**




**డాక్టర్ ఆవుల మంజులత, M.A., Ph.D.**

వైస్ ఛాన్సలర్

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

**హైదరాబాద్.**


# పరిచయ వాక్యం

ప్రపంచ విముక్తిపోరాటాల చరిత్రలో భారతీయులు సాగించిన స్వాతంత్ర్య సంగ్రామం సువర్ణాక్షరాలతో లిఖించదగిన మహత్తర ఘట్టం. బ్రిటీష్ వలసపాలకుల నుండి స్వేచ్ఛ – స్వాతంత్ర్యాలు కోరుకుంటూ భరతగడ్డ మీద ఉన్న అన్ని సాంఘిక జనసముదాయాలు ఏకోన్ముఖంగా పోరుబాటన సాగాయి. ఈ పోరాటాలలో పురుషులతోపాటు మహిళలు కూడా ప్రత్యక్షంగా పరోక్షంగా కీలక పాత్రలను పోషించారు. సమరశీల మహిళలు పురుషులతోపాటుగా ప్రత్యక్షపోరాటంలో భాగస్వాములు కాగా, ఆచార సంప్రదాయాలు, సామాజిక పరిమితులలో ఉన్న మహిళలు ఉద్యమకారులైన తమ కుటుంబ సభ్యులను బ్రిటీషు ప్రభుత్వ వ్యతిరేక పోరాటాల దిశగా ప్రోత్సహిస్తూ స్వాతంత్ర్య పోరాటంలో అద్వితీయ పాత్ర వహించారు. కాని, భారతదేశ దాస్య శృంఖలాల విముక్తికి తమ సర్వస్వం ఒడ్డి పోరాడిన అనేక మంది మహిళల గురించి నేటి తరానికి తెలిసింది తక్కువ. చాలా మంది మహిళల పోరాటగాథలు చీకటి పుటల్లోనే ఉండిపోయాయి. ముస్లిం మహిళల విషయంలో ఈ వివక్ష మరింత ఎక్కువగా కనబడుతుంది. మాతృ దేశం కోసం, జాతి జనుల కోసం పోరాడి, ఆనాటి పోరాటాలకు స్ఫూర్తి నిచ్చిన ముస్లిం మహిళల జీవిత చరిత్రలను క్లుప్తంగా మన ముందు ఉంచడం ద్వారా రచయిత సయ్యద్ నశీర్ అహమ్మద్ నేటి తరానికి అత్యంత అవసరమైన అమూల్యమైన చరిత్ర గ్రంథాన్ని అందించారు. ఇది కేవలం చరిత్ర గ్రంథం మాత్రమే కాదు, చరిత్రలో మరుగునపడిన మాణిక్యాలను వెలికితీసి, వారి త్యాగమయ జీవితపు ప్రేరణాత్మక వెలుగులను మనకు పరిచయం చేసే పరిశోధనాత్మక గ్రంథం.

స్వాతంత్ర్య పోరాటంలో లక్షలాది మంది పాల్గొన్నారు. అందులో స్త్రీలు కూడా చాలామంది పాల్గొన్నారు. కాని స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొన్న స్త్రీల గురించి చాలా తక్కువ సమాచారం నేడు అందుబాటులో ఉంది. ముస్లిం స్త్రీలకు సంబంధించి,



దేశస్వాతంత్ర్య పోరాటంలో వారు నిర్వహించిన అసాధారణ భూమిక గురించి సమాచారం నేటి సామాన్య చరిత్ర పుస్తకాల్లో దాదాపుగా అలభ్యం అనే చెప్పాలి. అందుకు కారణాలు ఏమైనా గాని, స్త్రీల పట్ల వివక్ష వల్ల ఇలా జరిగినా లేక మరే విధమైన వివక్షలు దీని వెనుక ఉన్నాగాని, స్వాతంత్ర్యపోరాటంలో స్త్రీలు పోషించిన పాత్ర గురించి ముఖ్యంగా ముస్లిం స్త్రీలు పోషించిన పాత్ర గురించి నేడు సమాచారం దాదాపుగా మృగ్యం.

ఈ పరిస్థితుల్లో దేశం కోసం సర్వస్వాన్ని అర్పించిన ఆ త్యాగమూర్తుల గురించి వివరాలను అనేక వనరుల ద్వారా సేకరించి రచయిత మన ముందు ఉంచారు. ముఖ్యంగా గాంధీజీ రాసిన ఉత్తరాలు, యంగ్ఇండియా, నవజీవన్ పత్రికల్లో ఆయన రాసిన వ్యాసాల్లో వచ్చిన ప్రస్తావనలు, ఈ మహిళామణుల దేశభక్తిని మెచ్చుకుంటూ ఆయన రాసిన ప్రశంసా వాక్యాలు, పలు ప్రామాణిక చారిత్రక గ్రంథాలలో వచ్చిన ప్రస్తావనలు, బ్రిటీషు రచయితలు చేసిన వ్యాఖ్యలు, స్వాతంత్ర్యపోరాట యోధుల కుటుంబసభ్యులతో వ్యక్తిగతంగా జరిపిన చర్చలలో వెల్లడైన సమాచారం, పలు చరిత్ర గ్రంథాలలో, ఆత్మ కథలలో అక్కడక్కడా రచయితలు పేర్కొన్న వివరాలు తదితర వనరుల ద్వారా ఈ పుస్తకానికి అవసరమగు విషయ సామగ్రిని సేకరించడానికి రచయిత చేసిన ప్రయత్నం ప్రశంసించదగ్గది.

జాతీయోద్యమంలోని అగ్రనాయకత్వం మెప్పు పొందిన ఈ ముస్లిం మహిళలు ఎలాంటి స్వాతంత్ర్యకాంక్షను హృదయాల్లో నింపుకుని పోరాటాల్లో పాల్గొన్నారో ఊహించడం కష్టం కాదు. ఉద్యమం కోసం తమ సంపదలను త్యాగం చేసి, శరణార్థి శిబిరాల్లో తలదాచుకుని, ప్రభుత్వం మంజూరు చేసిన పెన్షన్ డబ్బులను తిరస్కరించి, నిర్బంధాలను, లాఠీ దెబ్బలను భరించి ముస్లిం మహిళలు ప్రదర్శించిన దేశాభిమానం చరిత్రపుటల్లో స్వర్ణాక్షరాలతో లిఖించదగ్గది. కాని దురదృష్టవశాత్తు నేటి పాపులర్ చరిత్ర గ్రంథాల్లో మనకు ఈ జాతిరత్నాల జీవితచరిత్రలు నమోదు చాలా తక్కువగా కన్పిస్తాయి. భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలోని ఈ లోటును పూడ్చడానికి బహుగ్రంథకర్త, పాత్రికేయుడు, న్యాయవాది సయ్యద్ నశీర్ అహమ్మద్ వ్యయప్రయాసలకు ఓర్చి ఈ గ్రంథాన్ని రూపకల్పన చేశారు. ఈ లక్ష్యసాధనలో విజయవంతమైన ఆయన ప్రయత్నం అభినందించదగ్గది.

ఈ పుస్తకంలో మనకు బ్రిటీషు వ్యతిరేక పోరాటాలు చేసిన స్త్రీలు, జాతీయోద్యమంలో పాల్గొన్న మహిళలు, హైదరాబాద్ విలీన పోరాటంలో పాల్గొన్న స్త్రీలు, తెలంగాణా రైతాంగ పోరాటంలో పురుషులతో పాటు సమాన పాత్ర పోషించిన

మహిళలు ఇలా వివిధ కాలాల్లో, విభిన్న రూపాల్లో, భిన్నపోరాటాల్లో పాల్గొన్న ముస్లిం మహిళల పాత్రల వైనం ఈ పుస్తకం ద్వారా తెలుస్తోంది. ముస్లిం మహిళలు చరిత్రలోని ప్రతి దశలోను, ప్రతి సందర్భంలోను వెల్లడించిన తమ దేశాభిమానాన్ని, స్వాతంత్ర్యకాంక్షను, జాతి కోసం ప్రాణాలర్పించే త్యాగనిరతిని రచయిత ఈ పుస్తకం ద్వారా పాఠకులకు తెలియజేశారు. ఈ ప్రయత్నం దేశంలో విభిన్న వర్గాలు ఒకరి త్యాగమయ చరిత్రను మరొకరు తెలుసుకోవడానికి, ఒకరి పట్ల మరొకరు ఆదరాభిమానాలు పెంచుకోవడానికి ఎంతైనా ఉపయోగపడుతుంది. సరిగ్గా ఈ అభిప్రాయాన్నే రచయిత తన లక్ష్యంగా నిర్దేశించుకోవటం అభినందనీయం.

ఈ పుస్తకంలో పొందుపరిచిన వివిధ ముస్లిం స్త్రీల పోరాటమయ జీవిత చరిత్రలను పరిశీలిస్తే మనకు అనేక విషయాలు అవగాహనకు వస్తాయి. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో పాల్గొని బ్రిటీష్ సైన్యాలను ఎంతో వీరోచితంగా ఎదుర్కొని, ఆత్మబలిదానాలతో విముక్తి పోరాటాలను సుసంపన్నం చేసిన బేగం హజరత్ మహల్, బేగం అజీజున్, తిరుగుబాటు యోధుల రహస్యాలను వెల్లడించ నిరాకరించి సజీవ దహనానికి సిద్ధపడిన అక్బరీ బేగం, ఆయుధాలు చేతపట్టి పోరాటంతో శత్రుసైనికులను ఎదుర్కొన్న పలువురు సామాన్య మహిళలు ఈ గ్రంథంలో మనకు దర్శనమిస్తారు. జాతీయోద్యమంలో  పాల్గొన్న షఫాతున్నీసా బేగం లాంటి వారు భారత విభజనను తీవ్రంగా వ్యతిరేకించిన వైనం పుట్టినగడ్డపై వారిరకున్న మమకారాన్ని చాటిచెబుతోంది. అంతేకాదు, భారతవిభజనను అధికసంఖ్యాక ముస్లిములు ఇష్టపడలేదన్న వాస్తవాన్ని కూడా తెలియజేస్తుంది. అలాగే, సహాయనిరాకరణలో భాగంగా ప్రభుత్వ గ్రాంటులతో నడిచే విద్యాసంస్థల నుంచి విద్యార్థులను బయటకు రావాలని గాంధీజీ పిలుపు ఇచ్చినప్పుడు జాహిదా ఖాతూన్ షేర్వానియా లాంటి మహిళలు ఈ వైఖరిని నిరసించారు. విద్యాభ్యాసం చేయవలసిన విద్యార్థులు విద్యాలయాలను బహిష్కరిస్తే వారి చదువులు ఎలా సాగుతాయని, వారి భవిష్యత్తు ఏమిటని  మహాత్ముడ్నే ప్రశ్నించారు. ఈ ప్రశ్న ఆనాటి మహిళల ముందుచూపు, అవగాహనలను మనకు పరిచయం చేస్తోంది. ఈ విధంగా  స్వాతంత్ర్య సంగ్రామంలో, ప్రజాపోరాటాలలో మహత్తర పాత్రను నిర్వహించి చరిత్ర సృష్టించిన ముస్లిం మహిళల జీవితవిశేషాలు మన ముందుంచడం ద్వారా భారతీయ ముస్లిం జనసముదాయం, ముఖ్యంగా ముస్లిం మహిళల దేశాభిమానాన్ని, వారి పోరాట స్ఫూర్తిని పాఠకులకు అందించడంలో రచయిత చాలా వరకు కృతకృత్యులయ్యారు.





మతసామరస్యం కోసం తీవ్రంగా కృషిచేసిన బేగం మజీదా బానో, **హింద్** పత్రికను నడుపుతూ జాతీయభావాలను ప్రోత్సహించిన బేగం ఖుర్షిద్ ఖ్వాజా మన హైదరాబాది మహిళ కావడం మనకు గర్వకారణం. బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడిన ఈ ధీరవనిత జీవితవిశేషాలు నేటి తరానికి స్ఫూర్తినిస్తాయని నిస్సందేహంగా చెప్పవచ్చు. పత్రికలు నడిపిన నాటి ముస్లిం మహిళల్లో మరొకరు బీబీ అమతుస్సలాం. ఆమె **హిందూస్తాన్** పత్రికను స్థాపించి జాతీయసమైక్యత, సమగ్రతల కోసం విశేష కృషిచేశారు. వివిధరంగాల్లో తమదైన ప్రత్యేకతను నిలుపుకుంటూ, దేశసేవ చేసిన ఈ మహిళల జీవితగాథలను పాఠకులకు అందించడం ద్వారా రచయిత, దేశంలోని వివిధ వర్గాల మధ్య సదవగాహనకు తోడ్పడే పుస్తకాన్ని ప్రచురించారు. అంతేకాదు, ముస్లిం మహిళలు ఇంటి నాలుగు గోడలకే పరిమితం అన్న అపోహను కూడా ఈ పుస్తకం పటాపంచలు చేస్తుంది.

ఈ విధంగా మన పూర్వీకులు జీవితవిశేషాలను అందించే రచనల్లో చారిత్రక సమాచారంతోపాటుగా పాఠకులకు విసుగు లేకుండా చదివించగల చక్కని రచనా శైలి చాలా అవసరం. ఈ రెండు అంశాలు ఈ గ్రంథంలో పుష్కలంగా కన్పిస్తున్నాయి. చదువరులను కట్టిపడేసే ప్రవాహశీల శైలితో సయ్యద్ నశీర్ అహమ్మద్ ఈపుస్తకంలోని సమాచారాన్ని పాఠకులకు అందించారు. అవసరమైన చిత్రాల ద్వారా అదనపు సమాచారాన్ని కూడా అందివ్వడం రచయితగా ఆయనకున్న నైపుణ్యానికి నిదర్శనం. సరికొత్త సమాచారం, చక్కని అరుదైన చిత్రాలు, ఫోటోలతో కూడిన ఈ చరిత్ర గ్రంథం మూడవ ముద్రణగా వెలుగు చూస్తుందంటే చరిత్ర గ్రంథాలకు పాఠకుల ఆదరణ తక్కువనే అభిప్రాయం తప్పన్పిస్తుంది. ఈ పుస్తకం మూడవసారి పాఠకుల చెంత చేరటం ద్వారా  పాఠకాదరణ ఏ మేరకు లభించిందో వేరేగా చెప్పనక్కర్లేదు. ఈ నూతన గ్రంథానికి కూడా అంతకంటె అత్యధిక ఆదరణ తప్పక లభించగలదని ఆకాంక్షిస్తూ, ఉత్తమ అభిరుచి గల పాఠకులు ఆ ఆకాంక్షను తప్పక నెరవేర్చగలరని ఆశిస్తాను. భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ముస్లింల మహత్తర పాత్రను వివరిస్తూ శరపరంపరగా చరిత్ర గ్రంథాలను రాస్తున్న శ్రీ సయ్యద్ నశీర్ అహమ్మద్ కలం ద్వారా ఇలాంటి ఉపయుక్త గ్రంథాలు మరెన్నో వెలువడాలని, తెలుగు భాషలో చరిత్రపరిశోధనకు ఆయన గ్రంథాలు కొత్త అధ్యాయాన్ని లిఖించాలని, ఆ గ్రంథాలు స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రకు సంబంధించిన సాహిత్యాన్ని మరింతగా సుసంపన్నం చేయాలని కోరుతూ ఆ దిశగా సాగుతున్న  ఆయన ప్రయత్నాలను మనసారా అభినందిస్తున్నాను. ◆



**ప్రొఫెసర్ టి. జ్యోతిరాణి**
**M.A., Ph.D.**
కాకతీయ విశ్వవిద్యాలయం
**వరంగల్**

# స్నేహ వాక్యం

**అ**సమ సంబంధాలు పునాదిగాగల రాజకీయార్థిక నిర్మాణాలను ప్రగతి శీలంగా మలచుకొనటానికి, ప్రజాస్వామికం చేసుకొనటానికి తలఎత్తిన ఉద్యమాలైనా, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పరాయిపాలన నుండి దేశాన్ని విముక్తం చేసుకొనటానికి నిర్మించబడ్డ స్వాతంత్ర్యోద్యమాలైనా అవి ఉనికిలోకి వచ్చి ఆశించిన లక్ష్యాలను సాధించటానికి **ఆకాశంలో సగం** అయిన స్త్రీల పరోక్ష, ప్రత్యక్ష భాగ స్వామ్యం అనివార్యం. కానీ పితృస్వామిక భావజాలం స్త్రీని ఒక స్వతంత్ర వ్యక్తిగా చూడటానికి నిరాకరిస్తుంది. స్త్రీపురుషుల మధ్య అధీనత్వ- ఆధిపత్య సంబంధాలు పునాదిగా నిర్మించబడిన పితృస్వామిక కుటుంబంలో ఇంటికే పరిమితం చేయబడిన స్త్రీ ఇంటిని నిర్వహించటానికి తన జీవితకాలమంతా నిర్విరామంగా, నిరంతరాయంగా శ్రమ చేస్తున్నప్పటికీ ఆ పనికి విలువ లేదు, గుర్తింపురాదు. అదే విధంగా భారతదేశ స్వాతంత్ర్య ఉద్యమంలో స్త్రీల చురుకైన భాగస్వామ్యం, క్రియాశీలక పాత్ర గుర్తింపుకు రాకుండా, అదృశ్యంగా మిగిలిపోయే ప్రమాదం వున్నది. ఇటువంటి స్థితి ముస్లిం స్త్రీల విషయంలో మరింత తీవ్రమయ్యే అవకాశ మున్నది. స్వాతంత్ర్య సంగ్రామంలో ముస్లింల స్త్రీలు చురుకైన భాగస్వామ్యం వహించారన్నది ఒక చారిత్రక వాస్తవం. ఈ సత్యాన్ని వెలికి తీయటానికి జెండర్ చైతన్య స్పృహ, చిత్తశుద్ధి, నిబద్ధతలతో కూడిన కృషి, విభిన్న పద్ధతుల ద్వారా స్త్రీల భాగస్వామ్యానికి సంబంధించిన సమాచార సేకరణ అవసరమవుతాయి. ఈ విధమైన కృషి శ్రీ సయ్యద్ నశీర్ అహమ్మద్ రాసిన **భారత స్వాతంత్ర్యోద్యమం- ముస్లిం మహిళలు** పుస్తకంలో వ్యక్తమవుతుంది.

స్వాతంత్ర్యోద్యమాన్ని జనబాహుళ్య ఉద్యమంగా (Mass Movement) బలోపేతం చేసే క్రమంలో గాంధీజీ పిలుపు మేరకే స్త్రీల భాగస్వామ్యం చోటు చేసుకున్నదనే భావన తప్పని ఈ పుస్తకంలో పొందుపరచబడిన 61 మంది ముస్లిం స్త్రీల పాత్రలను పరిశీలించినట్లయితే బోధపడుతుంది. 1857 నుండి 1947 వరకు



అంటే ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనకు వ్యతిరేకంగా తలెత్తిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం నుండి సంపూర్ణ స్వాతంత్ర్యం వచ్చేవరకు నిర్మించబడిన వివిధ ఉద్యమాలలో, ఆ తరువాత సాగిన ప్రజా ఉద్యమాలలో కూడా ముస్లిం మహిళలు గుణాత్మకంగా విలక్షణమైన పాత్ర నిర్వహించారన్న వాస్తవం తెలుస్తుంది. స్వతంత్ర భారత నిర్మాణంలో వారి స్థానం స్పష్టమవుతుంది. స్త్రీలుగా పితృస్వామిక సమాజంలో, ముస్లింలుగా భారతదేశంలో పరాయీకరణకు గురవుతున్న వర్తమాన సందర్భంలో ఈ పుస్తకం ఆహ్వానించతగింది.

భారతదేశంలోని వివిధ ప్రాంతాలకు చెందిన ముస్లిం స్త్రీలు స్వాతంత్ర్య పోరాటంలో అధికంగా పాల్గొనటం గమనించవచ్చు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న ముస్లిం స్త్రీలలో బేగం హజరత్ మహల్ మినహాయించి పోరుబాటన నడిచిన మిగిలిన వారందరూ సాధారణ కుటుంబాలకు చెందినవారే. దాదాపు నూటయాభై సంవత్సరాల క్రితమే పరాయిపాలనను వ్యతిరేకించి, తిరగబడి, ఉరిశిక్షలకు కూడా ఏమాత్రం భయపడకుండా ఎదురు నిలిచిన వీరవనితలు వీరు.

స్వాతంత్ర్య సాధనకు రూపుదిద్దుకున్న విభిన్న పోరాట మార్గాలు- అహింసా యుత మార్గం కావచ్చు, సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించే వామపక్ష మార్గం కావచ్చు గెరిల్లా యుద్ధమే మార్గం కావచ్చు- అన్ని పోరాట మార్గాలలో ముస్లిం స్త్రీల భాగస్వామ్యం ఉండటం గమనించవలసిన విషయం. ఖిలాఫత్ ఉద్యమం ద్వారా జాతీయోద్యమంలో ప్రవేశించి సహాయనిరాకరణ, విదేశీవస్తు బహిష్కరణ, క్విట్ ఇండియా మొదలైన అన్ని పోరాట రూపాలలో ముస్లిం స్త్రీల చురుకైన భాగస్వామ్యం కనిపిస్తుంది. ఈ ముస్లిం స్త్రీలు సంపన్న కుటుంబాల నుండి సాధారణ కుటుంబాల వరకు చెందినవారు. దక్షణాఫ్రికాలో సంపదను, వ్యాపారాలను త్యజించి భారత దేశానికి వచ్చి పాల్గొన్న కుటుంబాలు కొన్ని కాగా స్వదేశంలోనే ఆస్తులను, పదవులను, ఉద్యోగాలను, వ్యాపారాలను వదులుకొని జాతీయోద్యమంలో పాల్గొన్న కుటుంబాలు మరికొన్ని. ఇటువంటి నేపథ్యం గల కుటుంబాలకు చెందిన ముస్లిం మహిళలు చాలావరకు ఉన్నతవిద్యను అభ్యసించినవారే. బాల్యం నుండే బ్రిటీష్ పాలనను వ్యతిరేకించినవారే.

మునీరా మజ్రుల్ హఖ్, అమీనాతయ్యాబ్జీ, మజీదా హసీనా బేగం మొదలైన వారు జాతీయోద్యమంలో ప్రత్యక్షంగా భాగస్వాములు. కాగా రజియాఖాతూన్ మొదలైనవారు పరోక్షంగా ఉద్యమానికి తోడ్పడ్డారు. వాస్తవానికి ప్రత్యక్ష, పరోక్ష

భాగస్వామ్యం అని ఖచ్చితంగా విభజించటం కష్టం. సమావేశాలు నిర్వహించడం, ప్రసంగించటం, పికెటింగ్‌లు జరపటం, ఊరేగింపులో పాల్గొనటం, పోలీసు లాఠీ దెబ్బలను తినటం, జైలుకెళ్ళటం, శిక్షననుభవించటం ఉద్యమానికి ఎంత ముఖ్యమో నిధులను సమీకరించటం, ఉద్యమకారులు జైలుకెళ్ళినప్పుడు వారి కుటుంబాలను ఆర్థికంగా ఆదుకొనటం, నైతిక మద్దతునివ్వటం, ఉద్యమకారులకు ఆశ్రయమివ్వటం, ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడానికి పత్రికలు నడపటం, రచనలు చేయటం, తమ ఇంటి పురుషులు ఉద్యమంలో నిమగ్నమైనప్పుడు కుటుంబ బాధ్యతలు సంపూర్ణంగా స్వీకరించటం, పోలీసుల దాష్టికాన్ని భరించటం, ఎంతటి కష్టనష్టాలకైనా సంసిద్ధులు కావటం మొదలైనవన్నీ ఉద్యమం నిలదొక్కు కొనటానికి, లక్ష్యాలను సాధించటానికి అంతే ముఖ్యం. కాబట్టి సమగ్ర దృష్టితో, సునిశితంగా పరిశీలించినట్లయితే ఉద్యమంలో ప్రత్యక్ష, పరోక్ష భాగస్వామ్యం అనే విభజన కృత్రిమమైనదే. చాలా సందర్భాలలో ఉద్యమకారుల కుటుంబాలకు చెందిన మహిళల భాగస్వామ్యం ప్రారంభంలో పరోక్షరూపంలో ఉన్నట్లు కనిపించినా, భర్త జైలుకెళ్ళినప్పుడు, భర్త చేపట్టిన బాధ్యతను నిర్వర్తించే క్రమంలో స్త్రీలు పోరాటంలో ముందుండటం గమనించదగింది.

అక్బరీ బేగం, అమినా తయ్యాబ్జీ, షంషున్నిసా అన్సారీ, సుఫియాసోం, అంజాదీ బేగం మొదలైనవారు ఉద్యమ నాయకత్వ స్థానంలో వుండి ఉద్యమాన్ని సమర్థవంతంగా నిర్వహించారు. కాగా కార్యకర్తలుగా కూడా ముస్లిం స్త్రీలు పోరాటాలలో ముందుండి లాఠీ దెబ్బలు తిని, అరెస్టయి, జైలుశిక్షలను అనుభవించినారు. స్త్రీలను సమీకరించడంలో కీలక పాత్రను పోషించారు. బ్రిటీష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా బ్రెజిల్‌లో జరిగిన అంతర్జాతీయ సమావేశానికి 'హజరా ఆపా' భారత దేశ ప్రతినిధిగా హజరయ్యారు. అక్బరీ బేగం, మహబూబ్ ఫాతిమా, అంజాది బేగం, సుగరా ఖాతూన్, సాదత్ బానో కిచ్లూ తదితరులు ఉత్తేజపూరిత ప్రసంగాలతో ప్రజలను ఉద్యమోన్ముఖులను చేయటంలో కృతకృత్యులయ్యారు. కాగా ఉమర్ బీబీ, ఆమనా ఖురేషి మొదలైనవారు కార్యకర్తలుగా విదేశీ వస్త్ర దహనంలో ముందుండి తమ వస్తువులను దహనం చేయటంతో ఉద్యమాన్ని ప్రారంభించారు. అన్ని పోరాట రూపాలలో కూడా ముస్లిం స్త్రీలు ముందుంది లాఠీ దెబ్బలను తిని, అరెస్టయి, జైలు శిక్షలను అనుభవించారు.

భర్త అరెస్టయినప్పుడు బ్రిటీష్ వ్యతిరేకతను ప్రచారం చేసే 'జమిందార్' పత్రిక ప్రచురణ బాధ్యతను బేగం జాఫర్ అలీఖాన్, అదేవిధంగా 'ఉర్దూ-ఏ-



మొల్లా' ప్రచురణను బేగం నిశాతున్నీసా చేపట్టగా బేగం ఖుర్షీద్ ఖ్వాజా 'జామియా మిలియా ఇస్లామీయ' విద్యా కేంద్రాన్ని సమర్థవంతంగా నిర్వహిస్తూ 'హింద్' అను ఉర్దూ మాసపత్రికకు సంపాదకురాలిగా విధులను నిర్వర్తించారు. బీబీ అమతుస్సలాం 'హిందుస్థాన్' అనే ఉర్దూ పత్రికను నిర్వహించారు. మరికొందరు తమ రచనలతో ఉద్యమానికి స్ఫూర్తినిచ్చారు. హాజ్రా ఆపా అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం వ్యవస్థాపక సభ్యురాలు కూడా. స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొంటూ లింగవివక్షత వైపు దృష్టి సారించి, స్త్రీలను చైతన్యవంతులను చేయటానికి స్త్రీ విద్య సాధనమని గుర్తించి ఆ దిశగా ప్రయత్నించిన స్త్రీలూ కనిపిస్తారు. సంప్రదాయ మూఢాచారాలకు, పర్దా వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాడటమూ కనిపిస్తుంది.

స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న ముస్లిం మహిళలందరూ హిందూ- ముస్లిం ఐక్యత కోసం కృషి చేసినవారే. ఉద్యమం చివరిదశలో బ్రిటిష్‌వారి కుతంత్రాల ఫలితంగా పరిస్థితులు దేశవిభజనకు దారి తీయగా దానిని వ్యతిరేకించారు ఈ ముస్లిం మహిళలు. అదేవిధంగా నైజాం ప్రాంతం భారతదేశంలో విలీనం కావాలని ఆందోళన చేసినవారిలో ముస్లిం మహిళలు ఉన్నారు. భారతదేశ విభజన వల్ల ఆస్తులు పాకిస్తాన్ భూభాగంలో ఉండిపోయినా, భారతదేశంలోనే వుండి కటిక పేదరికాన్ని అనుభవించిన ఉద్యమకారిణులూ కనిపిస్తారు. జాతీయోద్యమంలో పాల్గొన్న ఈ ముస్లిం మహిళలు 'భారతదేశం తమ మాతృభూమి' అన్న భావనతోనే ఎంతటి త్యాగానికైనా సిద్ధపడటం వీరి జీవితాలను గురించిన అధ్యయనం వెల్లడి చేస్తుంది. స్వాతంత్ర్య పోరాటంలో భాగస్వాములు కావటమే కాకుండా, బ్రిటీషర్ల తొత్తులైన జమీందారులకు వ్యతిరేకంగానూ, స్వాతంత్ర్య సిద్ధించాక ప్రజా ఉద్యమాలలో, తెలంగాణా రైతాంగపోరాటంలోనూ పాల్గొన్న ముస్లిం మహిళలు కూడా ఉన్నారు.

గాంధేయమార్గాన్ని అనుసరిస్తూ సమాజ సేవకు అంకితం కావటం పట్ల కృతజ్ఞతతో స్వతంత్ర భారత ప్రభుత్వం ఫాతిమా ఇస్మాయిల్, కుల్సుం సయానీలకు 'పద్మశ్రీ' బిరుదునిచ్చి సత్కరించింది. వీరిలో కుల్సుం సయానీ 1957లో యూనిస్కో సమావేశంలో భారత ప్రతినిధిగా పాల్గొన్నారు. 1958లో ప్రభుత్వం స్త్రీ విద్య కోసం నియమించిన 'నేషనల్ కమీషన్ ఆన్ విమన్స్ ఎడ్యుకేషన్' అనే కమిటీలో ఈమె సభ్యురాలు. మహాత్మాగాంధీ శాంతి సందేశాన్ని ప్రపంచానికి చాటి చెప్పటానికి 11 దేశాలు పర్యటించింది. భారత్-పాకిస్థాన్ దేశాల మధ్యస్నేహం కోసం కృషి

చేసింది. విద్యకోసం ప్రత్యేకించి స్త్రీవిద్య కోసం అవిశ్రాంతంగా ఆమె చేసిన కృషికి 'నెహ్రూ లిటరసీ అవార్డు' లభించింది. ఫాతిమా ఇస్మాయిల్ దళితుల అభ్యున్నతి కోసం చేసిన కృషికి గుర్తింపుగా 'దళిత మిత్ర' అవార్డు పొందింది. హాజఁరా ఆపా కార్మిక కర్షక సంక్షేమానికి చేసిన కృషికి లెనిన్ శతజయంతి ఉత్సవాలలో 'సుప్రీం సోవియట్ జూబ్లీ అవార్డు'తో గౌరవించబడింది. ఫాతిమా యఫ్ తయ్యాబ్ అలీ కూడా గాంధేయ మార్గంలో నడుస్తూ స్వాతంత్ర్యానంతర భారతదేశంలో గుజరాత్‌లోని 'పడేలా' గ్రామాన్ని దత్తత తీసుకొని ఆదర్శగ్రామంగా తీర్చిదిద్దింది. అందుకు భారత ప్రభుత్వం విశిష్ట మహిళగా ఆమెను గుర్తించింది.

స్వతంత్ర్య భారత దేశంలో రాజకీయ రంగ ప్రవేశం చేసి అసెంబ్లీ, పార్లమెంటు సభ్యులుగా, మంత్రులుగా బాధ్యతలను నిర్వహించిన వారున్నారు. ఆంధ్రప్రదేశ్‌కు చెందిన మాసుమా బేగం రాష్ట్రంలో మంత్రి పదవిని చేపట్టి దేశంలో మంత్రి పదవి చేపట్టిన తొలి ముస్లిం మహిళగా ఖ్యాతి గడించారు. సఫియా అబ్దుల్ వాజిద్, బేగం అక్బర్ జహాన్ బేగం, అనీస్ బేగం కిద్వాయ్ లాంటి వారు పార్లమెంటు సభ్యులయ్యారు. బేగం షరీఫా హమీద్ అలీ ఐక్యరాజ్యసమితి మహిళా విభాగానికి భారతదేశ ప్రతినిధిగా నియమితులయ్యారు.

ఈ విధంగా ఉద్యమబాటన నడిచిన ఈ స్త్రీల జీవితాలను అధ్యయనం చేసినప్పుడు వాళ్ళు ఎటువంటి విలువల కోసం పాటుపడ్డారో అవి ఎంత ఉన్నతమైన, ఉదాత్తమైన మానవీయ విలువలో అర్థమవుతుంది. ఎటువంటి కష్టానికీ తలవంచక పోవటం, ధైర్యంగా నిలబడడం, దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించటానికైనా సిద్ధపడడం, తాము చెప్పేదే ఆచరించటం, అరెస్టు కాకపోవటాన్ని నామోషీగా భావించటం, బ్రిటీష్ ప్రభుత్వానికి విన్నవించుకోవటాన్ని చిన్నతనంగా పరిగణించటం, క్షమాబిక్షను కోరటానికి బదులు ప్రాణాలు అర్పించడానికి సంసిద్ధులు కావడం, తమ ప్రాణాలు 'జాతి సొత్తులు' అని ప్రకటించడం మొదలైనవన్నీ వాళ్ళ ఆత్మాభిమానానికి, త్యాగనిరతికి అద్దం పడతాయి.

వస్తు వినిమయ విష సంస్కృతిలో పడికొట్టుకుపోతున్న ప్రస్తుత యువత తప్పనిసరిగా చదవవలసిన పుస్తకమిది. ఈ పుస్తకం ఇటు స్త్రీల చరిత్రనూ, అటు ముస్లింల చరిత్రనూ సుసంపన్నం చేస్తుంది. జాతీయోద్యమంలో పాల్గొన్న ముస్లిం మహిళల **భారతీయత**ను స్పష్టం చేస్తుంది. హిందూ– ముస్లింలు ఐక్యతతో స్వతంత్ర్య భారతదేశాన్ని సాధించుకున్నారన్న విషయం వెల్లడి చేస్తుంది. గ్లోబలేజేషన్ సంస్కృతిలో,



స్వార్థపూరిత సామాజిక వాతావరణంలో పతన మవుతున్న మానవీయ విలువల మధ్య బ్రతుకుతున్న ప్రస్తుత యువత ఈ పుస్తకం ద్వారా ఒక్కసారి చరిత్రలోకి తొంగిచూస్తే ఎటువంటి త్యాగాలతో ప్రస్తుత సమాజాన్ని నిర్మించుకున్నామో వారికి అర్థమవుతుంది. గతాన్ని తెలుసుకొని ఆ పునాదుల మీదుగా లౌకిక, ప్రజాస్వామిక, మానవీయ విలువలతో కూడిన ఉన్నతమైన సమాజాన్ని నిర్మించుకొనటానికి కావలసిన ప్రాతిపదిక ఈ పుస్తకంలో ఉన్నది.

విశ్వవిద్యాలయాలలో సామాజిక శాస్త్రలలో ప్రత్యేకించి చరిత్రకు సంబంధించిన పరిశోధన అధ్యయనాలకు సయ్యద్ నశీర్ అహ్మద్ వ్రాసిన ఈ పుస్తకం ఒక నమూనాను అందిస్తుందని నిస్సందేహంగా చెప్పవచ్చు. పరిశోధకులకిది స్ఫూర్తినిస్తుంది. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ముస్లిం మహిళలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించటం సుళువైన విషయం కాదు. నిరంతర అన్వేషణ, నిజాయితీతో కూడిని అవిశ్రాంత కృషి, పట్టుదల అవసరమవుతాయి. అధ్యయనం పట్ల ఆసక్తి, సీరియస్‌నెస్ వున్న రచయిత నశీర్ అహమ్మద్ ఎన్నో గ్రంథాలయాలు తిరిగి, ఎన్నో సంస్థలను, వ్యక్తులను కలసి వివిధ భాషల్లో వున్న ఆధారాలను సేకరించటం వల్లే ఈ పుస్తక రచన సాధ్యమైందని భావించవచ్చు. వ్యక్తుల జీవిత చరిత్రలకు ఫోటోలు కూడా జతపర్చినప్పుడు అధ్యయనం చేసేవారు ఆత్మీయ భావనకు లోనవుతారు. ఇందుకోసం మహిళల ఫోటోలను సేకరించటానికి రచయిత చేసిన శ్రమ అభిలషణీయం.

సామాజిక స్పృహతో తపనతో ఎంతో శ్రమించి, ఎన్నో ఆధారాలను అధ్యయనం చేసి, అదృశ్యంగా ఉన్న ముస్లిం మహిళలు, ముస్లిం యోధులు స్వాతంత్ర్య పోరాటంలో నిర్వహించిన పాత్రను తన పలు గ్రంథాల ద్వారా, అసంఖ్యాకమైన తన వ్యాసాల ద్వారా వెలుగులోకి తీసుకరావటంలో రచయిత అనిర్వచనీయమైన కృషి వ్యక్తం అవుతుంది. భారతదేశ చరిత్రలో ముస్లింల భాగస్వామ్యం దిశగా శ్రీ సయ్యద్ నశీర్ అహమ్మద్ నిరంతరం సాగిస్తున్న కృషి ఆహ్వానించదగింది మాత్రమేకాదు అభినందించదగింది. ఈ పుస్తకానికి **'స్నేహ వాక్యం'** వ్రాసే అవకాశం నాకు లభించిన గౌరవంగా భావిస్తున్నాను. ◆



డాక్టర్ అస్గర్ అలీ ఇంజనీర్

ప్రముఖ రచయిత

ముంబాయి.

# ఆప్త వాక్యం

స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ముస్లిం మహిళల మీద 1999లో మిత్రులు సయ్యద్ నశీర్ అహమ్మద్ తెలుగులో రాసిన పుస్తకం అశేష పాఠకాదరణ పొంది తృతీయ ముద్రణ వచ్చిందని తెలిసి సంతోషిస్తున్నాను. 1999 నాటి పుస్తకం 2003లో పునర్ముద్రణ కావటం, ఆ తరువాత 2006లో తృతీయ ముద్రణకు రావటం రచయితగా సయ్యద్ నశీర్ అహమ్మద్ కృషికి తెలుగు పాఠకుల నుండి లభించిన గుర్తింపుగా భావించవచ్చు.

1999 నాటి పుస్తకంలో పోల్చితే 2003 నాటి పుస్తకం అదనపు సమాచారం పరంగా చాలా బాగా వచ్చింది. ఆనాటి పుస్తకాన్ని ప్రస్తుత గ్రంథంతో పోల్చి చూస్తే, ఇది పరిమాణంలోనే కాదు నాణ్యత విషయంలో కూడా చాలా బాగా వచ్చిందని పుస్తకం చూస్తేనే తెలుస్తుంది. ఈ పుస్తకంలో చాలా చిత్రాలు, ఫోటోలు ఉన్నాయి. ముస్లిం మహిళల చిత్రాలు, ఫోటోలు సేకరించటం చాలా కష్టం. రచయిత నిరంతర కృషి, అవిశ్రాంత అన్వేషణ మంచి ఫలితాలనిచ్చాయి.

2004 లో జరిగిన ఓ జాతీయ సదస్సులో పాల్గొనడానికి ఢిల్లీ వచ్చిన సయ్యద్ నశీర్ అహమ్మద్ నాతో మాట్లాడుతూ భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లిం పాత్రను వివరిస్తూ తాను రాసిన **భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం మహిళలు** మూడోసారి పూర్తి మార్పులు-చేర్పులతో ముద్రణ కానున్న విషయం నా దృష్టికి తెచ్చినప్పుడు చరిత్ర పట్ల తెలుగు పాఠకుల ఆసక్తి, అభిరుచిని అభినందించకుండా ఉండలేకపోయాను.

1999 నాటి తొలి ప్రచురణ సందర్భంగా 'ముస్లిం సమాజం పట్ల సృష్టించబడిన అపోహలు, అపార్థాలను తొలగించేందుకు ఇటువంటి గ్రంథాలు అనేకం రావాలి. అవి విస్తృతంగా ప్రజలలోకి ప్రవహించాలి. ఈ గ్రంథానికి పాఠక మిత్రుల అశేష



ఆదరణ లభించాలని ఆకాంక్షిస్తున్నాను ' అని నా మనసులోని మాటను ముందు మాటగా రాశాను. నా ఆకాంక్షను మూడు ప్రచురణల ద్వారా తెలుగు పాఠకులు ఇంత ఘనంగా నెరవేర్చుతారని నేను ఆనాడు ఊహించలేదు. నా ఊహకు అందని విధంగా చరిత్ర పుస్తకాలను ఆదరించిన తెలుగు పాఠకులకు, ప్రచురణకర్తలకు ప్రత్యేక అభినందనలు.

మన సమాజంలో ముస్లిం మహిళలకు సంబంధించి కొన్ని అపోహలు ఉన్నాయి. ప్రజా జీవన వ్యవహారాలలో ముస్లిం మహిళలు పాల్గొనరని, పర్దాచాటు నుండి బయట ప్రపంచంలోకి ముస్లిం మహిళలు ససేమిరా రారని అనుకుంటుంటారు. ముస్లిం మహిళల సంగతి ఎలా ఉన్నా ముస్లింలు స్వాతంత్ర్యోద్యమంలో చురుగ్గా పాల్గొనలేదన్న సాధారణ అపోహ కూడా బలంగా ఉంది. ఈ రెండూ నిజం కావు. చరిత్ర తిరగేస్తే అనేక యుద్ధాలు, పోరాటాలు, ఉద్యమాలలో పాల్గొని పోరాట పటిమ చూపిన ముస్లిం మహిళల వృత్తాంతాలు అనేకం కన్పిస్తాయి.

ఆ కాలంలో ముస్లిం మహిళలు ఖచ్చితంగా ' పర్దా ' ను పాటిస్తూ, సాధారణంగా తమ గృహాల నుండి బయటకు వచ్చేవారు కారు. అయితే మాతృదేశ దాస్య విముక్తి పోరాటం కంటె తమకు ఏదీ ప్రియమైనది కాదని భావించిన ఆ మహిళలు ఆనాటి సామాజిక కట్టుబాట్ల ఉల్లంఘనకు కూడా సిద్ధమై స్వాతంత్ర్య సమరాంగ ణంలో పాల్గొని అపూర్వమైన సాహసాన్ని, అనితరసాధ్యమైన త్యాగాన్ని, నిబద్ధతను ప్రదర్శించారు.

ఈ చరిత్రలు చాలా వరకు మరుగునపడి ఉన్నాయి. ఆ మహత్తర చరిత్రలు అక్కడక్కడ వెలుగులోకి వచ్చినా అవి సామాన్యుల చెంతకు చేరటం లేదు. అవి చరిత్ర పండితుల వరకు పరిమితమై పోతున్నాయి. ఆ చరిత్రలన్నిటినీ వెలుగులోకి తీసుకురావాల్సి ఉంది. అద్వితీయ త్యాగాలతో, అద్భుత పోరాట పటిమతో, మాతృభూమి పట్ల ఉన్న అంతులేని గౌరవాభిమానాలతో పోరుబాట నడిచి ప్రత్యేక చరిత్రను సృష్టించిన మహిళల చరిత్రలను ఆయా ప్రాంతీయ భాషలలో రచించినట్టయితే అత్యధిక ప్రయోజనం సమకూరుతుంది. ఆయా విషయాలు అత్యధికులకు చేరువవుతాయి. ఆ లక్ష్యంగా, ఆ దిశగా చరిత్ర పరిజ్ఞానాన్ని ప్రజాస్వామ్యీకరించేందుకు నిరంతరం కృషి సల్పుతున్న మిత్రుడు సయ్యద్ నశీర్ అహమ్మద్ అభినందనీయుడు. ◆

# రచయిత మాట

1999లో **భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం మహిళలు** పుస్తకాన్ని తొలుత ప్రచురించాను. అది స్వాతంత్ర్యోద్యమంలో ముస్లిం మహిళల పాత్రను వివరిస్తూ తెలుగులో వచ్చిన తొలి పుస్తకం కావటంతో పాఠక మహాశయుల ఆదరణ లభించింది. ఈ పుస్తకానికి లభించిన పాఠకుల ఆదరణ, పండితుల, పెద్దల ప్రోత్సాహం, సన్నిహిత మిత్రులు వ్యక్తం చేసిన సూచనలు, అభిప్రాయాలు పరిగణలోకి తీసుకొని, ఆనాటి రాజకీయ – సామాజిక వాతావరణం దృష్ట్యా భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల భాగస్వామ్యాన్ని వివరిస్తూ మరిన్ని పుస్తకాలను రాసి ప్రచురించాలని నిర్ణయించాను. ఈ మేరకు చారిత్రక సమాచారం కోసం సాగిన అన్వేషణలో స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న పలువురు ముస్లిం మహిళల జీవిత విశేషాలు చాలా లభించాయి, ఎంతో ఆదనపు సమాచారం అందుబాటులోకి వచ్చింది.

ఆ విధంగా లభించిన నూతన వివరాలతో నాకు అందిన అదనపు సమాచారంతో, భారత స్వాతంత్ర్యోద్యమం:ముస్లిం మహిళలు పుస్తకాన్ని పూర్తిగా తిరగరాసి ప్రచురించాలనుకున్నాను. ఆ ప్రయత్నంలో నేనుండగా మిత్రులు, ప్రముఖ రచయిత డాక్టర్ టి.యస్. రావు (విజయవాడ) సహకారంతో జె.పి. పబ్లికేషన్స్ (విజయవాడ) వారు ఈ పుస్తకాన్ని 2003లో ప్రచురించారు. ఆ పుస్తకంలో అదనంగా మరికొందరి మహిళల జీవిత విశేషాలను చేర్చడమే కాకుండా, ప్రథమ ముద్రణలోని సమాచారానికి అదనపు సమాచారాన్ని జతచేశాను. ప్రథమ ప్రచురణకు లభించినట్టుగా ద్వితీయ ప్రచురణకు కూడా పాఠకుల నుంచి మంచి ఆదరణ లభించింది.

ఆ ఆదరణ పర్యవసానంగా ప్రస్తుతం భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం మహిళలు మూడవ ముద్రణకు రావటం సంతోషంగా ఉంది. ఈ పుస్తకాన్ని తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ (హైదరాబాద్) సరికొత్తగా ప్రచురించ సంకల్పించింది. ఆ సంస్థ సంచాలకులు జనాబ్ అబ్బాదుల్లా పుస్తక ప్రచురణ విషయమై మాట్లాడుతూ, 2003లో ప్రచురితమైన పుస్తకాన్ని పూర్తిగా తిరగరాసి నూతన సమాచారం జోడించి, నూతన చిత్రాలు, ఫోటోలు సమకూర్చాలని కోరారు. అలనాటి త్యాగమూర్తుల వివరాలన్నీ లభ్యమైనంత వరకు పాఠకులకు అందించాలని, ఆ కారణంగా పుస్తక పరిమాణం పెరిగినా ఫర్వాలేదన్నారు. ఆయన సూచనలను–సలహాలను గౌరవిస్తూ, ప్రథమ, ద్వితీయ ప్రచురణలను చదివిన చరిత్ర అధ్యాపకులు, పరిశోధకులు, పాఠకులు అందించిన సూచనలు, సలహాలను కూడా పరిగణలోకి తీసుకున్నాను.



ప్రధానంగా గత మూడు సంవత్సరాలుగా సేకరించిన అదనపు సమాచారంతో విషయపరంగా ఈ పుస్తకాన్ని సరికొత్తదిగా రూపొందించ ప్రయత్నించాను. ఈ మధ్యకాలంలో నేను సేకరించిన చిత్రాలు, ఫోటోలు పుస్తకంలో సమకూర్చాను. ఈ పుస్తకాన్ని విషయపరంగా మాత్రమే కాకుండా రూపం పరంగా కూడా ఆకర్షణీయంగా తీర్చిదిద్దాను. ఆ కారణంగా పుస్తకం పరిమాణం బాగా పెరిగింది.

ఈ గ్రంథం రూపుదిద్దుకోవడంలో తమ సహకారం అందించిన తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, డైరక్టర్ జనాబ్ అబ్బాదుల్లా గారికి, చక్కని పరిచయ వాక్యం రాసిచ్చిన ప్రొఫెసర్ టి. జ్యోతిరాణి (కాకతీయ విశ్వవిద్యాలయం), ప్రశంసా వాక్యంతో ప్రోత్సహించిన డాక్టర్ ఆవుల మంజులత (వైస్ ఛాన్సలర్, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్) గారికి చరిత్ర రచన విషయంలో నాకు అవసరమగు సమాచారం అందిస్తూ, ఆ దిశగా రచనలు చేయమని నన్ను ప్రోత్సహిస్తు, ఆప్తవాక్యం రాసిచ్చిన ప్రముఖ రచయిత, చరిత్ర పరిశోధకులు డాక్టర్ అస్గర్ అలీ ఇంజనీర్ (ముంబాయి) గారికి కృతజ్ఞతలు.

నా కృషిలో సహకరించిన సోదరులు జనాబ్ అబ్దుల్ వాహెద్ (గీటురాయి – హైదరాబాద్), ప్రముఖ సాహితీవేత్త శ్రీ కొత్తపల్లి రవిబాబు (విజయవాడ), చరిత్రో పన్యాసకులు జనాబ్ మహబూబ్ బాషా (అంబేద్కర్ విశ్వవిద్యాలయం, లక్నో), సద్విమర్శకులు శ్రీ పెద్ది సాంబశివరావు (గుంటూరు), కవి మిత్రులు డాక్టర్ ఇక్బాల్ చాంద్ (సత్తుపల్లి) గార్లకు ధన్యవాదాలు.

నా ప్రయత్నాలకు తొలి నుండి శుభాశీస్సులు అందిస్తు నన్ను ప్రోత్సహిస్తున్న ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్ ఛైర్మన్ జనాబ్ షేక్ పీర్ అహమ్మద్ (నరసరావుపేట), పలు ఉర్దూ గ్రంథాలను చదివి అందులో నాకు ఉపయుక్తమగు సమాచారాన్ని నాకు తెలియపర్చుతూ నన్ను ఆశ్వీరదిస్తున్న మా అమ్మ సయ్యద్ బీబీజాన్, నా ప్రతి ప్రయత్నం వెనుక తానుండి సతతం నన్ను ప్రోత్సహిస్తు అన్నివిధాల నాకు తోడుగా నిలచి సహకరిస్తున్న నా జీవిత భాగస్వామి షేక్ రమిజా బానుకు ప్రత్యేక ధన్యవాదాలు.

ఈ గ్రంథ రచయితను నేనైనా, సమాచార సేకరణ వద్దనుండి, ఆ సమచారాన్ని పుస్తకం రూపం కల్పించి పాఠకులకు అందించగలిగించేంత వరకు సాగిన ప్రకియలో పలువరురు ప్రముఖులు సన్నిహితులు, మిత్రులు ప్రత్యక్షంగా సహకరించినా, పరోక్షంగా చేయూతనిచ్చినవారు పలువురున్నారు. ఆ కారణంగా ఈ గ్రంథం 'వ్యష్టి కృషి' కంటె 'సమష్టి కృషి' ఫలితమని భావిస్తున్నాను. ◆

**నవంబర్, 2006**
**వినుకొండ.**

**– సయ్యద్ నశీర్ అహమ్మద్**

## ' యాది ' సదాశివ

### శుభాశీస్సులు



'స్వాతంత్ర్య సమరంలో తాము పాల్గొనకున్నా ముస్లిములు పాల్గొనలేదని నిందించే మేధావులకు జవాబుగా ఎక్కడెక్కడో వెదికి, ఎంతో పరిశ్రమించి స్వాతంత్ర్య సమరంలో పాల్గొని వీరమరణం పొందిన (షహీదులయిన) ఎందరో ముస్లిమ్ వీరుల, వీర నారీమణుల చరిత్రలు రాసిన సయ్యద్ నశీర్ అహమ్మద్ ఒక మతానికి, ఒక కులానికి మాత్రమే ఉపకారం చేయలేదు, మొత్తం జాతికే ఉపకారం చేసినాడు. అతని వ్యాసాలు **గీటురాయి** పత్రికలోనే చాలా వరకు వచ్చాయి. అతని రచనలో ఎక్కడా పరనింద వుండదు. వ్యంగం వుండదు. పక్షపాతం వుండదు. అతిశయోక్తి అనిపించే మాట వుండదు. అతని సేవను ఎందరు గుర్తించినారు? ఎందరు సన్మానించినారు? సేవాభావం కలవాళ్లు సన్మానాలు ఆశించరు. వాళ్లను సన్మానించాలని ఏ సంస్థలూ భావించవు కూడా. నేనట్లాంటి వాళ్ళకు నమస్కరిస్తాను. అట్లాంటి వాళ్లకు దీర్ఘాయురారోగ్యాలు ప్రసాదించాలని భగవంతున్ని ప్రార్థిస్తాను '

(గీటురాయి 3-9-2004 నుంచి..)



## ' చేరాతల ' చేరా

### ఆకాంక్ష



'...ప్రముఖ భాషా శాస్త్రవేత్త ఆచార్య చేకూరి రామారావు గారు మాట్లాడుతూ భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ముస్లింల పాత్రను తెలియజేస్తూ సయ్యద్ నశీర్ అహమ్మద్ రాస్తున్న గ్రంథాలను తాను పరిశోధనాత్మక చరిత్ర గ్రంథాలుగా పరిగణిస్తున్నాని అన్నారు. రచయిత నశీర్ కృషిని గుర్తించి రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలు ఆయనకు డాక్టరేట్‌ని ఇవ్వాల్సివుందని, అయితే అది ఇంకా జరగక పోవటం విచారకరమన్నారు. తాను కనుక వైస్-ఛాన్సలర్ అయివున్నట్లయితే తప్పకుండా నశీర్‌కు డాక్టరేట్ ఇచ్చివుండేవాడినని చేరా చెప్పారు'

(గీటురాయి 25-8-2006 నుంచి..)

# అంకితం...

కుటిల రాజకీయం

కుత్సిత మతతత్వం

కలసి మెలసి సమాధి చేసిన

సజీవ చరిత్రను

కనురెప్పలతో తొలచి

తరచి వెలికి తీస్తూ

వెలుగును ప్రసాదిస్తున్న

**చరిత్రకారులందరికి**

సగౌరవంగా...

# భారత స్వాతంత్ర్యోద్యమం
# ముస్లిం మహిళలు

**భా**రతదేశ చరిత్రలో స్వాతంత్ర్యోద్యమం మహోజ్వల ఘట్టం. భారతీయుల పోరాటపటిమకు, త్యాగనిరతికి, నిరుపమాన దేశభక్తికి ఆ ఉద్యమం ఒక నిలువుటద్దం. దాదాపు ఒక శతాబ్దంపైగా సాగిన ఈ పోరాటాన్ని సుసంపన్నం చేసేందుకు జాతి, మత, కుల, ప్రాంతీయతలను విస్మరించి భారతీయులంతా ఏకోన్ముఖంగా ఆత్మార్పణలకు పోటీపడటం అపూర్వం. లక్షలాది ప్రజానీకం ఒకే నినాదం, ఒకే లక్ష్యం కోసం ఒకే బాటన ముందుకు సాగటం ప్రపంచ చరిత్రలోనే అరుదైన సంఘటన.

ఈ పోరాటానికి భారతదేశపు అతిపెద్ద అల్పసంఖ్యాకవర్గమైన ముస్లిం సమాజం తనదైన భాగస్వామ్యాన్ని అందించింది. ముస్లిమేతర సాంఘిక జన సమూహాలతో మమేకమై స్వాతంత్ర్యసమరంలో తన విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తించింది. అపూర్వ త్యాగాలతో, అసమాన బలిదానాలతో భారతీయ ముస్లింలు పునీతులయ్యారు. అయినప్పటికీ ముస్లిం సమాజం త్యాగమయ చరిత్ర పలు కారణాల మూలంగా మరుగున పడిపోయింది.

బ్రిటీష్ పాలకులు తమ పాలనను సుస్థిరం చేసుకునేందుకు విభజించు-పాలించు అను కుటిల నీతిని అమలుపర్చి భారతీయులను మతం పేరుతో హిందువులు-ముస్లింలుగా విభజించటంలో కృతకృత్యులయ్యారు.





ఆ తరువాత భారత విభజనకు దారితీసిన పరిస్థితులు, ఆ సందర్భంగా జరిగిన దారుణాలు, పొరుగుదేశంగా ఏర్పడిన పాకిస్తాన్‌తో జరిగిన యుద్ధాలు, వివాదాలు స్వాతంత్ర్యోద్యమ కాలంనాటి హిందూ - ముస్లింల ఐక్యతకు చిచ్చుపెట్టాయి. భారత విభజనానంతర పరిణామాల వలన అపరాధ భావనకు గురిచేయబడిన ముస్లిం సమాజం సుషుప్తావస్థలోకి నిష్క్రమించింది. యుద్ధాలు, వివాదాలు, దేశంలో తరచుగా సాగిన మత కలహాలు మెజారిటీ, మైనారిటీ వర్గాల మధ్య మానసిక విభజనకు కారణమయ్యాయి.

ప్రజల మత మనోభావాలను రెచ్చగొట్టి మతం పేరుతో మనుషులను చీల్చి, రాజకీయ ప్రయోజనాలను సాధించదలచిన మతోన్మాద రాజకీయశక్తులు, వ్యక్తులు ఈ చీలికను అగాధంగా మార్చాయి. పర్యవసానంగా బ్రిటీషర్ల బానిసత్వం నుండి మాతృభూమిని విముక్తం చేసేందుకు సాగిన సుదీర్ఘ పోరాటచరిత్రలో ముస్లిం సమాజం త్యాగాలు మరుగున పడిపోయాయి.

## ప్రజలకు చేరువకాని సమాచారం

చరిత్ర గ్రంథాలలో ముస్లింలు చాలా వరకు కన్పించరు. ఒకరిద్దరు కన్పించినా అనన్య సామాన్యమైన వారి త్యాగాలు, సాధారణ స్థాయి వివరణలతో వర్ణనలతో సరిపెట్టబడ్డాయి. ప్రాచుర్యంలో ఉన్న చరిత్ర గ్రంథాలలో ముస్లింల వీరోచిత గాధలు సరైన స్థానం పొందలేకపోయాయి. ఆయా కథనాలు సామాన్య చరిత్ర గ్రంథాలలోగాని, పాఠ్య పుస్తకాలలోగాని చోటు చేసుకోలేదు. ఫలితంగా భవిష్యత్తు తరాలకు అమూల్య సమాచారం అందకుండా పోయింది.

చరిత్ర ద్వారా తెలిగ్గా సమాచారం లభించే అవకాశం లేనందున, కళా రూపాలకు, సాహిత్య ప్రక్రియలకు, ప్రచార మాధ్యమాలకు ముస్లింల శ్లాఘనీయ చరిత్రలు కథా వస్తువు కాలేకపోయాయి. ఆ కారణంగా ముస్లింల త్యాగాలు, ఆనాటి వీరోచిత సంఘటనలు జనబాహుళ్యంలోకి వెళ్ళకపోవటంతో ఆ తరువాతి తరాలకు ఆ విషయాలు అందలేదు. ఈ పరిణామాలే భారతదేశంలోని హిందూ- ముస్లిం జనసమూహాల మధ్య మానసిక ఎడం ఏర్పడటానికి ప్రధాన కారణమయ్యాయి.

ఈ అగాధాన్ని మరింత పెంచి ఒక సాంఘిక జనసమూహానికి తామే ఏకైక ప్రతినిధులుగా ప్రకటించుకుని రాజ్యమేలాలని ఆశిస్తున్న శక్తులు-వ్యక్తులు ఈ అవకాశాన్ని వినియోగించుకుంటున్నాయి.

# పురుషులకు దీటుగా మహిళలు

ఈ సమరోజ్వల చరిత్రలో ముస్లిం మహిళలు కూడా పురుషులతో దీటుగా తమదైన వీరోచిత పాత్ర నిర్వహించారు. ఆ త్యాగాలు కూడా పలు కారణాల మూలంగా మరుగున పడిపోయాయి. మతపరమైన ఆచార సంప్రదాయాలు ముస్లిం మహిళలను గడప దాటనివ్వవన్న అపోహల మూలంగా ముస్లిం మహిళల త్యాగమయ చరిత్ర వైపు దృష్టి సారించటమే గగనమైపోయింది. చరిత్రకారుల అన్వేషణకు స్వాతంత్ర్యోద్యమంలో ముస్లిం మహిళల పాత్ర వస్తువు కాలేకపోయింది. ఆ కారణంగా విముక్తి పోరాటంలో ముస్లిం మహిళల అరుదైన పాత్ర చరిత్ర పుటలలో బందీగా మిగిలిపోయింది.

మాతృభూమి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం ముస్లిం మహిళలు ఆత్మబలిదానానికి సిద్ధపడిన దృష్టాంతరాలున్నాయి. విముక్తి పోరాట మైదానంలో శత్రువును సవాల్ చేసిన వీర వనితల చరిత్రలున్నాయి. సాహసోపేత సంఘటనలున్నాయి. ఆ సంఘటనలన్ని చరిత్ర అట్టడుగు పొరల నుండి బయటపడలేక పోయాయి.

# ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో...

ప్రథమ స్వాతంత్రసమరంలో ప్రధాన పాత్ర వహించిన ముస్లిం సమాజానికి చెందిన స్త్రీలు తమ అపూర్వ త్యాగాలతో, ఆత్మార్పణలతో చరిత్ర పుటలను ఎరుపెక్కించారు. అటువంటి వారిలో ప్రముఖులు అవధ్‌రాణి బేగం హజరత్ మహల్. బ్రిటీష్ పాలకులు కుయుక్తులతో ఆమె భర్త నవాబ్ వాజిద్ అలీషాను అరెస్టు చేసి అవధ్‌ను స్వాధీనం చేసుకున్నారు. మాతృభూమి పరుల పాలవడంతో ఆగ్రహించిన ఆమె ప్రజల అండదండలతో బ్రిటీష్ సైన్యంపై విరుచుకుపడి తిరిగి తన రాజ్యాన్ని సొంతం చేసుకున్నారు. పదమూడు సంవత్సరాల తన బిడ్డడు బిర్జిస్ ఖదీర్‌ను నవాబుగా ప్రకటించి అతని సంరక్షకురాలిగా బాధ్యతలు చేపట్టారు. స్వదేశీ పాలకులను, ప్రముఖులను ప్రజలను ఐక్యపర్చారు. పరిపాలనలో హిందూ-ముస్లింలకు సమాన స్థాయి కల్పించారు. బ్రిటీష్ సైనికదళాల పడగ నీడలో కూడా ఎంతో సాహసంతో 14 మాసాల పాటు బ్రిటీష్ వలస పాలకుల ఎత్తులను చిత్తుచేస్తూ, సమర్థవంతమైన పాలన సాగించారు. బేగంపై కత్తి గట్టిన బ్రిటీష్ పాలకులు అవధ్‌ను అపార సైనిక బలగాలతో ముట్టడించినా, ఏమాత్రం అధైర్యపడక ఆమె స్వయంగా రణరంగ ప్రవేశం చేసి, తన సైనిక దళాలను ముందుకు నడిపి వీరోచితంగా పోరాడారు. భారీ సంఖ్యతో చుట్టుముట్టిన బ్రిటీష్ సైనికమూకలను





ఎదుర్కొనటం కష్టతరమైన తరుణంలో, తిరిగి దాడి చేసేందుకు తాత్కాలికంగా యుద్ధరంగం నుండి వైదొలిగి నేపాల్ పర్వతాల్లోకి నిష్క్రమించారు. ఆ అడవుల్లో నానాసాహెబ్, మొగల్ రాకుమారుడు ఫిరోజ్ షా లాంటి యోధులను కలసి బలగాలను మళ్ళీ సమీకరిస్తూ, 1879లో నేపాల్ అడవుల్లో సామాన్య మహిళగా కన్నుమూశారు.

ప్రథమ స్వాతంత్ర్య సమరంలో బేగం బాటన నడిచిన మహిళలు పలువురున్నారు. చరిత్ర పుటలు మనకు పలువుర్ని పరిచయం చేస్తాయి. ఆనాటి పోరాటంలో ప్రాణాలను సైతం పణంగా పెట్టి శత్రువును మట్టు పెట్టేందుకు కదనరంగానికి కదలిన వారిలో బేగం అజీజున్ ఒకరు. మాతృభూమి పట్ల అపార ప్రేమాభిమానాలు గల ఆమె ప్రభుభక్తి పరాయణురాలు. కాన్పూరు అధినేత నానాసాహెబ్ తిరుగుబాటు శంఖారావాన్ని పూరించగానే ఆమె కూడా యుద్ధరంగ ప్రవేశం చేశారు. స్వయంగా శత్రుసైన్యాలను ఎదుర్కొన్నారు. సైనిక పటాలాలను, గూఢచారి దళాలను, ఆయుధాలు, ఆహారం అందించే బృందాలను నేర్పుతో ఏర్పాటుచేసి నానాసాహెబ్ పోరుకు ఎంతగానో తోడ్పడ్డారు. చివరి వరకు పోరాడుతూ యుద్ధభూమిలో గాయపడి శత్రువు చేత చిక్కారు. శత్రువు క్షమాభిక్ష ప్రకటించినా, తనకు ప్రాణం కంటే మాతృభూమి విముక్తికై సాగుతున్న పోరాటం ప్రధానమని ప్రకటిస్తూ, బ్రిటీష్ తుపాకి గుండ్లకు ఎదురు నిలిచి వీరమరణం పొందారు.

అజీజున్ మార్గాన సాగిన మరొకరు 60 సంవత్సరాల అనామిక. ఆమె పేరేమిటో తెలియదు. ఆమె ఎల్లవేళల ధరించే పచ్చరంగు దుస్తుల వలన ఆమె **పచ్చరంగు దుస్తుల మహిళ**గా ఖ్యాతిగాంచారు. గెరిల్లా పోరాటం సాగించిన ఆమె బ్రిటీష్ సైనికదళాలలో భయోత్పాతం సృష్టించారు. గాయపడిన తరువాత గాని పట్టుబడని ఆమెను అంబాలాలో గల బ్రిటీషు సైనిక స్థావరానికి పంపారు. ఆమెను అంబాల పంపుతూ, ఈ వృద్ధురాలు బహు ప్రమాదకారి...జాగ్రత్త, అంటూ అక్కడి అధికారులను హెచ్చరిస్తూ ప్రత్యేకంగా లేఖ రాసి పంపి, ముందు జాగ్రత్తల గురించి హెచ్చరించారంటే ఆ పచ్చదుస్తుల మహిళ ఎంతటి ఘటికురాలో మనం ఊహించవచ్చు.

ఈ విధంగా శత్రువును సాయుధంగా ఎదుర్కొన్న మహిళలు, సాయుధ తిరుగుబాటు దళాలను ప్రోత్సహించినవారు, ఆశ్రయం కల్పించి ఆదుకున్న మహిళలు ఎందరో ఉన్నారు. ఈ కోవలో మాతృదేశ విముక్తి కోసం ఉరిని కూడా లెక్కచేయని సాహసి హబీబా బేగం, ఝాన్సీ రాణి వెన్నంటి నిలచి పోరాడి ప్రాణాలర్పించిన ముందర్, బ్రిటీషు సైనిక మూకలను సాయుధంగా ఎదుర్కొన్న ధైర్యశాలి బేగం రహిమా, తిరుగుబాటు యోధుల

క్షేమం కోరుతూ సజీవదహనమైన అస్గరి బేగం, సాయుధంగా ఆంగ్ల సైన్యాలను నిలువరించిన బేగం జమీలా, కత్తిపట్టి కదనరంగాన శత్రువును సవాల్ చేసిన సాహసి బేగం ఉమ్‌ద్దా తదితరులు ఎందరో ఉన్నారు.

చరిత్ర నమోదు ప్రకారం ఆనాడు ఇతర సాంఘిక జనసముదాల తోపాటుగా వందలాది ముస్లిం మహిళలు కాల్చి వేయబడ్డారు. సజీవ దహనమాయ్యారు. ఉరితీయబడ్డారు. అవమానాలకు, అత్యాచారాలకు గురయ్యారు. ఈ మేరకు ఆ సమాచారాన్ని బ్రిటీష్ అధికారుల డైరీలు, లేఖలు బహిర్గతం చేస్తున్నాయంటే, ఆ వీరనారీమణుల త్యాగాలు ఎంతటి మహత్తరమైనవో మనం అర్థం చేసుకోవచ్చు.

## జాతీయోద్యమంలో....

ప్రథమ స్వాతంత్ర్యసమరం రగిల్చిన స్వాతంత్ర్య కాంక్ష లక్షలాది మహిళలను స్వాతంత్ర్యోద్యమం వైపు నడిపింది. పూర్వీకుల అసమాన పోరాటాలను వారసత్వంగా స్వీకరించిన ముస్లిం మహిళలు ఖిలాఫత్ ఉద్యమం ద్వారా పెద్ద సంఖ్యలో జాతీయోద్యమంలో అడుగు పెట్టారు. ఈ సందర్భంగా ఖిలాఫత్ కమిటీ, జాతీయ కాంగ్రెస్ నిర్వహించిన సహాయ నిరాకరణోద్యమం, విదేశీవస్తు బహిష్కరణ, మద్యపాన నిషేధం లాంటి పలు కార్యక్రమాలలో ముస్లిం స్త్రీలు బృహత్తర పాత్ర నిర్వహించారు.

బ్రిటీష్ పాలకుల దమననీతి, నిర్బంధాలకు భీతిల్లకుండా జాతీయోద్యమబాటలో నడిచిన స్త్రీలలో బీబీ అమ్మకు తొలి స్థానం లభించింది. ఆమె అసలు పేరు ఆబాదీ బానో బేగం కాగా **బీబీ అమ్మ**గా ఆమె చిరస్మరణీయ ఖ్యాతి గడించారు. అనితర సాధ్యమైన సాహసంతో, అద్భుతమైన ప్రసంగాలతో, ఆదర్శవంతమైన నేతృత్వంతో ఖిలాఫత్ ఉద్యమం కోసం దేశమంతా తిరిగి ఆమె నిధులను సమకూర్చారు. ఈ నిధులే భారత పర్యటన గావించిన గాంధీజీకి ఉపయోగపడ్డాయి. **ఈ దేశపు కుక్కలు పిల్లులు కూడ బ్రిటీష్ బానిస బంధనాలలో నుండ వీలులేదని** గర్జించిన ఆమె హిందూ-ముస్లింల ఐక్యతకు చివరి వరకు కృషి సల్పారు. జాతీయోద్యమకారులంతా తనను అమ్మ అని పిలుస్తున్నందున, బిడ్డల ఎదుట తనకు పర్దా అక్కరలేదని ప్రకటించి, పర్దాలేకుండా బహిరంగ సభలలో ప్రసంగించిన సాహసి ఆబాది బానో బేగం.

ఆబాది బానో బేగం బాటలో నడిచిన మరొక చిచ్చర పిడుగు నిషాతున్నీసా బేగం. ఆమె ఫైర్ బ్రాండ్‌గా పిలువబడిన మౌలానా హస్రత్ మోహాని భార్య. భర్త పలుమార్లు జైలుకు వెళ్ళినా అధైర్యపడకుండా ఉద్యమబాటన చివరికంటా నడిచిన మహనీయురాలు.





జాతీయోద్యమ ప్రధాన ఘట్టాలన్నిటిలో ఆమె ప్రముఖ పాత్ర వహించి సాహస మహిళగా ఖ్యాతిగాంచిన నిర్మొహమాటి. భర్త మౌలానా హస్రత్ మోహాని సంపూర్ణ స్వరాజ్యం తీర్మానాన్ని ప్రతిపాదించగా దానిని గాంధీజీ తిరస్కరించినందుకు ఆగ్రహించిన ఆమె గాంధీజీ వైఖరిని నిశితంగా విమర్శించి, చివరకు గాంధీజీచే శభాష్ అన్పించుకున్న ప్రతిభాశీలి. మంచి రచయిత్రి.

ఈ వరుసలో అలీ సోదరులలోని షౌకత్ అలీ భార్య అంజాదీ బేగం, మౌలానా అబుల్ కలాం ఆజాద్‌కు స్ఫూర్తిగా నిల్చిన జులేఖా బేగం, స్వాతంత్రేచ్ఛను రగిల్చే సాహిత్యాన్ని సృష్టించిన కవయిత్రి జాహిదా ఖాతూన్, ఆలోచనాత్మక ప్రసంగాలకు పెట్టింది పేరైన అక్బరీ బేగంలను పేర్కొనవచ్చును. బ్రిటీష్ పోలీసులు గుర్రాలచేత తొక్కించినా, లాఠీలతో రక్తసిక్తం చేసినా పోరుబాట వీడని హమీదా తయ్యాబ్జీ, గాంధీజీచే మధ్యపాన నిషేధ ఉద్యమనేతగా నియుక్తురాలైన అమీనా తయ్యాబ్జీ, బ్రిటీష్ పోలీసు మూకల దాష్టీకాన్ని ఎదుర్కొన్న షఫాతున్నిసా బేగం, ఆదర్శ జాతీయవాదిగా ఖ్యాతిగాంచిన మజీదా బాను, జలియన్‌వాలా బాగ్‌లో జనరల్ డయ్యర్ ఘాతుకానికి బలైన 55 సంవత్సరాల వీరమాత ఉమర్ బీబీ గౌరవప్రదమైన మరణం బానిస బతుకుకంటే మేలైనదని చాటిన బేగం మహమ్మద్ ఆలంలు జాతీయోద్యమంలో ప్రముఖపాత్ర వహించారు.

జాతీయ కాంగ్రెస్ జనచైతన్య కార్యక్రమాలలో ప్రముఖపాత్ర నిర్వహించారు ఫాతిమా బేగం. జాతి ప్రయోజనాలకు తమ సంపద ఉపయోగపడకపోతే అది ఎంత ఉన్నా వ్యర్థమంటూ షంషున్నీసా అన్సారీ తమ యావదాస్తిని జాతీయోద్యమానికి ధారపోశారు. భర్త పాలకుల కిరాతకానికి గురైనప్పటికీ ఆయన బాధ్యతలను స్వీకరించి ఉత్తేజపర్చే ఉత్తరాలతో స్వాతంత్ర్య సమరయోధులలో ఉత్సాహాన్ని నింపారు బేగం జాఫర్ అలీఖాన్. గాంధీజీ కోరిక మేరకు క్రమం తప్పక ఆయనకు లేఖలు రాస్తూ, ఆయన ఉర్దూభాషను బేగం జోహరా అన్సారి తీర్చిదిద్దారు. ఈ మహిళలంతా తాము కలలుగన్న ' స్వతంత్ర భారతాన్ని ' కళ్ళారా చూడకుండానే పరలోకగతులయ్యారు.

## సాయుధపోరాట మార్గంలో...

అహింసా మార్గాన్నే కాకుండా ప్రమాదభరితమైన సాయుధపోరాట మార్గాన కూడా పలువురు ముస్లిం మహిళలు ఉద్యమించారు. **ఖుదీరాం కి దీది**గా ఖ్యాతిగాంచిన విప్లవ వీరుడు మౌల్వీ అబ్దుల్ హదీమ్ సోదరి వీరిలో ఒకరు. ఆమె అసలు పేరు తెలియదు. విప్లవకారుల మీద, వారి సన్నిహితుల మీద, సానుభూతిపరుల మీద బ్రిటీష్ ప్రభుత్వం

విరుచుకు పడుతున్న భయానక వాతావరణంలో విప్లవ వీరుడు ఖుదీరాంను రక్షించుకునేందుకు విఫల ప్రయత్నం చేశారామె. బ్రిటీష్ గూఢచారి వర్గాల కళ్ళుగప్పి జాతీయ ఉద్యమకారులకు సమాచారాన్ని చేరవేసే కొరియర్‌గా సఫియా వాజిద్ చురుకైన పాత్ర నిర్వహించారు. ఈ వరుసలో కంటక ప్రాయమైన విప్లవబాటను ఎంచుకుని ఆత్మార్పణకు సిద్ధపడిన రజియా ఖాతూన్ లాంటి మహిళలు ఎందరో ఉన్నారు.

జాతీయోద్యమంలో పాల్గొనటమేకాక, జమీందార్ల జులుంను సాయుధంగా ఎదుర్కొన్న వారిలో కూడా ముస్లిం మహిళలున్నారు. సింధ్ ప్రాంతానికి చెందిన మాయి భక్తావర్ ఆ కోవకు చెందినవారు. తన గ్రామానికి చెందిన రైతుల కష్టార్జితాన్ని దోచుకో చూసిన జమీందారు గూండాలను, జమీందారుకు వత్తాసుగా వచ్చిన పోలీసులను సాయుధంగా ఎదుర్కొని ఆ పోరులో వీరమరణం పొందిందామె. ఈ విధంగా పోరాడిన వీరవనితలు ఎందరో ఉన్నా ప్రచారం లభించినవారు చాలా తక్కువ.

## నవభారత నిర్మాణంలో...

స్వాతంత్ర్యోద్యమం వేగం అందుకుని లక్ష్యసాధన దిశగా పరుగులిడుతున్న దశలో ఉద్యమంలో భాగస్వాములైన ఆనాటి మహిళలంతా అదృష్టవంతులు. ఆ తల్లులంతా తాము కలలుగన్న స్వతంత్ర భారతావనిని కళ్ళారాగాంచటమేగాక, కొందరు నవభారత నిర్మాణంలో బృహత్తరమైన బాధ్యతలు నిర్వహించారు.

ఈ తరంలోని ముఖ్యులలో ఒకరు జుబేదా బేగం. చిన్ననాటనే ఉద్యమబాటన నడక ప్రారంభించిన ఆమె అద్భుత వక్త. సుసంపన్న కుటుంబంలో జన్మించిన ఆమె తన సర్వస్వం జాతీయోద్యమానికి సమర్పించారు. చివరి దశలో కటిక పేదరికం అనుభవిస్తూ కూడా ప్రభుత్వం ప్రకటించిన పెన్షన్ స్వీకరించ నిరాకరించారు. పెన్షన్ స్వీకరించటమంటే తన మాతృదేశ సేవకు ఖరీదు కట్టడమేనంటూ, ఎటువంటి ఆర్థిక సహాయం స్వీకరించకుండా గడిపారు. ఈ రకంగా భారత ప్రభుత్వం ఇవ్వజూపిన అనేక రకాల ఆర్థిక సహాయాన్ని మర్యాదపూర్వకంగా తిరస్కరించిన వారెందరో ఉన్నారు.

ఈ మేరకు ఉద్యమంలో భాగంగా గాంధీజీ అడుగుజాడల్లో నడిచిన ప్రముఖుల్లో శ్రీమతి అముతుస్సలాం ఒకరు. నౌఖాళి మతకలహాల నివారణకు గాంధీజీ ఆమెను పంపారు. కలహాల నివారణకు గ్రామీణులు సహకరించకుండా మంకుపట్టు పట్టడంతో 22 రోజులపాటు నిరాహారదీక్ష పూని ఆ ప్రాంతంలో శాంతి సామరస్యాన్ని నెలకొల్పిన





ఆమె గాంధీజీ ప్రశంసలందుకున్నారు. బేగం రెహనా తయ్యబ్జీ గాంధీజీకి ఉర్దూ భాషను నేర్పిన గురువయ్యారు. పండు వయస్సులో కూడా బేగం లుక్మాని పోరాట పటిమ చూపారు. స్వదేశీ ఉత్పత్తులను ప్రోత్సహించే కార్యక్రమంలో బేగం ఫాతిమా ఇస్మాయిల్ చురుగ్గా వ్యవహరించారు. బొంబాయి నగరంలో 30 సంవత్సరాలపాటు అవిశ్రాంతంగా శ్రమించి ఐదు లక్షల మందిని అక్షరాస్యులుగా తీర్చిదిద్దటంలో అనితర సాధ్యమైన విజయాన్ని బేగం కుల్సుం సయాని సొంతం చేసుకున్నారు. ఆమె వయోజన విద్యావ్యాప్తి కోసం ప్రత్యేకంగా పలు భాషలలో **రహబర్** అను పత్రికను కూడా నడిపారు. జాతీయోద్యమంలోని ప్రతి ఘట్టంలోనూ పాల్గొన్నారు.

స్వాతంత్ర్య ఉద్యమకారులచే **హజ్రా ఆపా**గా (హజ్రా అక్కయ్య) హజ్రా అహమ్మద్ పిలిపించుకున్నారు. రష్యాను సందర్శించిన తొలి భారతీయ మహిళగా ఆమె ఖ్యాతిగాంచారు. ఆంధ్ర రాష్ట్రంలోని మంతెనవారి పాలెంలో జరిగిన రాజకీయ శిక్షణా తరగతులలో ఆమె పాల్గొన్నారు. ఈవిధంగా అంకిత భావంతో విముక్తి పోరాటంలో పాల్గొన్న వారిలో ఆదర్శవంతమైన సేవలకు అంకితమైన బేగం సుఫియా సోం, ఆత్మరక్షణకు ఆయుధం ధరించిన బేగం సుల్తానా హయాత్, గాంధీజీ నేతృత్వంలో ఆదర్శ వివాహం చేసుకున్న బేగం ఆమనా ఖురేషి, పోరుబాటలో నడిచినందుకు అరెస్టయిన ఢిల్లీలోని తొలి మహిళా కార్యకర్త బేగం మహబూబ్ ఫాతిమా లాంటి వారెందరో ఉన్నారు.

## తెలుగింటి ఆడపడుచులు

ఈ కోవకు చెందిన వారిలో తెలుగింటి ఆడపడుచులూ ఉన్నారు. అటువంటివారిలో మహమ్మద్ గౌస్ ఖాతూన్, హజ్రా బీబీ ఇస్మాయిల్, నఫీస్ ఆయేషా బేగం, రబియాబీ తదితరులు ఉన్నారు. చీరాల-పేరాల ఉద్యమంలో పాల్గొన్న ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు గౌస్ మొహిద్దీన్ భార్య ఖాతూన్, భర్తతోపాటుగా జైలుకు వెళ్ళకపోయినా, ఉద్యమకారులకు ఆశ్రయం కల్పిస్తూ, ఆతిథ్యమిస్తూ, తన కుటుంబానికి చెందిన సర్వం ఉద్యమం కోసం వ్యయం చేసిన త్యాగశీలి. గాంధీజీ అనుచరుడుగా రాష్ట్రంలో ప్రఖ్యాతి గాంచిన ఖద్దర్ ఇస్మాయిల్ భార్య హజ్రా బీబీ గాంధీజీ బాటన నడిచినందుకు ఆమె కుటుంబాన్ని వెలివేసినా వెరవని ధీమంతురాలు.

అనంతపురం జిల్లా చియ్యేడు గ్రామానికి చెందిన రబియాబీ భర్త మొహిద్దీన్ సాహెబ్‌తో కలిసి సత్యాగ్రహంలో పాల్గొని చరిత్ర సృష్టించారు. ఆంధ్రావనిలో ఒక ముస్లిం

మహిళ వ్యక్తిగత సత్యాగ్రహ ఉద్యమంలో బహిరంగంగా పాల్గొనటం ఇదే ప్రథమమని ఆనాడు పలువురు శ్లాఘించారు. జాతీయోద్యమకారుడైన భర్త, ఆమెను పర్దాపద్ధతి నుండి విముక్తి చేయడంతో, రబియాబీ మరింత ఉత్సాహంతో స్వాతంత్ర్యోద్యమంలోని ప్రతి కార్యక్రమంలో పాల్గొన్నారు. ఆనాడు సాగిన యుద్ధ వ్యతిరేక ప్రదర్శనలో స్వయంగా పాల్గొనటమేకాక యుద్ధ వ్యతిరేక నినాదాలిచ్చి పలువుర్ని ఆశ్చర్యచకితులను చేశారు. ఆనాడు మహిళలకు జైళ్ళల్లో ప్రత్యేక ఏర్పాట్లు లేనందున అరెస్టు కాకుండా తప్పించుకున్నారు. స్వజనుల చేత పలు విమర్శలకు గురైనప్పటికీ ఖాతరు చేయకుండా, చివరి శ్వాస వరకు జాతీయోద్యమ కార్యక్రమాలలో పాల్గొనటం ఆమె మానలేదు.

## నైజాం విలీనోద్యమంలో...

స్వాతంత్ర్యం సాధించాక, ఇండియన్ యూనియన్‌లో నైజాం విలీనమవ్వాలన్న డిమాండ్‌తో సాగిన పోరులో కూడా రాష్ట్రానికి చెందిన పలువురు ముస్లిం మహిళలు పాల్గొన్న దాఖలాలున్నాయి. ముస్లిం మహిళలకు ఉన్న మత, సామాజిక బంధనాల మూలంగా పెద్ద సంఖ్యలో ఉద్యమ బాటన నడవలేకపోయినప్పటికీ, ఉద్యమకారులైన తమ బిడ్డలను, భర్తలను ఎంతగానో ప్రోత్సహించారు. పరోక్షంగా సహకరించారు. ఈ విధంగా పరోక్ష సహాయం అందచేసిన వారెందరో ఉన్నప్పటికీ అందరి వివరాలు తెలియరాలేదు.

రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన స్వాతంత్ర్య సమరయోధుల గ్రంథంలో ఒకే ఒక ముస్లిం మహిళ పేరుంది. ఆ అదృష్టవంతురాలు నఫీస్ ఆయేషా బేగం. ఆమె హైదరాబాద్ నివాసి. ఆమె తండ్రి పేరు హామీద్ అలీఖాన్. ఆమె 16-9-1948 నుండి 17-9-1948 వరకు రెండురోజుల పాటు నిర్బంధంలో ఉన్నారు. నైజాం విలీనం కోరుతూ ఉద్యమించినందున ఆమె నిర్బంధానికి గురయ్యారు. ఆమె పేరు తప్ప మరే ముస్లిం మహిళ పేరు రాష్ట్ర ప్రభుత్వం ప్రచురించిన గ్రంథాలలో కన్పించపోవటం ఆశ్చర్యం కల్గించే అంశం.

## తెలంగాణ పోరాటంలో....

ఆనాడు జరిగిన తెలంగాణ సాయుధ పోరాటంలో కూడా ముస్లింలు తమ భాగస్వామ్యాన్ని అందించారు. స్త్రీ, పురుష భేదం లేకుండా ఆ పోరులో పాల్గొన్నారు. అటువంటి వారిలో రాజారాం గ్రామానికి చెందిన జైనాబి ఒకరు. పేద రైతు కుటుంబానికి చెందిన ఆమె పోరాట నాయకులకు తన ఇంట రక్షణ కల్పించారు. పోలీసుల నుండి





కాపాడారు. చివరివరకు ఆమె ఉద్యమకారులకు చేయూత నిచ్చారు. వయస్సుతో నిమిత్తం లేకుండా, శరీరం సహకరించని వృద్ధాప్యంలో కూడా పోరాటయోధులను అటు రజకార్ల నుండి, భూస్వాముల స్వంత సాయుధ బలగాల నుండి, ఇటు మిలటరీ దాడులు, సోదాల నుండి రక్షించుకునేందుకు ప్రాణాంతక సహసాన్ని ప్రదర్శించిన మహిళలు మనకు తారసపడతారు. జాతీయోద్యమంలో పాల్గొనటం మాత్రమే కాకుండా సామ్యవాద భావాలతో ప్రభావితమై ఇటు ఇండియన్ యూనియన్‌లో నైజాం సంస్థానం విలీనం కోసం సాగిన పోరు, ఆ తరువాత అటు తెలంగాణా రైతాంగ పోరాటంలలో కూడా తమ త్యాగపూరిత భాగస్వామ్యాన్ని అందించిన మహిళలలో బేగం రజియా, జమాలున్నీసా బాజీ లాంటి వారున్నారు.

నైజాం వ్యతిరేకపోరాటం నుండి తెలంగాణా రైతాంగ పోరాటం వరకు ముస్లిం కుటుంబాలు ఉద్యమకారులను తమ కడుపులో పెట్టుకుని కాపాడిన సంఘటనలు అనేకం ఉన్నాయి. ఆయుధాలు చేతపూని రణం చేసిన సాహసులైన వీరవనితలు ఉన్నారు. వడిసెల గిరగిరా తిప్పుతూ శత్రువు మీద దాడి జరిపిన సమశీల మహిళలు ఉన్నారు. ఆనాడు సామాజిక జీవన బంధనాలలో ఉంటూ కూడా బ్రిటీష్ వ్యతిరేక పోరాటంలో పాల్గొన్న మహిళలు చరిత్ర గ్రంథాలలో తమదైన స్థానాన్ని సంపాదించుకోలేక పోయారు. అందు వలన ఆ తల్లుల గురించి ప్రజలకు అతి తక్కువ మాత్రమే తెలిసింది. ప్రభుత్వం ప్రచురించిన గ్రంథాలలో కూడా మహిళామణులకు స్థానం లభించకపోవడం విచారకరం.

ఈ విధంగా పేర్కొంటూ పోతే అనేక మంది మణిపూసల్లాంటి మహిళలను మనం ప్రస్తావించుకోవచ్చు. ఈ మహిళల చరిత్రలు అక్కడక్కడా ఆయా ప్రాంతాలలో స్థానిక భాషలలో, స్థానిక చరిత్ర గ్రంథాలలో ఉన్నాయి. ఆనాటి వారి త్యాగాల గురించి అందరికి తెలియాలంటే జాతీయ స్థాయి ప్రామాణిక చరిత్ర గ్రంథాలలో అన్ని సాంఘిక జనసముదాయాలకు చెందిన స్వాతంత్ర్యసమరయోధులందరికి తగిన స్థానం కల్పించాలి. ఆ లక్ష్యంగా చరిత్ర గర్భంలో దాగిన మరెందరి చరిత్రలనో పరిశోధకులు వెలికి తీయాలి. ఆయా చరిత్రలను ఆయా ప్రాంతీయ భాషల్లో ప్రచురించాలి. ఆ చరిత్రలను పాఠ్యగ్రంథాలలో పొందుపర్చాలి. ఆనాటి త్యాగాల పరంపరకు భవిష్యత్తరాలను వారసులను చేయాలి.

ప్రస్తుతం భారతీయ ప్రధాన జన సముదాయాల మధ్య మానసిక అంతరాలు, అపోహలు, అనుమానాలకు ప్రధాన కారణం ఆయా సాంఘిక జన సముదాయాల

త్యాగమయ చరిత్రలను విస్మరించటమే. ఈ అవకాశాన్ని స్వార్థపర రాజకీయ శక్తులు, వ్యక్తులు ఉపయోగించుకుంటున్నారు.

ఈ ప్రమాదకర పరిస్థితికి ప్రతిగా, ఆ త్యాగాల స్ఫూర్తిగా ప్రతి ఒక్కరూ భారతదేశ బంగారు భవితకై నడుం కట్టేలా ప్రోత్సహించాలి. అందుకు ప్రజలు, ప్రభుత్వాలు సహకరించాలి. అప్పుడు మాత్రమే త్యాగసంపన్నులైన మన పూర్వీకులకు మనం ఘనమైన నివాళి అర్పించినవారం కాగలుగుతాం.

## త్యాగాల చరిత్ర అందరికీ తెలియాలి

ప్రజలకు అన్ని సాంఘిక జనసముదాయాల త్యాగాలు తెలియాల్సి ఉంది. పలు సాంఘిక జనసముదాయాలు కలసిమెలసి సహజీవనం సాగిస్తున్న గడ్డ అయినటువంటి భరతభూమిలో ఆయా జనసముదాయాల మధ్యన సుహృద్భావ వాతావరణం ఏర్పడడానికి ఒకరి త్యాగపూరిత చరిత్రలు మరొకరికి తెలియాల్సిన ఆవసరం ఎంతైనా ఉంది. మాతృభూమి సేవలో పునీతమైన ప్రజలందరి చరిత్ర అన్ని సాంఘిక జనసముదాయాలకు తెలిసినప్పుడు మాత్రమే ఆయా జనసముదాయాల మధ్యన పరస్పర గౌరవం ఏర్పడుతుంది. ఆ గౌరవం సదవగాహనకు కారణమౌతుంది. ఆ సదవగాహన నుండి సద్భావన, సహిష్ణుత ఉత్పన్నమౌతాయి. ఆ సహిష్ణుత, సామరస్యం, శాంతి-స్నేహాలకు బలమైన పునాది అవుతాయి.

ఈ వాతావరణంలో లౌకిక వ్యవస్థ పరిఢవిల్లుతుంది. మత విద్వేషాలు మట్టిలో కలసిపోయి మతసామరస్యం మరింతగా పటిష్టమౌతుంది. మతోన్మాద రాజకీయ శక్తుల కుట్రలు, కుయుక్తులకు అడ్డుకట్ట పడుతుంది. ఆ ప్రయత్నంలో భాగంగా సామాన్య ప్రజలకు చేరువకాని ముస్లింల, ప్రధానంగా ముస్లిం మహిళల త్యాగమయ చరిత్రను ప్రజల చెంతకు చేర్చేందుకు సాగుతున్న కృషిలో అతి చిన్న ప్రయత్నమిది.

◆◆◆

## జీవిత రేఖా చిత్రాల క్రమం...









◆◆◆



## బ్రిటీష్ సైనిక బలగాలను సవాల్ చేసిన యోధురాలు

# బేగం హజరత్ మహల్

**(-1874)**

**మా**తృభూమి కోసం ప్రాణాలను పణంగా పెట్టి, బ్రిటీష్ సైనిక బలగాలతో తలపడిన రాణులు స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో అరుదుగా కన్పిస్తారు. ఆ అరుదైన ఆడపడుచులలో అగ్రగణ్యురాలు బేగం హజరత్ మహల్. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం తొలిదశలో ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులతో రాజీబేరాలు కుదుర్చుకునే ప్రయత్నాలు చేసి, అవి విఫలమై చివరకు మార్గాంతరం లేక పోరు మార్గం ఎంచుకున్న రాణుల్లా కాకుండా, ఆది నుండి కంపెనీ పాలకులను శత్రువులుగా పరిగణించి, మాతృదేశ పరిరక్షణార్థం, ప్రజల ఆత్మగౌరవం కోసం ఆయుధం పట్టక తప్పదని ప్రకటించి, అత్యంత ధైర్య సాహసాలతో రణభూమికి నడిచిన వీరనారీమణి బేగం హజరత్ మహల్.

ఆమె ఉత్తర భారతదేశంలోని అత్యంత సంపన్నవంతమైన అవధ్ రాజ్యం అధినేత నవాబ్ వాజిద్ అలీషా సతీమణి.ఆమె స్వస్థలం మాత్రం ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ఫైజాబాద్. ఆమె చిన్నప్పటి పేరు ముహమ్మద్ ఖానం. ఆమె అందచందాలకు గురించి విన్న నవాబు వాజిద్ అలీ షా ఆమెను కోరి మరీ వివాహమాడాడు. వివాహం తరువాత ఆమె బేగం హజరత్ మహల్ అయ్యారు. వివాహం తరువాత ఆమెకు ఇఫ్తికారున్నీసా (నారీమణి) అని పేరుపెట్టాడు భర్త. ఆమెకు **సుగంధ కన్య** అని బిరుదు కూడా ఇచ్చాడాయన.





ఆమెను ఇఫ్తికారున్నీసా ఖానం సాహెబా అని కూడా పిలుచుకున్నాడు. ఆ దంపతులకు మిర్జా బిర్జిస్ ఖదిర్ బహుద్దూర్ అను కుమారుడు కలిగాడు. ఆ తరువాత ఆమె బేగం హజరత్ మహల్ అయ్యారు.

అవధ్ రాజ్యం రాజధాని లక్నో. అది మొగల్ రాజ్యంలో ఒక భాగం కాగా, ఆ ప్రభువుల బలాధిక్యత క్షీణిస్తున్న సమయంలో స్వతంత్ర్యరాజ్యంగా ప్రకటితమైంది. 1801లో అవధ్ రాజు నవాబు సాదత్ అలీ బ్రిటీష్ పాలకులతో సంధి చేసుకుని, అవధ్ రాజ్యాన్ని ఈస్ట్ ఇండియా కంపెనీకి అప్పగించాడు. అవధ్ మీద అధికారం కంపెనీ పాలకులది కాగా, నవాబు నామమాత్రమయ్యాడు. ఆ అవధ్ రాజ్యానికి చివరి నవాబు అయినటువంటి వాజిద్ అలీషా 1847లో సింహాసనం అధిష్టించాడు.

ఆ సంవత్సరం గవర్నర్ జనరల్‌గా డల్హౌసీ భారతదేశం విచ్చేశాడు. రాజ్యవిస్తరణ కాంక్షతో ఇండియాలోని ఒక్కొక్క రాజ్యాన్ని అక్రమంగా ఆక్రమించుకుంటున్న అతని చూపు సంపన్నవంతమైన అవధ్ రాజ్యం మీద పడింది. ఫలితంగా ఈస్ట్ ఇండియా కంపెనీకి చెందిన గవర్నర్ జనరల్ లక్నోలోని ఒక బ్రిటీష్ అధికారి ద్వారా లొంగుబాటు పత్రాన్ని తయారు చేయించి నవాబ్ వాజిద్ అలీషాకు పంపి, ఆ పత్రం మీద సంతకం చేయమని ఆదేశించాడు. ఆ విధంగా సంతకం చేయనట్లయితే కంపెనీ సేనలు అవధ్ రాజ్యంతోపాటుగా అంతఃపురాన్ని కూడా స్వాధీనం చేసుకోగలవన్నాడు. ఆ బెదిరింపులకు భయపడిన నవాబు అవధ్‌ను కంపెనీపరం చేయడానికి సిద్ధపడ్డాడు.

భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో అవధ్ పతాకాన్ని వినువీధుల్లో ఎగరవేసిన బేగం హజరత్ మహల్ ఆ సమయంలో రంగప్రవేశం చేశారు. ఆ లొంగుబాటు పత్రం మీద సంతకాలు చేయడమంటే అవధ్ రాజ్యాన్ని పూర్తిగా ఈస్ట్ ఇండియా కంపెనీకి దాసోహం చేయటమేనని భావించిన ఆమె గవర్నర్ జనరల్ ఆదేశాలను నిరసించారు.ఈ పరిణామాలతో ఆగ్రహించిన కంపెనీ పాలకులు నవాబ్ వాజిద్ అలీషాను 1856 ఫిబ్రవరి 13న నిర్బంధంలోకి తీసుకుని, మార్చి 13న కలకత్తా పంపారు. ఆ పరిణామాలకు భయపడిన నవాబు పరివారంలోని అత్యధికులు నవాబుతో పాటుగా కలకత్తా వెళ్ళిపోయారు. బేగం హజరత్ మహల్ మరికొందరు మాత్రం, స్వంత గడ్డను పరులపరం చేసి కలకత్తా వెళ్ళటం ఇష్టంలేక లక్నోలోని కౌసర్ బాగ్‌లో ఉండిపోయారు.

ఆంగ్లేయుల ఈ చర్య వలన ప్రజలలో అసంతృప్తి రగులుకుంది. అవధ్ చుట్టు

ప్రక్కల గల స్వదేశీ పాలకులు, స్వదేశీ యోధులు కంపెనీ పాలకుల దుశ్చర్యల పట్ల తీవ్రంగా ప్రభావితులయ్యారు. కుతకుతలాడుతున్న హృదయాలతో ఆంగ్లేయుల చర్యల పట్ల మండి పడసాగారు. ఆ సమయంలో ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం ఆరంభమైంది. కంపెనీ చర్యల పట్ల తీవ్రంగా ఆగ్రహావేశాలను వ్యక్తంచేస్తున్న అవధ్‌లోని ప్రజలు, సైనికులు స్వదేశీయుల పాలన కోసం కంపెనీ పాలకుల ఆధిపత్యాన్ని నిరాకరిస్తూ తిరుగుబాటు ప్రకటించారు. 1857 మే 31న లక్నోలోని ఛావనీలో తిరుగుబాటు ఫిరంగులు పేలాయి. ఆంగ్లేయాధికారులను, ఈస్ట్ ఇండియా కంపెనీ సమర్ధకులను లక్నో నుండి, అవధ్ రాజ్యంలోని ఇతర ప్రాంతాల నుండి తరిమివేశారు. అవధ్ రాజ్యంలోని అత్యధిక ప్రాంతాలు తిరుగుబాటు వీరుల ఆధిపత్యంలోకి వచ్చాయి. కంపెనీ పాలనాధికారం అనవాళ్ళు కూడా కన్పించకుండా తుడుచుకు పోయింది.

ఆ పరిస్థితులతో హడలిపోయిన ఆంగ్లేయులు బేగంతో కాళ్ళబేరానికి వచ్చారు. ఆమె కనుక కంపెనీకి సైనిక సహాయం అందచేస్తే వాజిద్ అలీషా పూర్వీకుడు షుజా ఉద్దౌలా కాలంలో అవథ్ పాలన క్రింద ఉన్న అన్ని ప్రాంతాలను తిరిగి ఆమెకు అప్పగిస్తామని, తద్వారా అవధ్ రాజ్యం విస్తరించగలదని రాయబారానికి దిగారు. ఈ ప్రతిపాదనను అంగీకరిస్తే కంపెనీ రాజ్యవిస్తరణ కాంక్షకు తాను తొడ్పాటు అందించినట్టు కాగలదు కనుక, స్వేచ్ఛా-స్వాతంత్ర్యకాంక్ష గల స్వదేశీ పాలకులకు వ్యతిరేకంగా ఆంగ్లేయుల పక్షాన నలివటం ఏమాత్రం సహించని బేగం హజరత్ మహల్ ఆ ప్రతిపాదనను నిర్వందంగా తిరస్కరించారు.

1857 జూన్ 30న చిన్హట్ వద్ద కంపెనీ బలగాలతో జరిగిన పోరాటంలో తిరుగుబాటు వీరులకు లభించిన విజయం ఇటు ప్రజలలో అటు తిరుగుబాటుకు సన్నద్ధమౌతున్న స్వదేశీపాలకులలో, సైనికులలో ఉత్సాహాన్ని రేకెత్తించింది. ఆ ఉత్సాహంతో తిరుగుబాటు యోధులు మరింతగా రెచ్చిపోయారు. స్వతంత్ర రాజ్యాన్ని ప్రకటించారు. ఆ సమయంలో అవధ్ పతాకం క్రింద నాయకత్వం స్వీకరించి ఆంగ్లేయుల మీద పోరాటం సాగించేందుకు బలమైన నాయకుడి అవసరం వచ్చింది.

నవాబు వాజిద్ అలీషా వంశస్థుల కోసం అన్వేషణ ప్రారంభమైంది. బ్రిటీష్ పాలకులంటే ఏర్పడిన భయం వలన లక్నోలో ఉంటున్న నవాబు భార్యలు కొందరు తమ బిడ్డలకు, కలకత్తాలో ఉన్న భర్త బంధువులకు ఎటువంటి ప్రమాదం సంభవించగ





లదోనని భయపడి కంపెనీ పాలకుల ఆగ్రహానికి తమను బలి చేయవద్దంటూ ప్రాధేయ పడుతూ నాయకత్వం స్వీకరణకు ఎవ్వరూ ముందుకు రాలేదు. ఆ క్లిష్ట సమయంలో హజరత్ మహల్ కంటకప్రాయమైన మార్గంలో కూడా చారిత్రక పాత్ర నిర్వహించేందుకు ఎంతో సాహసంతో ముందుకొచ్చారు. ప్రజల అభీయిష్టం మేరకు బిడ్డడు బిర్జిస్ ఖదీర్‌ను నవాబుగా ప్రకటించేందుకు అంగీకరించారు. ఆ సందర్భంలో బేగం నిర్వహించిన పాత్ర, ఆమె త్యాగనిరతి, ఆత్మబలిదానం చిట్టచివరి వరకు శత్రువుకు లొంగని దీరత్వం చరిత్రలో ఆమెకు ప్రత్యేకస్థానం సంతరించి పెట్టాయి.

ఆ సమయంలో అవధ్ రాజ్యంలోని ఫైజాబాద్‌లో కంపెనీ పాలకుల బందీగా నున్న తిరుగుబాటు యోధుల నేత మౌల్వీ అహమ్మదుల్లా షాను, తిరుగుబాటు యెధులు విడుదల చేయించి ఆయనను తమ నాయకునిగా స్వీకరించారు. మౌల్వీ తన బలగాలతో లక్నో చేరుకుని కంపెనీ పాలకులను ఎదుర్కొన్నారు. ఆ సందర్భంగా బేగం హజరత్ మహల్ బ్రిటీషు పాలకులకు వ్యతిరేకంగా మరింత చొరవ తీసుకున్నారు. ఆ కారణంగా తిరుగుబాటు మరింత ప్రజ్వరిల్లింది. పది రోజుల్లో లక్నో అంతా పూర్తిగా తిరుగుబాటు సేనల పరమైంది.

బేగం హజరత్ మహల్ తన బిడ్డ బిర్జిస్ ఖదీర్‌ను 1857 జూలై 5న అవధ్ నవాబుగా ప్రకటించారు. ఆ నిర్ణయాన్ని పలువురు ప్రముఖులు బలపర్చారు. తిరుగుబాటు యోధులలో ఆనందం విల్లివిరిసింది. బిర్జిస్ ఖదీర్ పేరిట బేగం హజరత్ మహల్ పాలన ప్రారంభమైంది. ఆమె అధికారపగ్గాలను చేపట్టగానే పాలనా పరమైన చర్యలను చేపట్టారు. అన్ని సాంఘిక జనసముదాయాలకు పాలనాధికారంలో భాగం కలిగించే విధంగా సమష్టి నిర్ణయాలకు అనుకూలంగా పాలనా వ్యవస్థను రూపొందించారు. బహిర్గత శత్రువును ఎదుర్కొడానికి ప్రాణాలు పణంగా పెట్టే సైనికులకు అధిక ప్రాధాన్యత కల్పించారు. స్వదేశీ పాలకులు, నమ్మకమైన సైనికాధికారులకు, తిరుగుబాటు వీరులకు, స్వదేశీ భక్తులకు ప్రతిభా సామర్థ్యాల ఆధారంగా పలు విభాగాల బాధ్యతలను అప్పగించారు.

మతం, కులం, ప్రాంతాల ప్రసక్తి లేకుండా, పౌర-సైనికాధికార ప్రముఖులైన మమ్ముఖాన్, మహారాజ బాలకృష్ణ, బాబూ పూర్ణచంద్, మున్షీ గులాం హజరత్, మహమ్మద్ ఇబ్రహీం ఖాన్, రాజా లాలా సింహ్, రాణా జిజియా లాల్, రాజా మాన్‌సింగ్, రాజా దేశిబక్ష్ సింగ్, రాజా బేణిప్రసాద్ లాంటి వారితో ఉన్నతస్థాయి కమిటీని ఏర్పాటు చేశారు.



**లక్నోలోని బేగం హజరత్ మహల్ అంతఃపురం**

ఈ కమిటీ ప్రతి రోజు సమావేశమయ్యేది. ప్రతి అంశాన్ని కమిటీ సభ్యుల ఎదుట పెట్టి, చర్చించి ప్రజాస్వామ్యబద్ధంగా నిర్ణయాలు తీసుకుని వాటి అమలును బేగం పర్యవేక్షించారు. ఆనాటి రాజరికపు రోజుల్లో ఆ విధంగా ప్రజాస్వామికంగా వ్యవహరించటం బేగం హజరత్ మహల్ బుద్ధికుశలతకు నిదర్శనం. అన్ని రంగాలు పూర్తిగా ఆమె ఆధీనంలోకి వచ్చాక అవధ్ నవాబు బిర్జిస్ ఖధిర్ పేరిట వెలువడిన ప్రకటనలు అవధ్ రాజ్యంలో ఆంగ్లేయుల పాలన అంతటితో అంతమైందని ఆ ప్రకటనలు స్పష్టం చేశాయి. అంతటితో ఆమె మిన్నకుండి పోలేదు. స్వయంగా గుర్రం మీద, ఏనుగు మీద సవారి చేస్తూ ప్రజలను, ప్రముఖులను కలుస్తు ఆమె రాజ్యమంతా తిరిగి అందర్ని ఏకతాటి మీదకు తెచ్చేందుకు విజయవంతంగా ప్రయత్నించారు.

బేగం హజరత్ మహల్ ఎటువంటి ప్రగతిశీల, సామరస్యపూర్వక విధానాలు చేపట్టినా, ఆమె శక్తిసామర్థ్యాల పట్ల విశ్వాసం కలుగని కొందరు స్వదేశీ పాలకులు, జమిందారులు ఆమె నాయకత్వాన్ని తొలుత ఆమోదించలేదు. అవధ్ అంతటా అస్తవ్యస్థ పరిస్థితి, క్రమశిక్షణారాహిత్యం, వ్యక్తిగత స్వార్థంతో కంపెనీ పాలకులవైపు మొగ్గు చూపుతున్న విద్రోహుల బెడద, బేగం శక్తి సామర్థ్యాలను శంకించే జమిందారుల రగడ, స్వదేశీ పాలకుల, అధికారుల సమస్యలు ఒకవైపు, అవమాన భారంతో రగిలిపోతున్న కంపెనీ పాలకుల కుయుక్తులు మరోకవైపు బేగం హజరత్ మహల్‌ను చుట్టుముట్టాయి.





ఆ పరిస్థితులలో కూడా ఆమె ఏమాత్రం అధైర్యపడలేదు. ప్రజలను ఆకట్టుకుంటూ, స్వదేశీ పాలకులకు, తాలూకాదారులకు పలు రాయితీలు ప్రకటించారు. ఆ సమయంలో ఆంగ్లేయాధికారి జనరల్ హ్యావ్‌లాక్ తనకు లభించిన రెండు విజయాల తరువాత కూడా అవధ్ నుండి నిష్క్రమించటంతో బేగం శక్తిసామర్థ్యాల మీద నమ్మకం కుదిరిన స్వదేశీ పాలకులు, జమిందారులు తిన్నగా బేగం నాయకత్వం స్వీకరించి, నజరానాలు సమర్పించుకోవటం ఆరంభించారు. ఢిల్లీలోని మొగల్ చక్రవర్తి బహద్దూర్ షా జఫర్ ప్రతినిధిగా బిర్జిస్ ఖదీర్ తనను తాను ప్రకటించుకున్నారు. ఆయన ప్రతినిధిగా బిర్జిస్ ఖదీర్ అవధ్ పాలకునిగా పాలనను చేపట్టారు. కంపెనీ అధికారుల చర్యలతో నష్టపోయి, కంపెనీ పాలకుల పట్ల ఆగ్రహంగా ఉన్న స్వదేశీయులు ఆయనను అవధ్ పాలకునిగా అంగీకరించారు. ఈ మేరకు అవసరమగు లాంఛనాలన్నీ పూర్తయ్యాయి.

ఆ అనుకూల వాతావరణంలో ప్రజల అవసరాలను తీర్చుతూ, శత్రువు దాడుల నుండి ప్రజలను కాపాడేందుకు లక్నో కోటను పటిష్టపర్చే కార్యక్రమాలను బేగం చేపట్టారు. ఆమె స్వయంగా తన లక్షలాది రూపాయలను వ్యయంచేసి కోటగోడలను పునర్మించారు. ప్రతి విషయాన్ని హజరత్ మహల్ స్వయంగా పర్యవేక్షించసాగారు. ఆమె ఏనుగునెక్కి పనులు సాగుతున్న ప్రదేశాలకు చేరుకుని స్వయంగా పర్యవేక్షించటంతో ప్రజలు-సైనికులు ఉత్సాహభరితులయ్యేవారు.

ఆ సందర్భంగా అవధ్‌లోని ప్రజలనుద్దేశించి బిర్జిస్ ఖదిర్ పేరిట బేగం హజరత్ మహల్ ఒక ప్రకటన విడుదల చేశారు. ఆ ప్రకటనలో, ' **హిందూ- ముస్లింలకు ధర్మం, ఆత్మగౌరవం, ప్రాణం, ధనం అను నాలుగు అంశాలు ప్రధానం. ఈ అంశాలను కేవలం స్వదేశీ పాలనలో, స్వదేశీ పాలకులు మాత్రమే ప్రసాదించగలరు. కంపెనీ సైనికులు ప్రజలను దోచుకుంటున్నారు. ఆత్మగౌరవాన్ని మంట కలుపుతున్నారు. స్త్రీల మీద అఘాయిత్యాలు, అత్యాచారాలు జరుపుతున్నారు...హిందూ-ముస్లిం పౌరులను హెచ్చరిస్తున్నాం. ఆత్మగౌరవంతో, ధర్మబద్ధంగా ప్రశాంత జీవితం సాగించాలంటే స్వదేశీ పాలన కోసం శతృవులకు వ్యతిరేకంగా ఆయుధాలు చేపట్టండి. స్వదేశీ సైన్యంలో భర్తీకండి. ..మాతృదేశం కోసం సాగుతున్న పోరాటంలో భాగస్వాములు కండి. శతృవుకు సహకరించ కండి. ఆశ్రయం ఇవ్వకండి..**', అంటూ బేగం హజరత్ మహల్ ప్రజలకు పిలుపునిచ్చారు. ఆ పిలుపుతో ఉత్తేజితులైన ప్రజలు, సైనికాధికారులు, అంతవరకు ఆమెకు దూరంగా

ఉన్న స్వదేశీ పాలకులు, అధికారులు బేగం పతాకం నీడన చేరుకున్నారు. (భారత్‌కి స్వాతంత్ర సంగ్రామం మేఁ ముస్లిం మహిళావోంకా యోగ్‌దాన్, (హిందీ) – డాక్టర్ ఆబెదా సమీయుద్దీన్, ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఆబ్జెక్టివ్ స్టడీస్, న్యూఢిల్లీ, 1997, పేజి. 22)

ఈ మేరకు పరిస్థితులు మరింత అనుకూలించి ప్రశాంత వాతావరణం ఏర్పడటంతో, అవధ్ ఆర్థిక పరిస్థితులను చక్కదిద్దేందుకు బేగం నడుం కట్టారు. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం ఫలితంగా పలు ప్రాంతాల నుండి లక్నోకు తరలి వస్తున్న తిరుగుబాటు యోధులకు, వేలాది సైనికులకు ఆమె ఆశ్రయం కల్పించాల్సి వచ్చింది. ప్రముఖ తిరుగుబాటు నాయకులు నానా సాహెబ్ పీష్వా, జనరల్ బఖ్త్ ఖాన్ రొహిల్లా, మొగల్ రాజకుమారుడు ఫిరోజ్ షా తమ భారీ సైనిక బలగాలతో లక్నో చేరుకుంటున్నారు. ఈ నేతలకు, ఆ నేతల పరివారానికి, వారి సైన్యాలకు వసతి సౌకర్యాలు సమకూర్చటం బేగంకు కడుభారంగా మారింది.

ఈ పరిస్థితులు ఖజానా మీద అధిక భారమయ్యాయి. చివరకు ఖజానా ఖాళీ అయ్యింది. ఆమె వ్యక్తిగత సంపద కూడా ఖర్చయిపోయింది. గత్యంతరం లేని పరిస్థితులలో ధనికులు, సంపన్నవర్గాల మీద 'యుద్ధపన్ను' అంటూ ప్రత్యేక పన్ను విధించారు. ఆ నిర్ణయానికి సహజంగా మిశ్రమ స్పందన లభించింది. ఆ విధంగా సమకూరిన ధనం కూడా సరిపోక పోవడంతో ఆమె అధికారులు కొందరు తిరుగుబాటు వ్యతిరేక శక్తులుగా వ్యవహరిస్తున్న సంపన్నుల కుటుంబాల నుండి బలవంతంగా ధన సంపదలను వసూలు చేయసాగారు. ఆనాటి క్లిష్ట పరిస్థితులలో కూడా బేగం హజరత్ మహల్ ఎంతో బుద్ధి కుశలతతో ఆర్థిక వ్యవహారాలను చక్కదిద్దుకుంటూ, ఆంగ్లేయులను ఎదుర్కొనేందుకు సైనికంగా సన్నద్ధులు కాసాగారు. ఈ మేరకు 1,80,000 మంది సైనికులను ఆమె సమకూర్చుకున్నారు. బ్రిటీషు బలగాలతో ఢీ అంటే ఢీ అనడానికి సిద్ధమయ్యారు.

ఈ పరిస్థితులను గమనించిన బ్రిటీష్ అధికారి విలియం రస్సెల్, '..**బేగం మాతో అప్రకటిత యుద్ధం ప్రారంభించింది...ఈ రాణులు, బేగంల శ్లాఘనీయ, శక్తివంత చరిత్రలను గమనించాక, అంత:పురంలో పర్దాల చాటున ఉంటూ కూడ ఎంతటి శక్తి యుక్తులు సంతరించుకోగలరో తెలుసుకున్నాం**..' అని వ్యాఖ్యానించాడు. (భారత్‌కి స్వాతంత్ర సంగ్రామం మేఁ ముస్లిం మహిళావోంకా యోగ్‌దాన్, పేజీ. 42)





మరో ప్రముఖ చరిత్రకారుడు H. Beveridge 1857 నాటి,'..**తిరుగుబాటుకు బేగం ఆత్మలాంటిది** '. అని బేగం హజరత్ మహల్‌ను ప్రస్తుతించాడు. ( A Comprehensive History of India, H. Beveridge, 1887 Ed. Vol.III, Page. 842. Quoted by Mr. Srivasthava in his book Freedom Fighters of Indin Mutiny 1857 at page.105)

**ఆమె పర్దానషీ మహిళ కానట్టయితే మిగతా పురుషుల కంటే గొప్ప పోరాట యోధురాలుగా ఖ్యాతి గడించేది**..', అని ప్రముఖ చరిత్రకారుడు Mr. Abdul Harim Sharar వ్యాఖ్యానించాడు. (Freedom Fighters of Indian Mutiny 1857, Mr. Srivasthava, page.105)

అవధ్‌లో పరిస్థితులు కొంతమేరకు మెరుగు పడ్డాక బేగం హజరత్ మహల్ తన రాజకీయ కుశలతను చూపనారంభించారు. బ్రిటీషర్లతో మిలాఖత్ అయిన నేపాల్ పాలకుడు జంగ్ బహుద్దూర్‌ను తనవైపుకు తిప్పుకునేందుకు పావులను కదిలించారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా స్వదేశీ పాలకులతో చేతులు కలిపినట్టయితే ఆయనకు కంపెనీ పాలకులు ఆశపెట్టిన దానికంటే, ఎక్కువ భూభాగాన్ని ఇవ్వగలనని వర్తమానం పంపారు. అవధ్ ఇరుగుపొరుగు స్వదేశీ పాలకులకు రానున్న గడ్డు పరిస్థితుల పట్ల హెచ్చరికలు చేస్తూ, అవసరాన్ని బట్టి ప్రతి అవకాశాన్ని అనుకూలంగా మలుచుకుంటూ, మంత్రాంగం నడుపుతూ బేగం హజరత్ మహల్ కంపెనీ పాలకులకు చెమటలు పట్టించారు.

ఈ విధంగా బేగం తన పాలనాదక్షతతో స్వదేశీ పాలకుల మద్దతుతో అవధ్‌లో పరిస్థితులను అనుకూలంగా మార్చుకుంటున్న దశలో ఢిల్లీ లో తిరుగుబాటు విఫలమైంది. బహుద్దూర్ షా జఫర్ ను ఆంగ్లేయులు అరెస్టు చేశారు. తిరుగుబాటుకు కేంద్రంగా భావించిన ఢిల్లీ ఆంగ్లేయుల వశమైంది. ఈ వార్తలు తిన్నగా లక్నో చేరాయి. ఆ ప్రతికూల పరిస్థితులలో కూడా ఆమె అధైర్యపడలేదు. ప్రజల, స్వదేశీ యోధుల అండదండలతో కంపెనీ అధికారులకు కంటి మీద కునుకు లేకుండా చేశారు.

బేగం హజరత్ మహల్ సుమారు 10 మాసాల పాటు ప్రత్యక్షంగా పాలన చేశారు. ఆంగ్లేయులు లక్నోలోని ఆలంబాగ్‌లోని రెసిడెన్సీ దాగి ఉండటం, ఆ రెసిడెన్సీ నుండి బయటపడి లక్నోను స్వాధీనం చేసుకొవడానికి కంపెనీ అధికారులు వేస్తున్న ఎత్తులను గమనించిన ఆమె రెసిడెన్సీ మీద దాడికి తన సైనికులను పురికొల్పారు. ఈ చర్య

కోసం 1857 డిసెంబరు 22న సైనిక యోధుల సమావేశం ఏర్పాటు చేశారు.

ఆ సమావేశంలో ఉత్తేజపూరితంగా ప్రసంగిస్తూ, ' **ఎందుకీ నిరీక్షణ..శతృవుతో తలపడేందుకు భయపడుతున్నారా?..బ్రిటీషర్లు తమ సైన్యాలను రప్పించేంత వరకు మీరు కూర్చోనే గడుపుతారా ? ముందుకు సాగండి. మీరు పోరాడుతారా ? లేదా ? చెప్పండి. పోరుబాటన నడువలేమంటే నేను ఆంగ్లేయులతో మంతనాలు జరిపి నా ప్రాణాలను కాపాడుకుంటాను. ఏ విషయం చెప్పండి ?**', అంటూ సైనికులను, సైన్యాధిపతులను నిగ్గదీశారు. ఈ సందర్భంగా సైనికుల మీద తూటాల్లా ప్రయోగించిన ఆమె మాటలు తిరుగుబాటు యోధులలో ఆత్మ బలిదానానికి సన్నద్ధులను చేసి, పోరుకు ప్రేరేపించాయి. (Encyclopaedia of Women Biography Vol. II, Ed. by Nagendra.K.Singh, APH Publishing Corporation, New Delhi, 2001, Page.64)

ఆ తరువాత బ్రిటీష్ రెసిడెన్సీని బేగం సేనలు చుట్టుముట్టాయి. విజయమో వీర స్వర్గమో అంటూ పోరాటం ప్రారంభించాయి. ఈ పోరాట సమయంలో బేగం అపూర్వ ధైర్య సాహసాలను ప్రదర్శించారు. బిడ్డడు బిర్జిష్ ఖధీర్‌ను వెంట పెట్టుకుని ఏనుగు మీద ఆమె స్వయంగా రణభూమికి విచ్చేశారు. (Hazrath Mahal riding on an elephant encouraged her army by her presence on the field of battle, History of Freedom Movement in India, Dr. Tara Chand, Page. 85) మాతృభూమి కోసం ప్రాణాలొడ్డి పోరాడుతున్న సైనికులను, ప్రజలను తన ప్రసంగాలతో ఉత్తేజపర్చారు. పోరాటం భయంకరంగా సాగింది. ఆ పోరాటం గురించి తెలుసుకున్న లక్నో కమీషనర్, బ్రిటీష్ అధికారి హెన్రీ లారెన్స్ వ్యాఖ్యానిస్తూ, ' **ఎక్కడా కూడా ఇంతకుమించిన శౌర్య ప్రతాపాలు మేము చూడలేదు** ', అంటూ బేగం నాయకత్వంలో సాగిన పోరాటాలను ప్రశంసించాడు. ఈ పోరులో పలువురు కంపెనీ అధికారులు మృత్యువాత పడ్డారు. స్వదేశీ యోధులు ఎంతగా పోరాడినా రెసిడెన్సీ మాత్రం హజరత్ మహల్ వశం కాలేదు.

ఆ సమయంలో బ్రిటీష్ అధికారుల నుండి సంధి ప్రస్తావన వచ్చింది. తిరుగుబాటుదారులకు క్షమాభిక్ష ప్రసాదిస్తామని, బేగంకు ప్రతినెల 25వేల రూపాయల పెన్షన్ ఇస్తామని, అందుకుగాను బేగం హజరత్ మహల్ అవధ్ మీద తన అధికారాన్ని పూర్తిగా వదులుకోవాలని కంపెనీ అధికారులు ప్రతిపాదించారు. ఆ ప్రస్తావన పట్ల బేగం మండిపడ్డారు. మా గడ్డ మీద మరొకరి పెత్తనమా? మా ప్రాణాలు పోయినా సరే





శత్రువుకు లొంగేది లేదన్నారు. బిడ్డడు బిర్జిస్ ఖదీర్ న్యాయమైన హక్కులను, తన వెంట నడిచిన స్వదేశీపాలకులను, సైనికులను, సేనాధిపతులను ప్రజలను కంపెనీ బలగాల దయాదాక్షిణ్యాలకు వదిలి పెట్టలేనంటూ, ఆ ప్రతిపాదనలను ఆమె తిరస్కరించారు. నా ప్రాణం మీది తీపితో న్యాయమైన హక్కులను వదులుకునేది లేదని బేగం స్పష్టం చేశారు.

భారతదేశ వ్యాపితంగా పలుప్రాంతాలలో ఆరంభమైన తిరుగుబాట్లను అణచివేసిన, బ్రిటీష్ సైన్యాలు,సేనాధిపతులు చివరకు లక్నో మీద పూర్తిగా దృష్టి సారించారు. లక్నోను వీలయినంత త్వరగా పట్టుకోవలసిందిగా అధికారులకు గవర్నర్ జనరల్ లార్డ్ కానింగ్ నుండి ఆదేశాలందాయి. 1858 మార్చి 3-4 తేదిలలో బ్రిటీష్ సైన్యాధిపతి కోలిన్ భారీ సైనిక బలగాలతో లక్నోను చుట్టుముట్టాడు. ఆయనకు తోడుగా నేపాల్ ప్రభువు జంగ్ బహుద్దూర్ తన బలగాలతో మార్చి 11వ తేదిన ఆంగ్లేయాధికారులతో కలిశాడు. లక్నోను అన్ని వైపుల నుండి శతృసైన్యాలు పూర్తిగా చుట్టుముట్టాయి. బేగం హజరత్ మహల్ నివాసం కైసర్‌బాగ్ మీద ఆంగ్లేయ సైన్యాల ఫిరంగులు నిప్పుల వర్షం కురిపిస్తుండగా, సైనికుల తుపాకులు గుండ్ల వర్షం కురిపించసాగాయి.

ఆ సమయంలో బేగం హజరత్ మహల్ తన వెంట తొమ్మిది వేల మంది సైనికులతో మూసాబాగ్ వద్ద కంపెనీ సైనికులతో చివరిసారిగా తలపడ్డారు. మిడతల దండులా అన్ని వైపుల నుండి వచ్చిపడిన శత్రు సైనికులను తట్టుకుని నిలవటం బేగం సైన్యానికి అతి కష్టంగా మారింది. పరిస్థితి ప్రమాదంలో పడిందని గ్రహించిన సహచరులు ఆమెను రక్షిత స్థలానికి వెళ్ళవలసిందిగా సూచించారు. ఆమె అక్కడ నుండి మరోచోటుకు వెడితే అది ఆంగ్లేయులకు విజయం లభించినట్టు కాగలదని భావించిన ఆమె పెనుముప్పు చుట్టుముట్టేంత వరకు ఆ ప్రాంతం నుండి కదలలేదు. చివరకు సహచరుల ఒత్తిడి మేరకు తప్పని పరిస్థితులలో మార్చి 16న హజరత్ మహల్ లక్నో నుండి తప్పుకున్నారు. ఈ విధంగా తప్పుకుంటున్నప్పుడు కూడా తన క్షేమం కంటె తన వెంటనున్న వారి క్షేమం గురించి ఓ బాధ్యత గల నాయకురాలిగా ఆలోచించారు. ఆ సమయంలో కూడా తన వెంట నున్న ప్రముఖులంతా క్షేమంగా ఆంగ్లేయుల వలయం నుండి తప్పించుకుని వెళ్ళిన తరువాత బేగం ఆ ప్రాంతాన్ని విడిచిపెట్టారు.

బేగం సంరక్షణలోంచి అవధ్ జారిపోయాక కంపెనీ సైనికులు పెచ్చరిల్లిపోయారు. 1857 నాటి తిరుగుబాటులో మరెక్కడా ఎదురుకానంత పరాభవాన్ని చవి చూసిన



**హజరత్ మహల్ బ్రిటీషు సైన్యాలతో చివరి పోరాటం జరిపిన మూసాబాగ్ ప్రాంతం**

ఆంగ్లేయాధికారులు, ఆంగ్ల సైనికులు అవధ్ రాజ్యం మీద పడి దోచుకున్నారు. సంపన్నవంతమైన లక్నోను పూర్తిగా ఛిద్రం చేశారు. అవధ్ పౌరులను దోచుకోవడమే కాకుండా భయంకర హింసలకు గురిచేశారు. యధేచ్ఛగా హత్యాకాండ సాగించారు. ఈ మేరకు తాము చేసిన కిరాతక చర్యలను తమ వారికి ఉత్తరాల ద్వారా ఆంగ్లేయాధికారులు తెలుపుకున్నారు.

ఆ తరువాత అవధ్ రాజ్యంలోని స్వదేశీ పాలకుల అధీనంలో ఉన్న పలు ప్రాంతాలు తిరుగుతూ పలుచోట్ల శత్రువును ఎదుర్కొంటూ, మరికొన్ని చోట్ల మిత్రుల ఆతిధ్యం పొందుతూ, బ్రిటీషర్ల దాడుల నుండి తప్పించుకుంటూ ఆమె ముందుకు సాగారు. ఆమె ఎక్కడకు వెళ్ళినా బ్రిటీషు సైన్యాలు ఆమెను వెంబడించ సాగాయి. ఓ క్షణం విశ్రమించే తీరికలేకుండా చేశాయి. ఆమెకు ఆశ్రయమిచ్చినవారిని ఇక్కట్లపాలు చేయసాగాయి.

ఆ సమయంలో విద్రోహుల కుట్ర ఫలితంగా యోధుడు మౌల్వీ అహమదుల్లా షాను శత్రువులు బలితీసుకున్నారు. ఈ వార్త ఆమెను బాధించింది. పలు ప్రాంతాలలో తిరుగుబాటు యోధులు సాగిస్తున్న పోరాటాలలో అపజయాలు చవిచూడాల్సిన పరిస్థితులు ఎదురవుతున్నాయి. ఆమె సహచరులు, స్వదేశీ పాలకులు రాజా బేని మాధవ్ సింగ్





తదితరుల పరాజయాలు బేగంను బాగా కృంగదీశాయి. ఈ వాతావరణంలో బేగం తన పరివారం తోపాటుగా అక్కడ కొన్నాళ్ళు, ఇక్కడ కొన్నాళ్ళు తలదాచుకుంటూ గడపసాగారు. బేగం పరివారాన్ని వెంటాడుతున్న కంపెనీ బలగాలు ఆమె తలదాచుకున్న చోటల్లా ప్రవేశించి కసికొద్ది బీభత్సం సృష్టించసాగాయి. ఆమెను ఆమె బలగాలను నీడలా వెన్నంటి కంపెనీ సైనికులు వస్తున్నా ప్రజల అండదండలతో, అత్యంత విశ్వాసపాత్రులైన సైనికాధికారు, సైనికుల రక్షణలో ఆమె ప్రమాదాన్ని అధిగమిస్తూ సురక్షితంగా సంచరించసాగారు.

బేగం హజరత్ మహల్ ప్రవాసంలో ఉన్నప్పుడు 1858 నవంబర్ 1న విక్టోరియా మహారాణి ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనను రద్దుచేసి, పాలనాధికారాన్ని స్వయంగా స్వీకరించింది. ఈ సందర్భంగా **విక్టోరియా రాణి ప్రకటన** గా ఖ్యాతి గాంచిన ప్రకటనను ఆమె చేసింది. అందులో స్వదేశీ పాలకులకు, ప్రజలకు ఆమె పలు హామీలు కుమ్మరించింది. పలు ఆకర్షణీయమైన ఆశలను చూపింది. తిరుగుబాటు వీరులకు, నేతలకు క్షమాబిక్ష ప్రసాదిస్తానంది. తిరుగుబాటులో పాల్గొన్న స్వదేశీ పాలకులను, ప్రజలను ఆ ప్రకటన కొంతలో కొంతగా ఆకర్షించింది. విక్టోరియా రాణి ప్రసాదించే క్షమాబిక్షతో బ్రతికి బయటపడి తమ ప్రాణాలు కాపాడుకోవాలనుకున్న కొందరు సహచరులు, పాలకులు, జమీందారులు, అధికారులు తిన్నగా బేగం పక్షం నుండి తప్పుకోసాగారు. ఈ పరిణామాలు ఆమెను మరింత కలవరపరిచాయి.

ఆ పరిస్థితులలో ప్రజలలో, సహచరులలో ఆత్మవిశ్వాసం కలిగించేందుకు, బేగం హజరత్ మహల్ విక్టోరియా ప్రకటనకు దీటుగా 1858 డిసెంబర్ 31న మరో చారిత్రాత్మక ప్రకటనను బిర్జిస్ ఖదీర్ పేరిట విడుదల చేశారు. ఆ ప్రకటనలో సామ్రాజ్యవాద కాంక్ష కలిగిన ఆంగ్లేయులు ఇండియాలోని స్వదేశీ సంస్థానాలను ఎలా ఆక్రమించుకుందీ, స్వదేశీ పాలకులను ఎలా మోసగించిందీ, స్వదేశీ పాలకులతో పలు ఒప్పందాలు చేసుకుని వాటిని నిస్సిగ్గుగా ఎలా ఉల్లంఘించిందీ, ప్రజల మత విశ్వాసాల మీద, ఆచార సంప్రదాయాల మీద ఎటువంటి దాడులు నిర్వహిస్తున్నదీ సవివరంగా పేర్కొన్నారు. స్వదేశీ పాలకుల మీద ఎంతటి దారుణాలకు ఒడిగట్టిందీ ఆ ప్రకటనలో వివరించారు. ఆంగ్లేయులు అపరాధాన్ని క్షమించినట్టు కలలో కూడా ఎవ్వరూ చూడలేదు అంటూ ఆనాడు లొంగుబాటుకు సిద్ధమౌతున్న యోధులను బేగం హెచ్చరించారు.

('.. no one has ever seen in a dream that the English forgave an offence ..' -Encyclopaedia of Women Biography Vo. II, Ed. by Nagendra.K.Singh, APH Publishing Corporation, New Delhi, 2001, Page. 66)

ఆంగ్లేయులు స్వదేశీయుల ఆత్మాభిమానాన్ని ఏవిధంగా దెబ్బగొట్టిందీ, స్వదేశీయుల మతధర్మాలను ఏవిధంగా కించపర్చిందీ, మత మనోభావాలను ఏ విధంగా అవమాన పర్చిందీ, తిరుగుబాటుకు భయపడి తిరగబడ్డ సైనికులను, నేతలను మాలిమి చేసుకునేందుకు ఎలాంటి ఆశలు చూపిందీ, గతంలో స్వదేశీ పాలకుల మీద ఎంతటి అఘాయిత్యాలకు పాల్పడిందీ ఆ సుదీర్ఘమైన చారిత్రాత్మక ప్రకటన సాక్ష్యాధారాలతో సహా వివరించింది. చివరకు మా ప్రజలు మాదేశాన్ని కోరుతున్నప్పుడు ఆమె మాదేశాన్ని మాకెందుకు వదలిపెట్టదూ? ('..Why does her Majesty not restore our country to us. when our people want it..' - Encyclopaedia of Women Biography Vol. II, Page.66) అని సూటిగా విక్టోరియా రాణిని ప్రశ్నించారు. విక్టోరియా రాణి మభ్యపెట్టు మాటలను నమ్మవద్దని, మోసపోవద్దని ప్రజలకు, స్వదేశీ పాలకులకు ఆమె విజ్ఞప్తి చేశారు. మాతృభూమి నుండి పరాయిపాలకుల పెత్తనాన్ని రూపుమాపేందుకు కంకణబద్ధులై అంతా కదలాలని ఆమె ప్రజలను కోరారు.

ఈ పరిస్థితులు ఇలా ఉండగా, ఆంగ్లేయాధికారులు లక్నో తిరుగుబాటును క్రూరంగా అణిచివేయడానికి, తిరుగుబాటు నాయకులను తుదముట్టించేందుకు పథకాలు రూపొందించసాగారు. అన్ని వైపుల నుండి తిరుగుబాటు సైన్యాలను తరుముతూ, వారంతా నేపాల్ దిశగా సాగిపోయేందుకు పథకం ప్రకారంగా అనుకూలతను సృష్టించారు. లక్నో నుండి తప్పుకున్న తరువాత బేగం హజరత్ మహల్ కూడా మిగతా యోధులతో పాటుగా మరో మార్గం లేక నేపాల్ దిశగా సాగాల్సివచ్చింది. ఆ నిర్ణయం వలన ఆమె రక్షణ కూడా ప్రమాదంలో పడింది. బ్రతికుండగా తాను గాని, మరణించాక తన శవం గాని ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల చేతుల్లో పడరాదని నిర్ణయించుకున్న ఆమె నానా సాహెబ్ ఇతర తిరుగుబాటు నేతలతో కలిసి నేపాల్ అడవుల్లోకి వెళ్ళిపోయారు.

అక్కడ కూడా ఆమెకు ప్రమాదం తప్పలేదు. ప్రమాదాల నుండి తప్పించుకుంటూ రాత్రి పగలు అని తేడా లేకుండా ఆమె గడపాల్సి వచ్చింది. చివరకు నేపాల్ రాజ్యం లోనికి ప్రవేశించిన ఆమెకు నేపాల్ పాలకుడు జంగ్ బహుద్దూర్ నుండి సహకారం





లభించక పోగా నేపాల్ అడవులు వదిలి వెళ్ళిపోవాల్సిందిగా అతను ఆదేశించాడు. అనివార్యపరిస్థితులలో ప్రమాదకర వాతావరణాన్ని ఎదుర్కొంటూ బేగం హజరత్ మహల్, బిర్జిస్ ఖధిర్ నేపాల్ అడవుల్లో సంచరించాల్సి వచ్చింది. ఈ సందర్భంగా ఒక వేళ పోరాడి నేలకొరిగే అవకాశం తనకు లభించకుంటే అత్మార్పణ చేసుకునేందుకు బేగం ఎల్లప్పుడు విషంతో కూడిన పాత్రను తనవెంట ఉంచుకుని ఆంగ్లేయుల మీద పోరాటం సాగించేందుకు ప్రయత్నాలను సాగించారు.

ఆ సమయంలో నేపాల్ అడవుల్లోకి బేగం హజరత్ మహల్ ఛాయా చిత్రం గీసేందుకు వచ్చిన ఒక బ్రిటీష్ చిత్రకారుని ద్వారా, వ్యక్తిగతంగా ఆమెకు ఏడాదికి లక్ష రూపాయలు ఆమె కుమారుడు బిర్జిస్ ఖదీర్‌కు 15 లక్షలు అందచేస్తామని ఆశ చూపుతూ బ్రిటీష్ పాలకులు, బేగంను లొంగదీసుకునేందుకు విఫల ప్రయత్నం చేశారు. ఈ విధంగా ప్రతికూల పరిస్థితులను తట్టుకుంటూ సాగుతుండగా, ఆమె వెంట వచ్చిన యోధులు ఒక్కొక్కరే ఆ కారడవుల్లో, మంచు కొండల్లో మృత్యువువాత పడసాగారు. కాలం గడిచేకొద్ది సంపదతోపాటుగా, సహచరులు తరిగి పోసాగారు.

ఆ పరిస్థితులలో కూడా శత్రువుకు ఏమాత్రం తలవంచడానికి బేగం ఇష్టపడలేదు. ప్రధాన సహచరులు, అనుంగు అనుచరులు మృత్యువాతపడి అదృశ్యమైపోయారు. ఆ సమయంలో ఒంటరిగా మిగిలిన ఆ అసమాన పోరాటయోధురాలు, అతి నిస్సహాయ పరిస్థితులలో సామాన్య జీవితం గడపసాగారు. చివరకు ఆ మంచు కొండల శిఖరాల మీద రెపరెపలాడుతున్న అవధ్ రాజ్యం ఛత్ర ఛాయలో 1874 ఏప్రిల్ మాసంలో బేగం హజరత్ మహల్ కన్నుమూశారు.

ఆమె భౌతికకాయాన్ని ఖాట్మండులో ఆమె స్వయంగా హిందూస్థానీ మసీదులో ఓ ప్రక్కన ఖననం చేశారు. ప్రస్తుతం ఆ ఇమాంబారా శిథిలమైపోయింది. అక్కడ హజరత్ మహల్ స్మృతి చిహ్నంగా ఆమె సమాధి మాత్రమే మిగిలింది. అది కూడా ఆక్రమణలకు గురవుతుంది. ఆ సమాధి నూటపాతికేళ్ళుగా అక్కడ ఉన్నా దానిని పట్టించుకున్న వారు లేకపోయారు. 1957లో ప్రథమ స్వాతంత్ర్య శతాబ్ది ఉత్సవాలు జరుపుకుంటున్న సందర్భంగా, బేగం హజరత్ మహల్ సమాధికి ఏర్పడిన దుస్థితి గురించి ఆమె వంశజుడు మిర్జా ఆజం ఖదీర్ ఆనాటి ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ను కలసి ఓ మహజరు ద్వారా అక్కడున్న పరిస్థితిని ఆయన దృష్టికి తెచ్చారు.



ఖాడ్మండులోని హిందూస్థానీ మసీదులో నిర్మితమైన బేగం సమాధి అన్ని వైపుల నుండిఆక్రమణలకు గురైన దృశ్యం.









బేగం స్మారకార్థం లక్నోలో ఏర్పాటు చేసిన
బేగం హజరత్ మహల్ పార్కు

ఆ మహాయోధురాలి స్మృతిగా మిగిలి ఉన్న ఆమె సమాధి నిర్లక్ష్యానికి గురికావడం గురించి తెలుసుకున్న ప్రధాని నెహ్రూ తన బాధను వ్యక్తం చేస్తూ తగిన శ్రద్ద తీసుకుంటానని హామీ ఇచ్చారు. ఆ సమాధిని ఫోటోలు తీయించి, వాటిని ఆజం ఖదిర్‌కు కూడా పంపారు. ఆ ఫోటోలతోపాటుగా, నేపాల్‌లోని భారత రాయబార కార్యాలయం ఆ సమాధి సంరక్షణ బాధ్యతను తీసుకుంటుందని ప్రధాని నెహ్రూ హామీ కూడా ఇచ్చారు.

ఆ సంవత్సరం ఉత్తర ప్రదేశ్‌లో జరిగిన ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం ఉత్సవాలలో ఆ మహాయోధ బేగం హజరత్ మహల్ ప్రస్తావన కూడా రాలేదు. ఈ విషయమై ప్రిన్స్ ఆజం బారత ప్రభుత్వానికి, రాష్ట్ర ప్రభుత్వానికి పలు ఉత్తరాలు రాయడంతో 1958 మే 9న భారత ప్రభుత్వం లోక్‌సభలో 1857 నాటి పది మంది యోధుల పట్ల ప్రత్యేక గౌరవాన్ని ప్రకటిస్తూ ఆ జాబితాలో బేగం హజరత్ మహల్‌కు అగ్రపీఠం వేసింది. ఆ తరువాత ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం అప్పటి వరకు లక్నోలో ఉన్న విక్టోరియా పార్కు పేరు మార్చి బేగం హజరత్ మహల్ పార్కుగా నామకరణం చేసింది.

◆◆◆



## బ్రిటీష్ సైనిక తుపాకులకు ఎదురొడ్డి నిలచిన వీరవనిత

# బేగం అజీజున్

**(1832-1857)**

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో రాజులు, రాణులు, సంస్థానాధీశులు, స్వదేశీ సైనికాధికారులు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. ఈ వర్గాలు తమ రాజ్యాలను, సంస్థానాలను కాపాడుకోవాలని, అధికారాన్ని చేజారనివ్వరాదన్న బలమైన కోరికతో బ్రిటీష్ పాలకుల మీద తిరుగుబాటు చేశారు. ఈ రకమైన కాంక్షలేవీ లేకుండా కేవలం మాతృభూమి మీదగల ప్రేమాభిమానాలతో ప్రాణాలను తృణప్రాయంగా భావించి, నిస్వార్థంగా తిరుగుబాటులో పాల్గొని ప్రాణాలను బలిచ్చిన సామాన్యులు ఉన్నారు. అటువంటి సాధారణ మహిళలలో ఒకరు బేగం అజీజున్.

1832లో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని బితూర్‌లో బేగం అజీజున్ జన్మించారు. తండ్రి హసీనా ఖాన్. తల్లి హమీదా బాను. చిన్ననాటనే ఆమె అమ్మను కోల్పోయారు. అజీజున్ మంచి రూపశి. అందాలరాశి అజీజున్ ఆనాటి ప్రసిద్ధ నర్తకి ఉమరావ్‌జాన్ బృందంలో చేరారు. మంచి నర్తకిగా ఖ్యాతిగాంచారు. నాట్య కళ మీద మంచి అభినివేశాన్ని సాధించి ఆ కళను ప్రదర్శిస్తూ అపారంగా ధనాన్ని సంపాదించారు.





పరాయి పాలకులైన ఆంగ్లేయులంటే ఆమెకు విపరీతమైన ద్వేషం. బ్రిటీషు సైన్యంలో సుబేదారుగా పనిచేస్తున్న షంషుద్దీన్ అను సాహసి ఆమెను ప్రేమించాడు. ఆయన బ్రిటీషు సైన్యం నుండి తొలిగి ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధుడు నానా సాహెబ్ కొలువులో చేరేంతవరకు అతని ప్రేమను ఆమె అంగీకరించలేదు. **ఆమె హృదయం షంషుద్దీన్ కోసం ఎంతగా తపించిపోయేదో, భారత స్వాతంత్ర్యము కోసం కూడా అంతగా తపించిపోయేది.** (1857 స్వరాజ్య సంగ్రామం, సావర్కార్, నవయుగభారతి, హైదరాబాద్, 2001, పేజి. 88)

కాన్పూరు పాలకుడు నానా సాహెబ్ పీష్వా అంటే అజీజున్‌కు అమిత భక్తి-గౌరవం. స్వదేశీ సంస్థానాలను అక్రమంగా ఆక్రమించుకుంటున్న కంపెనీ అధికారులంటే అసహ్యం. పరదేశీయులు సాగిస్తున్న అధర్మాన్ని,అన్యాయాన్ని ఎదుర్కొవాలని ఆమె ప్రగాఢంగా వాంఛించారు. ఆ కోర్కె బలపడే కొద్ది, సారంగి మహల్ లోని సంగీత నృత్య వినోదాలను, త్యజించి, విలాస జీవితాన్ని వదిలి, నానా సాహెబ్ పక్షాన నిలిచి, బ్రిటీషర్ల దాష్టీకాలకు అడ్డుకట్టవేయాలని భావించారు.

ఆ అవకాశం 1857లో ఆమెకు లభించింది. 1857 జూన్ 4న కాన్పూరులో తిరుగుబాటు ఆరంభమైంది. నానాసాహెబ్ బ్రిటీషర్ల మీద జూన్ 7న సమరశంఖారావం పూరించారు. హిందూ-ముస్లింలను తేడా లేకుండా ధర్మాన్ని, దేశాన్ని రక్షించుకునేందుకు కాన్పూరు ప్రజలంతా ఆయుధాలు చేపట్టాల్సిందిగా ఆయన హిందీ-ఉర్దూ భాషలలో పిలుపునిచ్చారు. ఆ పిలుపునందుకున్న అజీజున్ సుకుమార, సౌకర్యవంత, సుఖమయ జీవితాన్ని వదిలి, పరాయి పాలకుల మీద యుద్ధం చేసేందుకు నానా సాహెబ్ పక్షంలో చేరారు.

సహచరుడు షంషుద్దీన్ సహకారంతో అజీజున్ ఆయుధాలు ఉపయోగించటం, గుర్రపు స్వారి నేర్చుకున్నారు. ఆమె సైనిక దుస్తులు ధరించి రణరంగానికి సిద్ధమయ్యారు. మాతృదేశ భక్తిభావనలు గల యువతులను సమీకరించి, ప్రత్యేక మహిళా సైనిక దళం ఏర్పాటు చేశారు. మహిళా సైనిక దళం ఏర్పాటు చేయటమే కాకుండా, వారికి స్వయంగా చక్కని శిక్షణ గరిపి, ఎటువంటి ఉపద్రవాన్నైనా ఎదుర్కొగలిగేట్టుగా ఆ దళాలను తీర్చిదిద్దారు. తుపాకి పేల్చటం, కత్తి తిప్పటం, గుర్రపుస్వారి చేయటంలో ప్రత్యేక శిక్షణ కల్పించి సుశిక్షితులైన సైనికులుగా తయారు చేశారు. ప్రజల రక్షణతోపాటు, రాజ్యరక్షణ కోసం

తమ ప్రాణాలను పణంగా పెడతామని శపథాలు చేయించి, శత్రువును దునుమాడేందుకు, ఏ క్షణాన్నైనా రణరంగ ప్రవేశం చేయడానికి బలగాలను సిద్ధంగా ఉంచారు. ఈ మేరకు మహిళా సైనిక దళాన్ని స్థాపించిన ప్రప్రథమ మహిళగా అజీజున్‌ను అభివర్ణిస్తూ, ప్రముఖ రచయిత ఆనంద స్వరూప్ మిశ్రా ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం ప్రచురించిన "Nana Saheb Peshwa and the War in Independence" అను గ్రంథంలో పేర్కొన్నారు.

అజీజున్ సమర్థవంతమైన నాయకత్వంలో మహిళా సైనిక దళాలు పలు కార్యక్రమాల భారాన్ని స్వీకరించి నానా సాహెబ్ పోరాటానికి ఎంతగానో తోడ్పడ్డాయి. ఆమె తన బలగంతో నగరంలోని ప్రతి ఇల్లూ తిరుగుతూ, ' **మీ లాంటి యువకుల్లో రక్తం చల్లబడిపోయింది. మీలో పౌరుషం చచ్చిపోయిందా? మీ రక్తం ప్రతీకార జ్వాలతో వేడెక్కుతుందా? లేదా? మన మోచేతి నీళ్ళు తాగే కుక్కలు మనపై పెత్తనం చలాయిస్తున్నారు. దానిని మనం మౌనంగా భరిస్తున్నాం. మన వీరత్వం, శౌర్య పరాక్రమాలు ఏమైపోయాయి?** అని ప్రశ్నిస్తూ యువకుల్లో రోషాగ్నిని ప్రజ్వరిల్లచేశారు. (**అజ్ఞాత వీర గాథలు**, గోవిందస్వరూప్ సింహోల్, భారత ప్రభుత్వ ప్రచురణలు, న్యూఢిల్లీ, 1999, పేజి. 30-31)

యుద్ధ భయంతో సైన్యంలో చేర నిరాకరించిన పురుషుల చేతులకు స్వయంగా గాజులు తొడిగి, వారిలో రోషం రగిలించి తిరుగుబాటు సైనిక బలగాలను బాగా పెంచగలిగారు. స్వాతంత్ర్య సమరయోధులకు ఆహారం, ఆయుధాలను సమకూర్చి పెట్టడం, నాయకులు, సైనికుల మధ్యన సంధానకర్తల్లా వ్యవహరించటం, బ్రిటీష్ సైనికుల కదలికలు గమనించి ఆ సమాచారాన్ని తిరుగుబాటు దళాల నాయకులకు చేరవేయటం తదితర బాధ్యతలను ఆమె నిర్వహించారు. దళ సభ్యులతో ఇల్లిల్లు తిరిగి బట్టలు, ఆహార పదార్థాలను సేకరించి తిరుగుబాటు యోధుల అవసరాలను తీర్చుతూ వారికి ఎటువంటి లోటు కలుగనివ్వకుండా జాగ్రత్తలు తీసుకున్నారు. ప్రధానంగా రణరంగంలో గాయపడిన స్వదేశీ సైనికుల చికిత్సకు సంబంధించిన కార్యకలాపాలను నిర్వహించటం పట్ల ఆమె శ్రద్ధను చూపారు. ప్రాణాలకు తెగించి పోరాడుతున్న వీరులు గాయపడి అనాథలుగా ప్రాణాలు విడవటం పట్ల కలతచెందిన ఆమె క్షతగాత్రులకు ప్రత్యేక శ్రద్ధతో సేవలందించారు.

అజీజున్ తరుచుగా తన మహిళా సైనిక బలగాలతో కాన్పూరు పురవీధుల్లో కవాతు చేసి ప్రజలను ఉత్సాహపర్చేందుకు కృషి సల్పారు. సంపూర్ణ సైనికాధికారి దుస్తులతో,





పలు సైనిక చిహ్నాలను అలంకరించుకుని, తుపాకి ఒకవైపు, ఖడ్గం మరోవైపున ధరించి కవాతులలో పాల్గొనటం ఆమెకు అలవాటు. ఆమె నేతృత్వంలో కవాతు సాగుతున్న బజార్లలో ప్రజలు బారులు తీరి నిలబడి ఆమె రాకకోసం ఎదురు చూస్తూ, ' **నానాసాహెబ్ జిందాబాద్-బేగం అజీజున్ జిందాబాద్** ' అంటూ దిక్కులు పిక్కటిల్లేలా నినాదాలను చేస్తూ ఆనందాన్ని వ్యక్తం చేసేవారు. ఈ విషయం 1857 జూన్ 16న నానక్ చంద్ అను వ్యక్తి తన డైరీలో రాసిపెట్టిన సమాచారాన్ని బట్టి వెల్లడవుతుంది. ఆమె కృషి, నిస్వార్థ సేవాతత్పరత, కార్యదక్షత, ప్రగతిశీల ఆలోచనలను, నానా సాహెబ్ పట్ల చూపుతున్న విధేయతను గమనించి నానాకు కుడి భుజంగా ఖ్యాతి చెందిన ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధులు, నానా సాహెబ్ ప్రధాన సహచరులు అజీముల్లా ఖాన్ ఆమె సేవలను ఎంతగానో ప్రశంసించారని ఆనాటి ప్రముఖ వ్యాపారి నానక్ చంద్ తన దస్తావేజులలలో రాసుకున్నాడు. (Encyclopaedia of Muslim Biography, Vol.I, Ed. by Nagendra Kr. Singh, APH, 2001, page. 585)

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం అంతమైన తరువాత ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు తిరుగుబాటులో పాల్గొన్న సంస్థానాధీశులు, సైనికాధికారులు, ప్రజల మీద భయంకరంగా విరుచుకుపడ్డారు. ఆ సమయంలో ఆంగ్లేయాధికారి Col. William తయారు చేసిన **కాన్పూరు తిరుగుబాటుదారుల జాబితాలో** అజీజున్ మొదటి స్థానంలో ఉన్నారు. ఆమెకు వ్యతిరేకంగా కాన్పూరుకు చెందిన ప్రముఖ వ్యాపారి జానకీ ప్రసాద్ సాక్ష్యం పలుకుతూ, **ఆమె సదా సైనికాధికారి దుస్తులలో ఉంటూ, నానా సాహెబ్ కోసం ఆమె మహిళా దళాలు పనిచేశాయి. ఆమెకు పీష్వా సైనిక దళాలతో ప్రత్యక్ష సంబంధాలున్నాయి. తిరుగుబాటు పతాకం ఎగరగానే ఆమె తిరుగుబాటు యోధులతో కలసి పోరుబాటన నడిచారని,** ఆంగ్లేయ న్యాయస్థానంలో వివరించాడు. ఈ మేరకు ఆమె తిరుగుబాటు యోధులతో కలసి పనిచేసిందని బ్రిటీషు అధికారుల విచారణలో పలువురు వ్యక్తులు సాక్ష్యం చెప్పారు. (Encyclopaedia of Muslim Biography, Vol.I, page. 585)

ఈ విచారణలో భాగంగా, బేగం అజీజున్‌ను ఉన్నత సైనికాధికారి General Havelock ఎదుట హాజరు పర్చారు. ఆమె సాహసకృత్యాల గురించి విన్న ఆ అధికారి, ఆమె రూపురేఖలను చూసి ఆశ్చర్యపోయాడు. మగదుస్తుల నుండి ఆమె బయట పడగానే ఆమె అందచందాలను చూసి అవాక్కయ్యాడు. ఆమె రణరంగంలో అరివీర భయంకరంగా

వ్యవహరించడాన్ని నమ్మలేకపోయాడు. ఆమె కనుక తన అపరాధాన్ని అంగీకరించి, క్షమాపణ వేడుకుంటే ఆరోణపలన్నీ రద్దుచేస్తానని, ఆమెను క్షమించి విడిచిపెట్టగలనని హామీ ఇచ్చాడు. ఆ ప్రతిపాదనలను బేగం అజీజున్ నిర్ద్వంద్వంగా నిరాకరించారు. ప్రాణ భయం ఏమాత్రంలేని ఆమె ప్రవర్తన చూసి విస్తుపోయిన ఆ అధికారి , **' నీకేం కావాలి? '** అని ప్రశ్నించాడు. నాకు ' **బ్రిటీష్ పాలన అంతం చూడాలనుంది** ',('I want to see the end of the British rule ', - ibid page. 586), అని ఆమె నిర్భయంగా, చాలా ఘాటుగా సమాధానమిచ్చారు. అ సమాధానంతో ఆగ్రహించిన General Havelock ఆమెను కాల్చివేయాల్సిందిగా సైనికులకు ఆదేశాలిచ్చాడు.

ఆ ఆదేశాలను విన్న అజీజున్ చిరునవ్వు చిందిస్తూ, తుపాకి గుండ్లకు ఎదురుగా నిలబడ్డారు. బ్రిటీష్ సైనికుల తుపాకులు ఒక్కసారిగా గర్జించాయి. ఆ తుపాకుల్లో నుండి గుళ్ళ బయల్పడి ఆమె సుకుమార శరీరాన్ని ఛేదించుకుని దూసుకపోతుండగానే **నానా సాహెబ్ జిందాబాద్** అంటూ ఆ అసమాన పోరాటయోధురాలు నినదించారు. ఆ సింహనాదంతో ఆంగ్లేయ సైనికులు ఒక్కక్షణం స్థంభించి పోయారు. మహాయోధ బేగం అజీజున్ ప్రాణాలు అనంతవాయువులలో కలిసిపోయాయి.

ఆ మహత్తర త్యాగమూర్తికి చరిత్రలో తగినంత స్థానం లభించలేదు. ఆ యోధురాలి గత జీవితాన్ని, ఆమె వ్యక్తిత్వాన్ని కించపర్చే విధంగా బ్రిటీషు చరిత్రకారులు, బ్రిటీషు సామ్రాజ్యవాదుల ఏజెంట్లు ఆమె గురించి అవాకులు చవాకులు రాశారు. నిజానికి **ఆమె ప్రేమను బజారులో అమ్ముకొనలేదు. స్వతంత్ర సమర రంగంలో దేశభక్తికి కానుకగా అర్పించింది.** (1857 స్వరాజ్య సంగ్రామం, సావర్కార్, పేజి. 88) ఆ తరువాత జరిగిన పరిశోధనలు బ్రిటీషర్ల కుట్రలను బయట పెడుతూ, అజీజున్ త్యాగమయ చరిత్రను వెలుగులోకి తెచ్చాయి. ఆనాటి అసత్యాలను, అభూత కల్పనలను బట్టబయలు చేశాయి. ఈ మేరకు సాగిన కృషి ఫలితంగా ఆ నాటి కుట్రల కారుమబ్బులను చీల్చుకుంటూ మధ్యాహ్న మార్తాండుడిలా ఆమె సాహసోపేత చరిత్ర వెలుగులు చిమ్మడంతో బేగం అజీజున్ ఉత్తమ చరిత్ర ప్రపంచానికి వెల్లడయ్యింది.

◆◆◆



## మాతృదేశ విముక్తి కోసం ఉరిని లెక్కచేయని సాహసి

# హబీబా బేగం

**(1833-1857)**

**పు**ట్టిన గడ్డ గౌరవాన్ని కాపాడుకునేందుకు ఆత్మాభిమానులైన బిడ్డలు ఎంతటి త్యాగాలకైనా సిద్ధపడతారన్న విషయం స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర నిరూపిస్తుంది. అటువంటి నిరూపణలకు దృష్టాంతరంగా నిలుస్తారు శ్రీమతి హబీబా బేగం.

హబీబా బేగం 1833లో ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ముజఫర్‌పూర్‌లో జన్మించారు. చిన్నతనం నుండే బానిస భావాలకు వ్యతిరేకంగా పోరాటాలు ప్రారంభించిన హబీబా మనస్సును బ్రిటీషర్ల బానిసత్వంలో మగ్గుతున్న మాతృభూమి దయనీయ స్థితి కలచివేసింది. ఆ వ్యథ నుండి వలస పాలకుల మీద ఆగ్రహం ప్రజ్వరిల్లింది. తెల్లపాలకులను శత్రువులుగా పరిగణించి, మాతృభూమిని బ్రిటీషర్ల నుండి విముక్తం చేసుకునేందుకు సరైన అదనుకోసం ఎదురు చూడసాగారు.

1857లో ఆమెకు ఆ అవకాశం లభించింది. భారతావనిలోని పలు ప్రాంతాలలో హబీబా లాంటి వీర నారీమణులు, వీర పుత్రులు ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల, అధికారుల మీద కత్తులు దూశారు. ఆ సమయం కోసం ఎదురు చూస్తున్న హబీబా తిరుగుబాటు యోధులతో కలసి రణరంగ ప్రవేశం చేశారు. సోదర తిరుగుబాటు వీరులతో కలిసి బ్రిటీష్ సైనికపటాలాల మీద తిరగబడ్డారు. ఆ నేరానికి ఆమెను అరెస్టు చేశారు.

నాటి దేశభక్తులకు ప్రాణాలు లెక్కలోనివి కావు. మాతృభూమి పరిరక్షణలో ప్రాణాలు విడవడం ఎంతో గర్వంగా భావించారు. హబీబా కూడా ప్రాణత్యాగానికి సిద్ధమయ్యారు. పరాయి ప్రభుత్వంపై తిరగబడిన నేరానికి 1857లో బ్రిటీషు సైనిక న్యాయస్థానం ఆమెకు ఉరిశిక్ష విధించింది. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ యోధురాలు హబీబా సంతోషంగా ఉరిని స్వీకరించారు.

◆◆◆

# గెరిల్లా దాడులతో బ్రిటీష్ సైనిక దళాలను హడలెత్తించిన

# "ఆకుపచ్చ దుస్తుల" యోధురాలు

**భా**రత స్వాతంత్ర్యసంగ్రామ చరిత్రలో ప్రథమ స్వాతంత్ర్యపోరాటం మహత్తర ఘట్టం. ఈ పోరాటంలో అసమాన్యులు మాత్రమే కాకుండా సామాన్యులు కూడా ఆయుధాలు చేపట్టి మాతృభూమి రక్షణకు శత్రువుతో పోరాటం చేశారు. ప్రాణాలను అర్పించారు. ఈ అర్పణకు వయస్సుతో నిమిత్తం లేకుండా పోయింది. అందరి లక్ష్యం ఒక్కటే ! పరాయి పాలకుల పెత్తనం నుండి మాతృభూమికి విముక్తి కలిగించటం. అందుకోసం ప్రతిఒక్కరూ కొదమసింగాలై పోరాడారు, సివంగులై గర్జించారు. ఈ మేరకు శత్రువును గడగడలాడిస్తూ పోరాటపథంలో అమరత్వం పొందిన అజ్ఞాత మహిళలు పలువురున్నారు. ఆ కోవకు చెందిన **ఆకుపచ్చ దుస్తుల మహిళ** గా ఖ్యాతి చెందిన ఓ మహిళ చరిత్రపుటలలో అస్పష్టంగా దర్శనమిస్తారు.

చరిత్రలో ఆమె పేరు ప్రస్తావన లేదు. ఆమె ఆకుపచ్చ దుస్తుల మహిళ గా మిత్రులు-శత్రువులచే గుర్తించబడ్డారు. ఆమె ఎల్లప్పుడు ఆకు పచ్చరంగు దుస్తులు ధరించటంతో ప్రజలతోపాటుగా శత్రువు కూడా ఆ పేరుతో ఆమెను పిలుచుకున్నాడు. ఆమె మగదుస్తులతో కన్పించారు. బ్రిటీషర్లకు వ్యతిరేకంగా పోరాడమని ప్రజలకు పిలుపు నిచ్చారు. ఆమె పిలుపులో ఉన్న ఆకర్షణ ఫలితంగా ప్రజలు అసంఖ్యాకంగా ఆమెను





అనుసరించారు. ఆ విధంగా ఆమె వెంట నడిచిన దేశభక్తి ప్రపూరితులైన ప్రజలతో ఆంగ్లేయ సైనికుల శిబిరాల మీద దాడులు నిర్వహించారు. ప్రజలలో మాతృదేశ భక్తి భావనలను రెచ్చగొట్టి, శత్రువుకు వ్యతిరేకంగా ప్రేరేపించి, ప్రజలను తన వెంట తీసుకుని, ప్రళయ భీకరంగా గర్జిస్తూ బ్రిటీష్ సైనికుల మీద విరుచుకుపడ్డారు. స్వంత దళాలతో అకస్మికంగా దర్శనమిచ్చి, అద్భుత కౌశల్యంతో కత్తి తిప్పుతూ, గురితప్పకుండా తుపాకి పేల్చుతూ శత్రుమూకలను చీల్చి చెండాడిన ఈమె పలుసార్లు శత్రుస్థావరాల మీద విజయవంతంగా దాడులు నిర్వహించారు. అనుచరులు యుద్ధరంగం వదలి వెళ్ళినా ఆమె మాత్రం చెక్కుచెదరని ధైర్యసాహసాలతో శత్రువును ఎదుర్కొని, శత్రువు కంట పడకుండా చాకచక్యంగా గెరిల్లా పోరు జరిపి తప్పించుకున్న ఘట్టాలున్నాయి. ఆ విధంగా తప్పించుకున్న ఆమె ఎక్కడకు వెడుతుందో, మళ్ళీ ఆమె ఎక్కడ నుండి వస్తుందో, ఎలా వస్తుందో, ఏం చేస్తుందో, ఏలా మాయమౌతుందో శత్రుగూఢచారులకు అంతుబట్టలేదు.

ఈ మేరకు బ్రిటీష్ సైనికుల మీద, సైనిక స్థావరాల మీద ఆమె చేసిన దాడులు, ఆ దాడుల తీరుతెన్నులను దర్శించిన అదృష్టవంతులు వివరించిన కథనాలు, బ్రిటీష్ అధికారులు రాసుకున్న అధికార, అనధికార లేఖలు, ప్రభుత్వ రికార్డులు ఆమె సాహస కృత్యాలను వెల్లడిస్తున్నాయి. ఈ పచ్చదుస్తుల మహిళ సాహసాన్ని ప్రస్తావిస్తూ, ' బేగమత్ కి అంశూఁ ' అను గ్రంథంలో రచయిత పేర్కొనట్లు ' భారత్ కే స్వాతంత్ర్య సంగ్రామం మేఁ ముస్లిం మహిళా వోంకా యోగదాన్ ' అను పుస్తకంలో రచయిత్రి, అలీఘర్ ముస్లిం యూనివర్శిటీ అచార్యులు డాక్టర్ అబిదా సమీయుద్దీన్ (పేజి. 44లో) ఈ విధంగా ఉటంకించారు.

**'..ఆ మహిళ అద్వితీయ ధైర్యశాలి. ఆమెకు మృత్యుభయం ఏ మాత్రం లేదు. ఫిరంగులు గర్జిస్తున్నా, తుపాకులు గుండ్లను వర్షిస్తున్నా అత్యంత ధైర్యశాలి అయిన సైనికుడి మల్లే ఆమె తుపాకి గుండ్ల వర్షంలో నింపాదిగా నడిచి వెళ్ళేది. ఆమెను కొన్ని సార్లు నడిచి వస్తుంటే చూశాం. మరికొన్నిసార్లు గుర్రం మీద స్వారి చేస్తూ చూశాం. ఖడ్గవిన్యాసంలో, గురి తప్పకుండా తుపాకి పేల్చటంలో ఆమె మంచి నేర్పరి. ఆమె ధైర్య సాహసాలను చూసి ప్రజలలో ఉత్సాహం ద్విగుణీకృతమయ్యేది..'.** ఈ వర్ణన ద్వారా ఆమె గెరిల్లా పోరు సాగించేదని మనం అర్థం చేసుకోవచ్చు. ఆమె ఎక్కడనుంచి వస్తుందో, ఎక్కడికి వెళ్ళిపోతుందో శత్రువుకు తెలియకుండా దాడులు జరిపిన తీరు ఆమె గెరిల్లా

రణతంత్రాన్ని స్ఫురణకు తెస్తుంది.

బ్రిటీష్ స్థావరం మీద దాడి చేసి శత్రుసైనికులతో పోరాడుతూ ఆమె తీవ్రంగా గాయపడ్డారు. ఆ గాయం కారణంగా అమె గుర్రం మీద నుండి కింద పడిపోయారు. ఆ సమయాన్ని అదనుగా ఉపయోగించుకుని శత్రువు ఆమెను చుట్టుముట్టి బంధించాడు. అక్కడి నుండి ఆమెను సైనిక స్థావరానికి తరలించాడు. ఆమెను బ్రిటీషు అధికారి లెఫ్టినంట్ హడ్సన్ కట్టుదిట్టమైన బందోబస్తుతో అంబాలాలోని బ్రిటీషు సైనిక స్థావరానికి పంపాడు. ఆ సమయంలో అంబాలాలోని ఆంగ్లేయ సైనికాధికారులకు ఆమె గురించి, ఆమె నిర్వహించిన దాడుల గురించి, ఆమె తిరుగుబాటు కార్యకలాపాల వివరాలను, ఆమె ధైర్యసాహసాలను వివరంగా ఎకరువు పెడుతూ, జాగ్రత్తలు చెబుతూ అంబాలా సైనిక స్థావరం డిప్యూటీ కమిషనర్‌కు 1857 జూలై 29న లేఖ రాశాడు.

ఆ లేఖలో, **నేను మీ వద్దకు ఒక ముస్లిం ముదుసలిని పంపుతున్నాను. ఆమె విచిత్రమైన మహిళ. ఆమె ఆకుపచ్చ దుస్తులు ధరిస్తుంది. కంపెనీ మీద తిరుగుబాటు చేయమని ప్రజలను రెచ్చగొట్టడం ఆమె పని. స్వయంగా ఆయుధాలు చేపట్టి తిరుగుబాటు దారులకు నాయకత్వం వహించి మన స్థావరాల మీద దాడులు చేస్తుంది. పలుమార్లు మన స్థావరాలపై ధైర్యసాహసాలతో విరుచుకుపడింది. ఆమె ఆయుధం చేపడితే ఐదుగురు సాయుధ పురుషులతో పోరాడగల శక్తిమంతురాలని, ఆమె బారిన పడిన మన సిపాయిలు, అధికారులు చెబుతున్నారు. ఆమె పట్టుబడిన రోజున, శిక్షణ పొందిన సైనికాధికారిలా నగరంలోని తిరుగుబాటుదారులను కూడేసుకుని, మన స్థావరాల మీద దాడి చేసి పోరాడుతూ పట్టుబడింది. ఆమె కడు ప్రమాదకారి. జాగ్రత్త సుమా,** అని పేర్కొన్నాడు.

ఈ లేఖను ఖుర్షీద్ ముస్తఫా రజ్వీ రాసిన **జంగ్-యే-ఆజాది 1857** అను ఉర్దూ గ్రంథంలో ప్రచురించారని, ' భారత్ కే స్వాతంత్ర్య సంగ్రామం మేఁ ముస్లిం మహిళా వోంకా యోగదాన్ ' గ్రంథ రచయిత్రి డాక్టర్ ఆబిదా సమీయుద్దీన్ తన గ్రంథంలో (45వ పేజీలో) వివరంగా ఉటంకించారు. ఈ లేఖతో పాటుగా అంబాలాలోని ఇతర ఆంగ్లేయాధికారులకు పలు ముందస్తు హెచ్చరికలు చేస్తూ ఆకుపచ్చ దుస్తుల మహిళను అంబాలలోని బ్రిటీషు సైనిక స్థావరానికి పటిష్టమైన బందోబస్తుతో తరలించారు.

భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో అత్యంత క్రూరుడిగానూ, ఇచ్చిన మాట తప్పటంలో ప్రప్రథమునిగా అపఖ్యాతిని మూటగట్టుకున్న ఆంగ్లేయాధికారి లెఫ్టినెంట్





హడ్సన్ లాంటి బ్రిటీష్ సైనికాధికారి ఆమె ధైర్యసాహసాలను స్వయంగా ప్రశంసించాడు. ఈ మేరకు ఆయన తన సహచర అధికారులకు లేఖల ద్వారా తెలియచేశాడు. మాతృదేశం పట్ల ఆమెకున్న గౌరవం అతడిని అమితంగా ఆకట్టుకుంది. అ ప్రభావంతో ' జోన్ ఆఫ్ ఆర్క్ ' తో ఆమెను పోల్చుతూ కీర్తించాడు. (భారత్ కే స్వాతంత్ర్య సంగ్రామం మేఁ ముస్లిం మహిళా వోంకా యోగదాన్, డాక్టర్ ఆబిదా సమీయుద్దీన్, పేజి. 45)

ఆ ఆంగ్లేయాధికారి రాసిన లేఖలలోని హెచ్చరికలను, ఆమె చర్యలను అధికారిక లేఖలలో ఆమె కార్యకలాపాలను వివరించిన తీరు, ఆ సందర్భంగా లేఖలో వాడిన భాష తీవ్రతను బట్టి **ఆకుపచ్చ దుస్తుల మహిళ** గా ఖ్యాతిగాంచిన ఆ యోధురాలు బ్రిటీష్ సైనికాధికారుల గుండెల్లో ఎంతటి గుబులు పుట్టించిందో అర్థం చేసుకోవచ్చు.

ఈ మేరకు అంబాలా సైనిక స్థావరానికి పంపబడిన ఆమె ఆ తరువాత ఏమైందో తెలియరాలేదు. శత్రుదళాలలో అంతటి భయోత్పాతం సృష్టించి ఆంగ్లేయ అధికారులను హడలగొట్టడం కాకుండా **కడు జాగ్రత్త సుమా** అంటూ పరస్పరం ముందస్తు జాగ్రత్తలు తెలుపుకోవాల్సినంత భయానక పరిస్థితులను బ్రిటీషు సైనిక స్థావరాలలో కల్పించిన ఆ యోధురాలిని శత్రువు ఏం చేసి ఉంటాడన్న విషయం మనం ఊహించలేనిది ఏమాత్రం కాదు.

◆◆◆

హిందూ- ముస్లింలకు ధర్మం, ఆత్మగౌరవం, ప్రాణం, ధనం అను నాలుగు అంశాలు ప్రధానం. ఈ అంశాలను కేవలం స్వదేశీ పాలనలో, స్వదేశీ పాలకులు మాత్రమే ప్రసాదించగలరు. కంపెనీ సైనికులు ప్రజలను దోచుకుంటున్నారు. ఆత్మగౌరవాన్ని మంట కలుపుతున్నారు. స్త్రీల మీద అఘాయిత్యాలు, అత్యాచారాలు జరుపుతున్నారు... హిందూ-ముస్లిం పౌరులను హెచ్చరిస్తున్నాం. ఆత్మగౌరవంతో, ధర్మబద్ధంగా ప్రశాంత జీవితం సాగించాలంటే స్వదేశీ పాలన కోసం శతృవులకు వ్యతిరేకంగా ఆయుధాలు చేపట్టండి. స్వదేశీ సైన్యంలో భర్తీకండి...మాతృదేశం కోసం సాగుతున్న పోరాటంలో భాగస్వాములు కండి. శతృవుకు సహకరించకండి. ఆశ్రయం ఇవ్వకండి.

**-బేగం హజరత్ మహల్**

# ఝాన్సీ రాణి వెన్నంటి నిలచి ప్రాణాలర్పించిన యోధురాలు

# ముందర్

**(-1857)**

1857 నాటి సంగ్రామంలో మాతృభూమిని బ్రిటీషు పాలకుల నుండి విముక్తి చేయడానికి కులమతాలకు అతీతంగా ప్రజలు పోరులో పాల్గొన్నారు. ఆయా ప్రాంతాలలోని స్వదేశీ పాలకుల పక్షాన తిరుగుబాటు చేసిన యోధులు చివరి వరకు తమ ప్రాణాలను పణంగా పెట్టి నాయకుల వెంట నడిచారు. చివరకు ప్రాణాలను కూడా తృణప్రాయంగా భావించి త్యజించారు. ఆ విధంగా పోరుబాటలో నడిచి అమరత్వం పొందిన ముస్లిం యువతులలో ఝాన్సీ రాణి లక్ష్మీబాయి నీడలా వెన్నంటి నిలచి శత్రువుతో పోరాడిన ఓ సాహస యువతి కథనం తెలుస్తుంది. ఆమె పేరు ముందర్.

ఝాన్సీ రాణి లక్ష్మీబాయి అమరత్వం పొందిన తీరు గురించి ప్రధానంగా రెండు కథనాలు ఉన్నాయి. ఆ కథనాలలో ఒకటి రాణి లక్ష్మీబాయి బ్రిటీషర్ల తుపాకి గుండ్లకు బలైందన్నది. ఈ విషయాన్ని చాలామంది చరిత్రకారులు అంగీకరిస్తున్నారు. ఆ కథనం ప్రకారంగా ఝాన్సీ రాణి లక్ష్మీ బాయికి అంగరక్షకుల్లా ఇరువురు యువతులు మగ వేషాల్లో ఆమెను ఎల్లప్పుడూ వెన్నంటి ఉండేవారు. ఆ ఇద్దరిలో ఒకరు ముస్లిం యువతి. ఆమె రాణితో పాటు బ్రిటీష్ సైనికాధికారుల తుపాకి గుళ్ళకు బలయ్యారు. అప్పటి





సెంట్రల్ ఇండియా ప్రాంతానికి గవర్నర్ జనరల్ ప్రతినిధిగా నియమించబడిన రాబర్ట్ హెమిల్టన్ 1858 అక్టోబర్ 30న అప్పటి భారత ప్రభుత్వ కార్యదర్శి ఎడ్‌సన్‌కు ఒక లేఖ రాశాడు.

ఆ లేఖలో రాణి లక్ష్మీబాయి మీద తాము సాధించిన విజయాన్ని వివరించాడు. రాణి లక్ష్మీబాయి ఏ విధంగా మరణించింది వివరంగా తెలిపాడు. ఆ కథనం ప్రకారంగా, **రాణి వెన్నంటి ఒక ముస్లిం యువతి గుర్రం మీద అనుసరించేది. కొతాకి సరాయి ప్రాంతంలో రాణితోపాటుగా ఆమెకు తుపాకి గుండ్లు తగిలాయి. ఆమె రాణితోపాటుగా ఒకేసారి నేలకొరిగిందని** వివరించాడు.

ఆ విషయాన్ని EIGHTEEN FIFTY SEVEN గ్రంథంలో Dr. Surendra Nath Sen ఆంగ్లేయాధికారి రాబర్ట్ హెమిల్టన్ వివరణను ఉటంకించారు. ( '.. The Rane was on Horse back, and close to her was the female (a Mohomaden) who seems never to have left her side on any occasion, these two were struck by bullets and fell ' (Page 295) ఈ లేఖలో ఎక్కడా కూడా ఆ యువతి ఎవరన్న విషయం ప్రస్తావించలేదు.

ఆ కారణంగా ఆమె అజ్ఞాత యోధురాలుగా మిగిలిపోయింది. భారత ప్రభుత్వం 1973లో ప్రచురించిన Who's who of Indian Martyrs, Vol. 3 లో మాత్రం ఝాన్సీ రాణితో పాటుగా పలు పోరాటాలలో పాల్గొన్న ఆ ముస్లిం మహిళ గురించిన సంక్షిప్త వివరాలను డాక్టర్ పి.యన్. ఛోప్రా ఈ క్రింది విధంగా పేర్కొన్నారు.

'..Fought by the side of Maharani Lakshmi Bai during the battles against the British at Jhansi, Koonch, Kapi and Gwalior, Killed in the battle at Kotah-ki-sarai in Gwalior, where the Rani attained martyrdom. Her Body was also cremated in the garden of Baba Ganga Das at Gwalior on June 17, 1857 ' - Who's who of Indian Martyrs, Vol.3, Govt. of India Publications, New Delhi, 1973, Page.102

ఆ యోధురాలి పేరు ముందర్ (MUNDAR) అని డాక్టర్ ఛోప్రా పేర్కొన్నారు. ఈ వివరణలను, చరిత్ర గ్రంథాలలో వ్యక్తం అవుతున్న కథనాలకు అన్వయించుకుని చూస్తే ఆ అజ్ఞాత యోధురాలు పేరు ' **ముందర్** ' గా భావించవచ్చు.

◆◆◆

## బ్రిటీష్ సైనిక మూకలను సాయుధంగా ఎదుర్కొన్న ధైర్యశాలి

# బేగం రహీమా

**(1829-1857)**

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం, మాతృదేశాభిమానులైన ప్రతి పురుషుడు, ప్రతి స్త్రీలో త్యాగాల బలివేదికను ఆనందంగా అధిరోహించగల సాహసాన్ని, ఆత్మార్పణా స్ఫూర్తిని కలుగచేసింది. ఆ వీరగుణం కొందర్ని వ్యక్తిగత సాహసాలకు పురికొల్పితే మరికొందర్ని ఉమ్మడి పోరాటాలకు సన్నద్ధులను చేసింది. ఈ మేరకు బ్రిటీష్ సైనికదళాల మీద విరుచుకుపడ్డ తిరుగుబాటుదళాలతో కలసి పోరుబాటను ఎంచుకున్నారు బేగం రహీమా.

ఆమె ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌పూర్ జిల్లాకు చెందిన రాజపుత్రుల కుటుంబంలో 1829లో జన్మించారు. రాజపుత్రుల శౌర్యప్రతాపాలు సంతరించుకున్న ఆమె స్వాతంత్ర్య సంగ్రామంలో బ్రిటీష్ సైనిక మూకల మీద సమర శంఖరావం పూరించారు. ఆయుధం ధరించి తిరుగుబాటు దళాలతో కలిసి శత్రుమూకలను సంహరించే కార్యక్రమంలో ఉత్సాహంగా పాల్గొన్నారు.

ఈ పోరులో గాయపడిన ఆమె బ్రిటీష్ సైనికాధికారులకు బందీ అయ్యారు. శత్రువు గుప్పెట్లో ఉన్నా, ఏమాత్రం తలవంచని ఆ యోధురాలికి సైనికాధికారులు ఉరిశిక్ష విధించారు. మాతృదేశం కోసం మరణించటం అత్యంత గౌరవంగా భావించిన బేగం రహీమా చిన్న వయస్సులోనే, పుట్టిన గడ్డకోసం ప్రాణాలను అర్పించారు. ఆ తరువాతి తరం విప్లవకారులకు ఆమె ఆదర్శంగా నిలిచారు.

(**Who is who Indian Martyrs**, Dr. PN Chopra, Govt. of India Publications, New Delhi.1973, Page. 118)

◆◆◆



## తిరుగుబాటుయోధుల క్షేమం కోరుతూ అగ్నికి ఆహుతైన

# అస్గరీ బేగం

**(1811-1857)**

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో మాతృభూమి పట్ల తెగని బంధాన్ని పెంచుకున్న ప్రతి ఒక్కరూ అపూర్వమైన త్యాగాలతో చిరస్మరణీయులయ్యారు. అటువంటి త్యాగధనులలో తిరుగుబాటు యోధుల క్షేమం కోరుకుంటూ తనను తాను బలి చేసుకున్న త్యాగశీలి శ్రీమతి అస్గరీ బేగం.

1811 జులై 5న ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ముజఫర్‌పూర్ జిల్లాలో అస్గరీ బేగం జన్మించారు. ఆమె కుటుంబం ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామయోధుల కుటుంబం. 1857నాటి పోరాటంలో పాల్గొన్న ఖ్వాజీ అబ్దుల్ రహిమాన్ ఆమె కుమారుడు. అబ్దుల్ రహిమాన్‌ను బ్రిటీష్ ప్రభుత్వం ఉరితీసింది. ఆ తిరుగుబాటులో ఆమె కూడా పరోక్షంగా పాల్గొన్నారు. ఆ సంగ్రామంలో పాల్గొన్న ప్రతి ఒక్కరూ తన బిడ్డలేనని భావించిన ఆమె తిరుగుబాటు వీరులకు ఆశ్రయం కల్పించటం, ఆహార పానీయాలు అందించటంలో సహాయపడ్డారు.

ఈ విషయం తెలిసిన ఆంగ్లేయ సైనికాధికారులు ఆమెను బంధించారు. ఆమె మీద రాజద్రోహం ముద్రవేశారు. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ యోధుల రహస్యాలు చెప్పమని ఆమెను వేధించారు. అధికారులతో సహకరించకుంటే సజీవదహనం చేస్తామని బెదిరించారు. ఆ బెదిరింపులు ఏవీ కూడా ఆమె పట్టుదలను సడలించలేకపోయాయి. చివరకు భయంకర చిత్రహింసల పాల్జేసినా ఆమె లొంగలేదు, పెదవి విప్పలేదు. అందుకు ఆగ్రహించిన అధికారులు ఆమెను సజీవదహనం చేయించారు. ఆంగ్లేయ సైనికాధికారుల హింసాత్మక చేష్టలను భరించిన అస్గరీ బేగం మాతృభూమి సేవలో చిరునవ్వుతో బలయ్యారు.

(Freedom Movement and Indian Muslims, Santimoy Ray, PPH, New Delhi,1993, Page.116 and Who is who Indian Martyrs, Dr. PN Chopra, Govt. of India Publications, New Delhi.1973, Page. 118)

◆◆◆

### ఆంగ్ల సైన్యాలను సాయుధంగా నిలువరించిన సాహసి

# బేగం జమీలా

**(1835 - 1857)**

**మా**తృభూమిని పరాయిపాలకుల నుండి విముక్తం చేసి సొంత గడ్డను స్వదేశీయుల పాలనలో చూడాలన్న ప్రగాఢకాంక్ష కలిగిన యోధులు స్త్రీ-పురుష భేదం లేకుండా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ బాటను ఎన్నుకున్నారు. ఆ విధంగా తిరుగుబాటు యోధులతో కలసి కదనరంగాన ఆంగ్లేయ సైనికులను నిలువరించిన యోధులలో ఒకరు బేగం జమీలా.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌పూరు జిల్లాలోని ఓ గ్రామంలో బేగం జమీలా 1935లో జన్మించారు. ఆమె ఆత్మాభిమానానికి మారుపేరైన పరాయి పాలకులకు తలవంచని పఠాను కుటుంబానికి చెందిన యువతి. పరాయిపాలకుల పెత్తనాన్ని ఏమాత్రం సహించని వారసత్వంగల ఆమె ఆంగ్లేయుల అధికారాన్ని అంగీకరించలేదు. కంపెనీ పాలకులు మాతృభూమిని కబ్జా చేయటం భరించలేకపోయారు.

ఆ సమయంలో 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ నగారా మోగింది. ఆ నగారాతో ఆమెలోని యోధురాలు రణరంగానికి సిద్ధమయ్యారు. మాతృభూమి సేవలో ప్రాణాలను తృణప్రాయంగా భావించిన ఎంతటి త్యాగానికైనా సిద్ధపడి ముందుకు సాగారు. స్వదేశీపాలకుల మీద దాడులు జరుపుతూ తరలివస్తున్న బ్రిటీషు సేనలను నిలువరించడానికి తిరుగుబాటుయోధులతో కలిసి శతృవుపై కలబడ్డారు.

ఆ సందర్భంగా ఆంగ్లేయ సైన్యాలు ఆమెను అరెస్టు చేశాయి. బ్రిటీషు సైనిక న్యాయస్థానం విచారణ తంతును పూర్తిచేసి ఆమెకు ఉరిశిక్షను ప్రకటించింది. పుట్టిన గడ్డను పరాయి పాలకుల నుండి విముక్తం చేయటంలో ప్రాణాలను అర్పించి బేగం జమీలా చరితార్థురాలయ్యారు.

(Who is who Indian Martyrs, Dr. PN Chopra, Govt. of India Publications, New Delhi.1973, Page. 64)

◆◆◆



### కదనరంగాన శత్రువును ఎదిరించిన యోధురాలు

# బేగం ఉమ్‌ద్దా

**(1831- 1857)**

**ప్ర**థమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయ సైనికులతో పోరాడుతూ గాని, శత్రు సైనికులను నిలువరించటంలో గాని, తిరుగుబాటు యోధులకు సహాయసహకారాలు అందించటంలో గాని మహిళలు తమదైన పాత్ర నిర్వహించారు. ఆ కారణంగా మొత్తం మీద 255 మంది యువతులు ఉరికంబం ఎక్కారు. ఈ మేరకు Who is who Indian Martyrs, (Dr. PN Chopra,Govt. of India Publications, New Delhi.1973) గ్రంథంలో పేర్కొన్న మహిళా యోధులలో అత్యధికులు ముస్లిం మహిళలు ఉండటం విశేషం. అటువంటి విశిష్ట స్థానం పొందిన మహిళలలో బేగం ఉమ్‌ద్దా ఒకరు.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌పూరు జిల్లాలోని ఓ గ్రామంలో బేగం ఉమ్‌ద్దా 1931లో జన్మించారు. భయమంటే ఏమిటో ఎరుగని జాట్ కుటుంబానికి చెందిన యువతి ఆమె. ప్రాణాలను పణంగా పెట్టయినా స్వదేశీపాలనను సాధించుకోవాలన్న ఆత్మాభిమానంతో శత్రువుతో తలబడటంలో ఏమాత్రం వెనుకాడని వారసత్వం ఆమెది. పరాయిపాలకుల పెత్తనం ఆమెకు నచ్చలేదు. పరాయిపాలకులన పాలద్రోలి స్వదేశీయుల పాలనను ప్రతిష్టించుకోవాలన్నది ఆమె కోరిక.

ఆ ఆకాంక్షను సాధించుకునే అవకాశం 1957లో లభించగానే పరాయి పాలకుల పెత్తనానికి చరమగీతం పాడాలనుకుంటున్న యోధుల సరసన బేగం ఉమ్‌ద్దా చేరారు. స్వదేశీపాలకుల పక్షాన శతృసైనికులను నిలువరించేందుకు తిరుగుబాటు యోధులతో కలసి బ్రిటీషు సైన్యాలను ఎదుర్కొన్నారు.

ఆమె పోరుబాటన సాగుతున్న సందర్భంగా ఆంగ్లేయ సైన్యాలు అరెస్టు చేశాయి. ఆంగ్లేయాధికారులు సైనిక విచారణ జరిపి ఆమెకు ఉరిశిక్ష విధించారు. ఆమెతోపాటుగా మరో 11మంది యువతులకు ఆసందర్భంగా ఉరిశిక్ష అమలు చేశారు. ఆ పదకొండు మందితోపాటు బేగం ఉమ్‌ద్దా కూడా మాతృభూమి విముక్తి పోరాటంలో ప్రాణాలను అర్పించారు.

◆◆◆

## అగ్ని యుగంలో అపూర్వంగా భాసించిన సాహసి

# ఖుదీరాంకి దీది

బ్రిటీష్ వలసపాలకుల బానిసత్వం నుండి స్వదేశాన్ని విముక్తం చేసి, స్వరాజ్యాన్ని స్థాపించాలనే ఉత్సాహంతో ఉరకలెత్తే యువతరం ఆయుధాలు చేపట్టి విస్ఫులింగాలై బ్రిటీషర్ల మీద విరుచుకుపడుతున్న **అగ్నియుగం** రోజులవి. విప్లవకారుల అణిచివేతకు పలు చట్టాలను అమలులోకి తీసుకురావటమే కాకుండా, విప్లవోద్యమాన్ని దుంపనాశనం చేయడానికి అన్ని రకాల అధికారాలను ప్రసాదించి పోలీసు అధికారులను ఆంగ్లేయ ప్రభుత్వం ఉసికొల్పింది. విప్లవకారులకు సహాయపడుతున్నారని ఏ మాత్రం అనుమానం వచ్చినా, ఉద్యమ సానుభూతిపరులను అక్రమంగా నిర్బంధించి, తీవ్రంగా హింసించి అంతం చేస్తున్న భయానక వాతావరణమది.

బ్రిటీష్ పోలీసుల దాష్టీకాలను భరించలేక కుటుంబ సభ్యులే విప్లవకారులైన తమ బిడ్డలతో సంబంధాలు వదులుకుంటున్న భయంకర వాతావరణంలో బ్రిటిష్ పోలీసులకు ఏమాత్రం భయపడకుండా విప్లవయోధుడు ఖుదీరాంకు అండగా నిలవటమే కాకుండా ఆయనకు ఓ యువతి ఆశ్రయం కల్పించారు. ఆమెను ఆయన **దీది** (అక్కయ్య) అని పిలిచారు. ఆ కారణంగా ఆమె **ఖుదీరాంకి దీది** అయ్యారు.





ఆమె అసలు పేరు తెలియదు. చరిత్ర ఆమెను **ఖుదీరాంకి దీది** (ఖుదీరాం అక్కయ్య) గా నామకరణం చేసింది. ఆ పేరుతోనే ఆమె స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో గణుతికెక్కారు. ఆమె ప్రముఖ విప్లవకారుడు మౌల్వీ అబ్దుల్ వహీద్ చెల్లెలు. అన్నకు తగ్గ చెల్లెలుగా ఆమె పోరుబాటన నడిచి పోరాట యోధులకు అండదండలు అందించారు. (Freedom Movement and Indian Muslims, Santimoy Ray, PPH, New Delhi, 1993, Page. 34)

భయమెరుగని విప్లవకారుడు ఖుదీరాంను తమ్ముడిగా భావించిన ఆమె అతనికి ఆశ్రయమిచ్చారు. ఆంగ్లేయాధికారి కెన్నడీ (Kennedy) భార్యను హత్య చేసారన్నది ఖుదీరాం మీద ఆరోపణ. బ్రిటీష్ మహిళను హత్యగావించాడని ఆగ్రహంతో రగిలిపోతున్న అధికారులు ఖుదీరాం సమాచారం కోసం, ప్రజలపై, విప్లవోద్యమ సానుభూతిపరులపై విరుచుకుపడి, విధ్వంసం సృష్టిస్తున్నారు, చిత్రహింసల పాల్జేస్తున్నారు. ఆ పరిస్థితులలో ఆమె ఖుదీరాంను రక్షించపూనుకోవటం సాహసం.

ఆ విషయాన్ని పోలీసులు ఏమాత్రం పసిగట్టినా, ఖుదీరాంతోపాటుగా ఆమె కూడా దారుణ చిత్రహింసలకు గురికావటమేకాక ప్రాణాలను కూడా అర్పించాల్సి వచ్చేది. అటువంటి భయానక వాతావరణంలో కూడా ఆమె భయపడలేదు. అక్కయ్యకు ఏమాత్రం కష్టం–నష్టం కలిగించటం ఇష్టంలేక కొంతకాలం తరువాత ఖుదీరాం ఆమె వద్ద నుండి వెళ్ళిపోయారు. అ తరువాత అరెస్టయ్యారు. ఆయనను చాలా కాలం నిర్భంధంలో ఉంచింది ప్రభుత్వం. ఆ సమయంలో కూడా జైలులో నున్న ఖుదీరాం క్షేమసమాచారాలను తెలుసుకోడానికి ఆమె ఎంతో తెగింపుతో ప్రయత్నించారని ఆ యోధురాలి సాహసాన్ని చరిత్రకారుడు ప్రముఖ రచయిత Santimoy Ray, తన గ్రంథం Freedom Movement and Indian Muslims (Page. 34) లో ప్రశంసించాడు.

చివరకు ముజఫర్‌పూర్ జైలులో ఖుదీరాంను 1908 ఆగస్టులో ఉరితీశారు. ఉరిశిక్ష విధించిన విషయం తెలుసుకున్న ఆమె ఆ తరువాత ఎదురయ్యే పరిణామాలను ఖాతరు చేయకుండా పోలీసు వర్గాలను విమర్శించారు. అత్యంత కష్టకాలంలో విప్లవకారులకు అండగా నిలచి, కోరి తెచ్చుకున్న కష్టనష్టాలను చిరునవ్వుతో భరించిన ఆ యోధురాలు భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో **ఖుదీరాంకి దీది** గా చిరస్మరణీయమైన ఖ్యాతిని స్థిరపర్చుకున్నారు.

◆◆◆

# జుగాంతర్ విప్లవ దళం వీరవనిత

# రజియా ఖాతూన్

**భా**రత స్వాతంత్ర్య సంగ్రామం ప్రజానీకాన్ని అన్ని రకాల త్యాగాలకు సిద్ధపర్చింది. అహింసామార్గంలో బ్రిటీష్ సేనల తుపాకి గుండ్లకు బలైన ఖుదాయే- ఏ-ఖిద్మత్‌గార్‌లనూ (భగవత్సేవకులు), ఆయుధాలను చేతపట్టి బ్రిటీష్ పోలీసు-సైనిక దళాలను తొడగొట్టి సవాల్‌చేసి రణరంగంలో వీరోచితంగా పోరాడి ప్రాణాలను బలిపెట్టిన విప్లవకారులనూ జాతీయోద్యమం సృజియించింది.

బ్రిటీషర్ల బానిసత్వం నుండి విముక్తి కోరుకుంటూ సాగిన ఈ పోరాటాల మార్గాలు ఏవైనా అందులో పురుషులతోపాటు మహిళలు కూడా నడుంబిగించి ముమ్ముందుకు సాగారు. విముక్తి పోరాటంలో ఏమాత్రం వెన్ను చూపక ఆయుధం చేపట్టి బ్రిటీషర్ల వెన్నులో చలి పుట్టించారు. ఈ మేరకు బ్రిటీష్ ప్రభుత్వాన్ని సవాల్ చేసి హడలగొట్టిన ఆడపడుచులలో రజియా ఖాతూన్ ఒకరు.

భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర పుటలలో **అగ్నియుగం** గా పిలువబడిన సాయుధ పోరాట కాలంలో జుగాంతర్, అనుశీలన సమితి, ఆత్మోన్నతి దళం, గదర్ విప్లవ దళం, హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్ తదితర విప్లవ దళాలలోని విప్లవవీరులు అపూర్వ ధైర్య సాహసాలతో, అసమాన త్యాగాలతో అగ్నియుగాన్ని రగిలించారు. అటువంటి విప్లవ





వీరుల సరసన నిలిచిన మహిళామణి రజియా ఖాతూన్.

ఆమె ప్రముఖ విప్లవయోధుడు మౌల్వీ నశీరుద్దీన్ అహమ్మద్ కుమార్తె. చిన్ననాటి నుండి ఆమెలో అంకురించిన దేశభక్తి భావనలు బ్రిటీష్ వ్యతిరేకతను తీవ్రతరం చేశాయి. స్వదేశాన్ని విదేశీ పాలకుల బానిసత్వం నుండి విముక్తం చేయాలని ఆమె సంకల్పించారు. తండ్రితో పాటు ఆమె కూడా జుగాంతర్ విప్లవ దళంలో సభ్యత్వం స్వీకరించారు. జుగాంతర్ విప్లవయోధులు సాగించిన సాయుధపోరాటానికి దళ సభ్యురాలిగా రజియా ఖాతూన్ క్రియాశీలక తోడ్పాటునందించారు.

మాతృదేశ విముక్తికోసం తమ ప్రాణాలను తృణప్రాయంగా భావించి చిరునవ్వుతో బలిపెట్టడానికి సిద్ధమైన, ముక్సుద్దీన్ అహమ్మద్ (నెత్రకోన), మౌల్వీ గయాజుద్దీన్ అహమ్మద్, అబ్దుల్ ఖాదర్ (జమ్లాపూర్) తదితరులతో కలసి రజియా ఖాతూన్ విప్లవ కార్యక్రమాలను నిర్వహించారు. బ్రిటీష్ పాలకవర్గాలు జుగాంతర్ దళ సభ్యులను పూర్తిగా మట్టుపెట్టాలని ఒకవైపున తీవ్రంగా కృషి చేస్తూ, దాడులు, దాష్టీకాలకు పాల్పడుతున్న భయానక సమయంలో కూడా ఆమె మార్గం మళ్ళకుండా విప్లవబాటన నడిచారు.

ఆనాటి భయంకర పరిస్థితులలో కూడా విప్లవోద్యమంలో ముమ్ముందుకు సాగేందుకు రజియా ఖాతూన్ ఏమాత్రం భయపడలేదు. బ్రిటీష్ గూఢచారుల, పోలీసుల కదలికలను, ఇతర సమాచారాన్ని రహస్యంగా విప్లవకారులకు చేరవేయటం, దళంలోని సభ్యులకు ఆశ్రయం కల్పించటం, ఆహారం, ఆర్థిక, ఆయుధ సహాయ సహకారాలు అందచేయటం లాంటి పనులను చాకచక్యంగా నిర్వహించి జుగాంతర్ విప్లవ దళం చరిత్రలో ప్రత్యేక స్థానం పొందారు.

ప్రముఖ చరిత్రకారుడు Santimoy Ray తన గ్రంథం Freedom Movement and Indian Muslims, PPH, New Delhi,1993, Page. 44 లో ఆ పోరాట యోధురాలు రజియా ఖాతూన్ గురించి ప్రత్యేకంగా ప్రస్తావించారు.

◆◆◆

> మాతృదేశం కోసం మరణించటం కూడా అప్పుడప్పుడు అవసరం... అయితే మరణించటం కంటే లక్ష్యసాధన కోసం జీవించటం చాలా అవసరం.
> **- ఆబాది బానో బేగం**

## జలియన్ వాలా బాగ్‌లో నేలరాలిన ధీరమాత

# ' షహీద్ ' ఉమర్ బీబీ

**(1864-1919)**

**మా**తృభూమిని విముక్తి చేసేందుకు ప్రాణాలను పణంగా పెట్టి పరాయి పాలకుల మీద విజృభించిన ఘట్టాలలో పురుషులతోపాటు స్త్రీలు కూడా సాహసోపేత భాగస్వామ్యం వహించారు. ఈ మేరకు సాగిన అహింసాయత పోరాటాలలో పాల్గొని బ్రిటీష్ పోలీసుల హింసకు ప్రాణాలను అర్పించిన అమరజీవుల జాబితాలో ఉమర్ బీబీ అరుదైన స్థానం సంపాదించుకున్నారు.

పౌరుషానికి పోతుగడ్డ, ధైర్యసాహసాలకు పుట్టినిల్లుగా ఖ్యాతిగాంచిన పంజాబ్ రాష్ట్రంలోని అమృతసర్ జిల్లా, దుల్లా (DULLA) గ్రామంలో ఉమర్ బీబీ 1864లో జన్మించారు. బానిస బ్రతుకును సహించలేని రైతుకుటుంబంలో పుట్టిన ఆమె స్వతంత్ర భావాలను అలవర్చుకున్నారు. ఆమెకు ఇమానుద్దీన్‌తో వివాహం జరిగింది. (Freedom Movement and Indian Muslims, Santimoy Ray, PPH, New Delhi, 1983, Page.97)

మాతృభూమి పట్ల అపార గౌరవాభిమానాలు గల మహిళ ఉమర్ బీబీ. జాతీయ ఉద్యమ విశేషాలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ అనుకూలాంశాలకు ఆనందం, ప్రతికూల అంశాల పట్ల బాధను వ్యక్తం చేస్తూ వచ్చారు. స్వదేశీయుల మీద విరుచుకు





పడుతున్న బ్రిటీష్ పోలీసుల దాష్టీకాలను జ్వలిత నేత్రాలతో గమనిస్తూ ఆవేదన చెందారు. మాతృభూమిని బానిస బంధనాల నుండి విముక్తం చేయడానికి భారతీయులు సాగిస్తున్న పోరాటాలను అణిచివేసేందుకు బ్రిటీష్ పాలకులు అనుసరిస్తున్న క్రూరవిధానాల మూలంగా దేశంలో అల్లకల్లోల పరిస్థితి నెలకొనియున్న తరుణంలో ఆమె జీవిత సహచరుడు కన్నుమూశారు. భర్తను కోల్పోయిన ఆమె సంసారం ఒడిదుడుకులకు గురయ్యింది.

ఆర్థిక కష్టనష్టాల కడలిలో పయనం సాగిస్తున్నా కూడా ఉమర్ బీబీ జాతీయోద్యమ కార్యక్రమాల పట్ల తనకున్న ప్రత్యేక ఆసక్తిని కోల్పోలేదు. ఆనాడు పంజాబ్ రాష్ట్రంలో జరుగుతున్న పరిణామాలను తెలుసుకుంటూ ఉద్యమకారుల ఉత్సాహానికి ఆనందిస్తూ, ఉద్యమకారులను తన బిడ్డలుగా భావిస్తూ ప్రోత్సహిస్తూ ఆశీర్వదించారు. జాతీయోద్యమ కార్యక్రమాలలో భాగంగా ప్రముఖ నాయకుల సభలకు హాజరుకాసాగారు. ఆ నాయకుల, విప్లవయోధుల ప్రసంగాలను శ్రద్ధగా వినేవారు. ఆ సభలు–సమావేశాల నుండి గ్రామానికి తిరిగి వచ్చి ఆయా కార్యక్రమాల విశేషాలను గ్రామస్తులకు ఆసక్తిదాయకంగా వివరించటం అలవాటు.

ప్రథమ ప్రపంచ యుద్ధంలో భారతీయుల అండదండలు, మద్దతు సంపాదించటం కోసం బ్రిటీషు ప్రభుత్వం పలు ప్రయత్నాలు చేసింది. యుద్ధ సమయంలో పంజాబు నుండి అత్యధికులను భారత సైన్యంలో చేర్చుకుంది. ఈ మేరకు అటు ప్రజలకు ఇటు భారతీయ సైనికులకు పలు హమీలను ఇచ్చింది. ప్రపంచ యుద్ధం తరువాత తాను ప్రకటించిన హామీలను, కల్పిస్తానన్న అవకాశాలను ప్రభుత్వం తుంగలో తొక్కింది. ప్రభుత్వం తన హామీలను చేసిన వాగ్దానాలను నిలబెట్టుకోవాల్సిందిగా ప్రజలు డిమాండ్ చేశారు. ప్రజల డిమాండ్‌లను ప్రభుత్వం పట్టించుకోకపోగా అలనాటి హామీలను ప్రస్తావించిన ప్రజల మీద విరుచుకుపడింది. ఈ రకమైన నమ్మక ద్రోహం కారణంగా ఏర్పడిన ప్రతికూల వాతావరణంలో పాలకుల పట్ల అన్ని వర్గాలలో అసంతృప్తి అలుముకుంది. ఆ అసంతృప్తి కాస్తా స్థాయిదాటి ఆగ్రహ రూపుదాల్చింది. ఆ కారణంగా పంజాబులో విప్లవ కార్యకలాపాలు ఊపందుకున్నాయి.

ఈ వాతావరణంలో 1918 ఆగస్టులో అమృతసర్‌లో డాక్టర్ సైపుద్దీన్ కిచ్లూ, ఆయన భార్య సాదత్ బానో కిచ్లూల నేతృత్వంలో ముస్లిం జనసముదాయాల నిరసన సభ జరిగింది. ఈ సభలో వక్తలు బ్రిటీషు ప్రభుత్వం అనుసరిస్తున్న ప్రజావ్యతిరేక చర్యల



**అమృతసర్‌లోని జలియన్ వాలా బాగ్ లో**

**1919 ఏప్రిల్ 13, తేదిన జరిగిన దారుణ మారణ కాండ చిత్రం**

మీద విరుచుకుపడ్డారు. ఈ వాతావరణం క్రమంగా పంజాబు దాటి దేశవ్యాప్తం కాసాగింది. ప్రజల నుండి వ్యక్తమౌతున్న ఆందోళన, ఆగ్రహాన్ని అణిచివేతకు ఉద్యమిస్తున్న సాయుధ విప్లవకారులను నిరోధించేందుకు, దేశవ్యాప్తంగా వ్యక్తమౌతున్న నిరసన జ్వాలల వ్యాప్తిని అడ్డుకునేందుకు ఆంగ్ల ప్రభుత్వం 1919 మార్చిలో భయంకర **రౌలత్** చట్టాన్ని తెచ్చింది.

ఈ చట్టం ద్వారా అధికారులకు విశేషాధికారాలు కల్పించింది. పౌర హక్కులను కాలరాయడానికి, విచారణ లేకుండా ఎవరినైనా నిర్బంధించడానికి అవసరానికి మించిన అసాధారణ అధికారాలు పోలీసులకు లభించాయి. ఈ చట్టం క్రింద అనుమానితులు ఎవరినైనా, ఎక్కడైనా పోలీసులు, సైన్యాధికారులు అరెస్టు చేయవచ్చు. ఆ విధంగా అరెస్టు అయిన వారెవ్వరికీ బెయిలు లభించదు. వకీలును నియమించుకునే అవకాశం ఉండదు. తన వాదన విన్పించుకునే అవకాశం ఇవ్వరు. ఆ కారణంగా రౌలత్ చట్టం గురించి గాంధీజి వ్యాఖ్యానిస్తూ, **నో అప్పీల్-నో వకీల్-నో దలాల్** (No appeal; no vakeel; no dalaal ) అని అన్నారు.

ఈ ప్రజావ్యతిరేక చట్టానికి నిరసనగా సత్యాగ్రహోద్యమానికి గాంధీజీ పిలుపు ఇచ్చారు. ఈ ఉద్యమానికి నాందిగా ఢిల్లీలో తొలి సత్యాగ్రహ సభ జరిగింది. ఆ తరువాత పంజాబులో సభ నిర్వహించేందుకు డాక్టర్ సైఫుద్దీన్ కిచ్లూ తదితర నాయకుల నేతృత్వంలో





మహాత్మా గాంధీని ఆహ్వానించారు. ఆయన రాకను నిరోధించేందుకు ప్రభుత్వం గాంధీజీని అరెస్టు చేసింది. ఆ అరెస్టుకు పంజాబ్ ప్రజలు తీవ్రంగా స్పందించారు. ఆ సమయంలో అత్యంత క్రూరుడిగా పేర్గాంచిన జనరల్ డయ్యర్ నేతృత్వంలో సాగుతున్న పోలీసు రాజ్యాన్ని పంజాబు నాయకులు డాక్టర్ సైఫుద్దీన్ కిచ్లూ, డాక్టర్ సత్యపాల్ తీవ్రంగా విమర్శించారు. ఆ విమర్శలకు ఆగ్రహించిన ప్రభుత్వం ఆ నేతలను 1919 ఏప్రిల్ 10న అరెస్టుచేసి ప్రవాసానికి పంపింది.

ఈ చర్యతో పంజాబు జనం మరింత రెచ్చిపోయారు. ప్రియతమ నాయకులను విడిచిపెట్టమంటూ ఊరేగింపులు జరిపారు. ఆ సందర్భంగా జరిగిన కాల్పులలో నలుగురు మరణించారు, పలువురు గాయపడ్డారు. ఆ సంఘటనలతో మరింత రెచ్చిపోయిన ప్రజలు నేషనల్ బ్యాంకులోని ఇరువురు ఆంగ్ల అధికారులను హతమార్చారు, గందరగోళం సృష్టించారు. ప్రభుత్వ కార్యకలాపాలను స్తంభింపచేశారు.

అ సంఘటనల తరువాత జాతీయ కాంగ్రెస్ నాయకులు ఏప్రిల్ 13న అమృతసర్‌లోని జలియన్‌వాలా బాగ్‌లో నిరసన సభను నిర్వహించాలని నిర్ణయించారు. ఆ రోజున వైశాఖి పర్వదినం. ఆ సందర్భంగా జరుగుతున్న సభలో పాల్గొనేందుకు పరిసర గ్రామాల నుండి ప్రజలు భారీ సంఖ్యలో జలియన్‌వాలా బాగ్‌కు తరలి వచ్చారు. ఈ సమాచారం తెలుసుకున్న జనరల్ డయ్యర్ కుట్రపూరితంగా వ్యవహరించాడు. సభా కార్యక్రమాలు నిషేధిస్తూ ఉత్తర్వులు జారీ చేశాడు. ఆ ఉత్తర్వులను ప్రజలు ఖాతరు చేయలేదు. జలియన్‌వాలా బాగ్ ఆ రోజున జనప్రవాహంతో నిండిపోయింది. ఆ సభలో పాల్గొనేందుకు ఉమర్ బీబీ కూడా అమృతసర్‌కు చేరుకున్నారు.

ప్రజలు భారీ సంఖ్యలో సభాస్థలికి విచ్చేశారు. ఈ స్పందనకు జనరల్ డయ్యర్ మండిపడ్డాడు. నిప్పుతొక్కిన కోతిలా చిందులేశాడు. సాయుధ బలగాలను వెంటపెట్టుకుని సభాస్థలిని చుట్టుముట్టాడు. ముందుగా ఎటువంటి హెచ్చరికలు చేయకుండానే సభికుల మీద కాల్పులు జరిపించాడు. సభాస్థలి చుట్టూ ప్రహరీ గోడ ఉండటం, సభాస్థలిలోకి రాకపోకలకు ఒకవైపు మాత్రమే ఉన్న ఇరుకైన ప్రవేశమార్గానికి అడ్డంగా తన సాయుధ బలగాలను మోహరించి కాల్పులు జరిపించిన డయ్యర్ కిరాతకత్వానికి పెద్దసంఖ్యలో ప్రజలు నేలకొరిగారు. ఈ దుస్సంఘటనలో ప్రభుత్వ రికార్డుల ప్రకారంగా 378 మంది మరణించగా అందులో 55 మంది ముస్లింలు ఉన్నారు. ఈ సంఖ్య సరికాదని అమరులైన



అమర వీరుల రుధిర ధారలకు గుర్తుగా నిలచిన జలియన్‌వాలా బాగ్ గోడ.

వారు సుమారు 1500 వరకు ఉంటారని, మూడు వేలకు పైగా గాయపడిన వారు ఉన్నారని ఆనాటి పలు వ్యక్తిగత, సంస్థాగత నివేదికలు పేర్కొన్నాయి.

భారత స్వాతంత్ర్య సమరోజ్వల చరిత్రలో రక్తాక్షరాలతో లిఖించబడిన **జలియన్‌వాలా బాగ్ దుర్మార్గం**లో డయ్యర్ సైనిక మూకల తుపాకీ గుండ్లకు ఉమర్ బీబీ బలయ్యారు. ఆనాటి 55 మంది ముస్లిం యోధులలో ఒకే ఒక మహిళగా 55 సంవత్సరాల ఉమర్ బీబీ ప్రత్యేక స్థానం పొందారు.

ఈ మేరకు తన రుధిర ధారలతో జలియన్‌వాలా బాగ్ మట్టిని పునీతం చేయడం మాత్రమే కాకుండా తమ వీరోచిత పోరాటాలతో, ప్రాణ త్యాగాలతో పంజాబీలు నిర్మించిన అద్భుత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఉమర్ బీబీ ప్రత్యేక స్థానం పొందారు.

(Contribution of Muslims to the Indian Freedom Movement, Khaliq Ahamed Nizami, Idarah-i-adabiyat-i- Delli,1999, Page. 36)

◆◆◆

నా భర్తను సింహంలా మృత్యువును స్వీకరించనివ్వండి...జాతి ప్రయోజనాలు, ఆత్మగౌరవాభిమానాల పరిరక్షణ విషయంలో వ్యక్తిగత జీవితాలు అంత ప్రాముఖ్యం కావు..మాతృదేశ విముక్తి పోరాటంలో ధనమాన ప్రాణాలను బలిపెట్టాల్సి ఉంటుంది. ..అందుకు ఎవ్వరూ చింతించాల్సిన అవసరం లేదు సరికదా, మనమంతా మరింతగా గర్వపడాలి. **– బేగం ముహమ్మద్ ఆలం.**



## గాంధీజీకి వజ్రాల గాజులు అందించిన వితరణశీలి

# మునీరా మజ్రుల్ హఖ్

**స్వా**తంత్ర్యోద్యమంలో అవిశ్రాంతంగా పాల్గొంటూ ఉద్యమకారుడైన భర్తకు అన్ని విధాల సహకరిస్తూ, ఉద్యమ అవసరాలకు అనుగుణంగా మసలుకున్న మహిళలు జాతీయోద్యమ చరిత్రలో మనకు ఎందరో కన్పిస్తారు. ఆ కోవకు చెందిన మహిళామతల్లులలో మునీరా బేగం ప్రముఖులు.

మునీరా బేగం గుజరాత్‌కు చెందిన తయ్యాబ్జీ కుటుంబీకురాలు. ఆమె ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు జస్టిస్ బద్రుద్దీన్ తయ్యాబ్జీ మేనకోడలు. జాతీయోద్యమకారుల కుటుంబం నుండి వచ్చిన ఆమె 1917లో ప్రఖ్యాత జాతీయోద్యమకారుడు పాట్నా జమీందారి వంశస్థుడైన మౌల్వీ మజ్రుల్ హఖ్‌ను వివాహమాడారు. వివాహానంతరం ఆమె భర్తతోపాటుగా జాతీయోద్యమంలో భాగస్వామి అయ్యారు. హిందూ-ముస్లింల ఐక్యత కోసం కృషి సల్పారు.

ఆమె సంపన్న కుటుంబానికి చెందిన సర్వసంపదలను ఉద్యమకారుల కోసం త్యాగం చేసిన వితరణశీలి. నిరాడంబరంగా జీవితం సాగిస్తూ వచ్చిన ఆమె గాంధీజి అడిగినంతనే అత్యంత విలువచేసే వజ్రాలు పొదిగిన తన బంగారు గాజులను దానంగా ఇచ్చేసి ఆయనను ఆశ్చర్యచకితుల్ని చేశారు.

ఆమె త్యాగనిరతిని వివరిస్తూ, 1920 డిసెంబరు 4వ తేదిన గాంధీజి తన మిత్రుడు అక్బర్ హైదరాబాదికి రాసిన లేఖలలో, జాతీయోద్యమంలో ఆమె పాత్రను వివరిస్తూ, ఆమె దాతృత్వాన్ని వర్ణిస్తూ ఎంతగానో కొనియాడారు. (Collected works of Mahathma Gandhi , Volume XIX 1920-1921, Page.70)

ఆమె భర్త మజ్రుల్ హక్ సర్వసంపదల్ని వదలి ఫకీర్ జీవితాన్ని స్వీకరించి, హిందూ-ముస్లింల ఐక్యత కోసం పనిచేశారు. ఆ మార్గంలో మునీరా బేగం భర్తకు అన్ని విధాల సహకరించారు. ఆమె జీవితాంతం ఆ దిశగా కృషి చేశారు.

◆◆◆

## జాతీయోద్యమకారులను ఉత్తరాలతో ఉత్తేజపరచిన

# బేగం జాఫర్ అలీ ఖాన్

**జా**తీయోద్యమ చరిత్ర పుటలను కాస్త ఓపిగ్గా తెరిస్తే స్వాతంత్ర్యోద్యమంలో భర్తలతో పాటుగా పలు త్యాగాలకు సిద్ధపడి, మాతృభూమి విముక్తికి పోరుబాటను ఎంచుకున్న తల్లులు ఎందరో మనల్ని పలకరిస్తారు. భర్త అడుగుజాడల్లో నడుస్తూ, జీవిత భాగస్వామికి సంపూర్ణ తోడ్పాటు అందచేయటం ఒకవంతైతే, బ్రిటీష్ పాలకుల కుయుక్తుల వల్ల భర్తలు నిర్వహిస్తున్న కార్యక్రమాలకు అంతరాయం ఏర్పడిన సమయంలో, తామున్నామని రంగం మీదకు వచ్చి భర్త బాధ్యతల భారాన్ని స్వీకరించి సమర్ధవంతంగా మాత్రమేకాదు స్ఫూర్తిదాయకంగా నిర్వహించగలగటం గొప్ప విషయం. ఆ కోవకు చెందిన జాతి మహిళా రత్నాలలో ఒకరు బేగం జాఫర్ అలీఖాన్.

ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధులు మౌల్వీ జాఫర్ అలీఖాన్ సతీమణి బేగం జాఫర్ అలీఖాన్. భర్త జాఫర్ అలీఖాన్ పేరుతో ఆమె ప్రసిద్ధిచెందారు. 1904లో జాఫర్ అలీఖాన్ తండ్రి మున్షీ సిరాజుద్దీన్ ప్రారంభించిన ఉర్దూ పత్రిక **జమీందార్** సంపాదకత్వాన్ని 1909లో చేపట్టి, బ్రిటీష్ పాలకులకు వ్యతిరేకంగా దానిని బలమైన అస్త్రంగా తీర్చిదిద్దారు. బ్రిటీష్ వలసపాలకుల దాష్టీకాలను, దోపిడీ విధానాలను విమర్శిస్తూ జమీందార్ పత్రిక ద్వారా ప్రజలలో బ్రిటీష్ వ్యతిరేకతను చాలా బలమైన ప్రచారంగావించారు. బ్రిటీష్





ప్రభుత్వం అకృత్యాల మీద జాఫర్ అలీఖాన్ అక్షరాగ్నులను కురిపించారు. బ్రిటీష్ వ్యతిరేక పత్రిక జమీందార్ గొంతు నొక్కేయడానికి పలు విధాల ప్రయత్నించిన ప్రభుత్వం చివరకు జమీందార్ పత్రికను, ఆ పత్రిక సంపాదకులు మౌల్వీ జాఫర్ అలీని శత్రువుగా పరిగణించింది.

ఆ కారణంగా జాఫర్ అలీఖాన్ పలుసార్లు జైలుకు వెళ్ళవలసి వచ్చింది. ఆయన నగర బహిష్కరణకు గురయ్యారు. లాఠీ దెబ్బలు రుచిచూశారు. బ్రిటీష్ అధికారులు ఎంత క్రూరంగా వ్యవహరించినా, మౌల్వీ మాత్రం ప్రభుత్వానికి తలవంచలేదు. మార్గం మార్చుకోలేదు. జమీందార్ పత్రికను జాతీయోద్యమానికి ప్రాణంగా తీర్చిదిద్దారు. ప్రజలలో పోరాట స్ఫూర్తిని రగిలించారు. ఆనాటి పత్రికలలో జమీందార్ పత్రిక ఉత్తమశ్రేణి ఉర్దూ పత్రికగా ఖ్యాతిగాంచింది. ఆ కృషి ఫలితంగా జాతీయోద్యమ చరిత్రలో మౌల్వీ జాఫర్ అలీఖాన్‌కు ప్రత్యేకస్థానం లభించింది.

ఆంగ్లేయ ప్రభుత్వం ఆయన పట్ల కినుక వహించింది. ఆయనకు వ్యతిరేకంగా పోలీసు అధికారులు సృష్టిస్తున్న భయానక పరిస్థితులను అధిగమిస్తూ మౌల్వీ జాఫర్ అలీఖాన్ మున్ముందుకు సాగారు. బేగం జాఫర్ అలీఖాన్ కూడా ఆ బాటలో నడిచారు. ప్రజల పక్షం వహించిన కలంవీరుడు జాఫర్ అలీఖాన్ **జీవిత భాగస్వామి** గా ఆమె అత్యవసర పరిస్థితులలో ప్రత్యేక పాత్ర నిర్వహించి చరిత్ర సృష్టించారు.

బ్రిటీష్ ప్రభుత్వం మౌల్వీ జాఫర్ అలీఖాన్‌ను 1920లో అరెస్టు చేసింది. ఆయనను అష్టదిగ్బంధనం చేయడానికి అసత్య ఆరోపణలతో పకడ్బందీగా కేసును నమోదు చేసింది. ఈ వాతావరణాన్ని గమనించిన ప్రజలు, ఉద్యమకారులు వ్యధ చెందారు. మౌల్వీ జాఫర్ అలీ ఖాన్ గురించి, జమీందార్ పత్రిక భవిష్యత్తుగురించి ఆందోళన వ్యక్తం కాసాగింది. ఆ సమయంలో **నేనున్నా..నేనున్నా** నంటూ బేగం జాఫర్ అలీఖాన్ రంగం మీదకు వచ్చారు. జమీందార్ పత్రిక ప్రచురణ బాధ్యతలను ఆమె స్వీకరించారు.

భారతావని నలుచెరుగులా ఉవ్వెత్తున ఎగసిపడుతున్న ఖిలాఫత్–సహాయ నిరాకరణ ఉద్యమకారులను, ప్రజలను, జమీందార్ పాఠకులను ఉత్తేజపర్చుతూ, ఆమె ఒక ప్రకటన విడుదల చేశారు. ఆ ప్రకటన ఎంతో చారిత్రక ప్రాధాన్యతను సంతరించుకుంది. ఆ ప్రకటన ప్రజలలో జాతీయ భావాలను ప్రజ్వరిల్లచేసి, ఎటువంటి త్యాగాలకైనా వారిని

సిద్ధపడేట్టుగా కార్యోన్ముఖులను చేసి, ఖిలాఫత్ ఉద్యమచరిత్రలో ఎంతో ప్రాధాన్యత సంతరించుకుంది.

ఈ ప్రకటనలో, **నా భర్త మాట, రాత ద్వారా ఎటువంటి అపరాధం చేయలేదు... ఆయన కార్యక్రమాల గురించి, ఆయన లక్ష్యం గురించి, ఆ లక్ష్య సాధనా మార్గం గురించి నాకంటే బాగా ఎరిగిన వారుండరు.. నేరం చేయనివారు నిర్దోషిత్వాన్ని నిరూపించుకోవాల్సిన అవసరం లేదు.... ఆయనకు నేనొక సలహా ఇచ్చాను. బ్రిటీష్ న్యాయస్థానం ఎటువంటి శిక్షనైనా విధించనివ్వండి, అది జైలు శిక్ష, బహిష్కరణ, జీవిత ఖైదు, ద్వీపాంతరవాసం, చివరకు ఉరిశిక్ష అయినా కానివ్వండి, తల వంచాల్సిన అవసరం లేదన్నాను... భగవంతుని మార్గాన, మహమ్మద్ ప్రవక్త చూపిన బాటలో ఎంతటి త్యాగానికైనా సిద్ధం కావాలి. పరీక్షాకాలం చాలా కఠినంగా ఉంటుంది. భగవంతుడి కరుణతో అన్ని అవరోధాలు తొలిగి పోతాయి...భారతదేశంలో సోదర–సోదరీమణులంతా ఖిలాఫత్–సహాయనిరాకరణ ఉద్యమం కోసం ఉద్యమించి, ప్రభుత్వం అనుసరిస్తున్న అణిచివేత విధానాలను వ్యతిరేకించాలి..ఖిలాఫత్ ఉద్యమం ప్రతి ఒక్కరి నుండి అత్యున్నత స్థాయి అర్పణను ఆశిస్తుంది. ఈ ధర్మపోరాటంలో ప్రతి ముస్లిం ధనమాన ప్రాణాలు అర్పించేందుకు సర్వదా సిద్ధంగా ఉండాల్సిన సమయమిది. అంతా కలసి రండి. భగవంతుని అనుగ్రహంతో ఖిలాఫత్‌ను కాపాడుకుందాం**, అంటూ ఆమె పిలుపునిచ్చారు. ఈ పిలుపును 1920 సెప్టెంబరు 24నాటి **జమీందార్** పత్రిక ప్రచురించింది.

బేగం జాఫర్ అలీఖాన్ వ్యక్తంచేసిన దేశభక్తి భావనలు, బ్రిటీష్ ప్రభుత్వం పట్ల వెల్లడించిన అభిప్రాయాలు, బ్రిటీష్ న్యాయస్థానం ఎదుట తలవంచవద్దని, అవసరమైతే జాతిజనుల లక్ష్య సాధన కోసం ప్రాణత్యాగానికి కూడ సిద్ధపడమని భర్తను కోరటం ద్వారా జాతీయోద్యమం–ఖిలాఫత్ పోరాటాల పట్ల ఆమెకున్న దృఢమైన అభిప్రాయం ప్రజలను ఉత్తేజితుల్ని చేసింది. ఈ ప్రకటనలోని వాక్యాలు ఖిలాఫత్ కార్యకర్తలకు, నేతలకు ప్రాణపదమైనాయి.

పరదాల చాటున కుటుంబ జీవనం సాగించే మహిళలలో త్యాగమయ జాతీయ భావనలు ఈ విధంగా స్పష్టం కావటం ప్రజలను ఆశ్చర్యచకితుల్ని చేసింది. ఆమె పిలుపు ఖిలాఫత్ ఉద్యమానికి కొత్త బలాన్ని సమకూర్చి పెట్టింది. ఆమె త్యాగనిరతి, దృఢనిశ్చయం, ఖిలాఫత్ ఉద్యమం పట్ల ఆమె వ్యక్తంచేసిన నిబద్ధతను గమనించిన ఖిలాఫత్ నాయకులు





ఖిలాఫత్ కమిటీలో ఆమెకు ప్రత్యేక స్థానం కల్పించి గౌరవించారు.

ఆ తరువాత 1920 అక్టోబరు15న బేగం జాఫర్ అలీఖాన్ మరొక ప్రకటన జారీ చేసారు. ఈ ప్రకటన ద్వారా ఆమెలో నిబిడీకృతమైన ధైర్యసాహసాలు చాలా స్పష్టంగా బహిర్గతమయ్యాయి. **జమీందార్** లో ప్రచురితమైన ఆ ప్రకటనలో, **పాలకులు ప్రజలకు వ్యతిరేకంగా అన్యాయాలకు, అక్రమాలకు పాల్పడుతూ నియంతల్లా వ్యవహరిస్తుంటే, జనసముదాయాలన్నీ ఏకమై నియంతృత్వశక్తుల మీద విరుచుకుపడాలి...వినాశన మార్గం నుండి మంచి మార్గం వైపుకు పాలకవర్గాలు మళ్ళేంతవరకు ఉద్యమాలు ఉధృతంగా సాగాలి. అంతిమంగా ప్రజలు విజయం సాధిస్తారు. ..మన మాతృభూమి భవిష్యత్తు దృష్ట్యా, మన గౌరవాన్ని కాపాడేందుకు ఈ గడ్డమీది ప్రతి హిందూ–ముస్లిం ఈనాడు భుజం భుజం కలిపి పోరాడాల్సిన బాధ్యత ఉంది. సహాయనిరాకరణ ద్వారా దుష్టపాలకులను నిస్సహాయులనుచేయాలి. ఈ దేశంలోని ప్రతి ఒక్కరూ సహాయ నిరాకరణ చేపట్టినట్టయితే, ఈ దేశం సమస్యలు, ఖిలాఫత్ సమస్య పరిష్కారమైపోతాయి...స్వదేశీ ఉద్యమ ఫలితాలను గమనించండి. మనమంతా విదేశీ వస్తువుల బహిష్కరణను ఉద్యమంగా కొనసాగిస్తే సత్ఫలితాలను పొందగలం...ఈ రోజు నుంచి నేను విదేశీ వస్తువులను, బట్టలను త్యజిస్తున్నాను. నా ప్రాణం పోయినా విదేశీయత నా దేహాన్ని ముట్టుకోనివ్వను. భారత దేశంలో తయారైన బట్టలను, వస్తువులను మాత్రమే వాడుతానని ప్రమాణం చేస్తున్నాను.**, అని ఆమె పేర్కొన్నారు.

ఈ మేరకు ఆమె చేసిన ఆ ప్రమాణానికి బేగం జీవితపర్యంతం కట్టుబడి ఉన్నారు. మౌల్వీ జాఫర్ అలీఖాన్ వెంట ఆమె నిరంతరం నీడలా ఉంటూ స్వాతంత్ర్యోద్యమంలో బేగం జాఫర్ అలీఖాన్ తనదైన భాగస్వామ్యాన్ని అందించి కృతార్థులయ్యారు.

◆◆◆

మీ లాంటి యువకుల్లో రక్తం చల్లబడిపోయింది. మీలో పౌరుషం చచ్చిపోయిందా? మీ రక్తం ప్రతీకార జ్వాలతో వేడెక్కుతుందా? లేదా? మన మోచేతి నీళ్ళు తాగే కుక్కలు మనపై పెత్తనం చలాయిస్తున్నారు. దానిని మనం మౌనంగా భరిస్తున్నాం. మన వీరత్వం, శౌర్య పరాక్రమాలు ఏమైపోయాయి?

**– బేగం అజీజున్**

# ప్రజలలో స్వాతంత్ర్యేచ్ఛను రగిలించిన కవయిత్రి

# జాహిదా ఖాతూన్ షేర్వానియా

**(1894-1922)**

**మా**తృదేశాన్ని పరదేశీయుల పాలన నుండి విముక్తం కావించేందుకు స్వాతంత్ర్యేచ్ఛతో రగిలిపోతున్న అన్ని రంగాలకు చెందిన ప్రజలు విముక్తిపోరాటంలో తమదైన మార్గాలలో సాగారు. ఈ కృషిలో కవులు, కళాకారులు అద్వితీయ పాత్ర వహించారు. బ్రిటీషర్ల దుష్టపాలన మీద ధ్వజమెత్తిన కలం యోధులు, దుర్మార్గపాలనను ఎండగడ్తూ, అందుకు వ్యతిరేకంగా పోరాడాల్సిన అవసరాన్ని వివరిస్తూ ప్రజలను చైతన్యవంతుల్ని చేస్తూ, ఉద్యమకారులను ఉత్సాహపరుస్తూ అక్షరాయుధాలను సృష్టించారు. ఈ దిశగా సాగిన కృషిలో భాగం పంచుకున్న కవులు-కవయిత్రులలో జాహిదా ఖాతూన్ షేర్వానియా ఒకరు.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని అలీఘర్ సమీప గ్రామమైన భిక్కంపూర్‌లో జాహిదా ఖాతూన్ షేర్వానియా 1894 డిసెంబరు 8న జన్మించారు. ఆమె తండ్రి నవాబ్ ముహమ్మద్ ముజ్మిలుల్లా ఖాన్ షేర్వాని. సంపన్నుడు మాత్రమే కాకుండా విద్యావేత్త కూడా అయిన ఆయన అలీఘర్ విశ్వవిద్యాలయం కులపతిగా బాధ్యతలు నిర్వహించారు. చిన్న తనంలోనే తల్లిని కోల్పోయిన జాహిదా ఖాతూన్‌ను అన్నీ తానై పెంచారు. జాహిదా చదువు పట్ల





ఆయన అధిక శ్రద్ధ చూపారు. పలువురు ఉపాధ్యాయులను నియమించి ఇటు సంప్రదాయక విద్య అటు ఆధునిక ఆంగ్ల విద్యలో ఆమెకు ప్రవేశం కల్పించారు.

మంచి గురువుల చలువ వలన ఉత్తమ జ్ఞానాన్ని సంతరించుకున్న ఆమె తనలో దాగి ఉన్న కవయిత్రిని చిన్న వయస్సులోనే ప్రజల ఎదుట సాక్షాత్కరింప చేశారు. స్వంత అభిప్రాయాలను నిర్భయంగా, సాహసోపేతంగా తన కవితల ద్వారా వ్యక్తం చేయటం ఆరంభించారు. **నా కవితల వైపు యావత్తు ప్రపంచం కన్నార్పకుండా చూడాలి. ఆ స్థాయి కవయిత్రుల కోవలో నా కవితా ప్రస్థానం సాగాలి. నన్ను మించిన కవయిత్రి మరొకరు ఉండరాదు,** అని పది సంవత్సరాల వయస్సులో జాహిదా ఖాతూన్ ప్రకటించారు. ఆ ఆకాంక్ష మేర సాగించిన కృషి మూలంగా ఆనాటి కవయిత్రులలో ప్రముఖ స్థానం సంపాదించుకున్నారు.

సమాజాన్ని చదవటం, పరిణామశీలాన్ని అధ్యయనం చేయటం ద్వారా సమకాలీన పరిస్థితులన్నిటి మీద స్పష్టమైన అభిప్రాయాలను ఏర్పర్చుకొని, ఆనాటి అమ్మాయిల తీరు తెన్నులకు భిన్నంగా మార్పు కోసం జాహిదా ఖాతూన్ నడుంకట్టారు. పది సంవత్సరాల వయస్సులో పది దశాబ్దాల వయస్కురాలి పరిపక్వతను తన కవితలలో ప్రతిఫలింప చేశారు. ఆమె క్రమంగా ఎదుగుతూ, సమాజంలోని సనాతన సాంప్రదాయాలకు వ్యతిరేకంగా అక్షరాలను ఆయుధంగా మలచుకుని ఉద్యమించారు. సామాజిక రుగ్మతల నిర్మూలనకు, సామాజిక సంస్కరణకు పూనుకున్నారు. స్త్రీ స్వేచ్ఛకు ప్రాధాన్యతను ఇచ్చారు. పురుషులతోపాటుగా స్త్రీలు కూడా స్వేచ్ఛగా తమ శక్తియుక్తుల మేరకు బాధ్యతలను నిర్వహిస్తూ, హక్కుల సాధన కోసం ఉద్యమించాలన్నారు.

ఆనాడు భారతీయ మహిళల పరిస్థితులను జాహిదా ఖాతూన్ తన కవితలలో ప్రతిఫలింప చేశారు. **భారతీయ మహిళ గురించి రాద్దామని నా కోరిక. నా మనసంతా ఆందోళన. పదాల్ని ఎక్కడ నుండి తేను? నా ఈ దుర్దశ పశ్చాత్తాపానికి గురి చేస్తుందే మోనన్న ఆందోళనే ఎప్పుడూ. నా మాటలు పరాయి పదాలుగా అనిపిస్తుంటే, చెప్పనా? వద్దా? అను సందిగ్ధం..?**, అంటూ రాయడానికి పదాలు దొరకనంతగా మహిళల దుర్దశ ఉందని ఆమె ఆవేదన వ్యక్తంచేశారు. నిజం పలకటం నేరంగా మారిందని, తాను భారతీయురాల్ని కావటం, ముస్లిం కావటం, నిజం పలకటం ద్వారా మరింత నేరస్థురాల్ని అయ్యానని ఆవేదనను వ్యక్తంచేస్తూ, **నేరాలకు ప్రతిరూపాన్ని నేను. నా నేరాల్ని ఎన్నని**

**వర్ణించనూ. ముస్లింను, భారతీయురాల్ని, నిజం పలికేదాన్ని,** అన్నారు. ఈ దిశగా ఆమె రాసిన అనేక కవితలు ఆనాటి ప్రముఖ ఉర్దూ పత్రికలలో ప్రచురితమయ్యాయి.

జాహిదా ఖాతూన్ స్త్రీ విద్యకు అత్యంత ప్రాధాన్యత నిచ్చారు. స్త్రీలు అక్షర జ్ఞానసంపన్నులు కావాలని కలలుగన్నారు. ఆ కలలను సాకారం చేసేందుకు స్త్రీ విద్యను ప్రోత్సహించారు. **ఇల్లాలి చదువు ఇంటికి వెలుగు** అని భావించారు. ఉత్తమ సమాజం విద్యావంతులైన తల్లుల ద్వారా రూపుదిద్దుకుంటుందని దృఢంగా నమ్మారు. స్త్రీలు విద్యావంతులు కావటమే కాకుండా పురుషులతోపాటుగా కూడా రాజకీయ పరిజ్ఞానం కలిగి ఉండాలని ఆకాంక్షించారు. మహిళలు రాజకీయ రంగంలో కూడా రాణించాలన్నారు. అక్షరజ్ఞానం, రాజకీయ చైతన్యం గల మహిళలు మాతృభూమి కోసం త్యాగాలను చేయగల నాయకులను, జాతిజనులకు ఉత్తమ సేవలందించగల పౌరులను రూపొందించగలరని ప్రకటించారు. మహిళలను రాజకీయాలకు దూరంగా ఉంచిన జాతి, సమాజం వెనుకబాటుతనానికి గురవుతుందని ఆమె హెచ్చరించారు.

ఈ విషయాన్ని మరింత విస్తారంగా చెబుతూ, **గొప్ప వ్యక్తుల తల్లులందరూ ఓ ప్రత్యేక మనస్తత్వం కలిగిన మహిళలని మనకు చరిత్ర తెలుపుతుంది. విజేతల తల్లులు ధైర్యవంతులు, సంస్కర్తల అమ్మలు ఆలోచనాపరులు, మహాత్ముల తల్లులు మహనీయులుగా మనకు దర్శనమిస్తారు. వ్యక్తిగతంగా ఒక పురుషుడి నైతికత స్త్రీ ద్వారా రూపుదిద్దుకోవడమో లేక భ్రష్టు పట్టడమో జరుగుతుంది. ఓ జాతి నైతిక విలువలు, సామాజిక ఔన్నత్యం ఆ జాతికి చెందిన తల్లుల మానసిక స్థితితుల మీద ఆధారపడివుంటాయి. రాజకీయ ఔన్నత్యాన్ని గుత్తకు తీసుకున్నామని చెప్పుకునే జాతులను మనం పరిశీలిస్తే ఆ జాతులలోని మహిళలు రాజకీయంగా ఎంత పరిపక్వత కలిగి ఉండేవాళ్ళో, వాళ్ళల్లో మాతృభూమి పట్ల ప్రేమ ఎంత పొంగి పొర్లేదో మనకు అర్థమౌతుంది. పురుషుల అస్తిత్వం తల్లి రూపంలోనూ, ప్రజా సంక్షేమానికి చెందిన ప్రతిశాఖలో బాధ్యతగల పౌరుని రూపంలో జాతికి, దేశానికి భగవంతుడు ప్రసాదించిన ఉత్తమ వరంలా రుజువయ్యింది,** అని జాహిదా ఖాతూన్ షేర్వానియా అన్నారు. (Bharath Ke Swatantra Samgram me Muslim Mahilavonka Yogdan : Page.182)

విద్యారంగంలో ముస్లిం మహిళల స్థాయి అధమంగా ఉన్న విషయం మీద ఆవేదన వ్యక్తం చేసిన జాహిదా ఖాతూన్ ఎంతో బాధపడ్డారు. ఆ స్థితి పట్ల బాధను





వ్యక్తం చేయటంతో ఆమె ఊరుకోలేదు. ఈ స్థితికి గల కారణాలను కూడా ఆమె చాలా వివరంగా విశ్లేషించారు. ఈ దుస్థితికి కొందరు ముస్లిం మత పెద్దలు కారణమని ఆమె ఆగ్రహించారు. ఈ విషయం గురించి రాస్తూ, **ముస్లిం మత పెద్దల తప్పు వొకటే. తమ స్త్రీలను చదువు సంధ్యల్లేని వాళ్ళుగా వుంచారు. లేకుంటే చదివించినా రాజకీయ కార్యక్రమాలకు పూర్తిగా దూరంగా వుంచారు. జాతి తల్లులలో రాజకీయ పరిజ్ఞానం లేనందున జాతి జనులలో కూడా రాజకీయాల పట్ల సరైన అవగాహనకు ఆస్కారం లేకుండా పోయింది. అందుచేత అవమానకరమైన, దయనీయమైన ఆహారంతో కడుపు నింపుకుని ఉన్నట్టయితే మీ ఆ చేష్టలకు ముగింపు పలికి భవిష్యత్తు గురించి జాగ్రత్త వహించండి. మీ చర్యల వలన కలిగిన నష్టాన్ని భర్తీ చేసుకోడానికి మార్గం వొక్కటే. అది మీ స్త్రీలను విద్యావంతుల్ని చేయడం. విజ్ఞానార్జన ద్వారా సరైన రాజకీయ దృక్పథం, మంచి అవగాహన వారిలో కలుగచేయడం. ఆ అవకాశాలను వారికి కల్పించటం.**' అని జాహిదా ఖాతూన్ షేర్వానియా సలహా ఇచ్చారు. (Ibid, Page.182)

ఆనాటి సామాజిక పరిస్థితులలో ఓ కులీన కుటుంబం నుండి విచ్చేసిన మహిళ కవిత్వం చెప్పటం మాత్రమే కాకుండా స్త్రీవిద్య కోసం, రాజకీయరంగంలో స్త్రీల ప్రవేశం కోసం పోరాడటం, ఆ రంగాలలో మహిళల వెనుకబాటుతనానికి ముస్లిం పెద్దలను బాధ్యుల్ని చేయటం, ఆ పెద్దల చర్యలను తప్పుపట్టడం, ఆ తప్పులను దిద్దుకోవాల్సిందిగా పెద్దలకు సలహా ఇవ్వటం నిజంగా సాహసం.

ఈ మేరకు తాను నమ్మిన విషయాన్ని స్పష్టంగానూ, ధైర్యంగానూ ప్రకటించటంలో ఆమె ఏనాడు వెనుకాడలేదు. ముస్లిం మహిళలు ధరిస్తున్న పర్దా విధానం సరైనది కాదంటూ, **డాక్టర్లు అంటున్నారు బంధనాల నుండి బయట పడండి – గాలిని ప్రవేశింపనివ్వండని. సంకుచిత స్వభావులు అంటున్నారు. ససేమిరా వద్దు చావనివ్వండని,** అని ఓ కవితలో అన్నారు. జాహిదా ఖాతూన్ పర్దా పద్ధతిక పూర్తిగా వ్యతిరేకం కాకున్నా అనారోగ్య హేతువైన రీతిలో పర్దాను ధరించడాన్ని మాత్రం వ్యతిరేకించారు. (Ibid, Page.180)

విద్యాభ్యాసం పట్ల అధిక మక్కువ చూపిన ఆమె జ్ఞానార్జనకు విద్యాభ్యాసం మాత్రమే మార్గమని భావించినందున అందుకు వ్యతిరేకాంశాలతో ఏమాత్రం ఏకీభవించ లేదు. సహాయ నిరాకరణ ఉద్యమంలో భాగంగా ప్రభుత్వ గ్రాంటులతో నడుస్తున్న

విద్యాలయాలను విడిచి విద్యార్థులు బయటకు రావాలని మహాత్మా గాంధీ పిలుపునిచ్చినప్పుడు ఆ నిర్ణయం ఆమెకు నచ్చలేదు. విద్యాభ్యాసం చేయాల్సిన విద్యార్థులు విద్యాలయాలు బహిష్కరిస్తే వారి చదువు ఎలా సాగుతుందని ఆమె ప్రశ్నించారు. ఈ విషయం గురించి మాట్లాడుతూ, **సహాయ నిరాకరణోద్యమం ఆచరణలోని కొన్ని అంశాల్ని నేను వ్యతిరేకిస్తున్నాను. ఉద్యమంలో భాగంగా చదువులు మానేయడం నాకిష్టం లేదు,** అని బాహటంగా కళాశాలల బహిష్కరణకు ఆమె వ్యతిరేకత వ్యక్తం చేశారు.

చిత్తశుద్ధి కరువైన స్వార్థపూరిత రాజకీయాలు, ఆ మార్గాన నడిచే రాజకీయ నాయకుల చర్యల పట్ల కూడా ఆమె ఆగ్రహం వ్యక్తం చేశారు. **మన రాజకీయ నాయకులు జనాన్ని తమ గుప్పెట్లో ఉంచుకునే మంత్రంగా, పేరు ప్రతిష్టల్ని పొందే చిట్కాగా, వెండి బంగారాన్ని సమకూర్చి పెట్టగల ఊటబావిలా భావించి రాజకీయాల్ని స్వీకరిస్తున్నారు. ఆ కారణంగా విశ్వమానవాళి హృదయాల నుండి మన స్థానం దిగజారిపోతుంది,** అంటూ స్వార్థపరులైన రాజకీయ నాయకుల వ్యవహార సరళి మీద ఆమె అక్షరాయుధంతో విరుచుకు పడ్డారు. ఆనాడు ఆమె సంధించిన విమర్శనాస్త్రాలు ఈనాటి రాజకీయాలకు కూడా వర్తించటం ఆమెలోని దార్శనికతకు అద్దం పడుతుంది.

స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల కోసం సాగుతున్న జాతీయోద్యమంలో మహిళలు అధిక సంఖ్యలో పాల్గొనాలని ఆమె కోరారు. ఉద్యమించమని మహిళలను స్వయంగా కోరారు. ప్రజలకు స్వతంత్ర జీవన అవకాశాలను కల్పించేందుకు స్వాతంత్ర్యసమరంలో కలసికట్టుగా పాల్గొనాలని జాహిదా ఖాతూన్ ఉద్బోధించారు. మతాలకు అతీతంగా ప్రతిఒక్కరూ ఉమ్మడిగా ముందుకు సాగాలని సూచించారు. హిందూ-ముస్లింల ఐక్యత అత్యంత అవశ్యం అన్నారు. ఆయా జనసముదాయాల మధ్యన అపార్థాలను దూరం చేసి సద్భావన, సదవగాహన ఏర్పచేందుకు జాహిదా ఖాతూన్ నిరంతరం శ్రమించారు.

భారత స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా జరిగిన ప్రతి ఉద్యమం,సంఘటన మీద జాహిదా ఖాతూన్ షేర్వానియా కవితలు రాశారు. అభిప్రాయాలను వ్యక్తం చేశారు. బాల్కన్ యుద్ధం, ప్రథమ ప్రపంచ యుద్ధం, జలియన్‌వాలా బాగ్, కాన్పూరు మసీదు కేసు తదితర దుస్సంఘటనల మీద ఆమె తనవైన కవితలతో ప్రతిస్పందించారు. ఈ మేరకు తమ కవితలతో బ్రిటీషు ప్రభుత్వ చర్యల మీద విమర్శనాస్త్రాలు సంధించిన కవయిత్రిగా ప్రజల మనస్సులలో మాత్రమే కాకుండా స్వాతంత్ర్యోద్యమం సాహిత్య చరిత్రలో





ఆమె ప్రత్యేక స్థానం సంపాదించుకున్నారు.

ప్రజల మీద బ్రిటీష్ ప్రభుత్వం సాగించిన ప్రతి జులుం మీద ఆమె తన కవితలతో దాడులు చేశారు. ప్రభుత్వ చర్యలను నిర్భయంగా నిరసించారు. ప్రభుత్వ చర్యల మీద విమర్శలు చేస్తున్న కవులు రాసిన కవితలను, ఆ రచనలను ప్రచురిస్తున్న పత్రికల మీద ప్రభుత్వం దాడులు చేసినప్పుడు, ఆయా పత్రికలకు, పత్రికా సంపాదకులకు ఆమె అండగా నిలిచారు. జాతీయ భావాలను ప్రచారం చేస్తున్న పత్రికల మనుగడ కోసం అవసరమగు ఆర్థికతను అందించడానికి ఎంతో శ్రమించారు. ప్రభుత్వ ఆగ్రహానికి గురైన పత్రికల ఆస్థిపాస్తులను అధికారులు జప్తు చేసి, పత్రికల సంపాదకులను వీధుల్లో పడేసినప్పుడు వారికి తగిన విధంగా స్వయంగా సహయ,సహకారాలు అందించి పత్రికా స్వేచ్ఛ పట్ల తనకున్న గౌరవాన్ని వ్యక్తం చేశారు.

కవయిత్రిగా, సంస్కరణవాదిగా జాహిదా ఖాతూన్ ప్రముఖ కవి పండితుల, పాఠకుల ఆశీస్సులతో పాటుగా, ప్రజల అపార ప్రేమాభిమానాలను అందుకున్నారు. పేరు ప్రతిష్టల కోసం ఆమె ఎన్నడూ ప్రాకులాడలేదు. ఆమె ఎన్నడూ తన పేరును ప్రకటించలేదు. **జాహిదా , నుజహత్** ' అను కలం పేర్లతో ఆమె కవిత్వం సాగింది. (Encyclopadia of Women Biography, Ed. by Nagendra.K.Singh, APHPC,New Delhi, 2001,Page.484) మహిళల స్వేచ్ఛా,స్వాతంత్ర్యాల కోసం మాత్రమే కాకుండా వలసపాలకుల దుష్టపాలన నుండి ప్రజల విముక్తిని ఆకాంక్షించిన ప్రముఖ కవయిత్రిగా స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ప్రత్యేక స్థానం ఏర్పర్చుకున్నారు. ప్రముఖ జాతీయోద్యమకారుల సంపాదకత్వంలో నడుస్తున్న, **జమీందార్**, **అల్ హిలాల్**, **కామ్రేడ్** లాంటి పత్రికలతో పాటుగా ఆనాటి ఇతర ప్రముఖ పత్రికలలో ఆమె కవిత్వం చోటు చేసుకుంది.

స్వేచ్ఛ, స్వాతంత్ర్యేచ్ఛ, ప్రగతిశీల భావాలు, సంస్కరణల కోసం సాగిస్తున్న పోరాటం, ఛాందస భావాల మీద ప్రకటించిన యుద్ధం, స్వార్థ రాజకీయాల మీద ఆమె సంధించిన విమర్శనాస్త్రాల తీవ్రతను గమనించిన ప్రముఖ ఉర్దూ కవి అక్బర్ అల్హాబాది ఆమె కవితల గొప్పదనం గురించి మాట్లాడుతూ, **ఒక వేళ ఈ కవితలను ఓ మహిళ రచిస్తున్నట్టయితే, ఇక కవిత్వం మీద పురుషులు తమ ఆధిపత్యం వదులుకోవాల్సిందే**, అని వ్యాఖ్యానించటం ధైర్యశాలిగా, ఉత్తమ కవయిత్రిగా ఆమె స్థాయిని, స్థానాన్ని వెల్లడి చేస్తుంది. ఆమె రాసిన కవితలలో కొన్ని Aina-i-Haram,

Firdus-i-Takhiyyul పేర్లతో సంకలనాలుగా ఆమె మరణాంతరం ప్రచురితమయ్యాయి. (Who's who of Indian Writers, Sahithya Akademi, New Delhi, 1961)

జాహిదా ఖాతూన్ కవయిత్రిగా కవితలతో ఉద్యమకారులను ఉత్తేజపర్చటం, మార్గదర్శకం చేయటం మాత్రమే కాకుండా స్వయంగా ఉద్యమ కార్యక్రమాలలో కూడా పాల్గొన్నారు. బెంగాల్ విభజన, స్వదేశీ ఆందోళన, సహాయ నిరాకరణ ఉద్యమాలలో భాగస్వామ్యాన్ని అందించారు. స్వదేశీ ఉద్యమంలో చురుకైన పాత్ర నిర్వహించారు. ఖద్దరు ధరించమని ఇతరులను కోరటం మాత్రమే కాకుండా, స్వజనుల వ్యతిరేకతను ఖాతరు చేయకుండా తాను స్వయంగా ఖద్దరును ఎంతగానో ఇష్టపడ్డారు. ఈ విషయమై ఆమె మాట్లాడుతూ, **స్వదేశీ ఉద్యమం అంటే నాకు చచ్చేంత ప్రేమ. ఇవాళే కాదు. తొలినాటి నుంచి కూడా. ఇక ప్రస్తుత సంఘటన వల్ల విదేశీ వస్తువుల పట్ల భరించలేని వ్యతిరేకత ఏర్పడింది. అసహ్యం పుట్టింది. ఇక ముందు ఎన్నడూ విదేశీ వస్త్రాన్ని కొనరాదని నిర్ణయించుకున్నాను,** అని ప్రకటించారు.

ఈ మేరకు తన అభిప్రాయాన్ని వ్యక్తం చేయటం మాత్రమే కాకుండా ఖద్దరు ధారణ నిమిత్తం తనకు తానుగా ఆమె ఖద్దరు వస్త్రాలను కొనుగోలు చేశారు. ఆ దుస్తులను జీవితాంతం ధరించాలని ఎంతో ముచ్చటపడ్డారు. దురదృష్టం ఏమిటంటే ఆమె స్వయంగా కొనుగోలు చేసిన ఖద్దరు వస్త్రాలు ఆమె ధరించలేకపోయారు. ఆ ఖద్దరు దుస్తులు ఆమె మృతదేహాన్ని మాత్రమే అలంకరించాయి. ఖద్దరు వస్త్రాలు ధరించాలన్న నిర్ణయం తీసుకున్న 11 రోజులు వ్యవధిలో 1922 ఫిబ్రవరి 4న ఆకస్మికంగా తన 29 సంవత్సరాల వయస్సులో అవివాహితగా ఆమె కన్నుమూశారు.

ఆ సమయంలో ఆమె కొనుగోలు చేసిన ఖద్దరు వస్త్రాలను ఆమె సోదరుడు దావూద్ అహమ్మద్ ఖాన్ ఆమె భౌతికాయం మీద పరచి ఆమె అభిమతాన్ని ఆవిధంగా గౌరవిస్తూ జాహిదా ఖాతూన్ షేర్వానియా కోర్కెను నెరవేర్చారు.

◆◆◆

> భారతదేశపు కుక్కలు, పిల్లులు కూడా బ్రిటీషర్ల బానిసత్వపు సంకెళ్ళలో బందీలుగా ఉండ రాదన్నది నా అభిమతం. **– ఆబాది బానో బేగం**



## విదేశీ వస్తు బహిష్కరణ ఉద్యమకారిణి

# ఇస్మత్ ఆరా బేగం

**మా**తృభూమి విముక్తి పోరాటం పట్ల నిబద్ధత, కార్యచరణలో నిజాయితి గల నేతల చర్యలు ఆనాడు ప్రజలను బాగా ప్రభావితం చేశాయి. ఆ ప్రభావంలో పడ్డ ప్రజలు తమ సర్వం త్యాగం చేయడానికి, ఉద్యమబాట నడిచేందుకు ఏ మాత్రం వెనుకాడలేదు. ఆ విధంగా ఉద్యమకారులను ఉత్తేజితులను చేస్తూ ఉద్యమించిన యువతులలో ఒకరు ఇస్మత్ ఆరా బేగం.

ఆమె ప్రముఖ జాతీయోద్యమ నాయకులు, లక్నోలోని ప్రసిద్ధ వైద్యులు హకీం అబ్దుల్ మేనకోడలు. ఖిలాఫత్ ఉద్యమం సందర్భంగా అలీ సోదరులు విరాళాల కోసం లక్నో వచ్చారు. ఖిలాఫత్ ఉద్యమం కోసం విరాళాలు అందిచమని ఆ నేతలు కోరగా ప్రజలు బాగా స్పందించారు. అక్కడిక్కడే మహిళలు తమ వంటి మీదున్న ఆభరణాలను వారికి అందచేశారు. ఆ దృశ్యం హకీం అబ్దుల్‌ను కదలించి వేసింది.

ఆయన బిరబిరా ఇంటికి వచ్చారు. ఇస్మత్ ఆరాను పిలిచి విషయం చెప్పారు. ఆ వివరాలు తెలుసుకున్న ఆమె తమ ఇంటిలోని మహిళలందర్ని సమావేశపర్చి ఖిలాఫత్–సహాయ నిరాకరణ ఉద్యమ కార్యాచరణ తమ ఇంటి నుండి ఆరంభించాలన్నారు. అలీ సోదరుల తల్లి బీబి అమ్మతో కలసి, మాతృదేశ సేవలో పునీతం కావల్సిన అవసరాన్ని ఉత్తేజపూరితంగా వివరించారు.

ఆ ప్రసంగంతో ఉత్తేజితులైన ఇస్మత్ అరా కుటుంబీకులు సర్వం త్యాగం చేయడానికి ముందుకు వచ్చారు. ఆమె ముందుగా తన పెండ్లినాటి ఖరీదైన ఆభరణాలన్నింటిని తెచ్చి గుట్టగా పోసి బీబీ అమ్మకు విరాళంగా అందజేశారు. ఆ తరువాత పుట్టింటి వారు సారెగా పంపిన అతి ఖరీదైన విదేశీ వస్త్రాలన్నిటిని తెచ్చి పోగేసి స్వయంగా తగులబెట్టారు. ఆమెను కుటుంబీకులంతా అనుసరించారు. వారితో ఇరుగుపొరుగు జత కలవటంతో ఆ ఇంట విదేశీ వస్త్రాల దహనం జరిగింది. ఆ చర్యతో విదేశీవస్తు బహిష్కరణ ఉద్యమకారిణిగా ఇస్మత్ ఆరా బేగం లక్నోలో అందరికి ఆదర్శంగా నిలిచారు.

◆◆◆



## జాతీయోద్యమకారులచే 'అమ్మ' గా పిలిపించుకున్న

# ఆబాది బానో బేగం

**(1852-1924)**

**జా**తీయోద్యమంలో పురుషులతోపాటు మహిళలు కూడా అద్వితీయమైన భాగస్వామ్యాన్ని అందించారు. బ్రిటీషు ప్రభుత్వ దాష్టీకాలకు వ్యతిరేకంగా పోరుబాటలో సాగిన మహిళలు ఉద్యమకారులలో ఉత్తేజాన్ని కలిగించటమే కాకుండా, నిర్భయంగా ముందుకు సాగమని ప్రోత్సహించారు. ఆనాటి తొలితరం మహిళలలో శ్రీమతి ఆబాది బానో బేగం అగ్రగణ్యురాలు. ఆమె ఎంతో ఉత్సాహంతో ఉద్యమ కార్యక్రమాలలో క్రియాశీలక పాత్ర వహించటం వలన ఆమె నుండి ప్రేరణ పొందిన జాతీయోద్యమకారులు ఎంతో ప్రేమతో **బీబీ అమ్మ** అని ఆమెను పిలుచుకున్నారు.

ఆబాది బానో బేగం ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం మొరాదాబాద్ జిల్లా అమ్రోహా గ్రామంలో 1852లో జన్మించారు. ఆమెకు రాంపూర్ సంస్థానానికి చెందిన అబ్దుల్ అలీ ఖాన్‌తో వివాహం జరిగింది. అత్తవారింట ఆమె ఉర్దూ నేర్చుకున్నారు. ఉర్దూ, పర్షియన్ భాషల లిపి ఒక్కటే కావటం, ఆ లిపులు అరబ్బీ భాషకు దగ్గరగా ఉండటంతో చిన్ననాటనే ఖురాన్ గ్రంథాన్ని పఠించటం వలన లిపులను గుర్తించటం ఆమెకు సులువైంది. మంచి ధారణశక్తి గల ఆమె ఉర్దూ, పర్షియన్ భాషల లిపులను సునాయాసంగా





గుర్తుపట్టగలగటంతో, తన మరిది కుమారుని ద్వారా రహస్యంగా ఉర్దూ పుస్తకాలలోని కథలను చదివి విన్పించుకుని, ఉర్దూ అక్షరాలను గుర్తుపడుతూ ఉర్దూ భాషతోపాటు పర్షియన్ భాషను కూడా నేర్చుకున్నారు. ఈ భాషలను చదవటం తప్ప రాయటం ఆమెకు కుదరక పోయినా, సృజనశీలి అయిన ఆమె కథలల్లటంలో మంచి నేర్పును సాధించారు. ('She had learned Quran as a child and thus knew the Arabic script in a rudimentary fashion. She taught herself to read Urdu by asking a nephew to read to her from a book of stories, committing it to memory, and reading them it herself, partly from memory and partly by sounding out the letters--since the script for Persian and Urdu is only slightly different from that of Arabic, She could read, therefore, and in addition was a great story teller, but never learned to write'. - Secluded Scholars, Gail Minault, OUP, New Delhi, 1999, Page. 26)

ఆబాది బానో 27 సంవత్సరాల వయస్సులో భర్తను కోల్పోయారు. ఆనాటికి ఆమె ఐదుగురు మగపిల్లలు, ఓ ఆడపిల్లకు తల్లి. పునర్వివాహం చేసుకోవాల్సిందిగా బంధుమిత్రులు సలహా ఇచ్చారు. ఆ సలహాలను కాదంటూ బిడ్డలను ప్రయోజకులుగా తీర్చిదిద్దేందుకు తన్నుతాను అంకితం చేసుకున్నారు. ఆమె తన పేరును ఎక్కడ ప్రస్తావించాల్సి వచ్చినా **అబాది బానొ అబ్దుల్ అలీ బేగం** అని భర్త పేరుతో కలిపి రాయటం భర్త పట్ల ఆమెకు గల ప్రేమానురాగాలకు చిహ్నం. ఆ కారణంగా పునర్వివాహం గురించి తన వద్ద మరెవ్వరూ ప్రస్తావించరాదని బంధువులను వారించారు. బిడ్డల భవిష్యత్తు మీద దృష్టి సారించి, వారిని దేశభక్తులుగా, ధార్మిక నిష్ఠాగరిష్టులుగా, ప్రఖ్యాతి గాంచిన మేధావులుగా రూపొందించటంలో కృతకృత్యులయ్యారు.

ఆనాటి ముస్లిం సమాజంలోని సామాజిక-ధార్మిక బంధనాలకు భిన్నంగా మారుతున్న కాలానుగుణంగా బిడ్డలకు మంచి చదువు చెప్పించాలని ఆమె నిర్ణయించారు. పరుగులెత్తుతున్న కాలాన్ని బట్టి మారనట్టయితే బ్రతుకు పోరాటంలో వెనుకబడి పోతామన్న భావనతో తన బిడ్డలకు సాంప్రదాయ-ధార్మిక విద్యతోపాటుగా ఆధునిక ఆంగ్ల విద్య గరిపారు. ఆనాటి ప్రసిద్ధ అలీఘర్ విద్యాలయంలో చదువు చెప్పించారు. స్వదేశంలో విద్యాభ్యాసం తరువాత ఉన్నత విద్యకోసం బిడ్డలను ఇంగ్లాండ్ పంపారు. ఈ విధంగా ఆమె ఉన్నత విద్యకోసం బిడ్డలను విదేశాలకు పంపిన రాంపూరు నగరంలోని తొలి మహిళయ్యారు. భారత జాతీయోద్యమ చరిత్రలో **అలీ సోదరులు** గా ప్రఖ్యాతి చెందిన మౌలానా షౌకత్ అలీ, మౌలానా ముహమ్మద్ అలీలు ఆమె బిడ్డలు.

('..She sent her son first to Bareilly and then to Aligarh for studies, even though orthodox Muslims were deadly against English education in those days. She was perhaps, the first Muslim woman in the town who sent her boy for education in English.' - Encyclopaedia of Women Biography, Vol. one, Edited by Nagendra.K.Singh, APPHPC, New Delhi, 2001, Page.4)

ఆమె పెద్దగా చదువుకోనప్పటికి చక్కని లౌకిక జ్ఞానం, సమాజం తీరు,తెన్నులను అవగాహన చేసుకోగల పరిజ్ఞానం, సమర్ధత కలిగియుండి కుటుంబం ఆస్థిపాస్తులను, వ్యవహారాలను జాగ్రత్తగా నిర్వహించారు. బిడ్డల చదువుకు డబ్బు కావాల్సివస్తే, తన వ్యక్తిగత ఆభరణాలను రహస్యంగా కుదవ పెట్టి అవసరాన్ని అధిగమించారు తప్ప, ఆస్తిని విక్రయించ అంగీకరించలేదు.

అబాది బానో రాజకీయ జీవితం ప్రథమ ప్రపంచ యుద్ధసమయంలో ఆరంభమైంది. ఆ సమయంలో డాక్టర్ అనీబిసెంట్, గోపాల కృష్ణ గోఖలే ప్రారంభించిన **హోంరూల్ ఉద్యమం** లో ఆమె పాల్గొన్నారు. ఈ ఉద్యమం మరింతగా విస్తరించేందుకు హార్థిక, ఆర్థిక సహాయ సహకారాలను అందించటమే కాకుండా, తన కుటుంబం యావత్తు ఆ దిశగా సాగిన కార్యక్రమాలలో నిమగ్నమయ్యింది. ఉద్యమం పట్ల నిబద్ధత గల ఉద్యమకారిణిగా ఆమెకు చాలా స్పష్టమైన అభిప్రాయాలున్నాయి. **అభిప్రాయాలను కలిగి ఉండటం మాత్రమే కాదు, అవసరం వస్తే ఆ అభిప్రాయాలను ఎలుగెత్తి చాటాలి, అనుసరించాలని** ఆమె ప్రకటించారు.

డాక్టర్ అనీబిసెంట్ మార్గంలో హోంరూల్ ఉద్యమంలో పాల్గొని జైళ్ళ పాలవుతున్న ఉద్యమకారుల పరిస్థితుల దృష్ట్యా వారి కుటుంబాలు ఆకలితో అలమటించకుండా ఆదుకోవాల్సిన అవసరాన్ని గుర్తెరిగి ఆ దిశగా అబాది బానో ఎంతో కృషి సల్పారు. అలీ సోదరులు జైళ్ళ పాలయ్యి, ఆస్తులను అమ్ముకుని, కుటుంబం గడవటమే కష్టంగా మారి, పలు ఆర్థిక ఇబ్బందులను ఎదుర్కొంటూ కూడా ఆమె, ఆమె కుటుంబీకులు ఉద్యమకారుల కుటుంబాలను ఆదుకునేందుకు, ఉద్యమకార్యక్రమాల నిర్వహణకు **హోం రూల్ ఫండ్** సమకూర్చి పంపారు. ఆ ఉద్యమాన్ని నీరుకార్చేందుకు హోం రూల్ పతాకాన్ని పోలీసులు ధ్వంసం చేసిన సందర్భంగా ఆమె నిశితంగా విమర్శించారు. ఈ సందర్భంగా, **వైధవ్యం అనుభవిస్తున్న నేను తెల్ల వస్త్రాలు ధరించటం కాకుండా, పలు రంగులు గల హోంరూల్**





**పతాకాన్ని ధరిస్తాను, ఇదేదో ప్రదర్శనకు కాదు, నా ఆశయాలు,అభిప్రాయాలను వ్యక్తం చేయటంలో ఏమాత్రం సిగ్గుపడాల్సింది లేదనడానికి మాత్రమేనని** ఆమె స్పష్టం చేశారు. **ఒక్క పతాకాన్ని పోలీసులు ధ్వంసం చేస్తే ఏమౌతుంది. వందల వేల పతాకాలు ప్రతి ఉద్యమకారుడి ఇంట రెపరెపలాడుతాయి** అని ఆమె బ్రిటీషు పోలీసులకు సవాల్ విసిరారు. (Bharath Ke Swatantra Samgram me Muslim Mahilvonka Yogdan , Dr.Abida Samiuddin, IOS, New Delhi,1997, Page. 55-59)

ప్రథమ ప్రపంచ యుద్ధం జరుగుతున్న నేపథ్యంలో ఉద్యమకారులను అణిచి వేసేందుకు బ్రిటీష్ ప్రభుత్వం తెచ్చిన **ఇండియన్ డిఫెన్స్ రెగ్యులేషన్స్** స్వాతంత్ర్య సమర యోధుల పాలిట ప్రాణాంతకమైనాయి. బ్రిటీష్ ప్రభుత్వం పోకడలను నిరసిస్తున్న మౌలానా ముహమ్మద్ అలీ బ్రిటీష్ పాలకుల మీద చేసిన విమర్శనాత్మక వ్యాఖ్యలను పురస్కరించుకుని అలీ సోదరులను చిందన్‌వాడ గ్రామంలో నిర్బంధించి, ఆ ఊరు దాటి వెళ్లరాదని ప్రభుత్వం ఆంక్షలు విధించింది. ఆ సందర్భంగా ఆమె కూడా స్వచ్ఛందంగా అలీ సోదరులతో కలసి చిందన్‌వాడ వెళ్లారు. ప్రభుత్వ చర్యలను విమర్శిస్తూనే తన దేశం కోసం, జాతి జనుల కోసం నిర్బంధాలను భరించాల్సిరావటం నిజంగా భగవంతుడిచ్చిన వరంగా ఆమె భావించారు. ఈ సందర్భంగా **మాతృదేశం, జాతి జనుల కోసం కష్టనష్టాలను భరించేందుకు భగవంతుడి ఎంపిక** (తన బిడ్డలను ఎంపిక చేయడం) **నిజంగా గర్వించదగిన విషయం** అని ఆమె ఆనందం వ్యక్తంచేశారు.

అలీ సోదరులు నిర్బంధంలో ఉండగా బ్రిటీషు ప్రభుత్వం అలీ సోదరుల వద్దకు లొంగుబాటు ప్రతిపాదన పంపింది. ఆ ప్రతిపాదన ప్రకారంగా అలీ సోదరులు ప్రభుత్వానికి బేషరతు లొంగిపోవాలి, భవిష్యత్తులో రాజకీయాలలో పాల్గొనరాదు. ఆ ప్రతిపాదన తెచ్చిన పోలీసు ఉన్నతాధికారి లొంగుబాటు పత్రంలోని అంశాలను అలీ సోదరులకు తెలుపుతున్నప్పుడు పక్కగదిలో కూర్చోని ఆమె విషయం తెలుసుకున్నారు. ప్రభుత్వం ప్రతిపాదనలు విన్నాక పర్దా ధరించి అలీ సోదరులు, ప్రభుత్వాధికారులు కూర్చోని ఉన్న గదిలోకి విసవిసా వచ్చారు. గదిలోకి వచ్చి రాగానే, పోలీసు ఉన్నతాధికారితో నేరుగా మాట్లాడుతూ **నా బిడ్డలు స్వేచ్ఛను కోల్పోయేందుకు ఇష్టపడరు. ప్రభుత్వ ప్రతిపాదనలను అంగీకరిస్తే మా వెతలన్నీ తీరుతాయి. ఆ వెతల నుండి విముక్తి కోసం, మా ధార్మిక విలువలకు, మా దేశ ప్రయోజనాలకు విరుద్ధంగా నా బిడ్డలు ప్రభుత్వ ప్రతిపాదనలను**



**కుమారులు అలీ సోదరులతో ఆబాది బానో బేగం**

**అంగీకరించరు. ఒక వేళ అంగీకరిస్తే నిస్సందేహంగా అటువంటి బిడ్డల గొంతును నేనే స్వయంగా పిసికి చంపేస్తాను. ఈ మహత్తర కర్తవ్య నిర్వహణకు భగవంతుడు ఈ వృద్ధురాలి హస్తాలకు అంతటి శక్తిని తప్పక ఇస్తాడు** అని ఆమె గర్జించారు. ఆమె అంతటితో ఆగలేదు. '**ఈ విషయాలను మా సమాధానంగా, మీ ప్రతిపాదనలకు మా తిరస్కారంగా ప్రభుత్వానికి తెలియచేయండి**' అని ఆబాది బానో పోలీసు ఉన్నతాధికారులను కోరారు. మాతృభూమి సేవ చేసుకునేందుకు భగవంతుడు ప్రసాదించిన మహత్తర భాగ్యాన్ని ఎటువంటి అవాంతరాలు ఎదురైనా మరెన్ని కష్టనష్టాలు కలసివచ్చి పడినా వదలుకునేది లేదని ఆమె నిర్ద్వంద్వంగా ప్రకటించారు. (Bharath Ke Swatantra Samgram me Muslim Mahilavonka Yogdan, Page. 61-63)

1917లో ఆబాది బానో మొట్టమొదటిసారిగా గాంధీజీని కలిసారు. ఆ తరువాత అలీ సోదరులకు గాంధీజీకి మధ్యన ప్రగాఢ స్నేహబంధం ఏర్పడింది. అలీ సోదరులతో పాటుగా తనను కూడా ఆమె కన్నబిడ్డలా చూసుకున్నారని గాంధీజీ తన **యంగ్ ఇండియా** పత్రికలో, మిత్రులకు రాసిన లేఖలలో స్వయంగా పేర్కొని ఆమె పట్ల గౌరవభావాన్ని ప్రకటించారు. అంతేకాదు అలీ సోదరులతో కలసి ఆమెకు తాము ముగ్గురు కుమారులమని గాంధీజీ అన్నారు. ఆమె అభిప్రాయాలకు ఆయన అత్యంత ప్రాముఖ్యత నిచ్చారు.





జాతీయ కాంగ్రెస్ కలకత్తా నగరంలో జరిపిన సమావేశాలకు బీబీ అమ్మ హాజరయ్యారు. ఈ సమావేశంలో, స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలకోసం హిందూ-ముస్లింలు కలసి మెలసి పోరాడాలని పిలుపునిస్తూ, ఐక్యత ద్వారా మాత్రమే భారతీయులు స్వేచ్ఛ పొందగలరని ఉద్ఘాటించారు. జీవన ప్రయాణంలో భగవంతునికి తప్ప మరెవ్వరికీ తలవంచేది లేదన్నారు. భారత ప్రభుత్వ కార్యదర్శిని కలిసే ప్రతినిధి బృందంలో చేరాల్సిందిగా ఆమెకు ఆహ్వానం వచ్చింది. ఆ ఆహ్వానాన్ని ఆమె తిరస్కరిస్తూ పరాయి పాలకుల వద్దకు **నేను బిచ్చగత్తెగా రాలేనని** అన్నారు. 1917డిసెంబరులో కలకత్తా నగరంలో జరిగిన అఖిల భారత ముస్లిం లీగ్ మహాసభలకు హాజరైన ఆమె, హిందూ-ముస్లింల ఐక్యతావశ్యకతను వివరిస్తూ ఉత్తేజపూరిత ప్రసంగం చేశారు. ప్రజలు మత విద్వేషాలను విడనాడి ఇస్లాం ప్రబోధించిన, మహమ్మద్ ప్రవక్త చూపిన శాంతి-సామరస్య మార్గాన ప్రయాణించాలని ముస్లింలను కోరారు.

ప్రపంచ ముస్లిములు ధార్మికంగా గౌరవించే ఖలీఫా పదవిని బ్రిటీష్ ప్రభుత్వం రద్దు చేయటంతో రగిలిన ఆగ్రహజ్వాలల ఫలితంగా ఇండియాలో రూపుదిద్దుకున్న **ఖిలాఫత్ ఉద్యమం** లో ఆబాది బానో క్రియాశీలక పాత్ర పోషించారు. ఈ సందర్భంగా అరెస్టులను, అవరోధాలను ఆమె లెక్కచేయలేదు. ఆమె కుటుంబ సభ్యులంతా ఖిలాఫత్ ఉద్యమానికి పూర్తిగా అంకితమయ్యారు. అనర్గళ ప్రసంగాలతో, నిస్వార్థం, నిబద్ధతతో కూడిన త్యాగమయ జీవిత విధానంతో, లక్ష్యసాధన పట్ల పరిపూర్ణ అంకిత భావంతో వ్యవహరిస్తూ, ప్రజలను ఆకట్టుకుని జాతీయోద్యమ దిశగా ఎందరినో కార్యోన్ముఖులను చేశారు. **మాతృదేశం కోసం మరణించటం కూడా అప్పుడప్పుడు అవసరం. అయితే మరణించటం కంటే లక్ష్యసాధన కోసం జీవించటం చాలా అవసరం** అంటూ ఆమె వ్యక్తం చేసిన అభిప్రాయాలు ప్రజలను అశేషంగా ఆకట్టుకున్నాయి. ఈ సందర్భంగా ఆమె స్త్రీ విద్యకు, హిందూ- ముస్లిముల ఐక్యతకు అధిక ప్రాధాన్యతనిస్తూ ప్రసంగాలు చేశారు.

ఖిలాఫత్ ఉద్యమంతోపాటుగా, గాంధీజీ రూపకల్పన చేసిన సహాయనిరాకరణ ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు. ఈ సందర్భంగా ఆమె ఖిలాఫత్ సమస్య కోసం మీ జీవితాలను త్యాగం చేయండి అంటూ నినదించారు. ఈ నినాదం ఆనాడు ప్రతి ఉద్యమకారుడ్ని ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమదిశగా పురికొల్పింది. ('Sacrifice your life on the issue of Khilafath ' - Enclopaedia of Women Biography, Volume

I, Edited by Nagendra.K. Singh, APHPC, New Delhi, 2001, Page. 4) ఖిలాఫత్–సహాయనిరాకరణ ఉద్యమం సమయంలో ఆమె వృద్ధాప్యం వలన అనారోగ్యంతో బాధ పడుతున్నారు. ఆమె శరీరం ప్రయాణాలకు ఏమాత్రం సహకరించటం లేదు. ఆ పరిస్థితులలో కూడా అబాది బానో ప్రజలలోకి వచ్చారు. స్వచ్ఛందంగా సహాయ నిరాకరణ ఉద్యమ బాధ్యతలను చేపట్టారు. ఈ ఉద్యమాల నిర్వహణకు అవసరమైన నిధులను ప్రముఖులు, ప్రజల నుండి సమకూర్చటంలో అద్భుతమైన పాత్రను నిర్వహించారు. ఖిలాఫత్ నిధుల సేకరణకు కోడలు అంజాది బేగంను వెంటపెట్టుకుని విస్తృతంగా పర్యటించారు. ఆ నిధులను మహాత్మాగాంధీ జరిపిన దేశ పర్యటనకు, ఉద్యమ కార్యక్రమాల నిర్వహణకు అందచేశారు. ఈ సందర్భంగా ఆమె వందలాది సభలు, సమావేశాలలో పాల్గొని ప్రసంగించారు. ఆంగ్ల పత్రికలలో వచ్చే ఉద్యమ సమాచారాన్ని, ప్రభుత్వం తీరుతెన్నులను కూడా ఆమె సహచరుల నుండి గ్రహిస్తూ, ప్రజల మీద పాలకవర్గాల కిరాతక చర్యలు పెరిగే కొద్దీ, నిప్పులు చెరిగే ఉపన్యాసాలతో ప్రభుత్వం మీద తీవ్రంగా విరుచుకుపడ్డారు.

ఆబాది బానో రాజకీయ రంగాన మాత్రమే కాకుండా సామాజిక రంగంలో కూడా తనదైన భాగస్వామ్యాన్ని అందించారు. 1921లో జరిగిన అఖిల భారత మహిళల సమావేశానికి అధ్యక్షత వహించి, మహిళా కార్యకర్తలకు మార్గదర్శకత్వం వహించారు. స్వదేశీ ఉద్యమాన్ని పటిష్టపర్చటంలో, మతసామరస్యం కాపాడటంలో మహిళలు ప్రధాన పాత్ర వహించాలని పిలుపునిచ్చారు. ఈ సమావేశంలో కస్తూరిబా గాంధీ, బేగం హసరత్ మోహాని, సరోజిని నాయుడు తదితర ప్రముఖులు పాల్గొన్నారు. బ్రిటీష్ నియంతృత్వం నుండి విముక్తి సాధించాలంటే హిందూ–ముస్లింల ఐక్యత అనివార్యమని నమ్మిన ఆమె చివరిశ్వాస వరకు ఆ దిశగా కృషి సల్పారు. **ఐక్యంగా ఉండమని మనకు పలు అనుభావాలు నేర్పుతున్నాయి, ఈ దేశంలోని హిందూ– ముస్లిం– శిక్కు– ఈశాయి ప్రజలంతా ఐక్యంగా ఉద్యమించనట్లయితే మన లక్ష్యం ఏనాటికి సిద్ధించజాలదు** అని ఆమె ప్రజలను హెచ్చరించారు.

జాతీయోద్యమ కార్యక్రమాలలో మహిళలు అధికంగా పాల్గొనాలని ఆబాది బానో ఉద్బోదించారు. స్వయంగా ఉద్యమంలో పాల్గొనలేక పోయినా ఉద్యమిస్తున్న భర్త, పిల్లలను ప్రోత్సహించాలని మహిళలకు విజ్ఞప్తి చేశారు. జాతీయోద్యమకారులంతా తనను **అమ్మా**





అని పిలుస్తున్నందున, తనను తల్లిగా పరిగణించి గౌరవిస్తున్నందున తన బిడ్డల ఎదుట తాను పర్దా ధరించాల్సిన అవసరం లేదంటూ పర్దారహితంగా బహిరంగ సభలలో ఆమె ప్రసంగించారు.

అనారోగ్యం ఆటంకాలు కల్పిస్తున్నా లెక్కచేయకుండా విముక్తి పోరాటంలో చురుకైన పాత్ర నిర్వహించిన అబాది బానో 1922 సెప్టెంబరులో పంజాబు పర్యటన చేశారు. ఈ సందర్భంగా ఓ సభలో మాట్లాడుతూ **భారతదేశపు కుక్కలు, పిల్లులు కూడా బానిసత్వపు సంకెళ్ళలో బందీలుగా ఉండరాదన్నది నా అభిమతం,** అని ఆమె గర్జించారు. ప్రతి ఒక్కరూ ఖద్దరును ధరించాలని, ఖద్దరు ధారణను ప్రోత్సహించాలని, విదేశీ వస్తువులను బహిష్కరించాలని ఆమె ఉద్బోదించారు. అనారోగ్యం వలన గొంతు పెగలకున్నా ఎంతో శ్రమతో ఆమె చేసిన ప్రసంగాలు పంజాబ్ ప్రజలను ఉత్తేజితుల్ని చేశాయి.

ఈ రకంగా ఆమె దేశంలో ఏ ప్రాంతానికి వెళ్ళినా పరాయి పాలకుల దుష్టచర్యలను వ్యతిరేకిస్తూ, ప్రజలను ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఖిలాఫత్–సహాయనిరాకరణ ఉద్యమాలలో ప్రవేశించాల్సిందిగా ఉద్బోదించారు. ఆమె నిబద్దత, నిరాడంబరత, స్వచ్ఛమైన వ్యక్తిత్వం ప్రజలను కట్టిపడేయసాగాయి. ఆ కారణంగా ఆబాది బానో బేగంను **ప్రమాదకర విద్రోహి** గా బ్రిటీష్ ప్రభుత్వ నివేదికలు పేర్కొన్నాయి. అబాది బానో బేగం కుటుంబసభ్యులందర్ని ప్రభుత్వ వ్యతిరేకులుగా ప్రభుత్వాధినేతలు పరిగణించారు. ఈ పరిస్థితిని బట్టి ఆమె ఏ స్థాయిలో బ్రిటీషు ప్రభుత్వం మీద పోరాటం సాగించారో తెలుస్తుంది.

ఈ విధంగా చివరిశ్వాస వరకు స్వేచ్ఛాయుతమైన స్వతంత్ర భారతాన్ని కాంక్షిస్తూ, మహాత్ముని మార్గంలో పోరుబాటన నడిచిన శ్రీమతి ఆబాది బానో అబ్దుల్ అలీ బేగం 1924 నవంబరు 13న ఢిల్లీలో అలీ సోదరులు, మహాత్మా గాంధీ తదితర ప్రముఖుల సమక్షంలో ప్రశాంతంగా కన్నుమూశారు.

**ఆ రోజున యావత్తు భారత దేశం కన్నీటి సముద్రమైంది.**

◆◆◆

> నా భర్త సహచరులంతా జైళ్ళకు వెళ్ళారు. నా భర్త మాత్రం ఇంత వరకు స్వేచ్ఛగా ఉండటం పట్ల మాకు బాధగా ఉంది. **– బేగం ఖుర్షీద్ ఖ్వాజా**

# గాంధీజీ ఆధ్వర్యంలో ' నిఖా ' చేసుకున్న

# ఫాతిమా బేగం

స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు కోరుకున్న ప్రజలు వివక్షతను ఏమాత్రం సహించరు. మహత్తరమైన స్వేచ్ఛా,సమానత్వాల కోసం నడుం కట్టిన యోధులు సుఖ,సంపదలను లెక్కచేయరు. లక్ష్యసాధన పరమావధిగా భావించిన వారు ఆ మార్గం తప్ప అందుకు అడ్డం వచ్చే ప్రతిదాన్ని త్యజిస్తారు. ఆ కార్యాచరణకు ప్రతిరూపంగా నిలుస్తారు శ్రీమతి ఫాతిమా బేగం.

దక్షిణాఫ్రికాలో వర్ణ వివక్షకు వ్యతిరేకంగా సాగిన ఉద్యమాలలో మహాత్మాగాంధీ తోపాటుగా పాల్గొని, అక్కడున్న లక్షలాది రూపాయలను ఆర్జించిపెట్టే వ్యాపారాన్ని వదులుకుని, గాంధీజీ తోపాటుగా భారతదేశం విచ్చేసిన కుటుంబ సభ్యురాలు ఫాతిమా బేగం. ఆమె తండ్రి ఇమామ్ అబ్దుల్ ఖాదిర్ దక్షిణాఫ్రికాలో ప్రఖ్యాత అరేబియా గుర్రాల వ్యాపారి. దక్షణాఫ్రికాలో సాగుతున్న వర్ణ వివక్షతకు వ్యతిరేకంగా సాగిన పోరాటంలో ఇమామ్ ఖాదిర్ గాంధీజీకి క్రియాశీలక సహకారం అందించారు. ఆ క్రమంలో అక్కడున్న సర్వసంపదలను త్యజించి అతి సామాన్య ఉద్యమకారునిగా కుటుంబంతో సహా ఆయన భారత దేశం వచ్చారు. బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగుతున్న విముక్తి పోరాటంలో భాగస్వామ్యం వహించేందుకు సర్వసంపదలు వదులుకుని గాంధీజీ వెంట నడిచారు.





ఆ మహనీయుని పెద్ద కుమార్తె ఫాతిమా బేగం. ఆమె కుంటుంబం అంతా సబర్మతీ ఆశ్రమంలో గడిపింది. ఆ కారణంగా ఫాతిమా గాంధీజీ కనుసన్నలలో పెరిగారు. ఆశ్రమంలో అన్ని పనులలో ప్రతిఒక్కరికీ చేదోడుగా ఉంటూ ఆశ్రమ నిబంధనలను పాటిస్తూ ఆశ్రమవాసుల, ప్రత్యేకంగా మహాత్ముని ప్రశంసలను అందుకున్నారు.

ఆమె తండ్రి అబ్దుల్ ఖాదిర్‌ను గాంధీజీ స్వంత సోదరునిగా భావించి గౌరవించారు. ఆ అనుబంధంతో 20 సంవత్సరాల ఫాతిమా వివాహం విషయంలో గాంధీజీ ప్రత్యేక శ్రద్ధ చూపారు. ఆమె వివాహ ఆహ్వానపత్రాన్ని ఆయన స్వయంగా రూపొందించారు. ఆ వివాహానికి ప్రముఖులను, ప్రజలను ఆహ్వానిస్తూ 1920 ఏప్రిల్ 2న వెలువడిన ఆహ్వాన పత్రిక గాంధీజీ పేరిట ప్రచురితమై జాతీయోద్యమ సాహిత్య చరిత్రలో ప్రత్యేక స్థానం పొందింది. ఆ ఆహ్వాన పత్రిక ఇలా సాగింది.

**ప్రియమైన మిత్రమా! ఫాతిమా బేగం నా మిత్రులు మరియు నా సోదరులు ఇమాం అబ్దుల్ ఖాదిర్ సాహెబ్ గారి జ్యేష్ట పుత్రిక. ఇమాం సాహెబ్ దక్షణాఫ్రికాలో, భారత దేశంలోని ఆశ్రమ, జైలు జీవితంలో నా సహచరులు. సయ్యద్ హుస్సేన్ మియాతో ఫాతిమా బీబీ వివాహం 1920 ఏప్రిల్ 26 తేది శనివారం సాయంత్రం ఏడు గంటలకు జరపాలని నిశ్చయమైంది. ఆరున్నరకు మిలాద్ షరీఫ్ ఆరంభమౌతుంది. ఈ సంతోషకర సమయంలో మీరు కూడా పాల్గొని వధూ, వరులను తమ శుభాకాంక్షలతో అలంకృతులను చేయగలరు.**

**ఇట్లు**

**మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ.**

ఈ వివాహ కార్యక్రమం గాంధీజీ ఆధ్వర్యంలో అతి సాదాసీదాగా పూర్తయ్యింది. ఈ వివాహం గురించి గాంధీజీ తన **నవజీవన్** పత్రికలో విశేషంగా ఉల్లేఖించారు. వివాహం తరువాత ఫాతిమా అత్తవారింటికి వెళ్ళింది. ఆశ్రమ జీవితంలో అలవర్చుకున్న శిక్షణ, సహిష్ణత, దేశభక్తి, సామాజిక సేవాభావాలను అత్తవారింట పరిమళింప చేయాల్సిందిగా కోరుతూ గాంధీజీ ఆమెను ఆశీర్వదించారు. ఆ దిశగా అత్తవారింట కూడా జాతీయోద్యమ భావాలను పరిమళింప చేసిన ఫాతిమా బేగం చిన్న వయస్సులోనే కన్నుమూశారు.

◆◆◆

# ప్రసంగాలతో ప్రజలను ఉద్యమ దిశగా నడిపిన దిట్ట

# అక్బరీ బేగం

ప్రజా పోరాటాలలో మహిళలు పాల్గొనటం ఒకవంతైతే, ఆ పోరాటాలలో పాల్గొనటమే కాక, తోటివారిని కూడా పాల్గొనేట్టు చేయటం గొప్పవిద్య. అది ఆయా వ్యక్తుల స్వచ్ఛమైన ప్రవర్తన, నిజాయితీ, నిబద్ధతల మీద ఆధారపడి ఉంటుంది. ఈ మేరకు జాతీయోద్యమం తొలిదశలో జరిగిన ఖిలాఫత్-సహాయ నిరాకరణ ఉద్యమం దిశగా మహిళలను కార్యోన్ముఖులను చేయటమే కాకుండా, ఆయా స్త్రీల కుటుంబ సభ్యులను కూడా పోరాట దిశగా నడిపించే సత్తాగల ఆలోచనాత్మక ప్రసంగాలను చేసిన యోధురాలిగా శ్రీమతి అక్బరీ బేగం ఖ్యాతిగాంచారు.

ఆమె ప్రముఖ స్వాతంత్ర్యోద్యమకారుడు, న్యాయవాది ఆసఫ్ అలీ తల్లి. ఆమె భర్త అహసన్ అలీ. ఆయన పోలీసు అధికారి. స్వమతం పట్ల అత్యంత భక్తిప్రపత్తులున్నా ఇతర మతాల పట్ల వివక్షత చూపని విశాల హృదయం ఆమెది. ఆమె కుమారుడు హిందూ యువతి అరుణా గంగూలిని వివాహం చేసుకున్నారు. ఆ సమయంలో ఆమె కొంత కినుకు వహించినా ఆ తరువాత అరుణా ఆసఫ్ అలీని ఆదరించి కూతురు స్థానం కల్పించారు. ఆరుణా అసఫ్ అలీకి ఆమె ఉర్దూ నేర్పారు. ఆమెతో కలసి అక్బరీ





బేగం పలు జాతీయోద్యమ కార్యక్రమాలలో పాల్గొన్నారు. (Aruna Asaf Ali, GNS Raghavan, NBT, India, 1999)

ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమాలు ఉధృతంగా సాగుతున్న రోజులవి. 1920 మే మాసంలో ఢిల్లీలో మహిళల సమావేశం జరిగింది. ఆ సమావేశంలో అక్బరీ బేగం ఉత్తేజపూరిత ప్రసంగం చేసి బ్రిటీష్ పోలీసుల ఆగ్రహానికి గురయ్యారు. ఆనాడు ఆమె చేసిన ప్రసంగం ఈ విధంగా సాగింది.

**మీరంతా మీ కుటుంబాల పాలకులు, శాసకులు సంపూర్ణాధికారులు కారా? అది నిజమైతే మనం మన కుటుంబాలలోని మగవాళ్లందర్నీ సహాయ నిరాకరణ ఉద్యమంలో నిష్టగా పాల్గొనేట్టు ప్రోత్సహించాలి. ఉద్యమం పట్ల నిబద్ధతతో వ్యవహరించేలా చూడాలి. అందుకు విరుద్ధంగా వ్యవహరిస్తే సాంఘికంగా బహిష్కరించాలి. మన మగవాళ్ళను కర్మనిష్టాపరులను చేయాలి. మీ హృదయాలలో భగవంతుడిని, మహమ్మద్ ప్రవక్తను సన్నిహితంగా ప్రతిష్టించుకోవాలంటే, స్వర్గంలో బీబీ ఫాతిమా సేవలో నిమగ్నం కావాలన్న అభిలాష మీకున్నట్టయితే ధర్మపోరాటం పట్ల దృఢచిత్తులై వ్యవహరించండి.** (భారత్‌కి స్వాతంత్ర సంగ్రామం మేఁ ముస్లిం మహిళావోఁకా యోగ్‌దాన్, డాక్టర్ ఆబెదా సమీయుద్దీన్, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆబ్జెక్టివ్ స్టడీస్, న్యూఢిల్లీ, 1997 పేజి.313)

అక్బరీ బేగం మతసామరస్యానికి, విభిన్న మతస్థుల మధ్య స్నేహసంబంధాల పటిష్టతకు ఎంతగానో కృషిచేశారు. ఆమె తన ప్రసంగాలకు ఆధ్యాత్మికతా సుగంధాన్ని అద్దారు. ఆ కారణంగా ఆమె ప్రసంగాలు మహిళలను ప్రధానంగా ముస్లిం మహిళలను ఉద్యమ దిశగా నడిపాయి. మతసామరస్య పటిష్టతకు దోహదపడ్డాయి. ఆ ప్రసంగాల ద్వారా మహిళలు కదలి వచ్చి ఖిలాఫత్- సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనేట్టు ఆమె కృషి సాగింది.

ఈ మేరకు ఖిలాఫత్ ఉద్యమంలో ఆమె ప్రధాన పాత్ర వహించారు. పలు పర్యటనలు జరిపారు. అనేక సభలు-సమావేశాలలో ప్రసంగించారు. ఆసఫ్ అలీ లాంటి ప్రముఖ జాతీయోద్యకారుడ్ని విముక్తిపోరాటానికి అందించి, స్వరాజ్యం కోసం పోరాడుతున్న జాతీయోద్యమకారులకు ప్రేరణగా నిలిచి స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో తనదైన స్థానాన్ని ఆక్బరీ బేగం సొంతం చేసుకున్నారు.

◆◆◆

### విముక్తి పోరాటంలో అరెస్టయిన తొలి ఢిల్లీ మహిళ

# మహబూబ్ ఫాతిమా

పరదా చాటున జీవితాలు గడిపే కులీన వర్గానికి చెందిన ముస్లిం ఆడపడుచులు బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో బహిరంగంగా రంగం మీదకు రావటం జాతీయోద్యమ ప్రారంభ దినాలలో చాలా విశేషం. ఆనాడు ఏ సాంఘిక జనసముదాయానికి చెందిన మహిళలైనా జైలుకు వెళ్ళడానికి అంతగా ముందుకొచ్చేవారు కారు. అటువంటి వ్యతిరేక వాతావరణంలో శ్రీమతి మహబూబ్ ఫాతిమా ఢిల్లీలో అరెస్టయ్యి జైలుకెళ్ళి సంచలనం సృష్టించారు.

జాతీయోద్యమం పరవళ్ళుతొక్కుతున్న సమయమది. మాతృభూమి విముక్తి పోరాటంలో ప్రతి ఒక్కరూ భాగస్వాములవుతున్న కాలమది. ఆ వాతావరణంలో ఫాతిమా ఇంట్లో కూర్చోని ఉండలేకపోయారు. ప్రభుత్వ వ్యతిరేక కార్యక్రమాలలో ఆమె పాల్గొన్నారు. ఆనాడు మహిళలు అరెస్టులు కావటం, జైలు కెళ్ళటం విశేష వార్త. అటువంటి విశిష్టమైన వార్తకు ఆమె కారకులయ్యారు.

1919లో జనరల్ డయ్యర్ జలియన్ వాలాబాగ్‌లో వందలాది దేశభక్తులను బలి తీసుకున్నాడు. ఆ కిరాతక చర్యకు బలైన అమరయోధులను స్మరించుకుంటూ, ప్రతి ఏడాదిలా 1932 ఏప్రిల్21న జలియన్‌వాలాబాగ్ అమరవీరుల దినోత్సవం జరిగింది. ఆ రోజును పురస్కరించుకుని ఢిల్లీలోని చాందినీ చౌక్‌లో కార్యక్రమం జరిగింది. ఆ కార్యక్రమంలో పాల్గొన్న మహబూబ్ ఫాతిమా ప్రభుత్వ వ్యతిరేక నినాదాలిచ్చారు. అందుకు ఆగ్రహించిన పోలీసులు ఆమెను అరెస్టుచేసి కోర్టులో హాజరుపర్చారు.

బ్రిటీష్ కోర్టులో న్యాయపోరాటం చేయడానికి ఫాతిమా తిరస్కరించగా ఆమెకు ఆరు మాసాల జైలు శిక్ష, 50 రూపాయల జరిమానా విధించారు. ఈ వార్తను బిజనోర్ నుండి ప్రచురితమయ్యే 1932 ఏప్రిల్ 25 నాటి **మదీనా** అను ఉర్దూ పత్రిక **శిక్షకు గురైన తొలి ఢిల్లీ ముస్లిం మహిళ** శీర్షికతో ప్రత్యేకంగా ప్రచురించింది.

◆◆◆



### తొలిసారిగా అరెస్టయిన బెంగాల్ బేగం సిస్టర్స్

# బేగం జహీరా-సుల్తానా

**భా**రత స్వాతంత్ర్యోద్యమానికి పుట్టినిల్లు బెంగాల్. ఈస్ట్ ఇండియా కంపెనీకి వ్యతిరేకంగా 1763లో ఫకీర్లు-సన్యాసుల తిరుగుబాటు ఇక్కడే ప్రారంభమైంది. బెంగాల్‌లో పురుషులతోపాటుగా మహిళలు కూడ జాతీయోద్యమంలో ముందున్నారు. **పర్దానషీ** మహిళలై ఉండి కూడా అరెస్టులకు గురై జహీరా బేగం, సుల్తానా బేగం సోదరీమణులు చరిత్ర సృష్టించారు.

స్వాతంత్ర్య సమరయోధుడు, అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సభ్యులు ప్రొఫెసర్ అబ్దుల్ రహీం కుమార్తెలు ఈ బేగం సోదరీమణులు. జాతీయోద్యమంలో భాగంగా జరిగిన విదేశీ వస్తుబహిష్కరణ ఉద్యమంలో వారు చురుకైన పాత్ర నిర్వహించారు. ఈ సందర్భంగా మద్యం విక్రయశాలలు, విదేశీ వస్తువులను విక్రయిస్తున్న దుకాణాల ఎదుట ఈ వీరి నేతృత్వంలో పికెటింగ్ జరిగింది.

ఆ కారణంగా జహీరా బేగం, సుల్తానా బేగంలను ప్రభుత్వం అరెస్టు చేసింది. ఈ సంఘటనను పురస్కరించుకుని, 1930 ఆగస్టు 30నాటి **అభ్యుదయ** అను వార్తా పత్రిక బేగం సోదరీమణుల అరెస్టులకు అత్యధిక ప్రాధాన్యత కల్పిస్తూ **బెంగాల్ ప్రాంతంలో మొదటి సారిగా అరెస్టయిన ముస్లిం మహిళలు,** అని రాసింది.

ఈ సంచలనాత్మక వార్త ముస్లిం మహిళల్లోఉత్సాహాన్ని పెంచింది. స్వరాజ్య సాధన కోసం సాగుతున్న జాతీయోద్యమంలో పాల్గొని, పోలీసుల దాడులను, కిరాతకాలను భరిస్తూ, అరెస్టులకు, జైలుశిక్షలకు వెరవకుండా చివరివరకు సాగేందుకు ప్రజలకు ప్రేరణ కలిగించింది.

◆◆◆

## పోలీసులు గుర్రాలచే తొక్కించినా బెదరని

# హమీదా తయ్యాబ్జీ

**(1911- )**

బ్రిటీషు బానిస బంధనాల నుండి విముక్తి కోరుకున్న భారతీయులు దృఢసంకల్పంతో ఆ దిశగా ముందుకు సాగారు. పోరుబాటలో దీక్ష చేపట్టారంటే వారిని మార్గం మళ్లించడం ఎంతటి క్రూరత్వానికైనా సాధ్యమయ్యేది కాదు. ప్రభుత్వం ఎంతటి దారుణాలకు పాల్పడినా ఉద్యమకారులు పోరుబాట తప్పలేదు. ఈ వైఖరికి పురుషులైనా, స్త్రీలైనా తేడా కన్పించలేదు. భయానక హింసకు కూడా ఏమాత్రం వెరవక మున్ముందుకు సాగిన సాహస మహిళలు జాతీయోద్యమంలో పలువురు దర్శనమిస్తారు. ఆ మహిళలలో చెప్పుకోదగ్గవారు శ్రీమతి హమీదా తయ్యాబ్జీ.

గుజరాత్ రాష్ట్రానికి చెందిన తయ్యాబ్జీ కుటుంబానికి చెందిన హమీదా తయ్యాబ్జీ 1911లో బరోడాలో జన్మించారు. ఆమె సీనియర్ కేంబ్రిడ్జిలో విద్యాభ్యాసం గావిస్తున్న సమయంలో తన కుటుంబీకులతోపాటుగా జాతీయోద్యమంలో పాల్గొనేందుకు చదువును మధ్యలో వదిలేశారు. భారత జాతీయ కాంగ్రెస్ యువజన సమితిలో ఆమె సభ్యురాలు. తాత అబ్బాస్ షంషుద్దీన్ తయ్యాబ్జీ, మహాత్మా గాంధీల రాజకీయ సిద్ధాంతాల పట్ల ప్రభావితులయ్యారు. జాతీయోద్యమంలో భాగంగా జరిగిన అన్ని ప్రధాన సంఘటనలలో ఆమె పాల్గొన్నారు.





ఈ క్రమంలో బ్రిటీష్ పోలీసుల లాఠీ దెబ్బలను రుచి చూశారు. స్వదేశీ ఉద్యమంలో క్రియాశీలక పాత్ర నిర్వహిస్తూ, మహిళలతో ఆందోళన నిర్వహిస్తున్న సమయంలో మహిళల నిబద్ధతను నీరు కార్చేందుకు బ్రిటీష్ ప్రభుత్వం పోలీసులను ఉసికొల్పింది. ఆమెను పలు హింసలకు గురిచేసింది. ఆమెను ప్రత్యేక లక్ష్యంగా పెట్టుకుని గుర్రాలచే తొక్కించింది. అటువంటి భయానక సంఘటనలో తీవ్రంగా గాయపడినప్పటికీ ఆమె ఏ మాత్రం అదరలేదు, బెదరలేదు. మరింత పట్టుదలతో ముందుకు వెళ్ళారు. ఆమె తన సహచరిణులను సమీకరించుకుని రెట్టింపు ఉత్సాహంతో అహింసామార్గంలో ఆందోళనలో పాల్గొన్నారు. అరెస్టులు, లాఠీ దెబ్బలు, జైలు శిక్షలకు ఏమాత్రం భయపడకుండా ఉద్యమబాటన తన కార్యక్రమాలను కొనసాగించిన ధైర్యశాలి. ఈ మేరకు ఆమె పలుసార్లు జైలు శిక్షలు అనుభవించారు.

గాంధీజీ ఆదేశాల మేరకు ముస్లింలు అధికంగా ఉండే ప్రాంతాలలో పనిచేసేందుకు వెళ్ళిన ఆమె తన కార్యదక్షతను ప్రదర్శించి ప్రజలను ఆకట్టుకోవటం మాత్రమే కాకుండా భారత జాతీయ కాంగ్రెస్ నాయకుల ప్రశంసలందుకున్నారు. ఆమెకు పలు కార్యక్రమాల బాధ్యతలను జాతీయోద్యమం అప్పగించింది. జాతీయ కాంగ్రెస్ ఆదేశించిన ప్రతి కార్యక్రమాన్ని ధైర్య సాహసాలతో నిర్వహించటమే కాకుండా క్విట్ ఇండియా ఉద్యమంలో ఆమె ప్రముఖ పాత్రపోషించారు. ఆమె కార్యక్రమాల నిర్వహణా సరళిని ప్రశంసిస్తూ 1932 ఏప్రిల్ 24న బేగం రెహనా తయ్యాబ్జీకి గాంధీజీ లేఖ రాశారు. ఆ లేఖలో **హమీదా ఎంతో ధైర్యవంతురాలు. హమీదాకు మరింత ఆయుష్షును భగవంతుడు ప్రసాదించాలని కోరుకుంటున్నాను** అన్నారు. ఆమె చేపట్టిన కార్యకలాపాలను ఆమెకు స్వయంగా మహాత్ముడు రాసిన లేఖలలో, ఇతరులకు ఆయన రాసిన పలు లేఖలలో ప్రత్యేకంగా ప్రస్తావించి రెహనా సాహసాన్ని, కార్యదక్షతను చరిత్రకు అందించారు.

మతాతీత భావాలుగల హమీదా తయ్యాబ్జీ ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ కల్చరల్ రిలేషన్స్‌కు చెందిన ప్రముఖుడు ప్రబోధ్ మెహతాను (బొంబాయి) వివాహం చేసుకున్నారు. ఆ తరువాత బాధ్యతలు మరువని పౌరురాలుగా, కుటుంబాన్ని సమర్ధవంతంగా తీర్చిదిద్దిన ఆదర్శ గృహిణిగా, మాతృమూర్తిగా బేగం హమీదా జీవితం గడిపారు.

◆◆◆

## బానిస బ్రతుకు కంటే గౌరవ ప్రదమైన మరణం మేలని చాటిన

# బేగం ముహమ్మద్ ఆలం

**భా**రత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొంటున్న భర్తల అడుగుజాడల్లో నడుస్తూ, తమదైన ప్రత్యేక పాత్రను నిర్వహించిన ముస్లిం మహిళలు ఎందరో ఉన్నారు. ఆ మహిళలకు సంబంధించిన ప్రత్యక్ష ప్రస్తావనలు చాలా అరుదుగా కన్పిస్తాయి. జీవిత భాగస్వాములు బ్రిటీష్ ప్రభుత్వ దాష్టీకాలకు గురవుతూ, తరచుగా జైలు పాలవుతున్నందున ఎదురవుతున్న ఆర్థిక సామాజిక ఇక్కట్లతోపాటుగా మనోవ్యధను జీవితమంతా భరిస్తూ ఉద్యమాలకు ఊపిరి పోసిన మహిళామణుల త్యాగం అనిర్వచనీయం. అటువంటి మహిళలు చూపిన తెగువ, చాటిన దేశభక్తి, త్యాగనిరతి, చరిత్రలో తమదైన స్థానం ఏర్పర్చుకున్నాయి. ఆ విధమైన చరిత్రను సృష్టించిని కోవకు చెందిన మహిళలలో బేగం ముహమ్మద్ ఆలం ఒకరు.

ఆమె ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు డాక్టర్ ముహమ్మద్ ఆలం భార్య. లాహోర్‌కు చెందిన ఖాన్ షేక్ మియా ఫిరోజుద్దీన్ కుమార్తె. అసలు పేరు కంటే బేగం ముహమ్మద్ ఆలం పేరుతో ఆమె ఎంతో ప్రఖ్యాతి చెందారు. డాక్టర్ ఆలం లండన్‌లో ఉన్నత విద్యను పూర్తిచేసుకుని లాహోర్ వచ్చి న్యాయవాదిగా స్థిరపడ్డారు. 1921లో కనకవర్షం కురిపిస్తున్న న్యాయవాద వృత్తిని త్యజించి ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమం సందర్భంగా జాతీయోద్యమంలో ప్రవేశించారు. ఆనాటినుండి బేగం ఆలం భర్త





కార్యకలాపాలకు పరోక్షంగా మద్దతునిస్తూ జాతీయోద్యమంలో భాగం పంచుకున్నారు. డాక్టర్ ఆలం తరచుగా జైలు కెడుతుండటంతో భర్త బాధ్యతలను తన పరిమితుల మేరకు ఆమె నిర్వహిస్తూ వచ్చారు. ఆమె కృషి, స్వాతంత్ర్యోద్యమం పట్ల వ్యక్తం చేస్తున్న అభిప్రాయాలు, ఆమెలోని ఉద్యమ నిబద్ధత, లక్ష్యసాధన పట్ల ఉన్న దృఢసంకల్పం 1932లో ప్రపంచానికి వెల్లడయ్యాయి.

1932లో డాక్టర్ ఆలంను బ్రిటీష్ ప్రభుత్వం అరెస్టు చేసింది. ఆ సమయానికి డాక్టర్ ఆలం తీవ్ర శారీరక రుగ్మతతో బాధపడుతున్నారు. బ్రిటీష్ ప్రభుత్వం పట్ల, అధికారుల వ్యవహార సరళి పట్ల తీవ్ర వ్యతిరేకతను వ్యక్తం చేస్తున్న డాక్టర్ ఆలం అంటే మండిపడుతున్న అధికారులు ఆయన పట్ల క్రూరంగా వ్యవహరించారు. అనారోగ్యంతో బాధపడుతున్నప్పటికీ ఆయన చికిత్స పట్ల అధికారులు శ్రద్ధచూపలేదు. ఆ కారణంగా ఆయన ఆరోగ్యం రోజురోజుకు దిగజారి పోసాగింది. ఈ విషయం బయటకు పొక్కకుండా ప్రభుత్వం పలు జాగ్రత్తలు తీసుకున్నా, స్వదేశీ పత్రికలు డాక్టర్ ఆలం అనారోగ్య పరిస్థితులను తెలుసుకుని ఆందోళన వ్యక్తం చేశాయి.

ఈ విషయాలను తెలుసుకున్న ప్రజలు ఆగ్రహావేశాలు వ్యక్తంచేశారు. బ్రిటీష్ ప్రభుత్వం మీద, జైలు అధికారుల మీద విమర్శలు గుప్పించారు. డాక్టర్ ఆలం మీద కక్షపూనిన అధికారగణం ఆ విమర్శలను ఏ మాత్రం ఖాతరు చేయలేదు. డాక్టర్ ఆలం గాని, ఆయన కుటుంబ సభ్యులు గాని స్వయంగా విజ్ఞప్తి చేస్తే తప్ప ఆయనకు వైద్యసౌకర్యం కల్పించేది లేదని అధికారులు మొండికేశారు. స్వయంగా కోరితే చికిత్సకు అనుమతిస్తామని సంసిద్ధతను వ్యక్తం చేశారు.

ఈ విషయమై ప్రజలలో తర్జన భర్జనలు ప్రారంభమైనాయి. ప్రభుత్వం స్వయంగా వైద్యసేవలను అందించాల్సి ఉండగా, అందుకోసం అభ్యర్థించటం చిన్నతనంగా కొందరు భావించగా, మరికొందరు డాక్టర్ ఆలం అనారోగ్య తీవ్రత దృష్ట్యా వినతి పత్రం పంపటం మంచిదని అభిప్రాయపడ్డారు. డాక్టర్ ఆలం మాత్రం ఎటువంటి పరిస్థితులలోనూ తన వ్యక్తిత్వాన్ని చంపుకుని ప్రభుత్వానికి వినతిపత్రం పంపుకునేది లేదని స్పష్టంగా ప్రకటించారు. **ప్రాణం పోయినా నేను ఆ పని చేయను** అంటూ ఆయన మిన్నకుండి పోయారు. బేగం ఆలం భర్త ఆరోగ్యం పట్ల ఆవేదన చెందుతునప్పటికి, భర్త అభిప్రాయాన్ని గౌరవిస్తూ ప్రభుత్వానికి ఎటువంటి అభ్యర్థనలు పంపలేదు. ఈ పట్టుదల మూలంగా

డాక్టర్ ఆలంకు ఎటువంటి చికిత్స జరగకపోవడంతో సమయం గడిచే కొద్ది ఆయన ఆరోగ్యం ప్రమాదకర స్థితికి చేరుకుని చివరకు రక్తం కక్కుకుంటూ ఆయన మృత్యువుకు సమీపం కాసాగారు.

ఆ పరిస్థితులలో డాక్టర్ ఆలం హితైషులు బేగం ఆలం వద్దకు వచ్చి ఆమెకు నచ్చచెప్ప ప్రయత్నించారు. పరిస్థితులు చేయిదాటి పోతున్నందున ఉద్యమకారుడు డాక్టర్ ఆలంను కాపాడుకునేందుకు ప్రభుత్వానికి వినతి పత్రం పంపాల్సిందిగా హితవు పలికారు. ఆలస్యం చేస్తే ఆయన విలువైన ప్రాణాలను రక్షించటం ఎవ్వరికీ సాధ్యం కాదని, అందువలన త్వరపడాల్సిందిగా ఆమెకు విజ్ఞప్తి చేశారు. డాక్టర్ ఆలం ఆరోగ్యంపట్ల ఆందోళన వ్యక్తంచేశారు. ఈ మేరకు పత్రికలలో ప్రజల విజ్ఞప్తుల పరంపర సాగింది. ప్రముఖ జాతీయోద్యమ నాయకులు, కార్యకర్తలు డాక్టర్ ఆలం అనుచరులు, మిత్రులు ఆయన ఆరోగ్య పరిస్థితులను తలచుకుంటూ తీవ్రంగా వ్యధ చెందారు.

ఆ సమయంలో బేగం ఆలం నిరుపమాన దేశభక్తి, ఉద్యమకారుడైన భర్త దృఢనిర్ణయం పట్ల గల గౌరవం, ఆమెలోని అసమాన ధైర్యసాహసాలు బహిర్గతమయ్యాయి. డాక్టర్ ఆలం అనారోగ్య పరిస్థితి పట్ల దేశవ్యాపితంగా వ్యక్తమవుతున్న ఆందోళన, సన్నిహితుల నుండి వ్యక్తమవుతున్న హితవచనాల నేపథ్యంలో ఆమె ప్రజల నుద్దేశించి చేసిన ప్రకటన సంచలనం సృష్టించింది. ఆ ప్రకటన జాతీయోద్యమకారులకు ఎంతో స్ఫూర్తిదాయకంగా నిలచింది. **పర్ధానషీ** మహిళలు కూడా మాతృదేశ విముక్తికోసం సాగుతున్న పోరాటం పట్ల కలిగియున్న స్పష్టమైన అవగాహనకు బేగం ఆలం చేసిన ప్రకటన స్పష్టంగా అద్దం పట్టింది.

ఆనాడు బేగం ఆలం చేసిన ప్రకటనను బిజనోర్‌కు చెందిన **మదీనా** అను ఉర్దూ పత్రిక 1932 అక్టోబర్ 25నాటి సంచికలో ప్రచురించింది. ఆ ప్రకటన ఈ విధంగా సాగింది.

మాతృభూమి, **స్వేచ్ఛాస్వాతంత్ర్యాల నిమిత్తం పోరాడుతున్న నా భర్త జీవితం తొలుత ఈ జాతి సొత్తు, ఆ తరువాత మాత్రమే నాది, మరెవరిదైనా. అందువలన నా భర్త జీవితాన్ని ఎలా ఉపయోగించుకోవాలన్నది జాతి జనులు నిర్ణయించాలి...ప్రభుత్వాన్ని అర్థించి, నా భర్త నామీద ఉంచిన విశ్వాసాన్ని నేను భంగపరుస్తూ, ఆయన త్యాగపూరిత దృఢ నిశ్చయానికి వ్యతిరేకంగా నేను వ్యవహరించలేను...జరిగేదేదో జరగనివ్వండి.**





**ఆ ఘోర విపత్తుకు బ్రిటీష్ ప్రభుత్వమే కారణం కానివ్వండి.. నా భర్తను సింహంలా మృత్యువును స్వీకరించనివ్వండి...జాతి ప్రయోజనాలు, ఆత్మ గౌరవాభిమానాల పరిరక్షణ విషయంలో వ్యక్తిగత జీవితాలు అంత ప్రాముఖ్యం కావు... మాతృదేశ విముక్తి పోరాటంలో ధనమాన ప్రాణాలను బలిపెట్టాల్సి ఉంటుంది...అందుకు ఎవ్వరూ చింతించాల్సిన అవసరం లేదు సరికదా, మనమంతా మరింతగా గర్వపడాలి.**

**..నా భర్త కోలుకుంటారని నాకు నమ్మకం ఉంది. ఆయన బ్రిటీష్ వాళ్ళతో పోరాడినట్టే, మృత్యువుతో కూడా పోరాడి విజయం సాధించగలరు. ఒకవేళ మృత్యువుదే పైచేయి అయినట్టయితే, గౌరవప్రదమైన జీవితం సాగించే ఉద్యమకారునికి లభించే మరణం, పదికాలాల పాటు నికృష్టంగా గడిపే భయంకర బానిస జీవితం కంటే ఎంతో ఉన్నతమైంది...అందువలన నన్ను అర్థం చేసుకోండి. ప్రభుత్వాన్ని తన పని తాను చేసుకపోనివ్వండి.** (భారత్‌కి స్వాతంత్ర సంగ్రాం మేఁ ముస్లిం మహిళావోంకా యోగ్‌దాన్, డాక్టర్ ఆబెదా సమీయుద్దీన్, ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఆబ్జెక్టివ్ స్టడీస్, న్యూఢిల్లీ, 1997, పేజి. 316-317)

ఈ ప్రకటన అటు ప్రభుత్వ వర్గాలలోనూ ఇటు ప్రజలలోనూ సంచలనం సృష్టించింది. ఆ ప్రకటనలోని ప్రతి వాక్యం దేశభక్తిపూరితమై యావత్తు దేశాన్ని ఉత్తేజపర్చింది. బేగం ఆలం ధైర్యానికి, ఆమెలో దాగిఉన్న ఉద్యమ నిబద్ధతకు, భర్త నిర్ణయాల పట్ల ఉన్న గౌరవానికి ఉద్యమకారులు జేజేలు పలికారు.

ఆ విధంగా జాతీయోద్యమకారులకు స్ఫూర్తిదాయక మార్గదర్శకం చేసిన బేగం ఆలం జీవితాంతం డాక్టర్ ముహమ్మద్ ఆలంతోపాటుగా విముక్తి పోరాటంలో పాల్గొని చరితార్థులయ్యారు.

◆◆◆

> మీరంతా మీ కుటుంబాల పాలకులు, శాసకులు సంపూర్ణాధికారులు కారా? అది నిజమైతే మనం మన కుటుంబాలలోని మగవాళ్లందర్నీ సహాయ నిరాకరణ ఉద్యమంలో నిష్టగా పాల్గొనేట్టు ప్రోత్సహించాలి. ఉద్యమం పట్ల నిబద్ధతతో వ్యవహరించేలా చూడాలి. అందుకు విరుద్ధంగా వ్యవహరిస్తే సాంఘికంగా బహిష్కరించాలి. మన మగవాళ్ళను కర్మనిష్టాపరులను చేయాలి.....ధర్మపోరాటం పట్ల దృఢచిత్తులై వ్యవహరించండి.
>
> **– అక్బరీ బేగం.**

# బ్రిటిష్ దాష్టికాలకు భయపడని ధీశాలి

# బేగం నిశాతున్నీసా బేగం

**(1884-1937)**

**భా**రత స్వాతంత్ర్యోద్యమంలో భర్త రాజకీయాభిప్రాయాలను గౌరవిస్తూ, ఆయన అడుగుజాడల్లో ఉద్యమ దిశగా సాగిన భార్యలు కొందరైతే, స్వతంత్ర అభిప్రాయాలు కలిగి ఉండి ఉద్యమంలో స్వేచ్ఛగా పాల్గొంటూ, భర్తను కూడా తన నిర్దుష్ట,నిక్కచ్చి అభిప్రాయాలతో ఉద్యమ దిశగా ప్రోత్సహించినవారు కొందరున్నారు. అటువంటి అరుదైన ధీరవనితలలో బేగం నిశాతున్నిసా అగ్రగణ్యులు.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని మోహాన్ జిల్లాకు చెందిన అవధ్‌లో నిశాతున్నిసా బేగం 1884లో సంపన్న కుటుంబంలో జన్మించారు. ఆమె తండ్రి సయ్యద్ శబీబ్ హసన్ మోహానీ రాయచూర్‌లో హైకోర్టు న్యాయవాది. చిన్నతనంలో బేగం నిశాతున్నిసా ధార్మిక విద్యతోపాటుగా అరబ్బీ, ఉర్దూ, పర్షియన్ భాషలను అభ్యసించారు. ఆ ప్రాంతంలో విద్యావకాశాలు లేని బడుగువర్గాల ఆడపిల్లలకు చదవటం, రాయటం నేర్పటం ప్రారంభించి చిన్న వయస్సులోనే ఆమె తనలోని సేవాభావాన్ని వెల్లడి చేశారు. ఈ మేరకు ఆమె మోహాన్ (Mohaan) జిల్లా చెందిన ఉన్నవ్ గ్రామంలోని బాలికలలో విద్యాభ్యాసం పట్ల ఆసక్తిని కలిగించారు.

జాతీయోద్యమంలో **చిచ్చరపిడుగు** గా ఖ్యాతిగాంచిన మౌలానా హసరత్ మోహానిని





ఆమె 1901లో వివాహం చేసుకున్నారు. మౌలానా పూర్తి పేరు ఫజలుల్ హాసన్ హసరత్ మోహాని. వివాహానంతరం భర్తతోపాటుగా అలీఘర్ చేరుకున్న బేగం నిశాతున్నీసా చిన్నతనంలోనే ప్రదర్శించిన సేవాభావాలకు, స్వేచ్ఛా, స్వతంత్ర భావాలు గల హసరత్ మోహాని తోడ్పాటు లభించింది. మంచి చదువరి అయినటువంటి ఆమెకు పండితుడు, స్వేచ్ఛా, స్వాతంత్ర్యాభిలాషి అయినటువంటి భర్త లభించటంతో ఆమె అధ్యయనం మరింత చురుకుగా సాగింది.

వివాహం తరువాత అలీఘర్‌లో విద్యాభ్యాసం చేస్తున్న మౌలానా మోహాని 1903లో ఉర్దూ-ఏ-మౌల్లా (Urdu-e-Mualla) అను ఉర్దూ పత్రికను ప్రారంభించారు. మౌలానా మెహాని, బేగం నిశాతున్నిసా 1904లో భారత జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించారు. అప్పటి నుండి ఆ దంపతులిరువురు జాతీయ కాంగ్రెస్ సమావేశాలన్నిటిలో పాల్గొనసాగారు. 1907లో సూరత్‌లో జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశంలో కాంగ్రెస్ నాయకులు అతివాదులు- మితవాదులుగా చీలిపోగా అతివాదుల నేత బాలగంగాధర తిలక్ వెంట మౌలానా నడిచారు.ఆ తరుణంలో బేగం నిశాతున్నిసా భర్త అభిప్రాయాలను సమర్థించటమే కాకుండా ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా అతివాద రాజకీయాలను ప్రోత్సహించారు.

1908లో ఉర్దూ-ఏ-మౌల్లా బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రచురించిన ఓ వ్యాసం పట్ల ఆగ్రహించిన ప్రభుత్వం ఇండియన్ డిఫెన్స్ రూల్స్ క్రింద మౌలానాను 1908 జూన్ 22న అరెస్టు చేసింది. మౌలానా అరెస్టు కావటం అది మొదటిసారి. ఆ సమయంలో ఆమె తొలి సంతానం ఏడాది వయస్కురాలైన పసికందు నైమా బేగం (Naima Begum) తీవ్ర అనారోగ్యంతో బాధపడుతుంది. ఆర్థిక పరిస్థితులు బాగాలేవు. ఆ కుటుంబంలో అరెస్టులు, జైళ్ళ అనుభవం లేదు. అయినా గ్రామీణ ప్రాంతం నుండి వచ్చిన బేగం నిశాతున్నిసా భర్త అరెస్టు పట్ల ఏమాత్రం భయపడకుండా ఉద్యమకారిణిగా అత్యంత ధైర్యాన్ని ప్రదర్శించారు.

ప్రభుత్వం, పోలీసుల చర్యలకు తాను భయపడకుండటం అటుంచి భర్తకు ఎంతో ధైర్యం చెప్పారు. మౌలానా మోహానిని అరెస్టు చేసిన మరుసటి రోజున ఓ లేఖ రాసి దానిని పోలీసు అధికారి ద్వారా ఆయనకు పంపారు. ఆ లేఖలో **మీ మీద విరుచుక పడిన ప్రమాదాన్ని ఎదుర్కోండి. నా గురించి ఆలోచించ వద్దు. మీ నుండి**

**ఎటువంటి బలహీనత ప్రదర్శితం కారాదు. జాగ్రత్త సుమా!** అని హెచ్చరించారు. ఈ లేఖను చూసి మౌలానా ఆశ్చర్యపోయారు.

మౌలానా పక్షాన వాదించేందుకు ఆ సమయంలో న్యాయవాదులు ముందుకు రాలేదు. అలీఘర్ కళాశాల కార్యదర్శి నవాబు వకారుల్ ముల్క్ (Nawab Wiqar-ul-Mulk) లాంటి ప్రముఖులు మౌలానాకు వ్యతిరేకంగా సాక్ష్యం పలికారు. (Hasrath Mohani, Muzaffar Hanafi, Trd. by Khadija Azeem, NBT, India, 1989, Page. 29) ఆ విపత్కర పరిస్థితులలో అధైర్యపడకుండా న్యాయస్థానంలో విచారణ జరుగుతున్నంత కాలం ఆయా కార్యక్రమాలను ఆమె స్వయంగా పర్యవేక్షించారు. 1908 ఆగస్టు 4న కోర్టు తీర్పు చెబుతూ మౌలానాకు రెండేళ్ళ జైలు, ఐదు వందల రూపాయల జరిమానా విధించింది. ఆ తీర్పు ఆమెను ఏమాత్రం కదిలించలేకపోయింది. దయనీయంగా ఉన్న కుటుంబం ఆర్థిక పరిస్థితుల కారణంగా జరిమానా కట్టలేదు. ఆ కారణంగా అత్యంత విలువైన పుస్తకాలు గల మౌలానా స్వంత గ్రంథాలయాన్ని కేవలం 60 రూపాయలకు పోలీసులు వేలం వేశారు. ఈ సందర్భంగా పోలీసులు నానా హంగామా సృష్టించారు. ఆ దుష్టచర్యలకు బేగం నిశాతున్నీసా కించిత్తు కూడా చలించలేదు.

చివరకు 1909 జూన్‌లో మౌలానా విడుదలయ్యారు. జైలు నుండి విడుదల కాగానే మళ్ళీ ఆయన తన బ్రిటీషు ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలను కొనసాగించారు. ఆయనకు నచ్చచెప్పి ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాల నుండి విరమింపచేయాల్సిందిగా బంధువులు, సన్నిహితులు ఆమెకు సలహాలనిచ్చారు. ఆ సలహాలు ఆమెకు రుచించలేదు. ఆప్తులు, సన్నిహిత బంధువులు దూరమయ్యే పరిస్థితులు వచ్చినా ధార్మిక,ఆర్థిక,రాజకీయ నిబద్ధత నుండి ఏమాత్రం దారి మళ్ళేది లేదని బేగం నిశాతున్నీసా స్పష్టంచేశారు.

మౌలానా ఉర్దూ-ఏ-మౌల్లా ను పునరుద్ధరించారు. ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సమాచారాన్ని ప్రచురిస్తున్నందున ఉర్దూ-ఏ-మౌల్లా ముద్రణకు ఎవ్వరూ ముందుకు రాలేదు. ఆ అవాంతరాన్ని అధిగమించేందుకు మౌలానా దంపతులు తమ చిన్న అద్దె గృహంలో **ఉర్దూ ప్రెస్** ఏర్పాటు చేసుకున్నారు. ఈ ప్రెస్‌లో బేగం నిశాతున్నీసా అహర్నిశలు పనిచేస్తూ, అన్ని బాధ్యతలను సమర్థవంతంగా నిర్వహించారు. ఉర్దూ-ఏ-మౌల్లా పత్రిక నిరాటంకంగా బయటకు రావటంలో ఆమె అన్ని విధాల మౌలానాకు తోడ్పాటునిచ్చారు. బ్రిటీషు ప్రభుత్వ చర్యలకు వ్యతిరేకంగా జాతీయ భావాలతో ప్రజలను





చైతన్యవంతుల్ని చేయాలన్న లక్ష్యంతో ఆరంభించిన ఉర్దూ-ఏ-మౌల్లా ను మరింత అర్థవంతంగా రూపొందిచడంలో సంకల్పబద్ధులైన నిశాతున్నీసా బేగం బృహత్తర పాత్ర నిర్వహించారు.

మౌలానా దంపతుల ప్రభుత్వ వ్యతిరేక చర్యల పట్ల కినుక వహించిన అలీఘర్ ప్రముఖులు ఉర్దూ-ఏ-మౌల్లా పత్రికను ఎవ్వరూ కొనవద్దని, ఆ కుటుంబానికి ఎటువంటి సహాయ సహకారాలు అందించవద్దని ప్రత్యేకంగా హుకుం జారీచేశారు. ఆ కారణంగా మౌలానా దంపతులు ఆర్థికంగా పలు ఇక్కట్లు ఎదుర్కోవాల్సి వచ్చింది, ఆ సమయంలో వారిల్లు, ఉర్దూ ప్రెస్, ఆ దంపతుల ఆత్మగౌరవం, మౌలానా ఇంటి పరిస్థితులు మౌలానా అబుల్ కలాం ఆజాద్ మాటల్లో ఇలా ఉన్నాయి :

' When Hasarath was released from captivity he had nothing in the world that could provide him any financial help. There is an old dilapidated house that was taken on rent for about two rupees a month, and had a very small room and varandah in the inner part, and almost as much accommodation in the other portion. In the inner portion, lives that fervent freedom fighter, ascetic, with his wife who personifies resolve and determination; and in the outer portion you find a hand operated, small wooden press and a few stones (plates), Often enough he had even calligraphed the copy of Urdu-e-Moalla himself, had himself consolidated it on the stone plates, even operated the press himself to print the journal. This is about all that Urdu-e-Moalla's owner can boast of as his belongings. Neither has he any other source of income, nor does his self-respect allow him to take obligation from any one else! ' (Hasrath Mohani, Muzaffar Hanafi, Trans. by Khadija Azeem, NBT, India, 1989, Page. 29)

అటువంటి దుర్భర పరిస్థితులలో కూడా భర్తకు ధైర్యం చెబుతూ, కుటుంబ బరువు బాధ్యతలను స్వయంగా భరిస్తూ బేగం నిశాతున్నీసా మౌలానా మోహానీని ప్రోత్సహించారు. బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా అక్షరాగ్నులు కురిపిస్తున్న ఉర్దూ-ఏ-మౌల్లా మీద పోలీసు అధికారులు దృష్టి సారించారు. ఈసారి పత్రికను పూర్తిగా తుదముట్టించాలని అనుకున్నారు. 1913 మే 13న ఉర్దూ-ఏ-మౌల్లా పత్రిక నుండి మూడు వేల రూపాయలను డిపాజిట్టు చేయాల్సిందిగా ప్రెస్ యాక్ట్ క్రింద డిమాండ్ చేశారు. ఆ మొత్తం కట్టనందున ఉర్దూ ప్రెస్‌ను ప్రభుత్వం జప్తు చేసింది. ఆ చర్యతో మౌలానా దంపతులు ప్రాణపదంగా చూసుకుంటున్న ఉర్దూ-ఏ-మౌల్లా మూతపడింది.

అంతర్జాతీయ పరిణామాల మూలంగా బ్రిటీషు ప్రభుత్వ వ్యతిరేకుల మీద

పోలీసులు దృష్టిసారించారు. జాతీయోద్యమ నేతల మీద ఆంక్షలు విధించారు. అందులో భాగంగా మౌలానాను గృహనిర్బంధంలోకి తీసుకుని, ఆయన కదలికల మీద ఆంక్షలు విధించారు. ఆ ఆంక్షలను ఖాతరు చేయనందున 1916 ఏప్రిల్ 13న మౌలానాను ప్రభుత్వం మరోసారి నిర్బంధంలోకి తీసుకుంది. ఆంక్షలతో కూడిన స్వేచ్ఛను ప్రభుత్వం ప్రసాదిస్తాననగా అందుకు మౌలానా వ్యతిరేకించారు. మౌలానా హసరత్ తీసుకున్న ఆ నిర్ణయం పట్ల మౌలానా ఆజాద్, అలీ సోదరులు ఆందోళన వ్యక్తంచేయగా బేగం నిశాతున్నీసా మాత్రం ఎటువంటి జంకు లేకుండా భర్త నిర్ణయాన్ని సమర్థిస్తూ **ఆంక్షలతో కూడిన స్వేచ్ఛ కంటే జైలు జీవితం ఎంతో మేలు** అని ప్రకటించారు.

( She declared that arrest was better than detention and that her husband had done well by rejecting the conditions proposed by the British Empire's toadies - Hasrath Mohani, Page.46-47)

పల్లెటూరు నుండి విచ్చేసిన పడతిలో ఇంతటి ధైర్యం, సాహసం, హేతుబద్ధ ఆలోచనల వ్యక్తీకరణలను గమనించిన ప్రముఖ నాయకులు అమితాశ్చర్యాన్ని వ్యక్తం చేశారు. ఈ సందర్భంగా బేగం నిశాతున్నీసాలో దాగిఉన్న శక్తియుక్తులన్నీ బహిర్గత మయ్యాయి. మౌలానా విడుదల కోసం అధికారులతో పోరాడుతూ, న్యాయ వాదులను కలసి ఒకవైపున తీవ్రంగా కృషిచేస్తూ, మరోవైపున మౌలానా పక్షాన ప్రజలకు, పత్రికలకు సమాచారం అందిస్తూ, ప్రముఖ జాతీయోద్యమ నాయకులతో సంప్రదింపులు జరుపుతూ, అభిప్రాయాలను పంచుకుంటూ, జాతీయోద్యమ కార్యక్రమాలలో నిరంతరం పాల్గొంటూ ఆమె జాతీయ స్థాయిలో గుర్తింపు పొందారు.

మౌలానాను అరెస్టు చేసిన పోలీసులు ఆయనను ఒక్కచోట ఉంచకుండా రహస్యంగా పలుచోట్లకు మార్చుతున్నప్పటికి ఎంతో చాకచక్యంతో ఆ విషయాలను తెలుసుకుంటూ భర్త పరిస్థితిని, ఆయన అభిప్రాయాలను ప్రజలకు, జాతీయోద్యమ నేతలకు తెలుపుతూ మౌలానాకు ప్రజలకు ఆమె సంధానకర్తలా వ్యవహరించారు. ఆ సమయంలో కూడా మౌలానా పక్షాన వాదించేందుకు న్యాయవాదులు ముందుకు రాలేదు. ఆ సంక్లిష్ట పరిస్థితులను కూడా తట్టుకుంటూ భర్త పక్షాన క్రియాశీలకంగా వ్యవహరించారు.

మౌలానా జైలులో ఉన్నప్పుడు ఆయన సంకల్పబలాన్ని, ప్రభుత్వానికి తలవంచని





దృఢదీక్షను తెలియజేస్తూ ఆయనకు సంబంధించిన వ్యవహారాల మీద వ్యాఖ్యానిస్తూ పలువురు ప్రముఖులకు ఆమె ఉత్తరాలు రాశారు. 1916 ఏప్రిల్ 11న మౌలానా అబ్దుల్ బారికి లేఖ రాస్తూ, **మౌలానాకు భగవంతుడు మరింత సంకల్పబలం ఇవ్వాలి. ఏం జరుగుతుందో చూద్దాం. ఒక వేళ జైలు శిక్ష పడినా ధైర్యంగా ఉండాలి...నేను కూడా జైలుశిక్షకు గాని ఉరిశిక్షకు గాని బలవ్వడానికి సిద్ధంగా ఉండాలి**, అని ప్రకటించారు. మౌలానా మోహాని లలిత్‌పూరు జైలులో ఉండగా, ఆయనకు 1916 ఏప్రిల్ 28న రాసిన లేఖలో **ఎవడైతే జులుం చేస్తాడో వాడు కత్తికి బలవుతాడు. మనం జులుం చేయం. మన మీద జులుం సాగుతున్నందుకు సంతోషిద్దాం** అని ఆమె రాశారు.

మౌలానా మోహాని నిర్బంధంలో ఉండగా ఆమె చూపిన చొరవ, కార్యదక్షత, సమయస్ఫూర్తి, దేశభక్తిని కొనియాడుతూ మౌలానా అబుల్ కలాం ఆజాద్, మౌలానా అబ్దుల్ బారి ఫిరంగి మహల్, మౌలానా షౌకత్ అలీ, మౌలానా ముహమ్మద్ అలీ, ఆబాది బానో బేగం తదితర ప్రముఖులు ఆమెకు లేఖలు రాయగా మహాత్మా గాంధీ ఆమె ధైర్యసాహసాలను ప్రశంసిస్తూ తన పత్రికలలో ప్రత్యేక కథనాలు ప్రచురించారు.

జాతీయ స్థాయిలో బేగం నిశాతున్నీసాకు లభించిన గుర్తింపు గౌరవం ఎలా ఉన్నా ఇంట్లో మాత్రం భయంకర దుర్భర పరిస్థితులను ఎదుర్కోవాల్సివచ్చింది. ఆనారోగ్యం, పోలీసుల వేధింపులు, పేదరికం ఆ కుటుంబాన్ని పట్టి పీడించసాగాయి. ఆ సమయంలో ఆమె ఇంట దొంగతనం కూడా జరిగింది. ఆ దొంగతనంతో ఆ కుటుంబం ఆర్థికంగా మరింత కునారిల్లిపోయింది. కుటుంబం ఎంతటి ఆర్థిక అవసరాలతో అల్లాడుతున్నా ఆమె మాత్రం ఆత్మగౌరవానికి ఏమాత్రం భంగం కలుగనివ్వలేదు.

ఆ కుటుంబం పరిస్థితులు తెలుసుకున్న మౌలానా సన్నిహిత మిత్రులు, హిందూస్థాన్ పత్రిక సంపాదకులు, జాతీయ కాంగ్రెస్ నాయకులు పండిత కిషన్ ప్రసాద్ కౌల్ 1916 –17లో అలీఘర్ వచ్చారు. ఆ సమయంలో మౌలానా ఇంటి పరిస్థితులను స్వయంగా చూసిన ఆయన ఆమెకు ఆర్థిక సహకారం అందించదలిచారు. ఈ విషయాన్ని సంశయిస్తూ ఆమెవద్ద ప్రస్తావించారు. ప్రజల నుండి చందా వసూలు చేసి ఆమెకు పంపగలనన్నారు. ఆ మాట విన్నంతనే **మేము ఎలా ఉన్నామో అలాగే ఉండడానికి సంతోషిస్తున్నాం...మా బరువును ఇతరుల మీద వేయటం సరికాదు. మా విషయం గురించి ఆలోచించ వద్దు.. మౌలానా ప్రచురించిన సాహిత్యం చాలా పడిఉంది. మీకు వీలైనట్టయితే ఆ గ్రంథాలను**

**విక్రయించి సహకరించండి. ప్రజల నుండి చందాల వసూలు మాత్రం వద్దు** అని ఆమె సున్నితంగా పండిత్ కౌల్ అభ్యర్థనను నిరాకరించారు.

ఈ విధంగా ఆత్మాభిమానానికి ఏమాత్రం విఘాతం కలుగనివ్వకుండా కష్టనష్టాలను చిరునవ్వుతో స్వాగతిస్తూ ముందుకు సాగే ఉత్తమగుణసంపదతో బేగం నిశాతున్నీసా ఆచరణాత్మక ఉద్యమకారిణిగా జాతీయ స్థాయిలో ఖ్యాతి గడించారు. ప్రజలలో గౌరవాభిమానాలను సంతరించుకున్న ఆమె ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధుల సరసన నిలిచారు. ఆనాడు సరోజిని నాయుడు, అనిబీసెంట్, ఆబాది బానో బేగం తదితరులు గల భారతీయ మహిళా కాంగ్రెస్ ప్రతినిధిమండలిలో స్థానం పొందారు.

ప్రముఖ మహిళల ప్రతినిధి బృందంలో సభ్యురాలిగా ఆమె 1917లో మాంటేగ్‌ను కలిశారు. ఆ సందర్భంగా బ్రిటీషు ఉన్నతాధికారి సమక్షంలో ఆమె చూపిన తెగువ ఆమెలోని పోరాటయోధురాలిని మరోమారు బహిర్గతం చేసింది. విచారణ లేకుండా పోలీసుల నిర్బంధంలో మగ్గుతున్న, ఆంక్షల వలయంలో చిక్కుకుని బాధలు పడుతున్న ఉద్యమకారుల పక్షాన భారతీయ మహిళా కాంగ్రెస్ ప్రతినిధిమండలి సభ్యురాలిగాఆమె మాట్లాడారు. **ఐర్లండులోని విప్లవకారులను విడుదల చేస్తున్న మీరు నిర్బంధంలో ఉన్న భారతీయ యోధులకు ఎందుకు స్వేచ్ఛనివ్వరని** బ్రిటీష్ ప్రభుత్వ కార్యదర్శి మాంటేగ్‌ను ప్రశ్నిస్తూ జాతీయోద్యమకారుల విడులను డిమాండ్ చేసిన తీరు ఆమెలోని నిర్భీతికి నిదర్శనంగా నిలచింది.

1918 మేలో హసరత్ మోహాని జైలు నుండి విడుదలయ్యారు. గృహనిర్బంధ ఉత్తర్వులు మాత్రం అలాగే కొనసాగుతున్నాయి.ఆ ఆంక్షలను ఆయన నిరాకరిస్తూ వాటిని ఉల్లంఘించారు. ఆ కారణంగా మీరట్, మోహాన్ తదితర ప్రాంతాలలో ఆంక్షలతో కూడిన నిర్బంధాన్ని మౌలానా చవిచూడాల్సి వచ్చింది. ఈ విషయమై నిశాతున్నీసా బేగం భర్త పక్షాన న్యాయపోరాటం సాగించారు. ఆ పోరాటం ఫలితంగా చివరకు డిసెంబరు మాసంలో మౌలానాకు పూర్తిగా స్వేచ్ఛ లభించింది. ప్రభుత్వం విధించిన ఆంక్షలు తొలగగానే నిశాతున్నీసాతో కలసి మౌలానా ఖిలాఫత్ ఉద్యమంలో చురుగ్గా భాగస్వాములయ్యారు.

1920 డిసెంబరులో ఆరంభమైన సహాయనిరాకరణ ఉద్యమంలో మౌలానా పాల్గొన్నారు. ఈ సందర్భంగా బేగం నిశాతున్నీసా క్రియాశీలక పాత్ర నిర్వహించారు. హిందూ, ముస్లింల ఐక్యతను కాంక్షిస్తూ ఆమె ప్రచార కార్యక్రమాలను ఉధృతం చేశారు.





ప్రజలు ఐక్యంగా పోరాడినప్పుడు మాత్రమే బలమైన బ్రిటీషు ప్రభుత్వాన్ని మన దేశం నుండి తొలిగించగలమని మౌలానా దంపతులు ప్రబోధించారు. స్వదేశీయతను ప్రోత్సహించటం తోపాటు విదేశీ వస్తువులను బహిష్కరణ తదితర అంశాల మీద ఆమె పటిష్టమైన ప్రచార కార్యక్రమాన్ని ఆరంభించారు. ఆ కార్యక్రమాలలో భాగంగా సహాయనిరాకరణ ఉద్యమానికి ఊపిరిపోస్తూ **అలీఘర్ ఖిలాఫత్ స్టోర్స్** ఏర్పాటు చేశారు. ఈ మేరకు మౌలానా దంపతులు భారత దేశంలో ముందుగా **స్వదేశీ బట్టల వ్యాపారం** ఆరంభించిన వారయ్యారు. స్వదేశీని విస్తృతంగా ప్రచారం చేసేందుకు నిశాతున్నీసా పలు సమావేశాలు నిర్వహించారు. ఆ సమావేశాలలో ప్రసంగిస్తూ మహిళలను ఆ దిశగా ప్రోత్సహించారు. ఈ ఉద్యమంలో ఆమె నిర్వహించిన బృహత్తర పాత్రను కొనియాడుతూ 1920 మే 19నాటి **యంగ్ ఇండియా** పత్రికలో మహాత్మా గాంధీ ప్రత్యేక శీర్షిక కూడా నిర్వహించారు.

1920లో మౌలానా హసరత్ మోహాని తమ నివాసాన్ని అలీఘర్ నుండి కాన్పూరుకు మార్చి అక్కడ **ఖిలాఫత్ స్వదేశీ స్టోర్స్ లిమిటెడ్** ను ప్రారంభించారు. ఈ వ్యాపార నిర్వహణలో నిశాతున్నీసా బేగం భర్తకు చేయూతనిచ్చారు. ఆరంభంలో ఈ వ్యాపారం బాగున్నా ఆ తరువాత మౌలానా అరెస్టులు, ప్రభుత్వం ఒత్తిడి, పోలీసుల అరాచకం వలన వ్యాపారం నష్టదాయకంగా పరిణమించింది. ఆ కారణంగా ఆర్థికంగా మౌలానా ఇక్కట్లు పడాల్సివచ్చింది.

ఆర్థికంగా అవస్థల పాలవుతున్నా నిశాతున్నీసా దంపతులు రైలులో మూడవ తరగతి బోగీలలోని అసౌకర్యాలను భరిస్తూ సుదీర్ఘ ప్రయాణం చేసి 1921 నాటి అహమ్మదాబాద్ సమావేశాలలో పాల్గొనేందుకు వచ్చారు. అహమ్మదాబాద్‌లో ఆబాది బానో బేగం నేతృత్వంలో అఖిల భారత మహిళల సమావేశం జరిగింది. ఈ సమావేశంలో కస్తూరిబా గాంధీ, సరళా దేవిలతోపాటుగా ఆమె పాల్గొన్నారు. ఈ సందర్భంగా నిశాతున్నీసా మాట్లాడుతూ స్త్రీ విద్య పట్ల అత్యధిక శ్రద్ధ చూపాలన్నారు. మహిళలో చైతన్యం రావాలంటే ముందుగా చదువు చాలా అవసరమని భావించారు. స్వగ్రామంలో ఆడపిల్లలకు అక్షరజ్ఞానం అందించడానికి చిన్నతనంలోనే ప్రయత్నించిన నిశాతున్నీసా ఈసారి అఖిల భారత మహిళా కాంగ్రెస్ వేదిక మీద నుండి ఆ అంశాన్ని ప్రకటించారు.

1921లో అహమ్మదాబాద్ జాతీయ కాంగ్రెస్ సమావేశం జరిగింది. ఆ

సమావేశంలో మౌలానా మోహాని **సంపూర్ణ స్వరాజ్యం** కోరుతూ చారిత్రాత్మక ప్రతిపాదన చేశారు. ఆ ప్రతిపాదనను బేగం నిశాతున్నీసా బలపర్చారు. గాంధీజీ వ్యతిరేకత వలన ఆనాడు ఆ ప్రతిపాదన తీర్మానం కాలేకపోయింది. ఆ సంఘటన నేపథ్యంలో 1922లో గయాలో జరిగిన మరొక సమావేశంలో ఆనాటి అంశాన్ని పురస్కరించుకుని మహాత్మాగాంధీ వైఖరిని నిశితంగా విమర్శిస్తూ ఆమె అద్భుత ప్రసంగం చేశారు. ఆ ప్రసంగం సభికులను ఆశ్చర్యచకితులను చేసింది. ఆ సమయంలో జైలులో ఉన్న మహాత్ముడు కూడా ఆమె అభిభాషణ వివరాలను తెలుసుకుని నిశాతున్నీసా నిబద్ధతను అభినందించారు.

ఈ సందర్భంగా **సంపూర్ణ స్వరాజ్యం** కాంక్షిస్తూ మౌలానా మోహాని చేసిన పలు ప్రసంగాల పట్ల ఆగ్రహించిన ప్రభుత్వం 1922 ఏప్రిల్ 14న ఆయనను అరెస్టు చేసింది. బేగం నిశాతున్నీసా మళ్ళీ న్యాయపోరాటం ఆరంభించారు. మౌలానా కుటుంబం అలీఘర్ నుండి కాన్పూరుకు తరలి వెళ్ళినందున ఈ సారి ఆమె పోరు కాన్పూరు నుండి సాగింది. చివరకు మౌలానాకు కోర్టు రెండు సంవత్సరాల జైలుశిక్ష విధించింది. ఈ మేరకు జాతీయోద్యమకారునిగా మౌలానా మోహాని అత్యధిక సమయం జైళ్ళలో గడపాల్సి రావటంతో నిశాతున్నిసా ఆర్థికంగా పలు కడగండ్లను ఎదుర్కొంటూ కూడా జాతీయ కాంగ్రెస్ నుండి ప్రజల నుండి వచ్చిన ఆర్థికసహాయాన్ని తిరస్కరించారు. ఈ విధంగా అన్ని కష్టనష్టాలను సహిస్తూ పోరుబాటన సాగిన నిశాతున్నిసా ఉద్యమకారుల కుటుంబాల కు ఆదర్శంగా నిలిచారు.

అహమ్మదాబాద్ జాతీయ కాంగ్రెస్ సమావేశాలనంతరం 1924 డిసెంబరు 29న మౌలానా హసరత్ మోహాని భారత జాతీయ కాంగ్రెస్‌కు రాజీనామా చేశారు. భర్తను రాజకీయ సహచరునిగా భావించిన బేగం నిశాతున్నీసా ఆయన అభిప్రాయాలను సమర్ధించారు. ఏ పార్టీలో ఉన్నా, ఎక్కడ ఉన్నా సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కొంటూ, సంపూర్ణ స్వరాజ్యం, ప్రజల సంక్షేమం కాంక్షించే ఆ దంపతులు తమ లక్ష్యం దిశగా ముందుకు సాగుతూ, భారత కార్మికోద్యమ నిర్మాణంలోనూ భాగస్వామ్యం వహించారు.

చివరివరకు అటు ప్రజలతో మమేకమై జాతీయోద్యమంలో, ఇటు కార్మికులతో ఏకమై కార్మికోద్యమంలో ఆమె చురుకైన పాత్రను కొనసాగించారు. 1925లో కాన్పూరులో జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశాల సందర్భంగా జరిగిన కార్మికుల భారీ ప్రదర్శనకు ఆమె నాయకత్వం వహించారు. ఆ తరువాత క్రమక్రమంగా నిశాతున్నీసా బేగం క్రియాశీలక





రాజకీయాలకు దూరమయ్యారు.

ఈ మేరకు జీవితం చరమ దశ వరకు ఏదో ఒక మార్గాన బ్రిటీషు వ్యతిరేక పోరాటంలో ఆమె చూపిన తెగువ, ధైర్యసాహసాలను స్వయంగా గమనించిన మౌలానా ముహమ్మద్ అలీ ఆమె వ్యక్తిత్వంలోని ఔన్నత్యం మౌలానా మోహాని కంటే గొప్పదని కీర్తిస్తూ , ' his stature remain secondary to that of the fragile lady who was endowed with a heart larger than his...the woman, who had during his absence, inspired the Muslims with such daring and fortitude that even he could not have done had he not been behind the bars'. (Hasrath Mohani, Page.72) అని అన్నారు. ఆమెలోని ఉత్తమ గుణసంపదను మననం చేసుకుంటూ ఆనాటి ముస్లిం మహిళలలో మాత్రమే కాకుండా సమకాలీన పురుషులలో కూడా అంతటి స్థాయి కన్పించదని, మౌలానా హసరత్ మోహాని స్వయంగా నిశాతున్నీసా బేగం గురించిన రాసిన ఆర్టికల్‌లో ఈ క్రింది విధంగా పేర్కొన్నారు.

' Her selflessness, modesty, sense of dignity and honour, benevolence, perception and sagacity, courage and truthfulness, her determination and daring, generosity and sincerity, the depth of her faith and the purity of devotion, her high sensibility and politeness and fortitude, and, above all her devotion to the Prophet and her faith placed Begum Mohani much above not just Muslim women but also above most men of time. ' (Hasrath Mohani, Page.72).

బేగం నిశాతున్నీసా క్రియాశీలక రాజకీయాలకు దూరంగా ఉన్నా భర్తతోపాటుగా పలు ప్రాంతాలను చుట్టివచ్చారు. ఆ పర్యటనలలోని విశేషాలను, తన అనుభవాలను రాజకీయాభిప్రాయాలను అక్షరబద్ధం చేస్తూ Safar Nama-e-Hijaz, Safar Nama-e-Iraq అను గ్రంథాలను రాసి ప్రచురించారు.

ఈ విధంగా ప్రత్యక్షంగా తన విలక్షణమైన వ్యవహారసరళితో, పరోక్షంగా తన భర్త అభిప్రాయాలను ప్రభావితం చేస్తూ, అటు భారత స్వాతంత్ర్య సంగ్రామంలో, ఇటు భారత కార్మికోద్యమ చరిత్రలో అత్యుత్తమ ధైర్యసాహసాలు, కార్యదక్షత, సమయస్ఫూర్తి ప్రదర్శించిన ఉద్యమకారిణిగా తనదైన ముద్రను సుస్థిరం చేసుకున్న బేగం నిశాతున్నీసా 1937 ఏప్రిల్ 18న కాన్పూర్‌లో కన్నుమూశారు.

◆◆◆

## గాంధీజీ ఆహ్వానం మేరకు నాయకత్వ బాధ్యతలు స్వీకరించిన

# అమీనా తయ్యాబ్జీ

**(1866-1942)**

బ్రిటీషు వ్యతిరేక పోరాటాలలో భాగంగా సాగిన సంస్కరణోద్యమాలలో ఆనాడు మహిళలు చురుగ్గా పాల్గొన్నారు. ఆ కార్యక్రమాలలో నిబద్ధతతోపాటుగా ఎంతో కార్య దక్షతను ప్రదర్శించారు. ఆ కారణంగా సమర్థత గల అటువంటి మహిళలను మహాత్మా గాంధీ స్వయంగా ఆహ్వానించి వారికి నాయకత్వపగ్గాలను అందించారు. అంతటి మహోత్తర గౌరవాన్ని దక్కించుకున్న మహిళలలో అగ్రగణ్యులు బేగం అమీనా తయ్యాబ్జీ.

అమీనా తయ్యాబ్జీ గుజరాత్‌కు చెందిన ప్రసిద్ధ తయ్యాబ్జీల కుటుంబంలో 1866లో జన్మించారు. జాతీయ కాంగ్రెస్ నాయకులు జస్టిస్ బద్రుద్దీన్ తయ్యాబ్జీ ఆమె తండ్రికాగా జస్టిస్ అబ్బాస్ తయ్యాబ్జీని ఆమె వివాహం చేసుకున్నారు. ఆ కుటుంబంలో ఉన్న రాజకీయ వాతావరణం మూలంగా అమీనా చిన్ననాటి నుండే స్వాతంత్ర్యోద్యమం పట్ల ఆకర్షితురాలయ్యారు. ఆమె మొదటి నుండి ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ సభ్యురాలు.

అమీనాలో గల పట్టుదల గుజరాత్ మహిళలలో ఆమెపట్ల ఉన్న గౌరవాన్ని గమనించిన గాంధీజీ 1930 ఏప్రిల్ 11న ఆమె కుమార్తె రెహనా తయ్యాబ్జీ పేరిట ఓ లేఖ రాస్తూ **మధ్యపాన నిషేధం, విదేశీ వస్తువుల బహిష్కరణ తదితర అంశాల మీద**





**గుజరాత్ మహిళల సమావేశం ఏర్పాటు చేస్తున్నాను. ఆ సమావేశానికి నీవు, మీ అమ్మగారు తప్పక హాజరుకావాలి** అని కోరారు. స్వయంగా మహాత్ముడు పంపిన ఆహ్వానాన్ని గౌరవిస్తూ అమీనా సమావేశానికి హజరయ్యారు. ఆ సమావేశంలో గాంధీజీ సమక్షంలో గుజరాత్ మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలిగా అమీనా తయ్యాబ్జీ ఎంపికయ్యారు. మద్యపాన నిషేధం, విదేశీ వస్తువుల బహిష్కరణ కోసం కృషిచేయాలని నిర్ణయిస్తూ ఆ సమావేశం తీర్మానించింది.

ఆ నిర్ణయాల మేరకు గుజరాత్ మహిళా కాంగ్రెస్ నేతగా అమీనా తయ్యాబ్జీ అన్ని కష్టనష్టాల కోర్చి మద్యపాన నిషేధం, విదేశీ వస్తువుల బహిష్కరణోద్యమానికి ప్రాణం పోశారు. గుజరాత్ అంతటా ధర్నా, పికెటింగ్, రాస్తారోకో లాంటి ఆందోళనా రూపాలతో ఉద్యమించి భారతదేశం మొత్తానికి గుజరాత్‌ను ఆదర్శప్రాయమైన మార్గంలో నిలిపారు. విదేశీ వస్తువుల బహిష్కరణకు ప్రత్యామ్నాయంగా ఖద్దరు వస్త్రధారణను ప్రోత్సహించారు. రాట్నం తిప్పటం, నూలు వడకటం, ఖద్దరు నేయటం, ఖద్దరు ధరించడాన్ని స్వయంగా ఆచరించి ఆయా కార్యక్రమాలకు బహుళ ప్రాచుర్యం కల్పించారు.

ఆమె కృషి, కార్యదక్షతను గమనించిన గాంధీజీ తన **యంగ్ ఇండియా, నవజీవన్** పత్రికలలో **తగిన తీర్మానం చేసి గుజరాత్ మహిళలు మహత్తరమైన బాధ్యతను స్వీకరించారు. ఆ బరువును మహిళల పక్షాన అమీనా తయ్యాబ్జీ ఆమె కమిటీ భరించారు** అని ప్రశంసించారు. ఈ ఉద్యమం నేపథ్యంలో మహిళా కాంగ్రెస్ పక్షాన వైస్రాయికి పంపిన లేఖలో 24 మంది మహిళల సంతకాలతో పాటుగా అమీనా తయ్యాబ్జీ సంతకాన్ని కూడా గాంధీజీ కోరడం ద్వారా జాతీయ స్థాయిలో ఆమె ప్రాధాన్యత వెల్లడయ్యింది. ఆ లేఖలో ఆమనా ఖురేషి, రెహనా తయ్యాబ్జీలు కూడా సంతకాలు చేశారు.

చివరివరకు జాతీయోద్యంలో పాల్గొని, మహాత్ముని అడుగుజాడల్లో ఆమె నడిచారు. బాధ్యత స్వీకరించిన కార్యక్రమాలన్నిటినీ దీక్షాదక్షలతో నిర్వహించి ఉద్యమకారులకు ఆదర్శంగా నిలచిన శ్రీమతి అమీనా తయ్యాబ్జీ 1942లో కన్నుమూశారు.

(Collected Works of Mathama Gandhi, Govt. Of India Publications, New Delhi and Family, Kinship and Marriage among Muslims in India, Prof. Imthiaz Ahamed, Manohar, 1976)

◆◆◆

# కలకత్తా పారిశుధ్య కార్మికుల పెద్దమ్మగా ఖ్యాతిగడించిన

# మజీదా హసీనా బేగం

**భా**రతదేశంలోని విప్లవదళాలు బ్రిటీష్ ప్రభుత్వ పైశాచిక దాడులకు గురై, విప్లవకారులు భయంకర శిక్షలకు బలి కావటంతో స్వాతంత్ర్యోద్యమంలో **అగ్నియుగం** గా భాసించిన విప్లవోద్యమం కొంత మేరకు బలహీనపడింది. మాతృభూమి విముక్తి కోసం ఆ యోధులు ప్రదర్శించిన అసమాన దేశభక్తి ప్రజలలో, ప్రధానంగా యువకులలో, త్యాగపూరిత ఆలోచనలకు అంకురార్పణ చేసింది. ఆ సమయంలో రష్యాలో ప్రజలు సాధించిన విజయం ప్రపంచ వ్యాపితంగా యువతరాన్ని ఉత్సాహపర్చింది. బ్రిటీష్ సామ్రాజ్యవాద శక్తులకు వ్యతిరేకంగా ఒకవైపున పోరాడటమే కాకుండా అన్నిరకాల దోపిడీకి వ్యతిరేకంగా ఉద్యమించాలన్న చైతన్యానికి ఆ ఉత్సాహం కారణమయ్యింది. ఈ మేరకు వెలువడిన చైతన్యదీప్తుల వెలుగులో అంకిత భావం గల యువత పుట్టుకొచ్చింది. ఆ వెలుగు దివ్వెలలో ఒకరు శ్రీమతి మజీదా హసీనా బేగం.

ప్రస్తుత పశ్చిమ బెంగాల్ రాష్ట్ర రాజధాని కలకత్తాను ప్రధాన కేంద్రంగా చేసుకుని బ్రిటీష్ వ్యతిరేక కార్యకలాపాలను ప్రారంభించి మజీదా హసీనా బేగం ప్రజా పోరాటాలకు నాంది పలికారు. జాతీయోద్యమంలో పాల్గొనాల్సిందిగా ప్రజలను కోరుతూ జనచైతన్య కార్యక్రమాలను నిర్వహిస్తూ, ప్రజలలో బ్రిటీష్ వ్యతిరేక భావాలను పెంపొందించారు. ఈ జనచైతన్య కార్యక్రమాలలో భాగంగా ఆమె సాగించిన పర్యటనల్లో కలకత్తా పట్టణాన్ని





శుభ్రంగా ఉంచుతున్న పారిశుధ్యకార్మికుల దుర్భర పరిస్థితులను స్వయంగా గమనించారు. స్వాతంత్ర్యోద్యమకారిణిగా ఉద్యమాల అనుభవంగల ఆమె శ్రమ జీవులు కష్టనష్టాలను అనుభవపూర్వకంగా తెలుసుకుని అసహాయులైన కార్మికులను సంఘటితంచేసి కనీస హక్కుల సాధనకు సంకల్పించారు. ఆ దిశగా కార్మికులను సమైక్యపర్చి పోరాటం ప్రారంభించారు. ఈ క్రమంలో పలు ఇక్కట్లకు గురయ్యారు, పలుమార్లు అరెస్టయ్యారు. బ్రిటీష్ పోలీసుల లాఠీ దెబ్బలను రుచి చూశారు.

ఆమె ప్రారంభించిన పోరాటానికి కార్మిక సంక్షేమం ఆశించే యువకులు, ప్రజలు అన్నివిధాల అండదండలిచ్చారు. కలకత్తా మహానగరంలోని పారిశుధ్య కార్మికులు, పేదాసాదా జనం మజీదా హసీనా బేగంను, తమ ఆత్మబంధువుగా మనస్సులలో ప్రతిష్టించుకుని ఆమె వెంట నడిచారు. కనీస హక్కులను సాధించుకున్నారు. ఈ విజయాలు హసీనా బేగంలో ఆత్మ విశ్వాసాన్ని పెంచాయి. ఆమె మరింతగా ఉద్యమించారు.

బ్రిటీష్ ప్రభుత్వ ప్రజా వ్యతిరేక చర్యలను ఆమె ఏమాత్రం సహించలేదు. ద్వితీయ ప్రపంచ యుద్ధం సమయంలో యుద్ధ వ్యతిరేక కార్యక్రమాలలో పాల్గొని ఆమె జైలు కెళ్ళారు. పోరాటమే ఊపిరిగా తన కార్యక్షేత్రాన్ని నిర్దేశించుకుని కృషి ప్రారంభించిన ఆమె మహిళల సమస్యల మీద కూడా దృష్టిసారించారు. అణచివేతకు వ్యతిరేకంగా ఆందోళను విస్తరింప చేశారు. జాతీయోద్యమం చివరి దశలో మతం పేరుతో మనుషులను చీల్చపూనుకున్న మతోన్మాద శక్తులకు వ్యతిరేకంగా పోరాడారు. ఆమెకు వేర్పాటువాదుల నుండి ప్రమాద ఘంటికలు వినవచ్చినా ఏ మాత్రం అధైర్యపడకుండా ఆ శక్తుల కుయుక్తులను, కుట్రలను ఎండగడ్తూ ప్రజలను చైతన్యవంతుల్ని చేయగల ప్రసంగాలు చేస్తూ ప్రజలను సంఘటిత పర్చారు.

ఆమె నిరంతరం ప్రజల కోసం శ్రమించారు. ఆ కారణంగా ప్రజల ప్రశంసలను అందుకున్నారు. చివరకు "...the lady of incomparable audacity and uncommon dedication..darling of Calcutta scavengers...", అని ప్రముఖ చరిత్రకారుడు Prof. Santimoy Rayచే ప్రస్తుతించబడిన శ్రీమతి మజీదా హసీనా బేగం పలు విజయాలు సాధించి స్వాతంత్రోద్యమ చరిత్రలోనే కాకుండా, కార్మిక పోరాటాల చరిత్రలో కూడా చిరస్మరణీయమైన ఖ్యాతి గడించారు.

◆◆◆

## జాతీయోద్యమానికి సర్వం వొడ్డిన దానగుణశీలి

# షంషున్నీసా అన్సారి

**(-1938)**

**మా**తృభూమిని బ్రిటీష్ దాస్యశృంఖలాలనుండి విముక్తం చేయడానికి సాగిన మహత్తర స్వాతంత్ర్య సంగ్రామంలో ఈ దేశపు స్త్రీ పురుషులు విభిన్న పాత్రలను నిర్వహించి లక్ష్యసాధనలో తోడ్పడ్డారు. ఈ మేరకు పోరుబాటన నడిచిన మహిళల్లో ఆత్మార్పణలతో కొందరైతే, అద్వితీయ త్యాగనిరతి, దాన,ధర్మ,దయాగుణాలతో మరికొందరు తమదైన క్రియాశీలక భాగస్వామ్యాన్ని అందించారు. ఈ ద్వితీయ వర్గీకరణలోని మహిళలు తాము స్వయంగా ఉద్యమించకున్నా ఉద్యమకారులకు అన్ని విధాల తోడ్పాటు అందచేస్తూ ఉద్యమకారుల కుటుంబాలను ఆదుకుంటూ పరోక్షంగా ఉద్యమానికి జవసత్వాలను అందించారు. ఈ కోవకు చెందిన దానగుణశీలి శ్రీమతి షంషున్నీసా అన్సారి.

భారత జాతీయ కాంగ్రెస్‌లో ప్రధాన భూమిక నిర్వహించిన ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు ఢిల్లీకి చెందిన డాక్టర్ ముక్తార్ అహమ్మద్ అన్సారి ఆమె భర్త. 1899లో డాక్టర్ అన్సారిని ఆమె వివాహమాడారు. ఆమె సాంప్రదాయక మత విద్యను అభ్యసించటంతోపాటు పర్షియన్, ఉర్దూ, అరబ్బీ బాషలలో ప్రావీణ్యం సంపాదించారు. సాహిత్య, రాజకీయ,సామాజిక గ్రంథాల పఠనం పట్ల ఆమెకు ఆసక్తి ఎక్కువ. సమకాలీన సమాజ





స్వరూప స్వభావాలను, రాజకీయాలను అవగాహన చేసుకోవటం పట్ల అభిలాష. ఈ మేరకు సంతరించుకున్న పరిజ్ఞానం వలన ఆమె సమకాలీన రాజకీయాల గురించి భర్తతోపాటుగా మహాత్మాగాంధీ లాంటి మహానాయకులతో చర్చించటం జరిగింది. ప్రముఖ నాయకులతో అభిప్రాయాలను పంచుకుంటూ, తన వైఖరిని స్పష్టం చేయడానికి ఆమె ఏమాత్రం వెనుకాడ లేదు. జాతీయ,అంతర్జాతీయ రాజకీయ పరిణామాలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ భర్త అభిప్రాయాలను కూడా ప్రభావితం చేసిన ప్రతిభావంతురాలు.

1921నాటి ఖిలాఫత్ ఉద్యమ కార్యక్రమాలలో పాల్గొనటం ద్వారా ఆమె జాతీయోద్యమ రంగప్రవేశం చేశారు. జాతీయోద్యమంలో బేగం షంషున్నీసా, డాక్టర్ అన్సారి బహుముఖ పాత్ర నిర్వహించారు. ఢిల్లీ ఖిలాఫత్ కమిటీ మహిళా విభాగం అధ్యక్షురాలుగా ఆమె సేవలందించారు. డాక్టర్ అన్సారి ప్రత్యక్ష కార్యకలాపాలలో పాల్గొంటే షంషున్నీసా బేగం **పర్దానషీ మహిళ** అయిఉండి కూడా బృహత్తరమైన బాధ్యతలను నిర్వహించి మహాత్మా గాంధీజీ నుండి ప్రేమాభిమానాలందుకున్నారు. ఆమె ముస్లిం మహిళలలో ఎక్కువగా పనిచేశారు. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, అలీ సోదరుల మాతృమూర్తి ఆబాది బానో బేగం ఢిల్లీ వచ్చిన సందర్భంగా మహిళలతో ప్రత్యేక సమావేశాలను నిర్వహించి ఖిలాఫత్ ఉద్యమం కోసం రెండువేల రూపాయలకు పైగా విరాళాలను వసూలు చేసి ఆమెకు అందజేశారు.

భారత జాతీయ కాంగ్రెస్ సమావేశాలలో ఆమె ప్రత్యేక ఆసక్తి చూపారు. అన్సారి తోపాటుగా ఆమె కూడా ప్రతి సమావేశానికి హాజరయ్యేవారని INSIDE INDIA గ్రంథంలో రచయిత్రి HALIDE EDIB పేర్కొన్నారు. డాక్టర్ అన్సారి ప్రారంభించిన Anjuman-i-Khuddam-Kaaba కార్యకలాపాలలో ఆమె కీలకపాత్ర వహించారు. ఆధునిక విద్యావిధానాలు, సాంప్రదాయక విద్యాపద్ధతుల మధ్యన సమన్వయం ఏర్పరచడానికి, మక్కాలోని పవిత్రస్థలాలను పరిరక్షించి అభివృద్ధి పర్చేందుకు సాగిన కృషిలో తోడ్పాటునందించిన ఈ సంస్థకు ఆర్థిక వనరులు సమకూర్చడానికి షంషున్నీసా బేగం ఎంతగానో శ్రమించారు.

జాతీయ కాంగ్రెస్ ఢిల్లీలో నిర్వహించిన జాతీయ స్థాయి కార్యక్రమాలు ఏవీకూడా ఆమె భాగస్వామ్యం, సహకారం లేకుండా ఆరంభమయ్యేవి కావు. జాతీయ కాంగ్రెస్

సమావేశాలు ఏవి జరిగినా, అవి ఎన్ని రోజులు జరిగినా ఆ కార్యక్రమాలకు హాజరయ్యే ప్రతి యోధుడికి డాక్టర్ అన్సారి ఇంట ఆతిధ్యం లభించేది. ఆ కారణంగా ఆయన గృహం Dar-Us-Salam జాతీయోద్యమకారులందరికి అతిధి గృహంగా ఉండేది. Dar-Us-Salam లో ఉద్యమకారులకు అన్ని సదుపాయాలు కల్పించటం జరిగేది. ఆ సందర్భంగా షంషున్నీసా బేగం సమావేశాలకు హాజరయ్యే ప్రతి ఒక్కరికీ వారివారి అవసరాలకు తగ్గట్టుగా వసతి, భోజన ఏర్పాట్లు చేసేవారు. అతిధులెవ్వరికీ ఎటువంటి అసౌకర్యం కలుగకుండా ప్రణాళికాబద్ధంగా ఆతిధ్యాన్ని, ఇతర సదుపాయాలను కల్పించటంలో ఆమె శ్రద్ధవహించారు.

ఢిల్లీకి వివిధ రాష్ట్రాల నుండి విచ్చేసిన స్వాతంత్ర్యసమరయోధులకు వారివారి అవసరాలు, అలవాట్లను బట్టి ఏర్పాట్లు చేయటంలో ఆమె ప్రత్యేకత చూపారు. మాంసాహార, శాకాహార, యూరోపియన్ భోజనం ఇష్టపడే వారికి ప్రత్యేక శిబిరాలు ఉండేవి. అతిధుల కోసం శిబిరాల ఏర్పాటు ఎక్కడోకాకుండా Dar-Us-Salam లోని విశాలమైన ఆవరణలో ఏర్పాటు చేసి వారికి ఎటువంటి అసౌకర్యం జరగకుండా జాగ్రత్తలు తీసుకున్నారు. ఏ ఒక్కరి విశ్వాసాలకు, మనోభావాలకు భంగం కలుగకుండా చూసుకున్నారు. ఈ ఏర్పాట్లకు ఆమెకు తగినంత ధనం సమకూర్చటం డాక్టర్ అన్సారి వంతైతే, ఏర్పాట్ల నిర్వహణ, పర్యవేక్షణను బేగం అన్సారి తన భుజస్కంధాల మీద వేసుకుని శ్రమించారు. ప్రతినిధుల శిబిరాల నిర్వహణాభారాన్ని అతిధులు ఆశ్చర్యపోయేలా సమర్ధవంతగా నిర్వహించటం ఆమె ప్రత్యేకత.

షంషున్నీసా బేగం అంతటి బృహత్తర కార్యక్రమాన్ని ఎంతో సమర్ధవంతంగా నిర్వహించటం ద్వారా మహాత్మాగాంధీని కూడా ఆశ్చర్యచకితుల్ని చేశారు. జాతీయ కాంగ్రెస్ సమావేశాలు జరిగినన్ని రోజులు వచ్చేవారు, పోయేవారితో Dar-Us-Salam ధర్మశాలను తలపింపచేసేది. ఆ కారణంగా 1931మార్చి 29నాటి **నవజీవన్** పత్రికలో **అన్సారి ధర్మశాల** శీర్షికతో డాక్టర్ అన్సారి ఇంట అతిథ్యం లంభించే తీరు తెన్నులను, ఆయా కార్యక్రమాల నిర్వహణలో బేగం షంషున్నీసా చూపిన శ్రద్ధను ప్రశంసిస్తు గాంధీజీ ప్రత్యేక వ్యాసం రాసారు.

ఈ వ్యాసంలో షంషున్నీసా దయాగుణాన్ని, సహనశీలతను, కార్యనిర్వహణా దక్షతనేకాక, ఆమె ప్రగతిశీల భావాలను ఎంతగానో కొనియాడారు. ఆ వ్యాసం చివరిలో,





**అన్సారి బేగం సమక్షాన శ్రద్ధాభావనలతో నా శిరస్సు వంచాను** (మైనే శ్రద్ధా భావ్‌సే అపనా శిర్ బేగం అన్సారి కే సమక్ష్ మే ఝుకా దియా) అని అన్నారు. మహాత్మా గాంధీ తన ఢిల్లీ పర్యటనలో డాక్టర్ అన్సారి ఇంట మాత్రమే బసచేసేవారు. ఆ సందర్భంగా బేగం అన్సారితో కుటుంబ విషయాలనే కాకుండా, జాతీయోద్యమ కార్యక్రమాల గురించి కూడా చర్చించేవారని HALIDE EDIB రచనల ద్వారా తెలుస్తోంది. ఆ సన్నిహితత్వం నేపథ్యంలో మహాత్ముడు ఆ మహనీయురాలి పట్ల అంతటి అపూర్వ గౌరవాన్ని ప్రకటించారు.

అద్వితీయ త్యాగమూర్తులైన డాక్టర్ అన్సారి, బేగం షంషున్నీసా దంపతులకు సంతానం లేదు. జాతీయోద్యమ కార్యక్రమాలలో తలమునకలై ఉన్న ఆ దంపతులు సంతానం గురించి ఆలోచించలేదు. చాలా కాలం తరువాత జోహారా బేగం అను అమ్మాయిని, షౌకతుల్లా అను అబ్బాయిని పెంచుకున్నారు. ఈ ఇరువురు కూడా జోహరా బేగం అన్సారి, షౌకతుల్లా అన్సారి పేర్లతో ప్రసిద్ధులయ్యారు. బిడ్డలు జోహారా బేగం, షౌకతుల్లా అన్సారిలను స్వాతంత్రోద్యమంలో క్రియాశీలక పాత్ర వహించే విధంగా బేగం అన్సారి తీర్చిదిద్దారు.

1936లో డాక్టర్ ముక్తార్ అహమ్మద్ అన్సారి మరణించారు. భర్త మరణించినా ఆయన లేని లోటు కన్పించకుండా బేగం షంషున్నీసా చివరి శ్వాస వరకు స్వరాజ్య కాంక్షతో భారత జాతీయ కాంగ్రెస్‌కు, జాతీయోద్యమకారులకు తన ఇంట అసమానమైన సేవలందించారు. డాక్టర్ అన్సారి సమకూర్చిపెట్టిన సంపదను, తన అమూల్యమైన సమయాన్ని ఆమె పూర్తిగా జాతీయోద్యమానికి అంకితం చేశారు. **డాక్టర్ అన్సారి ఏమి సాధించినా అదంతా షంషున్నిసా సహకారంతో మాత్రమే** నని ఆమె ప్రముఖుల గౌరవాన్ని అందుకున్నారు. ఆమెతో పరిచయమున్న ప్రతి ఒక్కరిచే **పవిత్రమైన.. దానశీల మహిళ**గా (Very pious, very charitable) ప్రశంసలందుకున్నారు.

ఈ మేరకు చివరివరకు స్వాతంత్ర్యోద్యమానికి తోడ్పాటు అందిస్తూ, జాతీయోద్యమ కార్యకర్తల, ఉద్యమనాయకుల, ప్రజల గౌరవాభిమానాలను అందుకున్న స్వాతంత్ర్య సమరయోధురాలు శ్రీమతి షంషున్నీసా అన్సారి 1938లో కన్నుమూశారు.

◆◆◆

## మౌలానా అబుల్ కలాం ఆజాద్‌కు స్ఫూర్తి ప్రదాత

# జులేఖా బేగం

**(1893-1942)**

**భ**ర్తతో పాటు భుజం భుజం కలిపి కొందరు మహిళలు జాతీయోద్యమంలో పాల్గొంటే, ఉద్యమకారుడైన భర్త దృష్టిని కుటుంబ సమస్యల వైపుకు మళ్ళనివ్వకుండా స్ఫూర్తిని ప్రసాదించిన మహిళామణులు మరికొందరు. ఈ మేరకు పోరాట జీవితంలోని కడగండ్లను స్వయంగా భరించి స్వాతంత్ర్య సమరయోధుడైన జీవిత భాగస్వామిని మాతృదేశ సేవకు అర్పించిన సతీమణులలో ప్రముఖులు శ్రీమతి జులేఖా బేగం.

దశాబ్దానికి పైగా జైలు జీవితం గడిపిన మౌలానా అబ్దుల్ కలాం ఆజాద్ భార్య బేగం జులేఖా 1892-93 ప్రాంతంలో పశ్చిమ బెంగాల్‌లో జన్మించారు. ఆమెకు 7-8 సంవత్సరాల వయస్సు ఉండగా అనగా 1900-01 ప్రాంతంలో 12-13 ఏండ్ల వయస్కుడైన అబుల్ కలాం ఆజాద్‌తో వివాహం జరిగింది. ఆ ఇద్దరు తగిన వయస్సు వచ్చాక భార్యభర్తలుగా నూతన జీవితాన్ని ఆరంభించారు. (మౌలానా అబుల్ కలాం ఆజాద్ (హిందీ), కె.సి యాదవ్, హోప్ ఇండియా పబ్లికేషన్స్, గుర్‌గావ్, 2004, పేజీ.17). ఆ దంపతులకు **హసీన్** అను కుమారుడు కలిగాడు. బ్రిటీషు వ్యతిరేక పోరాటంలో నిరంతరం గడుపుతున్న భర్త ఇంట ఉంటున్న సమయం తక్కువ కావటంతో కుమారుడి





రాక ఆమెకు కొంత ఊరట కలిగించింది. కానీ ఆ సంతోషం ఎంతోకాలం నిలువలేదు. తల్లితండ్రులమయ్యామని మౌలానా దంపతులు సంతోషించేలోగా నాలుగు సంవత్సరాల వయస్సు గల ఆ పిల్లవాడు మరణించాడు. కుమారుని మరణం జులేఖా బేగం దంపతులను కలచి వేసింది.

జులేఖా బేగం నూతన జీవితాన్ని ఆరంభించేందుకు మెట్టినింట అడుగు పెట్టేసరికి మౌలానా ఆజాద్ బ్రిటీషు వ్యతిరేక పోరాటంలో భాగస్వాములయ్యారు. విప్లవోద్యమంతో బ్రిటీషు వ్యతిరేక పోరాటాన్ని ప్రారంభించిన ఆయన ఆ తరువాత మహాత్ముని మార్గంలో పయనం ఆరంభించారు. మౌలానా బెంగాల్ కేంద్రంగా జాతీయోద్యమంలో క్రియాశీలక పాత్రను స్వీకరించి బాధ్యతలు నిర్వహించసాగారు. అచిరకాలంలోనే ఉర్దూ పత్రిక **అల్ హిలాల్** సంపాదకునిగా, రచయితగా, బ్రిటీష్ ప్రభుత్వ వ్యతిరేక పోరాటయోధుడిగా రూపొందిన మౌలానా క్షణం తీరుబడి లేకుండా కార్యక్రమాలలో నిమగ్నమయ్యారు. ఆ విధంగా మౌలానా రచయితగా సాహిత్యరంగంలో శ్రమిస్తున్నా, విముక్తి పోరాట యోధుడిగా రాజకీయ రంగంలో నిమగ్నమైయున్నా జులేఖా బేగం ఆయనకు నిరంతరం తోడ్పాటునందించారు. ఏ విధమైన కష్టం కలగకుండా, ఆయన దృష్టి కుటుంబ సమస్యల మీదకు మళ్ళకుండా ఆమె జాగ్రత్తలు తీసుకున్నారు.

మౌలానా ఆజాద్ 1916లో మొట్టమొదటి సారిగా నిర్బంధానికి గురయ్యారు. ఆ సందర్భంగా ఆమె మానసిక స్థితిని తెలియచేస్తూ ఆజాద్ ఇలా రాశారు. **ఆమె తన భావోద్వేగతను ఆపుకోలేకపోయింది. తరువాత చాలా కాలం వరకూ నేనామెను క్షమించ లేదు. ఆ సంఘటన ఆమెను పూర్తిగా మార్చివేసింది. నా జీవితంలోని ఒడిదుడుకులను తట్టుకుని నిలబడే స్థయిర్యాన్ని అలవర్చుకుంది.** (అబుల్ కలామ్ ఆజాద్, అర్షమల్సియాని, భారత ప్రభుత్వ ప్రచురణలు, న్యూఢిల్లీ, 1983. పేజీ.111) ఆ నిర్బంధం సందర్భంగా రాంచీలో ఆయన మూడు సంవత్సరాలు గడిపారు. ఆ సమయంలో ఆమె భర్త నిర్వహిస్తున్న కార్యక్రమాలు కుంటుపడకుండా తన పరిధుల మేరకు స్వయంగా చర్యలు తీసుకున్నారు.

1920లో మౌలానా జైలు నుండి విడుదల కాగానే ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమంలో పాల్గొన్నారు. మౌలానా ఇల్లు విడిచి, ఇల్లాలిని మరచి ఖిలాపత్-సహాయ నిరాకరణ ఉద్యమానికి పూర్తిగా అంకితమయ్యారు. ఈ సందర్భంగా బ్రిటీషు పాలకుల చర్యలను విమర్శిస్తూ, వారి చర్యల మీద నిప్పులు చెరిగే ఉపన్యాసాలు చేస్తూ పర్యటనలు

గావించారు. అందుకు ఆగ్రహించిన ప్రభుత్వం 1921 డిసెంబరులో ఆయనను కలకత్తాలో అరెస్టు చేసింది. విచారణ తరువాత 1922 ఫిబ్రవరిలో ఏడాది జైలుశిక్ష విధిస్తూ న్యాయస్థానం తీర్పుచెప్పింది.

ఈ సందర్భంగా ఎప్పుడూ బయటకు రాకుండా ఇంటిపట్టున కాలం గడుపుతున్న జులేఖా బేగంలోని అత్మవిశ్వాసం, దేశభక్తి, మాతృభూమి పట్ల తనకున్న బాధ్యత, జాతీయోద్యమం పట్ల ఉన్న నిబద్ధత బహిర్గతమయ్యాయి. మౌలానాకు శిక్ష పడటం పట్ల ఆమె ఆశ్చర్యపడలేదు. అందుకు ఆమె మానసికంగా సిద్ధంగా ఉన్నారు. మౌలానాకు చాలా తక్కువ శిక్షపడినందుకు ఆమె అగౌరవంగా భావించారు. ఈ విషయాన్ని, **ఈ రోజున నా భర్త కేసులో న్యాయస్థానం తీర్పు చెప్పింది. ఆయనకు ఏడాది జైలు శిక్ష విధించింది. మేము అనుకున్న దానికంటే ఇది చాలా తక్కువ. నా భర్తకు అన్యాయం జరిగిందని మీరు అంగీకరిస్తారని అనుకుంటా** అని గాంధీజీని ఉద్దేశించి రాసిన లేఖలో ఆమె పేర్కొన్నారు. (Understanding The Muslim Mind, Rajmohan Gandhi, Penguin Books, New Delhi, 1987, Page. 228-229)

మౌలానాను అరెస్టు చేయటంతో కలకత్తా కేంద్రంగా ఆయన నిర్వహిస్తున్న కార్యక్రమాల నిర్వహణ బాధ్యతలను చేపట్టేందుకు జులేఖా బేగం ముందుకు వచ్చారు. ఈ విషయాన్ని గాంధీజీకి రాసిన లేఖలో, **నా భర్త అరెస్టు వలన బెంగాల్ ఖిలాఫత్ కమిటీ కార్యక్రమాల నిర్వహణలో ఏర్పడిన ఖాళీని నా కృషితో భర్తీ చేస్తాను. ఆయన ఇక్కడుంటే జరిగే పనులన్నీ యధాతథంగా జరుగుతాయని తెలుపుకుంటున్నాను. గతంలో నా భర్త నిర్బంధంలో ఉన్నప్పుడు నా శక్తి మేరకు ఆయన బాధ్యతలను నేను నిర్వర్తించాను. గత ఐదు సంవత్సరాల నుండి నా ఆరోగ్యం బాగాలేదు. మానసికంగా బలహీనంగా ఉన్నాను. నా ఆనారోగ్యం దృష్ట్యా నా విధిని నేను నిర్వహించేందుకు మౌలానా అనుమతించేవారు కారు. అయినప్పటికి ఈ నశ్వరమైన శరీరాన్ని ఖిలాఫత్ ఉద్యమానికి సంపూర్ణంగా అంకితం చేయాలని నిర్ణయించుకున్నాను**, అని రాశారు.

మౌలానా రాజకీయ కార్యకలాపాలలో ఎంతో తోడ్పాటు అందించిన ఆమె ఆయన సాగించిన సాహితీ వ్యవసాయంలో ఆమె చేయూత ఎంతో ఉంది. ఓసారి నిద్రలేమి వలన ఎర్రగా మారిన ఆమె కళ్ళను చూసి ఆమె మరదలు కళ్ళు అలా ఉన్నాయేంటని ప్రశ్నించింది. ఆ ప్రశ్నకు సమాధానంగా **ఈ మధ్యకాలంలో మౌలానా**





**గారు ఖురాన్ తర్జుమా గావిస్తున్నారు. రాత్రి 2 గంటల తరువాత లేచి కూర్చోని ఆయన ఎంత సేపు ఆ పనిలో ఉంటారో అంతసేపు నేనూ మేల్కొని ఆయనకు వింజామర వీస్తూ గడుపుతున్నాను. బాగా ఉక్కపోతగా ఉంది కదా. ఆయన మేల్కొని పనిచేస్తుంటే నేనెలా నిద్రపోగలను చెప్పు?** (Bharath Ke Swatantra Samg ram me Muslim Mahilavonka Yogdan (Hindi), Dr. Abida Samiuddin, IOS, New Delhi, 1997 Page.168) అని ఆమె ప్రశ్నించారు. ఈ సమాధానం ద్వారా ఆమెలోని సేవాగుణం, భర్తకు అందచేసిన సేవల తీరుతెన్నులు వెల్లడవుతున్నాయి.

1923 ప్రాంతంలో తన 35 సంవత్సరాల వయస్సులో మౌలానా భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎంపిక కావటంతో ఆయన కార్యకలాపాలు బాగా విస్తృతమయ్యాయి. అప్పటి నుండి ఆయన రాజకీయాలలో మరింత బిజీ అయ్యారు. భారతదేశం అంతటా పర్యటిస్తూ, కార్యక్రమాలలో పాల్గొంటూ, అరెస్టులు, జైళ్ళల్లో గడుపుతూ మౌలానా ఇంటిపట్టున ఉండటమే కరువైంది. 1939లో మరోసారి ఆయన జాతీయ కాంగ్రెస్ అధ్యక్షస్థానం అలకరించారు. స్వాతంత్ర్యోద్యమం అతి కీలక దశలో ఉన్నందున జాతీయ కాంగ్రెస్ అధ్యక్షులుగా ఆయన బాధ్యతలు మరింతగా పెరిగాయి. ఆ సమయంలో ఆయనకు భార్య గురించిగాని, ఆమె ఆరోగ్యం గురించిగాని, ఆర్థిక పరిస్థితుల గురించి గాని పట్టించుకునే అవకాశం ఏమాత్రం లేకుండా పోయింది. ఆ బాధాకరమైన వాతావరణాన్ని ఏకాంతంగా భరిస్తూ, అన్ని అవస్థలను సహిస్తూ జులేఖా బేగం గడిపారు.

ఆ క్రమంలో భర్తకు అన్ని విధాల తోడ్పాటు అందించటం మాత్రమేకాకుండా అవసర సమయాల్లో ఇంటి నుండి బయటకు వచ్చి భర్త స్థానాన్ని భర్తీ చేయడానికి సాహసించిన జులేఖా బేగం అంతటితో ఆగలేదు. స్వాతంత్ర్యసమరంలో పాల్గొంటున్న ఉద్యమకారుల కుటుంబాలను ఆదుకుంటూ పట్టుదల సడలిపోకుండా ఆ త్యాగమూర్తులు సమరభూమిలో సాగిపోవడానికి ఎంతగానో తోడ్పడ్డారు. ఈ కార్యక్రమాల నిర్వహణలో ఆమె తన అనారోగ్యాన్ని లెక్కచేయలేదు. ఆ కారణంగా **నా భావాలను విశ్వాసాలను పంచుకోనడమే కాక నా జీవితంలో నిజమైన సహచరిణిగా నిలచింది** అని ఆమె గురించి ఆజాద్ స్వయంగా పేర్కొన్నారు. (అబుల్ కలామ్ : పేజి. 111)

1941లో జులేఖా బేగం అనారోగ్యం తీవ్రతరమయ్యింది. స్థల, జల మార్పిడి

చేస్తే ఆమె ఆరోగ్యం కుదటపడుతుందని డాక్టర్లు సలహా ఇచ్చారు. ఆ సలహా మేరకు జులేఖా బేగం కలకత్తా వదలి రాంచీ వెళ్ళారు. ఆరోగ్యం కొంత మెరుగుపడ్డాక 1942 జూలై 31న తిరిగి కలకత్తా వచ్చారు. ఆమె కలకత్తాకు వచ్చి నాలుగు రోజులు గడవక ముందే ఆగస్టు 1942న మౌలానా కలకత్తా నుండి అఖిల భారత కాంగ్రెస్ సమావేశాలకు బొంబాయికి బయలుదేరాల్సి వచ్చింది.

మౌలానా బొంబాయికి బయలు దేరుతున్నప్పుడు చివరి సారిగా వీడ్కోలు పలికిన ఆవేదనాభరిత సంఘటనలో జులేఖా బేగం ప్రవర్తనా తీరు గురించి India Wins Freedom (Page.95) లో ఆజాద్ రాస్తూ, **ఆగస్టు 3న బొంబాయి బయల్దేరుతున్నప్పుడు ఎప్పటివలే నన్ను సాగనంపడానికి ఆమె వీధి గుమ్మం వరకు వచ్చింది. అనూహ్యమైన పరిస్థితులేమి ఎదురవ్వకపోతే 13న తిరిగి వస్తానని చెప్పాను.' ఖుదా- హాఫీజ్ ' అన్న మాటతప్ప ఇంకొక్క మాట ఆవిడ నోటివెంట రాలేదు. ఆమె ఏమీ చెప్పకుండా మౌనంగా ఉన్నా, దుఃఖం ఛాయలు ఆమె ముఖం మీద తారాడుతున్నాయి. ఆమె కళ్ళు వర్షించటం లేదుకాని ఆమె మోము బాధను వ్యక్తంచేస్తుంది. నేను గతంలో అనేకసార్లు ఆమెను వదలి వెళ్ళాను. నేనెప్పుడూ ఆమెను అంత బాధాతప్తంగా చూడలేదు** అని వివరించారు. (Understanding The Muslim Mind, Rajmohan Gandhi, Penguin Books, New Delhi, 1987, Page.240).

ఆ విధంగా బొంబాయి వెళ్ళిన మౌలానా పలు కారణాల మూలంగా భార్యకు వాగ్దానం చేసినట్టు కలకత్తాకు రాలేకపోయారు. బ్రిటీషు ప్రభుత్వం ఆయనను అరెస్టు చేసి నైనిటాల్ జైలులో బంధించింది. ఆ సమయంలో జులేఖా బేగం ఆయనకు పలు ఉత్తరాలు రాశారు. ఆ ఉత్తరాలలో ఎక్కడా కూడా తన అనారోగ్యం గురించి పేర్కొనలేదు. ఆమె ప్రాణాంతక రుగ్మతతో తీవ్రంగా బాధపడుతున్నందున, ఆ పరిస్థితిని మిత్రుల ద్వారా, పత్రికలలో వచ్చిన వార్తల ద్వారా మాత్రమే మౌలానా తెలుసుకున్నారు. ఆయనను పెరోల్ మీద విడుదల చేయడానికి ప్రభుత్వం అంగీకరిస్తూ కొన్ని ఆంక్షలు విధించింది. ఆ ఆంక్షలకు తలవంచి భార్యను చూడడానికి మౌలానా నిరాకరించారు. ఈ విషయం మీద జవహర్ లాల్ నెహ్రూతోపాటుగా ఇతర నాయకులు కూడా ఎంతగా నచ్చచెప్పినా అవమానకర ఆంక్షలను శిరసావహించి పెరోల్ మీద విడుదల పొందడానికి మౌలానా ఆజాద్ ససేమిరా అంగీకరించలేదు.





బేగం జులేఖా అనారోగ్యం రోజురోజుకు తీవ్రతరమైంది. డాక్టర్ల ప్రయత్నాలు ఫలించలేదు. చివరకు భర్త కడసారి చూపుకు నోచుకోకుండానే 1943 ఏప్రిల్ 19న భర్తకు 1500 మైళ్ళ దూరంలో ఉన్న కలకత్తాలో జులేఖా చివరి శ్వాసవిడిచారు. ఆమె కన్నుమూసిన విషయం తెలిసిన మౌలానా ఆజాద్ **మా 26 సంవత్సరాల వైవాహిక జీవితం సమాప్తమయ్యింది. మృత్యువు మా మధ్యన అడ్డుగోడలు నిర్మించింది** అంటూ నిస్సహాయంగా విలపించారు.

ఈ విధంగా జీవితాంతం మౌలానాకు మానసిక స్థైర్యాన్ని కలుగచేస్తూ, ఆయన మనస్సు విముక్తి పోరాటం మీద లగ్నమయ్యే విధంగా తోడ్పడిన జులేఖా బేగంలోని పట్టుదల, ధైర్యసాహసాలనులను, త్యాగాన్ని ప్రస్తావిస్తూ **ఆమె ఎంతో ధైర్యశాలి, నా ఆలోచనల ఆచరణలో ఆమె సహ భాగస్వామి. ఆమె తోడ్పాటు లేనట్టయితే నా రాజకీయ జీవితం అసంపూర్ణంగా మిగిలిపోయేది** అని మౌలానా అబుల్ కలాం అన్నారంటే ఆయన జీవిత సహచరిణిగా ఆమె ఎంతటి మహత్తర పాత్రను నిర్వహించారో అర్థమౌతుంది.

స్వాతంత్ర్యోద్యమంలో బేగం జులేఖా నిర్వహించిన పాత్రను సక్రమంగా అర్థం చేసుకున్నందున ఆనాడు మౌలానాతోపాటుగా దేశమంతా శోకసంద్రమయ్యింది. భారత దేశం యావత్తు ఆమెకు శ్రద్ధాంజలి ఘటించింది. ఆది నుండి మౌలానా రాజకీయాలను తీవ్రంగా వ్యతిరేకిస్తున్న ముస్లింలీగ్ కూడా ఎంతో గౌరవంతో ఆమెకు అంజలిఘటిస్తూ ప్రత్యేక సమావేశం జరిపి సంతాప తీర్మానాలు చేసింది. ఆ తీర్మానాలలో జులేఖా బేగం త్యాగ నిరతిని, లక్ష్యం పట్ల ఉన్న నిబద్ధతను కొనియాడటం విశేషం.

స్వాతంత్ర్యోద్యమంలో తాను ప్రత్యక్షంగా పాల్గొనక పోయినప్పటికి జీవిత భాగస్వామిని విముక్తి పోరాటానికి అంకితం చేసి, భర్తకు నైతిక, మానసిక బలాన్ని అందించి ఆయన దృష్టి స్వరాజ్యమను మహత్తర లక్ష్యం దిశగా సాగేందుకు తోడ్పడి పరోక్షంగా స్వాతంత్ర్యసంగ్రామంలో భాగస్వామ్యం అందించి శ్రీమతి జులేఖా బేగం పునీతులయ్యారు.

◆◆◆

నా భర్తకు శిక్ష పడినందుకు సంతోషంగా ఉంది. అందుకు ఆ ప్రభువుకు నా సాష్టాంగ ప్రణామములు. ఆయన మార్గంలోనే నేనూ నడుస్తా. ఆ కంటక ప్రాయమైన మార్గంలో సాగి నా ప్రాణాలను బలివ్వడానికి కూడా నేను సిద్ధం. **– సాదత్ బానో కిచ్లూ**

## ఆదర్శవంతమైన సేవలందించిన మహిళానేత

# సుఫియా సోం

**జా**తీయోద్యమంలో మహిళలు విభిన్న పాత్రలను పోషించారు. జాతీయ కాంగ్రెస్ పిలుపు మేరకు ఓర్పు, సహనం,సేవాభావనలకు ప్రతిరూపాలయిన మహిళలు అపూర్వ సేవలందించి, కార్యదక్షతను ప్రదర్శించి ఉద్యమంలో భాగస్వాములయ్యారు. ఈ కోవలో ఆత్మీయ పూర్వకంగా సేవలను అందించటంలో సమర్థులన్పించుకున్న ప్రముఖ మహిళా నేతగా శ్రీమతి సుఫియా సోం ఖ్యాతిగాంచారు. అఖిల భారత జాతీయ కాంగ్రెస్ మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలిగా, సేవాదళం పర్యవేక్షకురాలిగా, నాయకురాలిగా ఆమె ప్రఖ్యాతి చెందారు.

బొంబాయికి చెందిన సుఫియా సోం గురించి వివరాలు ప్రత్యేకంగా లభించకున్నా మహాత్మాగాంధీ రాసిన లేఖలు, ' సరిహద్దు గాంధీ ' ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్ ఆత్మకథలో ఆమె గురించి చేసిన ప్రస్తావనలను బట్టి జాతీయోద్యమంలో సుఫియా పాత్ర తెలుస్తోంది. సరిహద్దు గాంధీ తన ఆత్మకథలో **నాతోపాటు నా కుమార్తె మహర్ తాజ్, అన్నగారి కుమార్తె కుమారి మరియ్యం కూడా వచ్చారు. సుఫియాతో కలసి వాళ్ళంతా మహిళా విభాగంలో సేవలందిస్తూ గడిపారు** అని పేర్కొన్నారు.

చిన్న వయస్సులోనే సుఫియా పలుసార్లు జైలుకెళ్లారు. ఈ విషయం బిజనోర్





నుండి ప్రచురితమైన **మదీనా** అను ఉర్దూ వార్తాపత్రికలోని వార్తల ద్వారా తెలుస్తోంది. ఆ పత్రిక 1932 మార్చి 12 నాటి సంచికలో, **బొంబాయికి చెందిన సుప్రసిద్ధ మహిళా నాయకురాలు కుమారి సుఫియా సోం జైలు నుండి విడుదలయ్యారు. ఆమెను బొంబాయి వదలి వెళ్లవలసినదిగా ఉత్తర్వులు జారీ అయ్యాయి** అని రాసింది. 1932 మే ఒకటి నాటి సంచికలో **హిందూస్తాన్ సేవాదళం నాయకురాలు సుఫియా సోంను పోలీసులు అరెస్టు చేశారు** అని రాసింది. ప్రజలను చైతన్యవంతుల్ని చేసి సంఘటితపర్చగల సత్తా కలిగిన నాయకురాలు కావడంతో ఆమెను బొంబాయి నగరం నుండి ప్రభుత్వం బహిష్కరించింది. ఈ వార్తలు, విశేషాలను బట్టి సుఫియా సోం బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో చురుగ్గా పాల్గొంటూ క్రమక్రమంగా ప్రముఖ నాయకురాలి స్థానానికి ఎదిగినట్టు తెలుస్తుంది.

జాతీయోద్యమ కార్యక్రమాలలో పాల్గొంటున్నప్పుడే, ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్ సోదరుడు డాక్టర్ ఖాన్‌సాబ్ కుమారుడు ఖాన్ సాదుల్లా ఖాన్‌ను సుఫియా సోం వివాహం చేసుకున్నారు. సాదుల్లాఖాన్ బొంబాయి కార్పొరేషన్‌లో ఇంజనీర్ మాత్రమే కాకుండా, నాన్న, చిన్నాన్నలాగే స్వాతంత్ర్య సమరయోధుడు. ఈ విషయాన్ని మహాత్మాగాంధీ 1935 జనవరి 26నాటి తన లేఖలో ప్రస్తావిస్తూ, **వివాహం తరువాత భర్త ప్రోత్సాహంతో సుఫియా తన ఇష్టానుసారం దేశంకోసం మరింత బాగా సేవలందించగలదు,** అని ఆశాభావం వ్యక్తంచేశారు. ఆమె వివాహం రోజున తన వ్యక్తిగత కార్యదర్శి మహాదేవ దేశాయి ద్వారా రాయించిన లేఖలో గాంధీజీ నూతన వధువరులకు ఆత్మీయ శుభాకాంక్షలు తెలిపారు.

సుఫియా సోం భర్త సాదుల్లా ఖాన్ మాత్రమే కాకుండా, ఆయన కుటుంబీకులంతా స్వాతంత్ర్య సమరయోధులు కావటంతో, గాంధీజీ రాసినట్టు ఆమె జాతీయోద్యమంలో మరింత చురుకుగా పనిచేయడానికి చక్కని ప్రోత్సాహం లభించింది. ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ పలు లేఖలలో ఆమె కార్యక్రమాల గురించి వాకబు చేయటం ద్వారా, ఆయా విషయాలను ఆ లేఖలలో ప్రస్తావించడాన్ని బట్టి శ్రీమతి సోఫియా సోం దేశభక్తి జాతి జనుల పట్లగల సేవానురక్తి వ్యక్తమౌతుంది.

◆◆◆

# యుద్ధం వద్దని నినదించిన తెలుగింటి ఆడపడుచు

# రబియాబీ

స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న సామాన్య స్త్రీలు పలు ఇక్కట్లు పడాల్సి వచ్చింది. ఈ వెతలు మూడు రకాలుగా ఆనాడు మహిళలను చుట్టుముట్టాయి. తొలుత కుటుంబం, ఆ తరువాత సమాజం, చివరకు బ్రిటీష్ పోలీసు మూకల నుండి ఇబ్బందుల వాతావరణం. ఈ వెతలు ముస్లిం మహిళ విషయానికి వచ్చేసరికి మరింత కఠినమై వారిని ముందుకు సాగనిచ్చేవి కావు. బ్రిటీష్ పోలీసుల దారుణ దాష్టీకాల కంటే, కుటుంబం, సమాజం కల్పించే ఆటంకాల ప్రభావం వారి మీద తీవ్రంగా ఉండి, మాతృదేశ సేవామార్గంలో కొంతవరకు అవరోధాలయ్యాయి. అయినప్పటికీ శ్రీమతి రబియాబీ లాంటి సాహసులు ప్రతికూల వాతావరణాన్ని అధిగమించి జాతీయోద్యమంలో పాల్గొని చరిత్ర సృష్టించారు.

రబియాబీ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అనంతపురం జిల్లా చియ్యడు గ్రామానికి చెందిన మహిళ. ఆమె భర్త యం.మొహిద్దీన్ సాహెబ్. ఆయన స్వాతంత్ర్య సమరయోధులు. ఆమె భర్తతోపాటుగా జాతీయ భావాలను అలవర్చుకున్నారు. ఆనాడు మహాత్ముని నేతృత్వంలో సాగుతున్న జాతీయోద్యమంలో భాగం పంచుకోవాలనుకున్నారు. కుటుంబం, సమాజం సహజంగానే ఆమె ఆలోచనలను ముందుకు సాగనివ్వలేదు. ఆమె నిరాశ చెందలేదు. భర్త కూడా స్వాతంత్ర్య సమరవీరుడు కావటం వలన ఆయనతో తన





అభిప్రాయాలను పంచుకున్నారు. భార్య ఆలోచనల పట్ల మొహిద్దీన్ సాహెబ్ ఎంతో సానుకూలంగా స్పందించారు. విముక్తి పోరాటంలో పాల్గొనాలని అభిలషిస్తున్న ఆమెను ముందుకు సాగమని ప్రోత్సహించారు. ఆమెకు తోడుగా నిలిచారు.

ఆ సమయంలో ద్వితీయ ప్రపంచయుద్ధం సాగుతోంది. భారతీయుల ఇష్టా యిష్టాలతో పని లేకుండా, భారతదేశాన్ని కూడా బ్రిటీష్ పాలకులు తమ పక్షంలో కలిపేసుకున్నారు. అందుకు వ్యతిరేకంగా భారత జాతీయ కాంగ్రెస్ ఉద్యమించింది. భారతదేశ వ్యాప్తంగా యుద్ధ వ్యతిరేక ప్రదర్శనలు ఊపందుకున్నాయి. ఆంధ్రులు కూడా ఏమాత్రం తీసిపోకుండా ప్రదర్శనలు నిర్వహించారు. ఆ కార్యక్రమాలలో భాగంగా అనంతపురం జిల్లాలో జరిగిన యుద్ధ వ్యతిరేక ప్రదర్శనలలో రబియాబీ పాల్గొన్నారు. పర్దా చాటున వుండే ముస్లిం మహిళ బహిరంగ ప్రదర్శనలో పాల్గొని **యుద్ధం వద్దని** నినదించటం పట్ల సాంప్రదాయ వాదులంతా విమర్శలు చేయగా ప్రజలు ఆశ్చర్యపోయారు. ఆమెను అభినందించారు.

ఆ తరువాత కూడా ఆమె పలు కార్యక్రమాలలో పాలుపంచుకున్నారు. 1941లో అనంతపురం ఆర్ట్స్ కళాశాల ఆటల మైదానంలో జరిగిన వ్యక్తి సత్యాగ్రహంలో కూడా రబియాబీ పాల్గొన్నారు. ఒక ముస్లిం మహిళ జాతీయోద్యమంలో భాగంగా సాగిన ప్రదర్శనలో పాల్గొనటం, యుద్ధానికి వ్యతిరేకంగా నినాదాలు ఇవ్వడం, వ్యక్తి సత్యాగ్రహంలో పాత్ర వహించడం తెలుగుగడ్డ మీద ప్రథమమని పలువురు శ్లాఘించారు.

ఆనాడు జైళ్ళల్లో మహిళలకు అవసరమైన కనీస వసతులు ఉండకపోవడంతో మహిళలు అరెస్టులకు ఇష్టపడేవారు కాదు. జాతీయోద్యమంలో భాగంగా సాగిన పలు కార్యక్రమాలలో రబియాబీ పాల్గొన్నప్పటికీ, ఆమె అరెస్టు కాకపోవడంతో ఆ యోధురాలి సాహసకృత్యాలు పోలీసు రికార్డులలో నమోదుకు నోచుకోలేదు. ఆ కారణంగా శ్రీమతి రబియాబీకి సంబంధించిన సమగ్ర సమాచారం అందుబాటులో లేకుండాపోయింది.

◆◆◆

> ఆమె (బేగం అజీజున్) హృదయం షంషుద్దీన్ కోసం ఎంతగా తపించిపోయేదో, భారత స్వాతంత్ర్యము కోసం కూడా అంతగా తపించిపోయేది...ఆమె ప్రేమను బజారులో అమ్ముకొనలేదు. స్వతంత్ర సమర రంగంలో దేశభక్తికి కానుకగా అర్పించింది.
>
> – వి.డి.సావర్కార్

## మహాత్ముడిచే సాహస మహిళగా కీర్తించబడిన

# అంజాదీ బేగం

**భా**రత స్వాతంత్య్రోద్యమ చరిత్రలో ప్రజలు కుటుంబాలకు కుటుంబాలుగా ఉద్యమించిన సంఘటనలు దర్శనమిస్తాయి. ఆ కుటుంబాలలోని పురుషులు సహజంగా బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉద్యమిస్తుండగా, మహిళలు వారికి సహకరించటం సర్వసాధారణం. అలా కాకుండా ఓ కుటుంబంలోని స్త్రీ, పురుషులంతా ఉమ్మడిగా పరాయి పాలనకు వ్యతిరేకంగా పోరుబాట ఎంచుకుని ఉద్యమించటం అరుదు. ఈ విధంగా ఉద్యమించి బ్రిటీష్ పోలీసు రికార్డులలో **' ప్రమాదకర కుటుంబం '** అని నమోదు పొందిన అలీ సోదరుల కుటుంబ సభ్యులలో ఒకరు శ్రీమతి అంజాది బేగం.

అంజాదీ బేగం రాంపూరు సంస్థానానికి చెందిన సంపన్న కుటుంబానికి చెందిన ఆడపడుచు. పుట్టినింట మంచి పుస్తక భాండాగారం ఉండటంతో ధార్మిక గ్రంథాలను విస్తృతంగా అధ్యయనం చేసిన ఆమె అంతటితో సరిపెట్టుకోక అందుబాటులో ఉన్న సామాజిక, ఆర్థిక, రాజకీయ గ్రంథాలను పఠిస్తూ ధార్మిక పరిజ్ఞానం తోపాటుగా లౌకిక పరిజ్ఞానాన్ని సంతరించుకున్నారు.

జాతీయోద్యమంలో **బీబి అమ్మ**గా ప్రసిద్ధిచెందిన శ్రీమతి ఆబాదీ బానో బేగం కుమారుడు మౌలానా ముహమ్మద్ అలీని ఆమె వివాహం చేసుకున్నారు. ఆయన విద్యార్థి





దశ నుండి బ్రిటీషు వ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొంటూ విముక్తిపోరాట నాయకునిగా గుర్తించబడ్డారు. ఆ కుటుంబంలోకి ప్రవేశించిన అంజాది బేగం అతి త్వరలో ఆ కుటుంబం అనుసరిస్తున్న ధార్మిక, రాజకీయ మార్గంలో పయనించటం ఆరంభించారు. ఖిలాఫత్–సహాయనిరాకరణ ఉద్యమం ద్వారా ఆమె మహాత్మా గాంధీ మార్గాన బ్రిటిష్ వ్యతిరేకత పోరాటంలో ప్రవేశించారు.

అలీఘర్‌లో చదువు పూర్తయ్యాక లండన్ చదువులు పూర్తిచేసుకుని ఇండియా తిరిగి వచ్చిన ముహమ్మద్ అలీ రాంపూరు, బరోడా సంస్థానంలో ఉన్నత ఉద్యోగాలు చేసి, స్వేచ్ఛకు ప్రతిబంధకంగా నిలచిన ఆ ఉద్యోగాలను విడిచి చివరకు జర్నలిస్టుగా **కామ్రేడ్** అను ఉర్దూ పత్రికను ప్రారంభించారు. ఆ పత్రిక ద్వారా ప్రజలలో జాతీయ భావాలను ప్రోదిచేస్తూ, హిందూ–ముస్లింల ఐక్యతను ప్రబోధిస్తూ, బ్రిటీష్ వ్యతిరేకతను ప్రజలలో పురికొల్పసాగారు. ఆ సందర్భంగా అంజాది బేగం భర్త అభిప్రాయాలకు మద్దతు తెలుపుతూ పూర్తి సహకారం అందిస్తూ ఆయనను ప్రోత్సహించారు.

ఖిలాఫత్–సహాయనిరాకరణ ఉద్యమంలో పాల్గొనటం ద్వారా ప్రత్యక్ష రాజకీయాలతో ఆమెకు పరిచయం ఏర్పడింది. ఈ ఉద్యమ వ్యాప్తికి అత్తగారు **బీబీ అమ్మ**, భర్త మౌలానా ముహమ్మద్ అలీతో కలసి పలు పర్యటనలు చేశారు. ఆ సందర్భంగా ప్రజల మనస్సులను ప్రభావితం చేయగల సంక్షిప్త ప్రసంగాలతో కార్యకర్తలను కార్యోన్ముఖులను చేశారు. ప్రముఖులను కలసి, ప్రజలను సమీకరించి ఉద్యమ స్వరూపం, ఉద్యమ లక్ష్యం, ఉద్యమ విధివిధానాలను వివరిస్తూ ప్రసంగించటంలో ఆమె మంచి ప్రతిభ చూపారు. సంక్షిప్త ప్రసంగాలు చేస్తూ మంచి వక్తగా ఆమె ఖ్యాతిగాంచారు. ఈ విధంగా అంజాది బేగం ప్రసంగాలు ప్రజలను ఉత్తేజితులను గావించడమే కాక గాంధీజీ ప్రశంసలు కూడా అందుకున్నాయి.

1921 నవంబరు 29 నాటి **యంగ్ ఇండియా** పత్రికలో **సాహస మహిళ** అను శీర్షికన ప్రచురించిన వ్యాసంలో గాంధీజీ ఆమె ప్రసంగాలను ప్రస్తావిస్తూ **ఆమె మొదట ముస్లిం మహిళలను ఉద్దేశించి ప్రసంగించటం ప్రారంభించారు. ఆమె ప్రసంగం ఆమె భర్త మౌలానా ముహమ్మద్ అలీ ప్రసంగానికి ఏమాత్రం తీసిపోదని పూర్తి విశ్వాసంతో చెబుతున్నాను. ఆమెది చిన్నపాటి ప్రసంగం అయినా నేరుగా ప్రజల హృదయాలను తాకి అధిక ప్రభావాన్ని చూపుతుంది. అత్యంత తక్కువ మాటలతో అత్యధిక భావాన్ని**

**అందించగల ఈ కళను తన భర్తకు ఆమె నేర్పగలదా లేదా అను విషయం గురించి నేనేమీ చెప్పలేను** అని రాశారు.

ఈ ఉద్యమంలో భాగంగా మహాత్ముడు నిర్దేశించిన సత్యాగ్రహ ఆందోళనను విజయవంతం చేయడానికి ఆమె శక్తివంచన లేకుండా పనిచేశారు. ఖిలాఫత్ కమిటీ– కాంగ్రెస్ కమిటీ నిర్ణయం మేరకు విదేశీవస్తువుల బహిష్కరణ, మద్యపాన నిషేధం, బ్రిటీష్ సైన్యంలో ఉద్యోగాలను, ప్రభుత్వ పదవులను, ప్రభుత్వ కళాశాలలను త్యజించటం తదితర కార్యకలాపాల అమలు దిశగా ప్రజలను ప్రేరేపించేందుకు ఆమె నడుంకట్టారు. ప్రజలను ప్రధానంగా మహిళలను సత్యాగ్రహాందోళన దిశగా ఆకర్షించేందుకు అత్తగారు ఆబాది బానో బేగంతో, భర్త మౌలానా ముహమ్మద్ అలీతో కలిసి పలుచోట్ల పర్యటించారు.

ఖిలాఫత్– సహాయ నిరాకరణ ఉద్యమానికి అవసరమగు నిధులను సమకూర్చి పెట్టడంలో అంజాది బేగం మంచి నేర్పరి. ఆర్థిక అవశ్యకత వివరిస్తూ ప్రజల నుండి నిధులు సేకరించి ఉద్యమానికి ఆర్థిక జవసత్వాలు అందించటంలో ఆమె తన శక్తిసామర్థ్యాలను చూపారు. ఖిలాఫత్ ఫండ్ నిమిత్తం ఆబాది బానొతోకలసి **లక్షలాది రూపాయాల నిధులను** సమకూర్చారు. **గాంధీజీని ప్రజలకు పరిచయం చేయటం, ఆయన సాగించిన పర్యటనల వ్యయభారాన్ని భరించటంలో ఖిలాఫత్ కార్యకర్తలు, మౌలానా ముహమ్మద్ అలీ కుటుంబానికి చెందిన మహిళలు సమకూర్చిన నిధుల పాత్రను విస్మరించలేము.** (Bharath Ke Swatantra Samgram me Muslim Mahilavonka Yogdaan (Hindi), Dr. Abida Samiuddin, IOS, New Delhi ,1997 Page. 143-144.)

ఖిలాఫత్ నిధుల సేకరణ విషయంలో మౌలానా ఇంటి మహిళలు తీసుకున్న ప్రత్యేక శ్రద్ధను ఆంగ్లేయాధికారి మాల్కం హేలి ఆనాటి లెజిస్లేటివ్ అసెంబ్లీలో ప్రస్తావించి మౌలానా ముహమ్మద్ అలీ ప్రభుత్వ వ్యతిరేకత గురించి వివరిస్తూ, **ఈయన ఇంటి మహిళలు కూడా చందాలు సేకరిస్తారు. విద్రోహానికి పాల్పడతారు** అని ప్రకటించాడు. ప్రతినిధుల సభలో ఆంగ్లేయుడు చేసిన ఈ ప్రకటన ద్వారా ఆనాడు అంజాది బేగం, ఆబాది బానో బేగంలు నిధులు సమకూర్చటంలో చూపిన సమర్థత, ఆ నిధుల ప్రాధాన్యత వెల్లడవుతుంది. ఈ అంశాన్ని మరింతగా నిర్ధారిస్తూ ఆ దిశగా అంజాది బేగం సాగించిన కృషిని మహాత్మా గాంధీ **యంగ్ ఇండియా** లో ప్రత్యేకంగా ఉటంకించారు.

అంజాది బేగం సదా మౌలానా వెంట ఉంటూ, ఖిలాపత్–సహాయ నిరాకరణ





ఉద్యమంలో, భారత జాతీయ కాంగ్రెస్ సమావేశాలన్నిటిలో పాల్గొన్నారు. 1921లో అహమ్మదాబాద్ లో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ వర్కింగ్‌కమిటీ సమావేశాలకు ఆమె ఉత్తర ప్రదేశ్ ప్రతినిధిగా హాజరయ్యారు. ఖిలాఫత్– సహాయ నిరాకరణ ఉద్యమంలో భాగంగా మహాత్ముడు, మౌలానా సోదరులు కలసి సాగించిన దేశవ్యాప్త పర్యటనల సందర్భంగా ఆ బృందంలో ఆమె సభ్యురాలిగా ఉన్నారు. ఈ సందర్భంగా ఆయా కార్యక్రమాల ప్రచారం విషయంలో శ్రద్ధ చూపటమే కాకుండా, ఆర్థిక వ్యవహారాలను ఆమె స్వయంగా పర్యవేక్షించారు. ఈ విషయాన్ని మౌలానా ప్రస్తావిస్తూ, ఆమె **ఆ విషయాలలో నాకంటే సమర్థురాలు...అనాటి మహిళలతో బేరీజు వేసినట్టయితే ఆమె ఖచ్చితంగా క్రియాశీలకంగా కార్యక్రమాలు నిర్వహించటంలో దిట్టగా పరిగణించవచ్చు** అన్నారు.

**జైలు నుండి తిరుగు ప్రయాణానికి టిక్కెటు తీసుకుని వచ్చాను** అంటూ జైలు శిక్షలు తమ జీవితంలో భాగమని భావించిన మౌలానా ముహ్మద్ అలీ ఎక్కువ కాలం జైళ్ళల్లో గడపటం వలన పలు సందర్భాలలో ఆయన బాధ్యతలను అంజాదీ బేగం స్వీకరించారు. అటు కుటుంబపరమైన విషయాలు గాని, ఇటు ఉద్యమపరమైన కార్యక్రమాలను గాని ఆమె ఎంతో సమర్థవంతంగా నిర్వహించారు. ఖిలాపత్ ఉద్యమం సందర్భంగా అత్యధిక సమయం మౌలానా ఇంటిబయట ఉంటున్నందున కుమార్తెల వివాహ కార్యక్రమాలు కూడా ఆమె స్వయంగా చూసుకున్నారు. వివాహం సమయానికి కేవలం అతిథిగా మాత్రమే హాజరయ్యి మౌలానా తిరిగి వెళ్ళివలసిన పర్థితులలో కూడా కార్యదక్షతతో ఆమె అన్ని వ్యవహారాలను నిర్వహించారు. ఈ విషయాన్ని మౌలానా ప్రస్తావిస్తూ, I was too busy to attend anything. So my wife looked after everything as best as she could and I just came in as a wedding guest, అని పేర్కొన్నారు. (Understanding The Muslim Mind, Rajmohan Gandhi, Penguin Books, New Delhi, 1987, Page. 99).

1921 సెప్టెంబరులో మౌలానా ముహమ్మద్ అలీ గాంధీజీ పరివారంతో కలసి కలకత్తా నుండి మద్రాసు వెడుతున్నారు. ఆ పరివారంలో అంజాది బేగం కూడా ఉన్నారు. విశాఖపట్నం రైల్వేస్టేషన్ వద్ద మౌలానా ముహమ్మద్ అలీ ఆరెస్టయ్యారు. అ సందర్భంగా ఆమె చూపిన ధైర్యసాహసాలు జాతీయోద్యమ నేతల, ప్రజల ప్రశంసకు పాత్రమయ్యాయి.

విశాఖపట్నం రైల్వే పోలీసు స్టేషన్‌లో నిర్బంధంలో ఉన్న భర్తను కలసి ' **తన గురించి, కుటుంబం గురించి చింతించాల్సిన అవసరం లేదని** ఆయనకు ఆమె ధైర్యం చెప్పారు. మౌలానా అరెస్టు సందర్భంగా గాంధీజీ ఆమెతో మాట్లాడుతూ మౌలానా అరెస్టు సమయంలో భయం కలుగలేదా? అని ప్రశ్నించగా **ఆయన తన దేశంకోసం జాతి కోసం జైలుకెళ్ళారు**, అని ఆమె ప్రతిస్పందించారని **యంగ్ ఇండియా**లో గాంధీజీ రాశారు. ఈ సంఘటనలు అంజాది బేగంలోని మొక్కవోని దీక్ష, అసమాన ధైర్య సాహసాలకు రుజువులుగా నిలుస్తాయనటంలో సందేహం లేదు.

1928లో పండిట్ మోతిలాల్ నెహ్రూ అధ్యక్షతన రూపొందిన **నెహ్రూ కమిటీ రిపోర్టును** మౌలానా ముహమ్మద్ అలీ అంగీకరించలేదు. ఈ నివేదిక ఢిల్లీ ప్రతిపాదనలకు వ్యతిరేకమంటూ ఆయన విమర్శించారు. ఆ క్రమంలో 1928లో మౌలానా భారత జాతీయ కాంగ్రెస్‌కు మానసికంగా దూరమయ్యారు. ఆయనకు మహాత్మాగాంధీతో కూడా సంబంధాలు సన్నగిల్లాయి. 1930నాటి బొంబాయి సభలో మౌలానా మాట్లాడుతూ మహాత్మా గాంధీ హిందూ మహాసభ మతఛాందసుల ప్రభావానికి లోనయ్యారని అభియోగం చేశారు. ఆ సమయంలో వాయువ్య సరిహద్దు ప్రాంతంలోని **కోహెట్** లో జరిగిన మతకలహాల విషయం మీద గాంధీజీకి మౌలానాకు అభిప్రాయబేధాలు వచ్చాయి. ఆ మతకలహాలకు కారణం ఎవరన్న విషయం మీద ఆ నేతలిరువురికి ఏకాభిప్రాయం కుదరలేదు. ఆ తరువాత క్రమక్రమంగా అలీ సోదరులకు, గాంధీజీకి మధ్య ఎడం బాగా పెరిగింది.

1930లో ప్రథమ రౌండ్ టేబుల్ సమావేశానికి ఎంపిక చేసిన ప్రతినిధిగా మౌలానా లండన్ వెళ్ళారు. ఆయన వెంట అంజాది బేగం కూడా వెళ్ళారు. ఆ సమయానికి మౌలానా ఆర్థిక పరిస్థితులు అధ్వాన్నంగా ఉన్నాయి. అంజాది బేగంను తన వెంట తీసుకెళ్ళేందుకు నిధులు లేని దుస్థితి ఆ కుంటుంబాన్ని ఆవరించింది. ఖిలాఫత్- సహాయ నిరాకరణ ఉద్యమం సందర్భంగా లక్షలాది రూపాయల నిధులను ఉద్యమం కోసం సేకరించి పెట్టిన కుటుంబానికి ప్రయాణ ఖర్చులకు డబ్బులేక ఇబ్బందులు పడాల్సిన దుస్థితి ఎదురయ్యింది. జాతీయ కాంగ్రెస్‌కు దూరం కావటం, నెహ్రూ నివేదికను వ్యతిరేకించటం, మహాత్మా గాంధీతో విభేదించటం వలన ఆయన క్రమంగా జాతీయ కాంగ్రెస్ నాయకుల నిరాదరణకు గురయ్యారు. ఆ కారణంగా ఆర్థిక ఇబ్బందులతో





సతమతమవుతున్న అంజాది బేగం లండన్ ప్రయాణం కోసం అప్పులు చేయాల్సి వచ్చింది.

మౌలానా లండన్ చేరుకున్నాక రౌండ్ టేబుల్ సమావేశాల కోసం అవిశ్రాంతంగా శ్రమించిన కారణంగా అంతంత మాత్రంగా ఉన్న ఆయన ఆరోగ్యం మరింత క్షీణించింది. చికిత్సకు నిధులు కరువు కాగా, ఆల్వార్ మహారాజా పంపిన వైద్యులు ఆయనకు వైద్యం ప్రారంభించారు. ఆయన శరీరం అనుకూలంగా స్పందించలేదు. అత్యధిక సమయం విశ్రాంతి తీసుకోవాలని డాక్టర్లు నిర్దేశించినా మౌలానా మాత్రం అధ్యయనం, ప్రముఖులతో చర్చలు జరపటం, లేఖలు రాయటం మానకుండా ప్రతిక్షణం స్వరాజ్యం గురించి, హిందూ-ముస్లింల ఐక్యత గురించి, ప్రజల స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల గురించి ఆలోచనలు సాగించారు. ఆ సమరయోధుని సేవలో అంజాది బేగం అవిశ్రాంతంగా గడిపారు. ఆ స్థితిలో ఆర్థిక పరిస్థితులు అనుకూలించక ఆమె ఎంతో క్షోభకు గురయ్యారు. ఆ దుస్థితి, అనుభవిస్తున్న కటిక పేదరికం గురించి అంజాది బేగం తన కుమార్తె జోహారాకు లేఖలు రాస్తూ ఎంతో ఆవేదనను వ్యక్తంచేశారు.

ప్రతికూల వాతావరణంలో అంజాది బేగం ఎంతగా శ్రమించినా ఫలితం దక్కలేదు. చివరకు మరణశయ్య నుండి, "...To live for a great cause, and live upto it is perhaps harder than to die for it" అని తన మనోగతాన్ని వ్యక్తంచేస్తూ, 1931 జనవరి 4న మౌలానా ముహమ్మద్ అలీ అంతిమశ్వాస విడిచారు.

మౌలానా అంత్యక్రియలు పూర్తయ్యాక అంజాది బేగం స్వదేశానికి తిరిగి వచ్చారు. రాజకీయంగా ప్రముఖ కాంగ్రెస్ నాయకులతో వచ్చిన అభిప్రాయభేదాల కారణంగా ఆమె కూడా చిన్నచూపుకు గురయ్యారు. ఆ తరువాత కాలంలో ఆమె క్రమంగా అఖిల భారత ముస్లిం లీగ్‌కు సన్నిహితులయ్యారు. ఆ వేదిక నుండి కూడా ఆమె పరాయి పాలకుల వ్యతిరేక పోరాటంలో భాగస్వాములయ్యారు.

ఈ విధంగా జీవిత చరమాంకం వరకు బ్రిటీషు వ్యతిరేక పోరులో పాల్గొన్న **సాహస మహిళ**గా అంజాదీ బేగం నిర్వహించిన మహత్తర పాత్ర నిర్లక్ష్యానికి గురై చరిత్ర పుటలలో వెనక్కి నెట్టి వేయబడిన శ్రీమతి అంజాదీ బేగం చివరకు అతిసాదాసీదా జీవితం గడుపుతూ కన్నుమూశారు.

◆◆◆

# బ్రిటీష్ పోలీసుల భయంకర దాష్టీకాన్ని ఎదుర్కొన్న

# షఫాతున్నీసా బీబీ

**(1896-1948)**

**స్వా**తంత్ర్యోద్యమంలో అష్టకష్టాలు భరించి, అహర్నిశలు శ్రమించి స్వరాజ్యం లభించాక తాము పుట్టిపెరిగిన గడ్డను వదలి వెళ్ళాల్సి వస్తే అది అత్యంత దుర్భర అనుభవం అవుతుంది. అవిశ్రాంతంగా సాగిన స్వాతంత్ర్యోద్యమం పుష్పించి, ఫలించి స్వరాజ్యం సిద్ధించాక మతం ఆసరాతో రాజకీయ నేతృత్వంలో పలు స్వార్థప్రయోజనాలు జమిలిగా ఆడిన వింతనాటకంలో విభజన ముంచుకు వచ్చింది. స్వలాభం ఏమాత్రం ఆశించక ఆనాడు పోరుబాట సాగిన కుటుంబాలు చేసిన అద్వితీయ త్యాగాలు మతం ముద్రవలన మరుగునపడి బలవంతంగా స్వంత గడ్డను విడిచిపెట్టాల్సి రావటం విషాదకరం. అటువంటి భయానక అనుభవాలను **విభజన సంఘటన** కొన్ని కుటుంబాలలో తెచ్చిపెట్టింది. ఆ భయంకర చేదు అనుభవాలను చవిచూసిన మహిళ షఫాతున్నీసా బీబీ.

1896లో పంజాబ్‌లోని లూధియానాలో షఫాతున్నీసా జన్మించారు. ఆమె తండ్రి మౌలానా అబ్దుల్ అజీజ్ నక్షాబంది. ఆయన ధార్మికపండితుడు. ఆయన చిన్న కుమార్తె షఫాతున్నీసా బీబీ. చిన్ననాటనే ఆమె ధార్మిక విద్యతోపాటుగా లౌకిక విద్యను అభ్యసించారు.





తండ్రి సాంప్రదాయక ధార్మికుడు కనుక ఆ మార్గంలోనే పెరిగినా లోకం పోకడను మాత్రం చిన్ననాట నుండి ఆసక్తిగా గమనించారు. 1914లో లూధియానాకు చెందిన ప్రముఖులు మౌలానా హఫీజుర్రెహమాన్‌ను వివాహమాడారు.

జాతీయోద్యమంలో చురుకైన పాత్ర నిర్వహిస్తున్న మౌలానా హబీబుర్రెహమాన్ జమాఅత్-ఏ-ఉలేమా-ఏ-హింద్, భారత జాతీయ కాంగ్రెస్‌లో క్రియాశీలక సభ్యులు. బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగుతున్న పోరాటంలో ఆయన అత్యంత కీలక పాత్ర నిర్వహించారు. ఖిలాఫత్-సహాయ నిరాకరణ ఉద్యమనేతగా ఖిలాపత్ ఉద్యమంలో ప్రముఖ పాత్ర పోషించారు. మంచి వక్తగా ఖ్యాతిగాంచిన మౌలానాకు మారువేషాలలో ప్రభుత్వ గూఢాచారుల కన్నుగప్పి, పోలీసులకు చిక్కకుండా ముప్పు తిప్పలు పెట్టిన సాహస చరిత్ర ఉంది. ఆ కారణంగా పోలీసులు కక్షగట్టటంతో మొత్తం మీద మౌలానా 10 సంవత్సరాల ఆరు నెలలపాటు పలు జైళ్ళల్లో గడిపారు. (Muslims In India, MK Jain, Manohar, New Delhi, 1979, Page.186)

అవిశ్రాంత ఉద్యమకారుని భార్యగా షఫాతున్నీ బీబీ కూడా జాతీయోద్యమంలో తనదైన సాహసోపేత పాత్రను నిర్వహించి చరిత్ర పుటలకెక్కారు. ఆ భార్యాభర్తలు అద్వితీయమైన దేశభక్తితో మహాత్మాగాంధీ. మౌలానా ఆజాద్, పండిట్ నెహ్రూలచే గౌరవాభిమానాలను అందుకున్నారు. స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా విరామం లేకుండా భర్త పలుమార్లు సుదీర్ఘ జైలు జీవితం గడిపినప్పటికీ ఏ మాత్రం అధైర్యపడకుండా లక్ష్యసాధనకు భర్తతోపాటు పలు కష్టాల కడగండ్లను ఎంతో సాహసంతో అనుభవించిన ఆమె సహనశీలి.

ఆమె భర్త మాత్రమే కాక కుమారులు కూడా స్వాతంత్ర్యసంగ్రామంలో భాగస్వాములు. అజ్ఞాతం, అరెస్టులు, జైళ్ళలో గడపటం మూలంగా ఆ కుటుంబం దుర్భరమైన ఆర్థిక పరిస్థితులను ఎదుర్కొంది. ఏరోజుకారోజు తిండితిప్పల కోసం వెతుక్కోవాల్సిన దుస్థితి ఏర్పడింది. రోజు గడవటం కూడా కనాకష్టమైన దశలో షఫాతున్నీసా ఆ విచారకర విషయాలను జైళ్ళల్లో మగ్గుతున్న భర్త బిడ్డలకు తెలియ నివ్వకుండా గుట్టుగా గడుపుతూ ఆ యోధులను ప్రోత్సహించారు. ఆర్థిక కడగండ్లను ఎదుర్కొంటున్నా, తనవద్దనున్న కొద్దిపాటి ఆర్థికవనరులతో జాతీయోద్యమంలో పాల్గొంటున్న ఇతర ఉద్యమకారుల కుటుంబాలను ఆదుకున్నారు. ఉద్యమకారుల

కుటుంబాలు ఎటువంటి దుర్భర, దారుణ పరిస్థితులను అనుభవించాల్సి వస్తుందో అనుభవపూర్వకంగా తెలిసిన ఉద్యమకారిణి కనుక ఉన్నంతలో ఇతరులను ఆదుకుంటూ, మంచి రోజులు ముందున్నాయని ఆ ఉద్యమకారుల కుటుంబ స్త్రీలకు ధైర్యం చెప్పటం విశేషం. ఆ కార్యక్రమంలో భాగంగా ఆమె ముస్లిం మహిళలకు ఖురాన్ అధ్యయనంలో శిక్షణ ఇచ్చారు. ఈ మేరకు పాకిస్థాన్ ఏర్పడేంతవరకు పదివేల మంది ఆమె నుండి లబ్ధిపొందినట్టు సమాచారం. (Encyclopaedia of Muslim Biography Vol. 4, NK Singh, APH Publishing Corporation, New Delhi,2001, Page. 233)

ఖద్దరు ప్రచార కార్యక్రమంలో పాల్గొని ప్రజలలో ప్రధానంగా మహిళలలో ఖద్దరు ధారణను ప్రోత్సహించారు. ఆమె కుటుంబ సభ్యులంతా ఖద్దరు ధరించారు. ఆమె భర్తతోపాటుగా జమాఅత్ ఉలేమా- యే-హింద్, (Jamiatul Ulema-e-Hind), భారత జాతీయ కాంగ్రెస్‌లో సభ్యత్వం స్వీకరించారు. ఆయా సంస్థల పిలుపు మేరకు జరిగిన పలు కార్యక్రమాలలో చురుకైన భాగస్వామ్యం అందించారు.

1922 నాటి సంఘటన. జాతీయోద్యమకారులైన షఫాతున్నీసా భర్త, బిడ్డలూ జైలు శిక్ష అనుభవిస్తున్నారు. న్యాయస్థానం భర్తకు ఒక సంవత్సరం జైలుశిక్షతోపాటుగా వెయ్యి రూపాయల జరిమానా విధించింది. ఆ జరిమానా చెల్లించేందుకు మౌలానా హబీబుర్రెహమాన్ నిరాకరించారు. ఆ సొమ్మును వసూలు చేయాలన్న సాకుతో ఆయన గృహాన్ని సోదా చేయాలని పోలీసు అధికారులు నిర్ణయించారు. ఆ సమయంలో షఫాతున్నీసా లూధియానాలోని తన మట్టి ఇంటిలో చిన్న పిల్లలతో అతికష్టం మీద కాలం గడుపుతున్నారు.

సోదా చేసేందుకు పోలీసులు ఆమె ఇంటిని చుట్టుముట్టారు. ఆమె పర్దానషీ మహిళ అని కూడా చూడకుండా పోలీసులు తమ సహజ శైలిని ప్రదర్శించారు. ఏమాత్రం అధైర్యపడకుండా సోదాకు వీలు కల్పించి ఆమె పక్కకు తప్పుకున్నారు. పోలీసులు యధాప్రకారంగా విధ్వంసం సృష్టించారు. ఆహార పదార్థాలను నిత్యావసర వస్తువులను నేలపాలు చేశారు. చివరకు చిన్న బిడ్డల చెవుల్లోని దుద్దులను కూడా లాక్కెళ్ళారు. అంత జరిగినా పోలీసులు వెళ్ళిపోయాక తన బిడ్డలను ఒడిన చేర్చుకుని ఏమీ జరగనట్లు ప్రశాంతంగా ఆమె తన కార్యక్రమాలలో నిమగ్నమైపోయారు. (Bharath Ke Swatantra Samgram me Muslim Mahilavonka Yogdaan, Dr. Abida Sameeuddin, IOS, New





Delhi,1997, Page. 260-261.)

అజ్ఞాతం, ఆ తరువాత అరెస్టు, జైలు శిక్షల మూలంగా సుమారు మూడు సంవత్సరాల పాటు భర్త, బిడ్డలు ఇంటలేరు. ఆమె ఉంటున్న మట్టిల్లు గోడలు కూలి పోయి ఆ కుటుంబంలోని మహిళలకు గోడచాటు కూడా కరువైంది. **పర్దానషీ** మహిళ లైనందున చాటుకు కనీసం మొండి గోడలు కూడా లేకపోవటంతో చినిగిన చీరలు, గోనెపట్టాలతో కొంత మేరకు చాటు ఏర్పాటు చేసుకుని, కుమార్తెలతో శిథిల గృహంలో గడపాల్సిన దుస్థితి ఏర్పడింది. ఆ స్థితిలో కూడా ప్రభుత్వం, పోలీసుల వేధింపులకు ఏమాత్రం జంకకుండా, ఉద్యమకార్యక్రమాల పట్ల అపూర్వమైన నిబద్ధత, ధైర్యాన్ని ప్రదర్శించారు. భర్త, బిడ్డలు దేశసేవకు అంకితం కావటం మహత్తర భాగ్యమని భావించిన షఫాతున్నీసా పోలీసుల వేధింపులను, విధ్వంసాన్ని ఓర్పుతో భరించారు.

1947 నాటికి స్వరాజ్యం సిద్ధించే రాజకీయ వాతావరణం ఏర్పడింది. అఖిల భారత ముస్లిం లీగ్ భారత విభజన కోరటంతో షఫాతున్నీసా దంపతులు సహించలేక పోయారు. మతం ఆధారంగా ప్రజల విభజన తగదన్నారు. పాకిస్తాన్ ఏర్పడినంత మాత్రాన ముస్లింలకు వొరిగేది ఏమీ ఉండదని హెచ్చరించారు. ఇస్లాం ప్రమాదంలో పడిందని సాగుతున్న ప్రచారాన్ని మౌలానా చాలా తీవ్రంగా ఎదుర్కొన్నారు. ఆ కారణంగా ముస్లిం లీగ్ నేతలకు, కార్యకర్తలకు ఆ దంపతులు శత్రువులయ్యారు. ఆ భయానక వాతావరణాన్ని భరిస్తూ మౌలానా దంపతులు విభజనకు వ్యతిరేకంగా ఉద్యమించారు.

చివరకు విభజన తప్పలేదు. ఆకాంక్షలకు విరుద్దంగా మాతృభూమి విభజనకు గురికావడం, మొన్నటిదాకా స్వదేశంగా ఉన్న ప్రాంతం ప్రస్తుతం పరాయి దేశం కావటం లాంటి అవాంఛనీయ వాతావరణం ఆ దంపతులకు మింగుడు పడలేదు. 1947 నాటి విభజన తుఫాను అందర్ని చుట్టుముట్టి అందరి జీవితాల్లో కల్లోలం సృష్టించింది. ఆ కల్లోలం తాకిడి షఫాతున్నిసా కుటుంబాన్ని కూడా తీవ్రంగా తాకింది. ఆ మతవిద్వేష పెనుతుఫానులో ఆమె కుటుంబం సర్వం కోల్పోయింది. తల దాచుకునేందుకు మొండిగోడల ఇల్లు కూడా లేకుండా పోయింది. నిలువనీడ లేకున్నా, తిండికరువైనా పర్వాలేదనుకున్నా చివరకు షఫాతున్నీసా కుటుంబీకుల ప్రాణాలకు ఉన్మాదుల నుండి ముప్పు ఏర్పడింది.

ఆ పరిస్థితులలో మిత్రుల, సన్నిహితుల బలవంతం మీద ఆ దంపతులు లూథియానా వదిలి వెళ్ళాల్సి వచ్చింది. ఏనాడు ఊహించనటువంటి దుస్థితి ఎదురు

కావటంతో షఫాతున్నీసా తీవ్రంగా కలతచెందారు. ఆమెకు లూధియానాలోని తన ఇంటిని, పుట్టిపెరిగిన గడ్డను వదలి వెళ్ళటం సుతరాము ఇష్టంలేదు. ప్రాణాలు పోయినా లూధియానా వదలి వచ్చేది లేదని ఆమె భీష్మించుకున్నారు. ఆమె తండ్రి ఇంటిని కూడా ఎవ్వరో స్వాధీనం చేసుకున్నారు. ఆ భయానక వాతావరణం నుండి తప్పించుకోడానికి సంబంధీకులు తలోదారయ్యారు. చివరకు మౌలానా హబీబుర్రెహమాన్ నచ్చచెప్పాక స్వంత ఇల్లు వదలిన ఆ దంపతులు శరణార్థుల శిబిరంలో తలదాచుకున్నారు.

శరణార్థుల శిబిరంలో ఉండటం ఆమెకు ఏమాత్రం ఇష్టంలేదు. ఈ విషయాన్ని పలుమార్లు భర్త వద్ద వ్యక్తంచేస్తూ, **ఈ దుస్థితిని చూడడానికేనా? మనం అష్టకష్టాలను భరించింది? మనం మన ఇంటికి వెళ్లి పోదాం, పదండి** అంటూ భర్తను పట్టుకుని ఆక్రోశించారు. ఆమెను ఓదార్చటం మౌలానాకు చాలా కష్టమైపోయింది. ఈ ఆవేదనతో అమె ఒక్కోసారి స్థిమితం కోల్పోయి ప్రవర్తించసాగారు. ఆ పరిస్థితికి బాధాతప్త హృదయంతో మౌలానా విచలితులవ్వడం తప్ప ఏమీ చేయలేని నిస్సహాయ స్థితి.

చివరకు లూధియానా శరణార్థుల శిబిరంనుండి ఆ దంపతులు ఢిల్లీ చేరారు. విభజన తరువాత పరిణామాల వలన ఖాళీగా ఉన్న ఒక గృహంలో తల దాచుకున్నారు. ఆ తరువాత కొద్దికాలానికే, ఆ ఇంటి యజమాని తిరిగి రావడంతో తాము తలదాచుకున్న ఇంటిని యజమానికి అప్పగించి వారు బజారుపాలయ్యారు. నిలువ నీడలేని దుస్థితిలో మళ్ళీ శరణార్థి శిబిరం చేరక తప్పలేదు. ఆ సమయంలో పాకిస్థాన్ వెళ్లమని కొందరిచ్చిన సలహాను షఫాతున్నీసా దంపతులు తీవ్రంగా అసహ్యించుకున్నారు. ఏది ఏమైనా **ఇక్కడే ఉండి పుట్టిన మట్టిలో కలసి పోవాల్సిందే తప్ప పుట్టిపెరిగిన గడ్డను వదలి వెళ్ళే ప్రసక్తి లేదని,** ఆమె స్పష్టం చేశారు.

ఆమె లూధియానాలోని తన స్వంత ఇంటికి వెళ్ళాలని చివరి దశవరకు ఎంతగానో పరితపించారు. ఇంటికి ఎప్పుడు వెడదామంటూ భర్తను పలుమార్లు ప్రశ్నించి ప్రశ్నించి ఎంతగా అలసి పోయినా ఎటువంటి ప్రయోజనం లేకుండా పోయింది. చివరకు లూధియానాలోని స్వంత ఇంటి గడప మళ్ళీ తొక్కకుండానే శ్రీమతి షఫాతున్నీసా బీబీ 1948 జూన్ 1న ఢిల్లీలో కన్నుమూశారు.

◆◆◆



## పండు వయస్సులో కూడా ప్రజాసేవకు వెనుకాడని

# ఫాతిమా యఫ్.తయ్యాబ్ అలీ

**( 1902-)**

ప్రఖ్యాతి నొందిన గుజరాత్ **తయ్యాబ్జీల** కుటుంబానికి చెందిన మరో మహిళ శ్రీమతి ఫాతిమా తయ్యాబ్ అలీ. భారత స్వాతంత్ర్య సంగ్రామంలో తనదైన పాత్ర నిర్వహించిన ఆమె 1902 నవంబరు 2న గుజరాత్ రాష్ట్రంలో జన్మించారు. తండ్రి పేరు అబ్దుల్ అలీ. మహాత్మాగాంధీ, పండిట్ నెహ్రూ, సర్దార్ వల్లభాయి పటేల్ లాంటి ప్రముఖుల రాజకీయాలోచనలతో ఆమె ప్రభావితమయ్యారు.

తయ్యాబ్ అలీతో వివాహం తరువాత ఆమె జాతీయ కాంగ్రెస్‌లో సభ్యత్వం స్వీకరించారు. జాతీయోద్యమంలో ప్రవేశించిన పిమ్మట గాంధీజీ అనుమతితో వ్యక్తిగత సత్యాగ్రహ దీక్షలో పాల్గొన్నారు. ఖద్దరు ధరించారు. ప్రజలలో ఖద్దరు ధారణను ప్రోత్సహించారు. మహిళలను చైతన్యపర్చేందుకు ఎంతగానో కృషి చేశారు. క్విట్ ఇండియా ఉద్యమంలో చురుగ్గా పాల్గొని రెండుసార్లు కారాగారానికి వెళ్ళారు. ప్రజాచైతన్య కార్యక్రమాల నిర్వహణలో భాగంగా ఆమె పలు పర్యటనలు జరిపారు.

బ్రిటీష్ బానిస బంధనాల నుండి భారతదేశం విముక్తమయ్యాక ఫాతిమా తయ్యాబ్ అలీ సామాజిక సేవకు అంకితమయ్యారు. గుజరాత్ రాష్ట్రంలోని ' పదేలా ' గ్రామాన్ని దత్తత తీసుకుని మహాత్ముని మార్గంలో ఆ గ్రామాభివృద్ధికి అవిశ్రాంతంగా శ్రమించారు. ఆమె కృషి ఫలించి పదేలీ గ్రామం, అహమ్మద్ నగర్ జిల్లాలో ఆదర్శగ్రామంగా ఖ్యాతి గడించింది.

ఈ మేరకు ఆమె వృద్ధాప్యాన్ని కూడా లెక్కచేయక గ్రామాభివృద్ధి కార్యక్రమాలకు పూర్తిగా అంకితమై పనిచేశారు. ఆ కృషికి గుర్తింపుగా శ్రీమతి ఫాతిమా తయ్యాబ్ అలీని భారత ప్రభుత్వం **విశిష్ట మహిళ** పురస్కారం అందించి గౌరవించింది.

◆◆◆

## మాతృదేశ సేవకు ఖరీదు కట్టనిరాకరించిన

# జుబైదా బేగం దావూది

**(1885-)**

**బ్రి**టీష్ వ్యతిరేక పోరాటంలో సర్వం త్యాగం చేసి, జీవిత చరమాంకంలో కటిక దారిద్ర్యంలో మగ్గుతున్నప్పటికీ, ఏమాత్రం చలించకుండా, ఎవరి అండను ఆశించకుండా, చివరివరకు ఆత్మగౌరవమే పెన్నిధిగా నిలచిన స్వాతంత్ర్య సమరయోధులు స్వాతంత్ర్యసమర చరిత్రలో తక్కువ మంది తారసపడతారు. అటువంటి వారిలో చిరస్మరణీయురాలు జుబైదా బేగం.

1885 అక్టోబర్‌లో బీహార్ రాష్ట్రం, ముజఫర్‌పూర్ జిల్లా పారో గ్రామంలోని అత్యంత సంపన్న కుటుంబంలో జుబైదా బేగం జన్మించారు. తండ్రి అబ్దుల్ ఫతేహ సాహెబ్ భూస్వామి. ఆయన బ్రిటీష్ ప్రభుత్వంలో ఉన్నతాధికారి. ప్రముఖ న్యాయవాది మౌలానా షఫీ దావూదిని ఆమె వివాహమాడారు. ఆయన మహాత్మాగాంధీ, డాక్టర్ రాజేంద్ర ప్రసాద్, పండిత మోతిలాల్ నెహ్రూ లాంటి ప్రముఖుల సహచరులు. మౌలానా దావూది స్వాతంత్ర్యసమరంలో క్రియాశీలక పాత్ర వహిస్తున్న ప్రముఖ నాయకులు. ఆయన రాజకీయాభిప్రాయాలను, జాతీయోద్యమంలో ఆయన అనుసరిస్తున్న విధివిధానాలను జుబైదా బేగం యధావిధిగా స్వీకరించారు. మౌలానా అలీ సోదరుల తల్లి, జాతీయో ద్యమంలో **బీబీ అమ్మ**గా ఖ్యాతిగాంచిన ఆబాది బానో బేగం ఉద్యమ కార్యక్రమాలలో





భాగంగా దావూది ఇంటికి తరచుగా వచ్చేవారు. ఆ సందర్భంగా ఆమెను కలవటానికి వచ్చిన ప్రముఖులతో జరుగు చర్చలు, సభలు-సమావేశాలలో ఆమె చేస్తున్న ప్రసంగాల ద్వారా వ్యక్తంచేస్తున్న అభిప్రాయాలు జుబైదా బేగంను బాగా ప్రభావితం చేశాయి.

మౌలానా షఫీ దావూది ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. మహాత్ముని పిలుపు మేరకు తన ఇంట కనక వర్షం కురిపిస్తున్న న్యాయవాద వృత్తిని వదిలి జాతీయోద్యమానికి ఆయన పూర్తిగా అంకితమయ్యారు. భారీ ఆదాయాన్ని ఒక్కసారిగా వదులుకోవటంతో ఆ కుటుంబం ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంది. ఆ ఇక్కట్లను భరిస్తూనే, జాతీయోద్యమకారులు దావూదితోపాటుగా జుబైదా బేగం జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించి ఆయన వెంట ముందుకు సాగారు.

జుబైదా ఖిలాఫత్ ఉద్యమం ద్వారా జాతీయోద్యమంలో ప్రవేశించారు. ఆనాటి నుండి దావూదితో కలిసి దాస్యవిముక్తి కోసం సాగుతున్న పోరులో క్రియాశీలక పాత్ర వహించారు. ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమంలో అవిశ్రాంతంగా శ్రమిస్తున్న భర్తకు అన్ని విధాల సహాయకారిగా నిలచారు. అత్యంత క్లిష్ట సమయాలలో భర్త బాధ్యతలను తాను స్వీకరించి సమర్థతతో నిర్వహించారు.

ఖిలాఫత్-సహాయ నిరాకరణోద్యమంలో పోలీసులు మౌలానా షఫీ అహమ్మద్ గృహం **షఫీమంజిల్** మీద ఆకస్మిక దాడిచేసి ఆయనను నిర్బంధంలోకి తీసుకున్నారు. ఆ సందర్భంగా ఆయన జుబైదా బేగంను పిలచి, తిలక్ మైదానంలోని కాంగ్రెస్ కార్యాలయానికి వెళ్ళమని సూచించారు. ఆ సూచన మేరకు జుబైదా బేగం హుటాహుటిన కాంగ్రెస్ పార్టీ కార్యాలయానికి వెళ్ళి భర్త స్థానంలో నాయకత్వపు బాధ్యతలు చేపట్టారు. దావూది అరెస్టు వలన నాయకత్వం లోపించిందన్న భావన కార్యకర్తలలో రాకూడదన్న ఆలోచనతో దావూది చేసిన సూచనను ఆమె పాటించారు. మౌలానా దావూది స్థానాన్ని మరొకరు భర్తీ చేసేవరకు ఎంతో ధైర్యసాహసాలతో భర్త కర్తవ్యాన్ని ఆమె నిర్వర్తించి శభాష్ అన్పించుకున్నారు.

సహాయనిరాకరణ ఉద్యమంలో భాగంగా సాగిన విదేశీవస్తు బహిష్కరణ, మద్యపాన నిషేధం, ఖద్దరు ప్రచారం తదితర కార్యక్రమాలలో ఆమె భాగం పంచుకున్నారు. తొలుత తన ఖరీదైన విదేశీ వస్తువులను తగులబెట్టి అందరికి ఆదర్శంగా నిలిచారు. భర్త, ఇతర కుటుంబ సభ్యులు ధరించే విదేశీ వస్త్రాలను ధ్వంసం చేసేందుకు తిలక్ రోడ్డులో గల

కాంగ్రెస్ భవనానికి పంపి అక్కడ దహనకాండను నిర్వహించారు. ఆ రోజుల్లో అతి ఖరీదైన దుస్తులు ధరించే న్యాయవాదిగా మౌలానా దావూది ప్రసిద్ధులు. ఆయన కూడా విలువైన బట్టలను విసర్జించారనడంతో ప్రజలు ఉత్తేజం పొంది విదేశీ వస్తువులు, వస్త్రాల బహిష్కరణలో చురుకుగా పాల్గొన్నారు. జుబైదా స్వయంగా ఇల్లిల్లు తిరిగి విదేశీ వస్త్రాలను సేకరించి, వాటిని షఫీమంజిల్‌కు చేర్చటం, ఆలా చేర్చిన బట్టలను ప్రజల సమక్షంలో అగ్నికి ఆహుతిచ్చే కార్యక్రమాన్ని ప్రత్యేకంగా ఏర్పాటు చేసి విదేశీ వస్త్రాల బహిష్కరణ కార్యక్రమాన్ని ఉధృతంగా నిర్వహించారు. ఖద్దరు ప్రచారంలో ప్రత్యేక శ్రద్ధచూపారు, స్వయంగా ఖద్దరు ధరించారు. ఖద్దరు ప్రచారంలో భాగంగా తన కుమార్తెల సహాయంతో ప్రత్యేక బగ్గీని ఏర్పాటు చేసుకుని పట్టణ వీధులలో, ఇతర గ్రామాలలో తిరుగుతూ స్వదేశీ వస్త్రధారణ ప్రచార కార్యక్రమాలను చేపట్టారు.

జుబైదా బేగం పర్దానషీ మహిళ అయినప్పటికి భారత జాతీయ కాంగ్రెస్ నిర్వహించిన సభలు సమావేశాలన్నిటిలో భర్తతోపాటు పాల్గొన్నారు. ఇతర మహిళలు కూడా సమావేశాలలో పాల్గొనేట్టుగా ప్రోత్సహించారు. పలు ప్రాంతాలలో మహిళల సమావేశాలను ప్రత్యేకంగా ఏర్పాటు చేసి సమర్థవంతంగా ఆమె నిర్వహించారు. ఈ పర్యటనలలో ప్రధానంగా మహిళలను ప్రభావితం చేయ ప్రయత్నించారు. జాతీయోద్యమం లో పాల్గొంటున్న కుటుంబాలతో పరిచయాలు పెంచుకుని, ఆ కుటుంబాల లో మగవారు అరెస్టులు కావటం, జైళ్ళకెళ్ళటం వలన మహిళలు, కుటుంబీకులు భయపడకుండా ధైర్యం చెప్పారు. స్వాతంత్ర్యోద్యమకారుల కుటుంబాల సంక్షేమం కోసం, తాము ఆర్థిక ఇక్కట్లను ఎదుర్కొంటూ కూడా బాధితులకు సహకరించారు.

ఈ సమావేశాలలో ఆవేశం, ఆలోచనలతో కూడిన ప్రసంగాలు చేస్తూ మహిళల్లో ధైర్యసాహసాలను నూరిపోస్తూ, వారిలో దేశభక్తి, త్యాగనిరతిని పెంపొందించారు. స్వయంగా ఉద్యమంలో పాల్గొనేట్టుగా మహిళలను పురికొల్పారు. షఫీమంజిల్ వేదికగా మహిళలకు సంబంధించిన పలు కార్యక్రమాలకు జుబైదా బేగం నాయకత్వం వహించారు. ఈ సందర్భంగా జైలుకి వెళ్ళాల్సి వచ్చినా, పోలీసు లాఠీల దెబ్బల తీవ్రతను చవిచూడాల్సి వచ్చినా ధైర్యంగా ముందుకు సాగారు.

సహాయ నిరాకరణోద్యమంలో భాగంగా ప్రభుత్వ కళాశాలలను బహిష్కరించిన విద్యార్థుల పట్ల ఆమె ప్రత్యేక శ్రద్ధచూపారు. ఆ విద్యార్థుల కోసం తమ షఫీ మంజిల్





ఆవరణలో జాతీయ కళాశాల ప్రారంభించారు. ఆ విద్యార్థుల భోజన వసతిని స్వయంగా చూశారు. ఈ సందర్భంగా తన పిల్లల చదువు సంధ్యలను కూడా విస్మరించి జాతీయ భావాలకు ప్రతీకలైన విద్యార్థుల కోసం నిరంతరం శ్రమించారు. ఆర్థిక ఇబ్బందులు చుట్టుముట్టగా ప్రతి ఇంట గుప్పెడు బియ్యం సేకరించి కొంతకాలం జాతీయ విద్యాసంస్థను నెట్టుకొచ్చారు. కాలం గడిచే కొద్ది ఆర్థిక ఇక్కట్లు మిక్కుటం కావటం, మరోవైపు నుండి బ్రిటీషు ప్రభుత్వాధికారుల వేధింపులు మితిమీరటంతో ఆ సంస్థలు ఎక్కువ కాలం మనుగడ సాగించలేకపోయాయి.

1928 నాటి పండిత మోతీలాల్ నెహ్రూ సమర్పించిన నివేదికతో మౌలానా షఫీ దావూదీ విభేధించారు. అప్పటి నుండి ఆయన కాంగ్రెస్ పార్టీకి దూరమై అరహర్ పార్టీలో చేరారు. చివరకు 1937లో మౌలానా షఫీ దావూది రాజకీయాలకు పూర్తిగా దూరమయ్యారు. ఆయన మూడు సంవత్సరాల పాటు రోగగ్రస్తులవ్వటంతో చికిత్స కోసం అధిక వ్యయమైంది.

ఆ కారణంగా జుబైదా కుటుంబం ఆర్థిక పరిస్థితి తీవ్ర వెనుకబాటును చవి చూసింది. ఆదాయం తెచ్చిపెట్టే న్యాయవాద వృత్తిని వదలుకోవటం, జాతీయోద్యమంలో ఇతరుల సహకారం లేకుండా కార్యక్రమాలను నిర్వహించటంతో పొదుపు చేసిన ధనం కరిగిపోవటం, అనారోగ్యం వలన అదనపు వ్యయం ముంచుకు రావటంతో ఆ కుటుంబం కునారిల్లిపోయింది. రోజువారి జరుగుబాటు కూడా కష్టంకాగా ఎందరికో ఆశ్రయం కల్పించిన **షఫీ మంజిల్** భవంతిని అద్దెకిచ్చి, ఆ కుటుంబం మరో చిన్న గృహంలోకి నివాసం మార్చాల్సి వచ్చింది. కుటుంబ ఆర్థిక పరిస్థితులు ఎంతగా దిగజారినా, సన్నిహితుల నుండి గాని, ప్రభుత్వం నుండి గాని సహాయం స్వీకరించడానికి జుబైదా నిరాకరించారు.

చివరికి ఆస్తంతా కరిగిపోవటంతో మిగిలిన కొద్దిపాటి భూమిని అమ్ముకుని జీవిత చరమాంకం గడపాల్సివచ్చింది. ఆ దుర్భర పరిస్థితిలోనూ శ్రీమతి జుబేదా బేగం మాతృదేశ సేవకు ఖరీదు కట్టలేనంటూ, ప్రభుత్వం, ప్రముఖులు అందించవచ్చిన ఆర్థిక సహాయాన్ని నిరాకరించి కడగండ్ల జీవితాన్ని నిశ్శబ్దంగా గడిపారు.

◆◆◆

## అద్భుత కార్యాచరణతో అందర్ని ఆకట్టుకున్న మహిళానేత

# సయ్యద్ కనీజ్ బేగం

**( 1890-1955)**

**జా**తీయోద్యమంలో పాల్గొన్న మహిళలు సత్యాగ్రహోద్యమమైనా, సాయుధ పోరాటమైనా ఏమాత్రం వెనుకాడలేదు. బ్రిటీష్ వ్యతిరేకపోరాటంలో మహిళలు తమ ప్రత్యేక ప్రతిభాసామర్థ్యాలను చూపారు. ఈ మేరకు అద్భుత ప్రసంగాలతో ప్రజలను ఆకట్టు కోవటమేకాకుండా, తన కార్యాచరణతో ఉద్యమ వ్యాప్తికి తోడ్పడిన మహిళా ప్రముఖులలో శ్రీమతి సయ్యద్ కనీజ్ బేగం ఒకరు.

1890లో బీహార్ రాష్ట్రంలో సయ్యద్ కనీజ్ బేగం జన్మించారు. ఆమె భారత జాతీయ కాంగ్రెస్ నాయకులు సయ్యద్ ముబారక్ హుస్సేన్ మనుమరాలు. బీహార్ రాష్ట్ర కాంగ్రెస్ నేత సయ్యద్ సలావుద్దీన్ కనిష్ట సోదరి. చిన్న వయస్సులోనే ఉర్దూ, అరబ్బీ, పర్షియన్ భాషలలో ఆమె మంచి తర్ఫీదు పొందారు. సోదరుడు సయ్యద్ సలావుద్దీన్ సహచర్యం వలన ప్రముఖ జాతీయోద్యమ నేతలు మౌలానా అబుల్ కలాం ఆజాద్, మహాత్మాగాంధీ, మౌలానా ముహమ్మద్ అలీ, మౌలానా షౌకత్ అలీల ఆలోచనలతో ఆకర్షితులయ్యారు. ఆ ప్రభావంతో భారత జాతీయ కాంగ్రెస్ క్రియాశీలక సభ్యత్వం స్వీకరించి బ్రిటీష్ వ్యతిరేక పోరాటాల దిశగా ముందుకు సాగారు.





స్వదేశీ ఉద్యమంలో, మద్యపాన నిషేధ కార్యక్రమాలలో చురుకైన భాగస్వామ్యం వహించారు. ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమంలో క్రియాశీలక పాత్రను పోషించారు. బ్రిటీష్ పాలకుల దుశ్చర్యలను విమర్శిస్తూ ఆమె చేసిన ప్రసంగాలు యువతీ-యువకులను ఉత్తేజపర్చాయి. గృహిణుల కోసం ఆమెచేసిన ప్రత్యేక ప్రసంగాలు కుటుంబ స్త్రీలను ఎంతగానో ఆకట్టుకుని ఖిలాఫత్ పోరాటంలో పాల్గొంటున్న తమ బిడ్డలను, భర్తలను, తోబుట్టువులను చూసి గర్వపడటమే కాకుండా, స్వయంగా మహిళలను కార్యోన్ముఖులను చేయగలిగాయి.

ఆమె తన ఉత్తేజిత ప్రసంగాలతో సరిపెట్టుకోకుండా కార్యక్రమాలలో స్వయంగా పాల్గొన్నారు. ఆశయాలను ఆచరణలో చూపి ఎందరికో మార్గదర్శకులయ్యారు. జాతీయోద్యమంలో భాగంగా సాగిన పలు పోరాటాల నిర్వహణలో సమర్థత చూపారు. ఈ మేరకు లక్ష్యసాధన పట్ల దృఢదీక్షతో పనిచేస్తూ బీహార్‌లోని జాతీయోద్యమకారులలో అగ్రస్థానంలో నిలచి ప్రముఖ మహిళా నాయకురాలిగా పేర్గాంచారు.

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు, భర్త రియాసత్ హుస్సేన్‌తో కలసి జాతీయోద్యమంలో ప్రముఖ పాత్ర వహిస్తున్న సమయంలో ఆయన 1931లో ఆకస్మికంగా మరణించారు. ఆ దుస్సంఘటన ఆమెను మానసికంగా చాలా దెబ్బతీసింది. ఆ స్థితి నుండి ఆమె మళ్ళీ కోలుకోలేదు.

ఆ తరువాత ప్రాపంచిక విషయాల మీద పూర్తిగా ఆసక్తి కోల్పోయిన ఆ ఉద్యమకారిణి క్రమంగా రాజకీయాలకు దూరమయ్యారు. ఆ విధంగా ప్రాపంచిక విషయాలకు దూరమైన శ్రీమతి సయ్యద్ కనీజ్ బేగం 1955లో చివరిశ్వాస విడిచేవరకు నియమనిష్టలతో ధార్మిక జీవితం గడిపారు.

◆◆◆

> నా భర్త కోలుకుంటారని నాకు నమ్మకం ఉంది. ఆయన బ్రిటీష్ వాళ్ళతో పోరాడినట్టే, మృత్యువుతో కూడా పోరాడి విజయం సాధించగలరు. ఒకవేళ మృత్యువుదే పైచేయి అయినట్టయితే, గౌరవప్రదమైన జీవితం సాగించే ఉద్యమకారునికి లభించే మరణం, పదికాలాల పాటు నికృష్టంగా గడిపే భయంకర బానిస జీవితం కంటే ఎంతో ఉన్నతమైంది. **- బేగం ముహమ్మద్ ఆలం.**

# అసాధారణ దేశభక్తికి అపూర్వ చిహ్నం

# సకీనా లుక్మాని

**(1865-1960)**

**స్వా**తంత్ర్యోద్యమంలో ఆది నుండి ప్రధాన పాత్ర వహించిన తయ్యాబ్జీ కుటుంబం పలువురు మహిళలను జాతీయోద్యమానికి అంకితం చేసింది. ఈ మహిళల్లో రెండు పదులు దాటని మహిళల నుండి యనభై ఏండ్ల పెద్దామె వరకు ఉన్నారు. అ విధంగా పెద్ద వయస్సులోకూడా జాతీయోద్యమంలో పాల్గొన్న మహిళలలో బేగం సకీనా లుక్మాని ఒకరు.

బేగం సకీనా లుక్మాని 1865 ప్రాంతంలో జన్మించారు. ఆమె స్వాతంత్రోద్యమ నేత బద్రుద్దీన్ తయ్యాబ్జీ కుమార్తె. తండ్రి జాతీయ భావాలను చిన్ననాటే అందిపుచ్చుకున్న ఆమె గాంధీ పిలుపు మేరకు 1930లో గుజరాత్‌లో సాగిన విదేశీ వస్తు బహిష్కరణ, మద్యపాన నిషేధ ఉద్యమాలలో క్రియాశీలక పాత్ర వహించారు. అప్పుడు ఆమె వయస్సు 65 సంవత్సరాలు. ఈ ఉద్యమంలో భాగంగా పెద్ద వయస్సులో కూడా విదేశీ వస్తువుల విక్రయశాలల, మద్యపాన విక్రయకేంద్రాల ఎదుట పికెటింగ్ జరుపుతూ మండు టెండలను కూడా లెక్క చేయక ఉద్యమించారు. గుజరాత్‌లో విదేశీ వస్తు బహిష్కరణకు, మద్యపాన విక్రయశాలల వద్ద పికిటింగ్ కార్యక్రమాలకు ప్రేరణగా నిలచిన ఆమెను





అడ్డుకోవాలని పోలీసులు అరెస్టు చేశారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా శాంతి భద్రతలకు భంగం కల్గించారన్న నేరారోపణ చేసి ఏకపక్ష విచారణ జరిపారు.

ఆమెకు నాలుగు మాసాల కఠిన కారాగార శిక్ష, వందరూపాయల జరిమానా విధించారు. ఈ వార్త గుజరాత్ రాష్ట్రంలో సంచలనం సృష్టించింది. ప్రజలు ఆగ్రహావేశా లను వ్యక్తంచేశారు. బ్రిటీష్ న్యాయవ్యవస్థను, ప్రభుత్వాన్ని దుయ్యపడుతూ, సకీనా బేగంకు విధించిన శిక్షను రద్దు చేయాల్సిందిగా ప్రజలు ఉద్యమించారు. జాతీయో ద్యమ నాయకులంతా ఆమె శిక్షను రద్దు చేయాల్సిందిగా డిమాండ్ చేశారు. ఆమె స్వయంగా అభ్యర్థిస్తే శిక్ష తగ్గించగల అవకాశాలున్నా, ఆ మేరకు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసేందుకు సకీనా బేగం నిరాకరించారు.

ఆ సందర్భంగా **అమ్మను నిరోధిస్తే ఆమె ఆరంభించిన కార్యక్రమాలను కొనసాగించ దానికి మేమున్నాం. మమ్మల్ని కూడా అరెస్టు చేయండి. మాకూ శిక్షలు విధించండి**, అంటూ భారీ సంఖ్యలో గుజరాత్ యువత ముందుకు వచ్చింది. మహిళలు ప్రభుత్వ చర్యల మీద నిరసన వ్యక్తంచేస్తూ విరుచుకుపడ్డారు. చివరకు ప్రభుత్వం దిగిరాక తప్పలేదు. ఆమెకు విధించిన కఠిన జైలు శిక్షను కాస్తా సామాన్య జైలుశిక్షగా మార్చక తప్పలేదు.

ఈ మేరకు ' **తయ్యాబ్జీ పరివారం సభ్యులు అసాధారణ ధైర్య సాహసాలను ప్రదర్శించారు**..' అంటూ గాంధీజీ నుండి ప్రశంసలందుకున్న సకీనా బేగం, జాతీయోద్యమ సంఘటనలన్నింటిలో ప్రముఖ పాత్ర వహించారు. మద్యపాన నిషేధ ఉద్యమంలో భాగంగా వైస్రాయికి గుజరాత్ రాష్ట్ర మహిళలు రాసిన చారిత్రాత్మక లేఖ మీద అమీనా తయ్యాబ్జీతో పాటుగా సకీనా లుక్మాని కూడా మహాత్ముని విజ్ఞప్తి మేరకు సంతకం చేశారు. గాంధీజీని బ్రిటీష్ ప్రభుత్వం అరెస్టుచేయగా గుజరాత్‌లో మహిళలతో భారీ సమావేశాన్ని ఆమె ఏర్పాటుచేసి ప్రభుత్వ వైఖరిని తీవ్రంగా విమర్శిస్తూ తీర్మానం చేయించారు.

అపూర్వత్యాగాల ఫలితంగా స్వాతంత్ర్యం సిద్ధించాక, దేశం రెండుగా చీలిపోవటం పట్ల ఆమె ఎంతో వ్యాకులత చెందారు. ఆ తరువాత ఆమె తన సమయాన్ని సామాజిక సేవకు అంకితం చేశారు. 1960 ఫిబ్రవరి 6న కన్నుమూసేంత వరకూ ప్రజాసేవలో గడిపిన శ్రీమతి సకీనా లుక్మాని త్యాగం చిరస్మరణీయం.

◆◆◆

## జాతీయోద్యమానికి సర్వం సమర్పించిన వితరణశీలి

# ఆమనా ఖురేషి

**(1905- 1967)**

**ప**రాయి పాలకుల నుండి దేశాన్ని విముక్తి చేయాలన్న బలమైన కాంక్ష ఆనాడు భారతీయుల మనోభావాలను బలంగా ప్రభావితం చేసింది. ఆ భావన స్వేచ్ఛ-స్వాతంత్ర్యాలను సాధించేందుకు తమ ప్రాణాలను సైతం అర్పించడానికి వెనుకాడని యువతను ఒకవైపు, మహాత్ముని అహింసాపథాన కష్టనష్టాలకు భయపడకుండా ముందుకు సాగిన ప్రజలను మరోవైపు ఉద్యమ దిశగా ఉపక్రమింప చేసింది. భారతదేశం మొత్తాన్ని ఆవరించిన ఆ అద్భుత వాతావరణం విదేశాలలో ఉంటున్న భారతీయులనూ బలంగా తాకింది. మాతృభూమి పట్ల ఏర్పడిన ఆ మనోభావాలు విదేశాలలో ఉన్నవాళ్ళను కూడా అక్కడ నుండి బ్రిటీషు ప్రభుత్వం మీద పోరాటానికి పురికొల్పగా, విదేశాలలో స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నవాళ్ళను స్వదేశానికి రప్పించాయి. ఈ విధంగా విముక్తి పోరాటంలో భాగస్వాములయ్యేందుకు స్వదేశం తిరిగివచ్చిన కుటుంబంలోని సభ్యురాలు ఆమనా ఖురేషి.

జాతీయోద్యమానికి సంపూర్ణ జీవితాలను, ధనసంపదలను పూర్తిగా సమర్పించుకున్న కుటుంబానికి చెందిన చిన్నారి ఆమనా ఖురేషి. ఆమె తండ్రి ఇమామ్ అబ్దుల్ ఖాదిర్ దక్షణాఫ్రికాలో అరేబియా గుర్రాల వ్యాపారి. ఆయన చిన్న కుమార్తె ఆమనా.





దక్షణాఫ్రికాలో వర్ణ వివక్షతకు వ్యతిరేకంగా సాగిన పోరాటంలో ఇమామ్ ఖాదిర్ గాంధీజీకి క్రియాశీలక సహకారం అందించారు. లక్షలాది రూపాయల లాభాలు ఆర్జించిపెట్టే భారీ వ్యాపారాన్ని త్యజించి బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగుతున్న పోరాటంలో భాగస్వామ్యం వహించేందుకు కుటుంబంతో సహా గాంధీజీ వెంట ఆయన ఇండియా వచ్చేయగా ఏడు సంవత్సరాల వయస్కురాలైన ఆమనా కూడా తల్లితండ్రుల వెంట తరలివచ్చారు.

స్వాతంత్ర్యోద్యమంలో ఆమనా ఖురేషి త్యాగమయ పాత్రను తెలుసుకునే ముందు ఆనాడు దక్షిణాఫ్రికాలో ఆమె కుటుంబ పరిస్థితులు, అక్కడ వర్ణవివక్షతకు వ్యతిరేకంగా గాంధీజీతో కలసి ఆ కుటుంబీకులు సాగించిన పోరాటం, ఆ తరువాత భారత దేశానికి రావటం, ఇక్కడ పరిస్థితులకు ఆ సంపన్న కుటుంబ సభ్యులు అలవాటైన విధానం తెలుసుకోవాల్సి ఉంది. ఈ పరిస్థితులను మహాత్మా గాంధీ ఈ క్రింది విధంగా వివరించారు.

దక్షణాఫ్రికాలో **ఇమాం గారిల్లు ఆంగ్లేయుల పద్ధతిలో నిర్మాణమైంది. ఇమాం గారి భార్య చిన్నప్పటినుండి ఆంగ్లేయ రీతిరివాజులతో కూడిన జీవితాన్ని అనుసరిస్తున వ్యక్తి. ఫాతిమా, ఆమనా వారి కుమార్తెలు. ఆంగ్లేయ పిల్లల పద్దతులలో వారిరువురి పెంపకం సాగింది. సర్వ సుఖభోగాల ఐశ్వర్యవంతమైన జీవితాన్ని త్వజించి ఫకీరు జీవితాన్ని అవలంభించటం సులభమైన పని కాదు. ఒక్కసారి దృఢసంకల్పం చేసుకున్నాక ఇమాం గారికి అది ఏమాత్రం పెద్దపని కాదు. నేను జోహన్స్‌బర్గ్ వదలి ఫోనిక్స్‌కు నివాసం మార్చగానే ఇమాం సాహెబ్ కూడా నాతోపాటుగా ఉండేందుకు నిర్ణయం తీసుకున్నారు. ఆయన దృఢనిశ్చయం గురించి ఎరిగి ఉండి కూడా ఆయనకు ఏ విధంగా జవాబివ్వాలన్న ఆందోళన నాలో ఉండేది. జీవితంలో ఎటువంటి కష్టంనష్టం ఎరుగని వ్యక్తి అనంత ఐశ్వర్యాన్ని వదలి ఫోనిక్స్‌లో ఒక మజ్దూర్‌గా జీవితం ఎలా గడపగలరు. ఆయనకు ఫోనిక్స్ కఠోర జీవితం గురించి తెలిపాను. ఫోనిక్స్ రాడానికి మీరు స్వయంగా నిర్ణయించుకున్నట్టయితే హాజీ సాహెబా** (ఇమాం గారి భార్య), **కుమార్తెలు ఫాతిమా, ఆమనా సంగతేంటని ప్రశ్నించా. అందుకు సమాధానంగా 'నాకు భగవంతుని మీద పూర్తి విశ్వాసముంది. మీరు హాజీ సాహెబాను పూర్తిగా ఎరుగరు. నేను ఎక్కడ ఉన్నా, ఏ స్థితిలో ఉన్నా అక్కడ ఉండేందుకు ఆమె సదా తయారుగా ఉంటారు. మన సంఘర్షణ అంతం ఎప్పుడో మనకెవరికీ తెలియదు. నా గుర్రాల వ్యాపారాన్ని నేను ఇంకా కొనసాగించ**

లేననుకుంటున్నాను. మరో వ్యాపారం ఆరంభించ లేను. ఒక సత్యాగ్రహి అన్ని రకాల విశ్రాంతులు, ఐశ్వర్యం, ధనసంపదల మీద కోరికలను త్యాగం చేయాలి. ' అని ఇమాం సాహెబ్ అన్నారు. ఈ సమాధానంతో నాకెంతో సంతోషం కలిగింది. నా ఫోనిక్స్ సహచరులకు కూడా ఈ విషయం గురించి రాశా. మా ప్రయోగాన్ని, మా నిశ్చయాన్ని వాళ్ళంతా స్వాగతించారు. ఈ విధంగా ఇమాం సాహెబ్ ఆయన పరివారం మా వెంట వచ్చేశారు.

ఫోనిక్స్‌లో ఇమాం సాహెబ్ మిగతా సహచరులతో సమానంగా భాగస్వామ్యం వహించారు. ఫోనిక్స్‌లో మా గృహాలు కొండ మీద ఉండేవి. ప్రతి వ్యక్తి తన వాడకం కోసం నీళ్ళను స్వయంగా కొండ దిగి వెళ్ళి కింద నుండి పైకి తెచ్చుకోవాలి. ఆ సమయంలో ఇమాం సాహెబ్ ఆరోగ్యం బాగాలేకున్నా ప్రతిరోజు ఉదయం పూట బక్కెట్లలో నీళ్ళుపట్టి 50 అడుగుల ఎత్తుకు మోసుకొచ్చేవారు....ఆశ్రమ నివాసులంతా యువకులుగాని యువతులు గాని, నవయువకులుగాని, వృద్ధులుగాని ఏదో ఒక పని చేయాలన్నది అనివార్యం.

ఇమాం సాహెబ్, హజీ సాహెబా, ఫాతిమా, ఆమనా ముద్రణాలయంలో పని చేసేవారు. ఇమాం సాహెబ్ కంపోజింగ్ పని నేర్చుకున్నారు. ఆయన లాంటి స్వభావంగల వృద్ధులు కంపోజింగ్ నేర్చుకోవడం ఆశ్చర్యకరం. ఆయన కుటుంబం మాంసాహారి. అయితే ఫోనిక్స్‌లో వారు మాంసాన్ని వండినట్టు నాకు గుర్తులేదు. అంతమాత్రాన ధార్మిక విషయాలలో ఆయనకు పట్టింపు లేదని కాదు. ఆయన నమాజ్ చేయకుండా ఎప్పుడూ ఉండలేదు. ఆయన పరివారం కూడా ఉపవాసం పాటించకుండా ఎప్పుడూ ఉండలేదు. ఆశ్రమవాసుల జీవనశైలిని పాటిస్తూ కూడా, ఇస్లాం ధార్మిక ఆలోచనలలోని విశాలత్వాన్ని వారు దర్శనీయం గావించారు.

ఇమాం సాహెబ్ వ్యక్తిత్వం, బలిదానం మరికొన్ని పరీక్షలకు గురికావాల్సి ఉండింది. 1914లో అసలు పరీక్ష వారి ఎదుట నిలిచింది. ఆశ్రమంలోని అత్యధికులు ఆశ్రమం వదలి భారతదేశానికి తిరిగి వెళ్ళడానికి నిర్ణయించారు. ఇమాం సాహెబాకు దక్షణాఫ్రికా స్వంత దేశమైపోయింది. హాజీ సాహెబా, ఫాతిమా, ఆమనాలకు భారతదేశం ఏమీ తెలియని అపరిచిత దేశం. వారికి ఏ భారతీయ భాషలో కూడా ప్రవేశం లేదు. ఆంగ్లం, డచ్ భాషలు తప్ప మరొక భాష వారికి తెలియని పరిస్థితి. అయినా కుటుంబ సమేతంగా





భారత దేశం వెళ్ళాలన్న నిర్ణయం తీసుకోడానికి ఇమాం సాహెబ్‌కు క్షణం పట్టలేదు. సత్యాగ్రహం, హిందూ-ముస్లింల ఐక్యతల కోసం ఆయన చేసిన మహాత్యాగమిది.

సబర్మతీ ఆశ్రమంలోని ప్రతి ఒక్కరికీ ఆయన దినచర్య గురించి తెలుసు... అల్లా పట్ల అధిక శ్రద్ధాళువైన ఆయన హృదయం స్వచ్ఛమైనది. ఆశ్రమ నియమ నిబంధనల పట్ల ఆయన విశ్వాసం మరింత దృఢం కాసాగింది.

(Collected works of Mahathma Gandhi, Govt. of India Publications and Bharath Ke Swatantra Samgram me Muslim Mahilavonka Yogdaan : Page. 225 )

ఆ విధంగా దక్షిణాఫ్రికా నుండి భారతదేశంలోని సబర్మతి ఆశ్రమం చేరిన ఇమాం సాహెబ్ కుటుంబంలోని చిన్న కుమార్తె ఆమనా. 1914లో సబర్మతి ఆశ్రమానికి వచ్చేసరికి ఆమె వయస్సు సుమారు తొమ్మిది సంవత్సరాలు. ఆమె ఆశ్రమంలో గాంధీజీ పర్యవేక్షణలో పెరిగారు. ఇమాం కుటుంబం అలనాటి సంపన్న జీవితాన్ని విస్మరించి కఠినతరమైన ఆశ్రమ జీవితం స్వీకరించింది. ఆశ్రమ వాతావరణంలో ఆమనాకు మహాత్మా గాంధీ ప్రేమాభిమానాల తోపాటుగా ప్రముఖ జాతీయోద్యమకారుల పరిచయ భాగ్యం దక్కింది. ఆ ప్రభావం, తల్లితండ్రుల త్యాగగుణాలను సంతరించుకున్న ఆమె అతి సహజంగా జాతీయ భావాలను పుణికిపుచ్చుకున్నారు. ఆశ్రమంలో ఉంటూ జాతీయోద్యమ కార్యక్రమాలలో భాగస్వాములయ్యారు. మహాత్ముని నిర్దేశంలో ఆమె పలు బాధ్యతలను నిర్వహించారు.

జాతీయోద్యమంలో భాగంగా పలు కార్యక్రమాలను నిర్వహిస్తున్న యువ ఉద్యమకారులు, గుజరాత్‌కు చెందిన గులామ్ రసూల్ ఖురేషిని ఆమనా వివాహం చేసుకున్నారు. 1924 మే 31న జరిగిన ఈ వివాహాన్ని ఇమాం సాహెబ్ సోదరుని హోదాలో గాంధీజీ స్వయంగా నిర్వహించారు. మహాత్ముడు అవిశ్రాంతంగా కార్యక్రమాలలో నిమగ్నమై ఉన్నా ఆమనాకు సంబంధించిన ప్రతి విషయాన్ని గుర్తుపెట్టుకుని ఆమెకు ఎటువంటి అసౌకర్యం కలుగకుండా చూశారు. ఆమెను స్వంత బిడ్డలా పరిగణించిన మహాత్ముడు ఆప్యాయతను అందించారు.

భర్త గులాం రసూల్‌తోపాటుగా జాతీయోద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొని తండ్రి, భర్తలతోపాటుగా తాను జైలుకెళ్ళాలని ఆమనా ఖురేషి ఎంతగా ఆకాంక్షించినా ఆమెకు గాంధీజీ అనుమతి అంత త్వరగా లభించలేదు. ఆశ్రమంలోని మహిళలను జైలుకెళ్ళడానికి అప్పట్లో గాంధీజీ అంగీకరించలేదు. ఆ కారణంగా తనకు అనుమతి ఇవ్వాల్సిందిగా

ఆమనా పలుమార్లు గాంధీజీని బ్రతిమాడాల్సి వచ్చింది. ఆమె గర్భవతిగా ఉన్నప్పుడు, ఆ తరువాత బాలింతగా ఉన్నప్పుడు కూడా బ్రిటీషు వ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొని జైలుకు వెళ్ళడానికి అనుమతి ఇవ్వాల్సిందిగా ఆమె గాంధీజీని పలుమార్లు కోరుతూ వచ్చారు.

1930లో సాగిన దండియాత్ర సందర్భంగా ఆశ్రమవాసులు కూడా ఆ కార్యక్రమంలో పాల్గొనాలని గాంధీజీ ఆకాంక్షించారు. ఆ యాత్రలో పాల్గొన్న ఆమనా తండ్రి ఇమాం సాహెబ్‌ను పోలీసులు నిర్భధంలోకి తీసుకున్నారు. ఆయన నిర్బంధంలో ఉండగానే అనారోగ్యంతో బాధపడుతూ 1931 డిసెంబరు ఒకటిన కన్నుమూశారు. అంతకు మునుపు ఆమనా తల్లి కూడా కన్నుమూయటంతో ఆమనా, ఫాతిమాలు తల్లితండ్రులను కొల్పోయిన వారయ్యారు. ఆ సమయంలో భర్త గులాం రసూల్ కూడా జైలు పాలయ్యారు. అప్పుడు కూడా బిడ్డతో సహా జైలుకు వెళ్ళేందుకు అనుమతివ్వమని ఆమనా ఖురేషి గాంధీజీని అర్థించారు.

చివరకు గుజరాత్‌లో విదేశీవస్తు బహిష్కరణ, మద్యపాన నిషేదం కోరుతూ పికిటింగ్ నిర్వహణకు మహాత్మాగాంధీ గుజరాత్ మహిళలకు అనుమతి ఇచ్చారు. ఆ సందర్భంగా ఆయా కార్యక్రమాలలో ఆమనా ఖురేషి ఉత్సాహంగా పాల్గొనే అవకాశం లభించింది. గుజరాత్‌కు చెందిన తయ్యాబ్జీ కుటుంబానికి చెందిన రెహనా తయ్యాబ్ అలీ, హమీదా తయ్యాబ్జీలతో కలసి ఆమనా ఆ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఆమె ఎన్నాళ్ళనుంచో ఎదురు చూస్తున్న అవకాశం లభించింది. ఆమనాను పోలీసులు అరెస్టు చేయగా న్యాయస్థానం మూడు మాసాల జైలుశిక్ష విధించింది.

ఒకవైపు భర్త అరెస్టు మరోవైపున చిన్న చిన్న బిడ్డలతో ఉంటూ కూడా ఆమనా ఖురేషి మంచి సత్యాగ్రహిగా పలువురికి ఆదర్శవంతంగా నిలిచారు. ఈ విషయం తెలుసుకున్న గాంధీజీ ఆమెకు ఉత్తరం రాస్తూ, **చిరంజీవి ఆమనా, నీవు చాలా ధైర్యం-సాహసం చూపావని చాలా మంది చెప్పారు, రాశారు. ఫోనిక్స్ మరియు సబర్మతీ ఆశ్రమంలో పెంపకం, శిక్షణ పొందిన ఇమాం సాహెబ్ గారి అమ్మాయి అలా కాకుండా మరెలా ప్రవర్తిస్తుంది** అంటూ ఆమె ప్రవర్తన పట్ల ఆయన గర్వం వ్యక్తంచేశారు.

స్వాతంత్ర్యసంగ్రామాన్ని అణిచివేయదలచిన బ్రిటీష్ ప్రభుత్వం ఉద్యమకారుల ఆస్తులను జప్తు చేయదలచింది. ఆ సయయంలో గాంధీజీ సబర్మతి ఆశ్రమాన్ని మూసివేయ





నిర్ణయించారు. 1933 ఆగస్టు 1న ఆశ్రమవాసులతో పరిసర గ్రామాలలో ప్రదర్శన నిర్వహించాలని నిర్ణయించారు. ఆ ప్రదర్శన జరిగితే అరెస్టులు, జైలు శిక్షలు తథ్యం కనుక ఆ సమయంలో జైలులో ఉన్న భర్త గులాం రసూల్‌తో ఆమనా మాట్లాడి అనుమతి పొందారు. ఆ ప్రదర్శన జరగక ముందే ఆశ్రమవాసులందర్ని పోలీసులు అరెస్టు చేశారు. ఆ సమయంలో ఆమనా ఆశ్రమంలో లేరు. ఆమె బాపూజీ ఆదేశం మేరకు తన ముగ్గురు పిల్లలను హరిజన ఆశ్రమంలోని అనుసూయా బెన్ వద్ద చేర్చడానికి వెళ్ళాల్సి వచ్చింది. ఆ కారణంగా ఆమె అరెస్టు కాలేదు. ఆశ్రమ సహచరులంతా అరెస్టయ్యి తాను అరెస్టు కాలేకపోయినందుకు ఆమనా బాధపడ్డారు.

సబర్మతి ఆశ్రమం నుండి వార్ధా ఆశ్రమానికి రావాల్సిందిగా జమునాలాల్ బజాజ్ కోరిన మీదట గాంధీజీ అందుకు అంగీకరించారు. ఆ సమయంలో సబర్మతి ఆశ్రమం ను ఆయన హరిజన సంక్షేమ కార్యక్రమాల నిర్వహణకు వక్ఫ్ చేశారు. ఆశ్రమ సహచరులకు ఆ కార్యక్రమాల నిర్వహణ అప్పజెప్పారు. ఆ సమయంలో ఆశ్రమంలోని కార్యనిర్వహణ బాధ్యతలను ఆమనా ఖురేషి, ఆశ్రమ బయటి కార్యక్రమాలను గులాం రసూల్ ఖురేషి నిర్వహించాలని గాంధీజీ ఆ దంపతులను ఆదేశించారు. మహాత్ముడి ఆదేశాల అనుసారంగా సబర్మతి ఆశ్రమంలో తన ముగ్గురు పిల్లలతో కలసి ఉండటం కాకుండా ఆశ్రమ వాసులందరికి తల్లిగా అందరి అవసరాల పట్ల ప్రత్యేక శ్రద్ధతో గాంధీజీ అప్పగించిన బాధ్యతలను ఆమనా ఖురేషి చివరి వరకు నిర్వహించారు.

ఈ మేరకు స్వాతంత్ర్యోద్యమంలో క్రియాశీలక పాత్ర వహిస్తున్న గులాం రసూల్ ఖురేషి పలుమార్లు జైలుకెళ్ళినా, స్వయంగా పోలీసుల దాష్టీకానికి గురైనప్పటికీ, గాంధీజీ పర్యవేక్షణలో సంతరించుకున్న ధైర్యసాహసాలు, లక్ష్యసాధన పట్ల పట్టుదల, నిబద్ధతల ఫలితంగా అన్ని కడగండ్లను ఆమె చిరునవ్వుతో భరించారు. అసాధారణ వ్యక్తిత్వం, దృఢ సంకల్పం, కార్యదక్షత, ధైర్యసాహసాల ప్రతిరూపంగా చివరి వరకు నిలచిన శ్రీమతి ఆమనా ఖురేషి 1967లో కన్నుమూశారు.

◆◆◆

## ఆచరణాత్మక త్యాగశీలి

# సుగరా ఖాతూన్

**(-1968)**

**జా**తీయ, అంతర్జాతీయ వ్యవహారాల పట్ల అత్యంత ఆసక్తి చూపటమే కాక లోతైన అధ్యయనంతో జ్ఞానపరంగా పరిణతి చెందిన మహిళలు జాతీయోద్యమంలో ఎందరో కన్పిస్తారు. అటువంటి మహిళా మేధావులలో ఒకరు శ్రీమతి సుగరా ఖాతూన్.

ఆనాడు నిజాం సంస్థానంలో భాగంగా ఉన్న ఉస్మానాబాద్‌లో సుగరా ఖాతూన్ జన్మించారు. ఆమె తల్లి సైదున్నీసా, తండ్రి సయ్యద్ హదీ. పదమూడు సంవత్సరాల వయస్సులో జమిందారీ కుటుంబానికి చెందిన మహమ్మద్ జమీర్‌ను ఆమె వివాహం చేసుకున్నారు. వివాహం జరిగిన ఆరు సంవత్సరాలకే భర్తను కోల్పోయి వితంతువయ్యారు. ఆ తరువాత అత్తింట తలెత్తిన ఆస్థి వివాదాల కారణంగా ఆమె ఉత్తరప్రదేశ్‌లోని లక్నోలో ఉంటున్న తన మేనమామ ఇంట చేరారు.

ఆ సమయంలో ఖిలాఫత్, సహాయనిరాకరణ ఉద్యమం ఉధృతంగా సాగుతోంది. ఆ వివరాలను ఆమె ఎప్పటికప్పుడు తెలుసుకుంటున్నారు. ఉద్యమ వార్తలు ఆమెను నిలువనివ్వటం లేదు. ఆమెలోని దేశభక్తి భావనలు ఆమెను ఊపిరి సలుపనివ్వటం లేదు. నిర్లిప్తంగా కూర్చోనివ్వటంలేదు. ఆ పరిస్థితులలో ఆమె జాతీయోద్యమంలో ప్రవేశించారు. విదేశీ వస్తు బహిష్కరణ సందర్భంగా అత్యంత విలువైన తన వస్త్రాలను





విసర్జించటమే కాక విదేశీ వస్తు విక్రయశాలల ఎదుట జరిగిన పికెటింగ్ తదితర కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఆ కార్యక్రమాలలో సరోజినీ నాయుడు, మోతీలాల్ నెహ్రూలతో కలసి పాల్గొని పోలీసుల లాఠీ దెబ్బలను రుచి చూశారు.

ఆమె ఉద్యమ కార్యక్రమాలలో చురుకైన భాగస్వామ్యాన్ని అందించటం, నిరంతరం ఆ కార్యకలాపాలలో మునిగితేలటం స్వజనులకు రుచించలేదు. చివరకు వస్త్రధారణ విషయంలో కూడా సంబంధీకుల నుండి తీవ్ర వ్యతిరేకతను ఎదుర్కోవాల్సి వచ్చింది. సౌకర్యంగా ఉంటాయన్న ఉద్దేశ్యంతో ఆమె ఖద్దరు చుడీదార్-కుర్తాలను ధరించారు. వితంతువులు అలాంటి వస్త్రధారణ చేయరాదని సాంప్రదాయవాదులు విమర్శించారు. అంగాంగ ప్రదర్శన లేని సభ్యతగల వస్త్రధారణ ఏమాత్రం అభ్యంతకరం కాదంటూ ఆ విమర్శలను ఆమె తోసిపుచ్చారు.

ఖిలాఫత్ నిధులకోసం ఆబాది బానో బేగం లక్నో పర్యటనకు రాగా సుగరా ఖాతూను అమెకు ఎంతగానో సహకరించారు. ఖిలాఫత్ ఫండ్ కోసం ఆమె తన వద్దనున్న పెళ్ళినాటి 50 తులాల బంగారాన్ని, విలువైన వజ్రాలను ఆబాది బానోకు జాతీయోద్యమ నిధికి విరాళంగా సమర్పించారు. ఈ సందర్భంగా మహిళలను ఉద్దేశించి ఆమె చక్కని ప్రసంగం చేసి సభికులను ప్రభావితులను చేశారు. ఆ ప్రభావంతో మహిళలు ముందుకు వచ్చి భారీ ఎత్తున నిధులు సమకూర్చిన సంఘటన ఆనాడు నగరంలో చర్చనీయాంశమయ్యింది. సుగరా ఖాతూన్ నిరంతర అధ్యయనశీలి. ఆమె రాసిన ఆలోచనాత్మక వ్యాసాలు, కవితలు **హందర్ద్, జమిందార్, హందం** లాంటి ఉర్దూ పత్రికలలో ప్రచురితమై సంచలనం సృష్టించాయి. ఆమె నవలలు కూడా రాశారు.

సుగరా ఖాతూన్ క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభ దశలో చాలా చురుగ్గా పాల్గొన్నారు. కుటుంబ సమస్యల కారణంగా ఆమె పలుమార్లు హైదరాబాద్ పర్యటనలు జరపాల్సిరావటంతో ఆ తరువాత జాతీయోద్యమంలో ప్రత్యేక పాత్ర నిర్వహించలేక పోయారు. భారత దేశ స్వతంత్ర భానుడు ఉదయించాక ఆమె హైదరాబాద్ నుండి లక్నో వెళ్ళిపోయారు. ఆ తరువాత జాతి పునర్నిర్మాణంలో భాగం పంచుకుంటూ, ప్రజాసేవలో నిరంతరం గడిపిన శ్రీమతి సుగరా ఖాతూన్ 1968 మే 10న తనువు చాలించారు.

◆◆◆

# ప్రాణం కంటే ఆత్మగౌరవం ప్రధానమని భావించిన

# సాదత్ బానో కిచ్లూ

**(1893-1970)**

**మా**తృదేశం పట్ల భక్తి భావన గల దేశభక్తులకు అక్షరజ్ఞానం తోడై, ఆ అక్షర యోధులకు దాస్య శృంఖలాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న దృఢ సంకల్పంతో పోరుబాటను ఎంచుకున్న ఉద్యమకారులు జీవిత సహచరులైనట్టయితే, అటువంటి మహిళలు అద్భుతాలను సృష్టించగలరు. ఆ మహత్తర అవకాశం దక్కించుకున్న ఉద్యమకారిణి బేగం సాదత్ బానో.

పంజాబు రాష్ట్రం అమృతసర్‌లోని సంపన్న కుటుంబంలో 1893 జనవరి 10న సాదత్ బానో జన్మించారు. ఆమె తండ్రి మియా హాఫీజుల్లా. ఆమె పుట్టినిల్లు విద్యావికాసాల కేంద్రం. తండ్రి, అన్నయ్య సయిాదుల్లా సాహెబ్‌లు ఆమె విద్యాభ్యాసం పట్ల ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. ఆ కారణంగా ఆమె పలు భాషలను నేర్చుకున్నారు. ఆమెకు ఉర్దూ, పర్షియన్ భాషలలో మంచి ప్రవేశం లభించింది. మంచి విద్వత్తు లభించిన కారణంగా ఆమె 1910 నుండి కవిత్వం రాయడం ఆరంభించారు. ముస్లిం మహిళలు చదువుకోవటమే అంతంత మాత్రంగా ఉన్న పరిస్థితులలో సాదత్ బానో జాతీయోద్యమ స్ఫూర్తితో కవితలు రాస్తూ, ప్రముఖ కవుల, పండితుల ప్రశంసలందుకున్నారు.





1914 అక్టోబర్ 20న డాక్టర్ సైఫుద్దీన్ కిచ్లూను ఆమె వివాహం చేసుకున్నారు. ఆయన కూడా స్వాతంత్ర్య సమరయోధులు. విదేశాలలో ఉన్నత చదువులు పూర్తిచేసి ఇండియా వచ్చిన ఆయన బ్రిటీషు వ్యతిరేక పోరాటాలకు జీవితాన్ని అకితం చేశారు. సాదత్ బానోతో వివాహానంతరం న్యాయవాదిగా రావల్పిండిలో తొలుత ప్రాక్టీస్ ప్రారంభించి, తరువాత అమృతసర్‌లో స్థిరపడ్డారు. బానిసత్వం నుండి విముక్తమై ప్రజలు స్వతంత్ర భారతావనిలో స్వేచ్ఛా వాయువులు పీల్చుతూ సంతోషంగా గడపాలని కాంక్షిస్తూ, కఠిన కారాగారవాసాన్ని, బ్రిటీష్ పోలీసుల క్రూర హింసలను భరించారు.

1919 సంవత్సరాంతంలో ప్రవాసం నుండి బయటకు వచ్చాక డాక్టర్ సైఫుద్దీన్ లక్షలను ఆర్జించి పెడుతున్న న్యాయవాద వృత్తిని పూర్తిగా మానేసి ఖిలాఫత్ ఉద్యమానికి, జాతీయ కాంగ్రెస్ కార్యక్రమాలకు అంకితమయ్యారు. స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో **జలియన్‌వాలా బాగ్ హీరో** గా ఖ్యాతి గాంచిన ఆయన బ్రిటీష్ వలసవాదుల చర్యలను తీవ్రంగా వ్యతిరేకించటంతో అత్యధిక కాలం జైళ్ళల్లో గడిపారు. జాతీయ ఉద్యమనేతగా పలుమార్లు కారాగారవాస శిక్షకు గురై, తన జీవితంలోని అత్యంత విలువైన **14** సంవత్సరాల కాలాన్ని జైలు గోడల మధ్యన గడిపిన పోరాట చరిత్ర ఆయనది. (Muslims In India, Volume II, Naresh Kumar Jain, Manohar, New Delhi, 1983, Page. 27.)

బ్రిటీషు వ్యతిరేక కార్యకలాపాల కారణంగా సాదత్ బానో గృహం మీద అనునిత్యం పోలీసుల నిఘా ఉండేది. సోదాలు, దాడులు ఆ ఇంటికి మామూలయ్యాయి. పోలీసుల వేధింపుల తాకిడిని తట్టుకుంటూ ఎంతో ధైర్యంగా నిలవటమే కాకుండా, జైళ్ళల్లో గడుపుతున్న భర్తకు ధైర్యం చెబుతూ కుటుంబం గురించి ఏమాత్రం పట్టించు కోకుండా పోరుబాటలో సాగాల్సిందిగా ఆమె ప్రోత్సహించారు. అందుకు తగ్గట్టుగా సైఫుద్దీన్ కిచ్లూ బ్రిటీషు వ్యతిరేక పోరాటంలో అగ్రగామిగా నిలచారు.

మతోన్మాద భావనలకు వ్యతిరేకంగా సాదత్ బానో కిచ్లూ కలం పట్టి పోరాడారు. బయటి శత్రువును తరిమి కొట్టాలంటే, హిందూ-ముస్లింల ఐక్యత అత్యవసరమని ఆమె తన కలం ద్వారా, గళం ద్వారా పలుమార్లు ఉద్ఘాటించారు. హిందూ-ముస్లింల ఐక్యతను ప్రగాఢంగా వాంఛించారు. ఆ దిశగా నిరంతరం కృషి సాగించారు. ఆ ప్రయత్నాలలో భాగంగా హిందూ సోదరుల మత మనోభావాలను గాయపర్చే ఏ పనులు చేయరాదని ముస్లింలకు హితవు పలికారు. ఆ హితవులను తాను ఆచరించి చూపారు. హిందూ

సోదరులు గోవును ఆరాధిస్తారు కనుక వారి మనోభావాలను గౌరవించాలన్న ఉద్దేశ్యంతో ఆమె తన కుటుంబంలో గోమాంసం వంటకాలను పూర్తిగా నిషేధించారు. (Bharath Ke Swatantra Samgram me Muslim Mahilavonka Yogdaan, Dr. Abida Samiuddin, IOS, New Delhi, 1997, Page.162)

ఆమె చక్కని కవయిత్రి, మంచి రచయిత్రి. ఉద్యమకారులను ఉత్తేజపరుస్తూ బ్రిటీషు ప్రభుత్వపు రాక్షస రాజకీయ క్రీడల వెనుకగల కుయుక్తులను ఎండగడ్తూ పలు కవితలు రాశారు. ఈ విషయంలో ఆమె మౌలానా ఆజాద్ మార్గంలో పయనించారు. ఉర్దూ, పర్షియన్ భాషల మీద మంచి ఆధిపత్యం ఉన్న ఆమె కవితలు మాత్రమేకాదు, నవలలు కూడా రాశారు. ఆమె రాసిన కవితలు **దక్కన్ రివ్యూ, తెహజీబ్-యే-నిసా, ఖాతూన్** లాంటి పత్రికలలో ప్రచురితమయ్యాయి. తెహజీబ్-యే-నిసా లో ఆమె మహిళల సమస్యల మీద ప్రగతిశీల పరిష్కారాలతో నవల రాశారు. 1910లో రాసిన ఆ నవల సీరియల్‌గా ప్రచురితమైంది. సమాజం ఎదుర్కొంటున్న పలు సమస్యల మీద ప్రత్యేక శీర్షికలతో 1910-12 సంవత్సరాలలో అసంఖ్యాకంగా ఆమె ప్రత్యేక ఫీచర్స్ రాశారు. ఈ కవితలు, వ్యాసాలు, ఫీచర్స్‌లలో ఆమెలోని దూరదృష్టి, విస్తృత అధ్యయనం వెల్లడవుతాయి. సమకాలీన సమాజం, జాతీయ అంతర్జాతీయ ప్రపంచం తీరుతెన్నులను, ఆయా రాజకీయ వ్యవస్థలను అర్థం చేసుకునేందుకు ఆమె ప్రత్యేకంగా ఆంగ్ల భాషను కూడా నేర్చుకుని ఆంగ్ల సాహిత్యాన్ని అధ్యయనం చేశారు.

1910లో తన 18 సంవత్సరాల వయస్సులో ఆమె దేశభక్తి ప్రపూరితమైన కవితలు రాశారు. ఓ కవితలో బానిస బంధనాలలో బందీ అయిన తన దేశం గురించి, స్వేచ్ఛను కోల్పోయిన దేశ ప్రజల గురించి ఆవేదన వ్యక్తంచేశారు. ఆ కవిత ఈ క్రింది విధంగా సాగింది-

**హృదయమా ! నాదుఃఖ గాథను ఎవరికి వినిపించేను ? పూదోట నుంచి నా నివాసం పంజరంలోకి మారింది. నా గుండెలపై బాధల కొరడా దెబ్బలు పడుతున్నాయి. గతకాలం నాకు జ్ఞప్తికొస్తూంది. ఆ పూదోటలోని వృక్షాలు, ఆ నా చిన్నిగూడునూ-**

**పంజరంలోంచి ప్రపంచపు స్వాతంత్ర్యాన్ని చూస్తూన్నాను. నా గూడు గుర్తు కొస్తూంది. బందీనైవున్నాను. అరిచే శక్తిలేదు. ఆ గుంపుగా ఎగరడం, ఆ ఆకాశ విహారం, ఆ తోటలో వసంతాలు. ఆ పాటల సవ్వడులూనూ.**

**నా ఆనందపు ఆ రోజులు ఇప్పుడెక్కడికి పోయాయి. ప్రభూ! పూదోటలో ఎగిరి**





**వలయాకారంగా తిరగటం. ఉద్యానవనపు శోభను తిలకించటం. కొమ్మల ఆకుల్లో సంతోషంతో కేరింతలు. చల్లని గాలులతోబాటు చప్పట్లు చరచడమూ.**

**నా ప్రాణాలు వెలిగినా నా గుండె మాడిపోయింది. నా వక్షంలో వేదనా జ్వాల అగ్నిని నింపింది. ఈ చిన్న పంజరంలో బందీగా మారాను. నా ఆనాటి గూటి తాలూకు స్వేచ్ఛ ఎక్కడికి పోయింది? ఇష్టం వొచ్చినపుడు రావడమూ. ఇష్టమైనపుడు పోవడమూను.**

**నా ఈ అసహాయతని ఎవరికి చెప్పేను ? నా రాత నాకు రోజూ కొత్త బాధల్ని తెస్తూంది. దెబ్బతిన్న రెక్కలతో విషాదగానం చేస్తున్నాను. మంచు వేకువలొచ్చి పూల మోము కడగటం గుర్తొచ్చినప్పుడల్లా నా గుండెపై దెబ్బపడుతోంది.**

**ఆనాటి నాగూటి రూపు నా కళ్ళల్లోనే తిరుగుతూంది. సంతోషాన్నీ, హాయినీ ఎక్కడ వెతికేను? జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా హృదయంలో వో భయం కలుగుతోంది. అందమైన ఆ రూపం ఆ చక్కటి ఆకారం. వాటితోనే గదా ఆనాడు వెల్లివిరిసే నా గూటి అందాలు !**

**నక్షత్రాలతో సంభాషణ** అను మరో కవితలో-

**ఈ వసంత దృశ్యం ఎంత హాయిగా ఎంత అందగా వుంది. కాని నా గుండెల్లో దాగిన భావనలు బయటికి రాలేకపోయాయి. నాకు మీతో గాని, మీ ఆకాశంతో గాని ఏ అవసరం లేదు. నా దేశం, నా భారత దేశం గురించే నా చింత అంతాను. ఆ రోజు దేవుడు ఏనాటికైనా నా కళ్ళకు చూపిస్తాడా? భారత దేశం ఆనాడు మీలాగే వెలుగులు విరజిమ్ముతుందా ?**

**సమకాలీనులు ఆశ్చర్యంతో చూస్తారు నా భారతదేశాన్ని-దాని వెలుగులు మురిపిస్తాయి సకల ప్రపంచాన్ని-నా ప్రియమైన దేశంపై బలవుతాను నేను- ప్రభూ ఈ మోడువారిన వనంలో వసంతాన్ని రప్పించు.**

అని ప్రభువును వేడుకుంటూ సాదత్ బానో నక్షత్రాలతో సంభాషణ సాగించారు. ఈ విధంగా ఆమె రాసిన ప్రతి కవితలో దేశభక్తి భావనలు వ్యక్తంచేస్తూ స్వేచ్ఛా-స్వాతంత్ర్యకాంక్షలతో, మాతృభూమి ఉజ్వల భవిషత్తును కాంక్షించారు.

1914 ప్రాంతంలో పంజాబు ప్రజలు రౌలత్ చట్టం వలన ఇక్కట్లు పడసాగారు. ఎప్పుడు ఎలా అరెస్టులు జరుగుతాయో, ఎప్పుడు ఎవరు అరెస్టవుతారో, ఏ స్వాతంత్ర్య సమరయోధుని ఇంటిమీద పోలీసు మూకలు విరుచుక పడుతాయో, ఎంతటి విధ్వంసం సృష్టిస్తారో, ఏ వ్యక్తి ప్రాణానికి ఎప్పుడు ప్రమాదం ముంచుకు వస్తుందో, ఏ రాత్రిపూట



**పంజాబు ప్రజల మీద రౌలత్ చట్టం అకృత్యాలు.**

బ్రిటీషు గూఢచారులు విరుచుకుపడతారో, ఎవరిని ఎక్కడికి తీసకువెళతారో తెలియని భయానక రోజులవి.

ఆ రోజుల్లో కూడా, **మీరు ధైర్యం కోల్పోకండి. వేదనపాలు కావొద్దు– అస్తిత్వపు తోటలోన పూలలా వికసించండి – ఈ సాదత్ ప్రార్థనను ఎప్పుడూ మరవొద్దు– ఏలాగైనా మీరు స్వపరిపాలనా స్వేచ్ఛను పొందండి**, అంటూ ఉద్యమకారులను ప్రోత్సహిస్తూ కవితలు రాశారు.

ఈ విధంగా కవితలు రాయటం, రచనలు చేయటం మాత్రమే కాకుండా ఆమె మంచి వక్తగా ప్రధానంగా మహిళలను ఉత్తేజపర్చుతూ ప్రసంగాలు కూడా చేశారు. ఆ ప్రసంగాలు మహిళలను బాగా ఉత్తేజితుల్ని చేశాయి. ఆ ప్రసంగాలలోని బ్రిటీషు వ్యతిరేక భావనలు సహజంగానే ప్రభుత్వ ఆగ్రహానికి గురయ్యాయి. 1919లో చారిత్రాత్మక జలియన్‌వాలా బాగ్ సభలో ఆమెకూడా ప్రసంగం చేయాల్సి ఉంది. ఆమె ఉత్తేజపూరిత ప్రసంగం కూడా తయారు చేసుకున్నారు. ఆ రోజున అమృతసర్‌లో ఉన్న అంవాంఛనీయ వాతావరణం మూలంగా సన్నిహితులు, జాతీయ కాంగ్రెస్ నాయకుల వత్తిడి మేరకు జలియన్‌వాలా బాగ్ సభాప్రాంగణానికి ఆమె చేరలేకపోయారు.

రౌలత్ చట్టం కిరాతకత్వానికి ప్రంజాబు ప్రజలతోపాటుగా డాక్టర్ సైపుద్దీన్ కిచ్లూ బలయ్యారు. ఆయనకు సంకెళ్ళువేసి అజ్ఞాత స్థానానికి తరలించారు. ఆయన ప్రాణాలకు ముప్పువాటిల్లనుందని ప్రజలలో తీవ్ర ఆందోళన ప్రారంభమైంది. ఆ తరువాత విచారణ





జరిపి ఆయనకు శిక్ష విధించారు. ఆ సంకట సమయంలో సాదత్ బానో మాట్లాడుతూ **నా భర్తకు శిక్ష పడినందుకు సంతోషంగా ఉంది. అందుకు ఆ ప్రభువుకు నా సాష్టాంగ ప్రణామములు. ఆయన మార్గంలోనే నేనూ నడుస్తా. ఆ కంటక ప్రాయమైన మార్గంలో సాగి నా ప్రాణాలను బలివ్వడానికి కూడా నేను సర్వదా సిద్ధం** అని ధైర్యశాలిగా ప్రకటించారు.

పంజాబు అకృత్యాల మీద విచారణ కోసం మహాత్మాగాంధీ పంజాబు వచ్చి సాదత్ బానో కిచ్లూను కలిశారు. ఆ సందర్భంగా ఉద్యమకారుల విడుదల కోరుతూ, గాంధీజీని ఉద్దేశించి ఈ క్రింది కవితను రాసి ఆయన గౌరవార్థం సమర్పించారు.

**ప్రతి హృదయంలో నీ నివాసం ఉంది కదా గాంధీ. నీ ప్రశంసలకు ఆలవాలం కదా ప్రతి జిహ్వ గాంధీ! నీ గురించి గౌరవం అను పుష్పాలు అన్ని చోట్ల పూశాయి. ఈ పూదోటలో శిశిరం ఏనాటికీ రాబోదు. అమృతసర్ వాసులు తీవ్రదుఃఖంలో చిక్కుకున్నారు. వారికి వారి లక్ష్యం తప్పక లభిస్తుంది. యదార్థాన్ని మీరు విడమర్చి చెప్పాలి మరీ. మీ మార్గదర్శకత్వంలో సూచించాలి ఉపాయాల్ని. జైల్లో పడివున్న వాళ్ళు బంధవిముక్తులవ్వాలి.**

ఈ అరెస్టుల సందర్భంగా ప్రముఖ జాతీయోద్యమ నాయకులు పండిత జవహర్ లాల్ నెహ్రూ, సి.ఆర్.దాస్, స్వామి శ్రద్ధానంద తదితరులు పరామర్శించేందుకు ఆమె ఇంటికి వచ్చారు. ఆ సందర్భంగా, **మాతృభూమి దాస్య విముక్తి కోసం సాగుతున్న పోరులో నా భర్త జైలు కెళ్ళటం మాకందరికి గర్వకారణం తప్ప చింతించాల్సినదేమీ లేదని,** ప్రకటించి ఆ నేతలను ఆశ్చర్యపర్చారు.

బ్రిటీషు పోలీసుల ఎత్తులను ఎదుర్కొనేందుకు జాతీయోద్యకారులకు శిక్షణ ఇవ్వాలన్న ఉద్దేశ్యంతో డాక్టర్ కిచ్లూ **స్వరాజ్య ఆశ్రమం** స్థాపించారు. ఆ ఆశ్రమాన్ని 1921లో మహాత్ముడు ప్రారంభోత్సవం చేయగా, అందులో సర్దార్ భగత్‌సింగ్ లాంటి యోధులు శిక్షణ పొందారు. ఆ ఆశ్రమం వ్యవస్థాపక అధ్యక్షులుగా డాక్టర్ కిచ్లూ శిక్షణా కార్యక్రమాలను నిర్వహించారు. బ్రిటీష్ ప్రభుత్వం అలవాటుగా డాక్టర్ కిచ్లూను అరెస్టు చేయగా ఆయన స్థానంలో సాదత్ బానో కిచ్లూ స్వరాజ్య ఆశ్రమ నిర్వహణ బాధ్యతలను స్వీకరించారు. ప్రభుత్వ గూఢచారుల నిఘా కళ్ళనుండి తప్పించుకుంటూ, ఆటంకాలు అధిగమిస్తూ ఆమె స్వరాజ్య ఆశ్రమం బరువు బాధ్యతలు చేపట్టి సమర్థవంతంగా నిర్వహించారు. (Saifuddin Kitchlew - Hero of Jallianwala Bagh, Toufique Kitchlew, NBT, India, 1996, Page. 42)

స్వదేశీ ఉద్యమంలో భాగంగా ఆ దంపతులు ఖద్దరు ధరించటం ప్రారంభించారు. సాదత్ బానో జీవితాంతం ఖద్దరు ధరించటమే కాకుండా, ఆమె బిడ్డలు కూడా ఖద్దరు ధారణకు ఇష్టపడేట్టుగా ఆమె తయారు చేశారు. ఖద్దరు ప్రచారంలో ఆమె క్రియాశీలక పాత్ర వహించారు. 1930 నుండి 1934 వరకు సాగిన శాసనోల్లంఘన ఉద్యమంలో భర్తతోపాటుగా ఆమె అన్ని సమావేశాలకు హజరయ్యారు. ముస్లిం సాంప్రదాయాలను గౌరవిస్తూ కూతురు జుబైదాతో కలసి ఆయా కార్యక్రమాలలో చురుకైన పాత్ర వహించారు. (Saifuddin Kitchlew : Page. 139)

భర్తతోపాటుగా జాతీయ-అంతర్జాతీయ వ్యవహారాల పట్ల, రాజకీయ వ్యవస్థలు, రాజకీయ ఆలోచనల పట్ల చక్కని అవగాహనగల సాదత్ బానో ప్రజలకు, ప్రధానంగా యువతకు ఆకర్షణ కేంద్రమయ్యారు. ఈ అవకాశాన్ని ఆమె ఉపయోగించుకుని యువతీ, యువకులలో దేశభక్తి భావనలను పెంపొందించేందుకు కృషి సల్పారు. యువతకు సన్మార్గం చూపటం మాత్రమే కాకుండా వారిని అవసరాలలో ఆదుకున్నారు. ఆ విధంగా యువత అభిమానాన్ని సొంతం చేసుకున్న ఆమెను యువతీ యువకులు ప్రేమతో **ఆపాజీ** (అక్కయ్య) అని పిలుచుకున్నారు.

జాతీయోద్యమంలో భాగంగా సాగిన మహిళా చైతన్య కార్యక్రమాలలో కూడా ఆమె అపరిమిత ఆసక్తి చూపారు. అఖిల భారత మహిళా సంఘాలలో ఆమె చురుకైన పాత్ర నిర్వహించారు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో, విభజన తరువాత స్వతంత్ర భారత దేశంలో మహిళల పరిస్థితులను మెరుగుపర్చేందుకు ఆమె పాటుపడ్డారు.

డాక్టర్ కిచ్లూ దంపతులు తొలుత నుండి **ముస్లింలీగ్** వేర్పాటు వాద రాజకీయాలను వ్యతిరేకించారు. హిందూ-ముస్లింల ఐక్యతను ప్రగాఢంగా కాంక్షించిన ఆ భార్యాభర్తలు లీగ్ కార్యకర్తల ఆగ్రహానికి గురైనప్పటికీ తమ మార్గం మార్చుకోలేదు. భారత్ విభజనను చివరి క్షణం వరకు వ్యతిరేకించారు. అయినా విభజన జరగటంతో, **మతోన్మాదానికి జాతీయవాదం దాసోహం అన్నది** అని డాక్టర్ కిచ్లూ చేసిన విమర్శను ఆమె సమర్థించారు. మాతృదేశం రెండుగా చీలిపోవడాన్ని ఆమె సహించలేక పోయారు. ఆ మానసిక పరిస్థితులలో విభజన వలన వచ్చిపడిన ఉపద్రవాన్ని ఆ కుటుంబం చవిచూడాల్సి వచ్చింది. నిరంతరం దేశ స్వేచ్ఛ, స్వాతంత్ర్యాల కోసం పోరాడిన ఆ కుటుంబానికి కూడా భయంకర పరిస్థితులు ఎదురయ్యాయి. ఆ దంపతుల ఆస్థిపాస్తులన్నీ దుండగులు దోచుకున్నారు.





చివరకు కట్టుబట్టలతో ఢిల్లీ వెళ్ళి ముస్లిం శరణార్థుల శిబిరంలో గడపాల్సిన దుస్థితి రావటంతో ఆమె తీవ్రంగా కుంగిపోయారు. ఆత్మీయులు, సన్నిహితులు పాకిస్తాన్ వెళ్ళమని సలహా ఇచ్చినా, ఆ సలహాలను ఖాతరు చేయలేదు. ఆ భయానక వాతావరణంలో కూడా భారత దేశ సరిహద్దులు దాటడానికి ఆమె ఇష్టపడలేదు.

స్వాతంత్ర్యం లభించాక డాక్టర్ సైఫుద్దీన్ కిచ్లూ ప్రభుత్వంలో ఎటువంటి పదవిని అధికారాన్ని ఆశించలేదు. ప్రపంచ శాంతి-, స్నేహాలు కాంక్షిస్తూ వామపక్ష భావాల వైపు మొగ్గు చూపుతూ ప్రపంచ శాంతి ఉద్యమానికి నాయకత్వం వహించారు. ఆయన మారిన రాజకీయ అభిప్రాయాల మూలంగా ఆ సాదత్ బానో దంపతులు అధికారం వెలగబెడుతున్న నేతల అలక్ష్యానికి గురయ్యారు. ప్రముఖులతో స్నేహసంబంధాలున్నా డాక్టర్ కిచ్లూ దంపతులు ఎటువంటి పదవిని గాని, ఎట్టి లబ్దిని కాని ఆశించలేదు. ఆర్థికంగా అవస్థలు పడుతూ చివరకు సన్నిహితులు, తమ మీద ఆధారపడిన ఇతరుల పోషణ కోసం ఉన్న ఆస్థిపాస్తులను అమ్మివేయడంతో ఆర్థికంగా బాగా చితికిపోయారు. అనారోగ్యం, పేదరికం వెంటాడుతున్నా ఆర్థిక సహాయం అర్థించడానికి ఆమె ఇష్టపడలేదు. భర్త డాక్టర్ కిచ్లూ అనారోగ్యంతో బాధపడుతుండగా పండిత నెహ్రూ కల్పించుకుని చికిత్స నిమిత్తం ఆయనను బలవంతంగా ఆసుపత్రిలో చేర్చాల్సిన పరిస్థితులు వచ్చాయి.

ఆ క్రమంలో సాదత్ బానో అధికార రాజకీయాలకు దూరమై ప్రజాసంఘాలలో పనిచేయసాగారు. 1963 లో డాక్టర్ సైఫుద్దీన్ కిచ్లూ మృతి చెందాక ఆమె ఆరోగ్యం, ఆర్థిక పరిస్థితులు మరింతగా దిగజారాయి. ఆ దుస్థితిలో కూడా ఆమె ఎవ్వరి వద్ద చేయి చాచలేదు. ప్రభుత్వాన్ని యాచించలేదు. ప్రభుత్వం కూడా ఆ యోధురాలిని ఆదుకోలేదు. చివరకు కటిక పేదరికంలో మగ్గుతూ, సరైన చికిత్సకు కూడా నోచుకోక, కనీసం మందులు కూడా కరువై అనారోగ్యంతో సమరం సాగిస్తూ శ్రీమతి సాదత్ బానో కిచ్లూ 1970 ఆగస్టు 18న కన్నుమూశారు.

◆◆◆

మాతృభూమి, స్వేచ్ఛాస్వాతంత్ర్యాల నిమిత్తం పోరాడుతున్న నా భర్త జీవితం తొలుత ఈ జాతి సొత్తు, ఆ తరువాత మాత్రమే నాది, మరెవరిదైనా. అందువలన నా భర్త జీవితాన్ని ఎలా ఉపయోగించుకోవాలన్నది జాతిజనులు నిర్ణయించాలి.

**- బేగం ముహమ్మద్ ఆలం**

# మతం పేర దేశ విభజన తగదంటూ ' లీగ్ ' ను ఎదుర్కొన్న

# బేగం మజీదా బానో

**(1919- 1974)**

బ్రిటీష్ వలసపాలకులను తరిమివేతకు పోరాటం సాగిస్తున్న ప్రజలను, **ద్విజాతి సిద్ధాంతం** ఆసరాతో చీల్చి, మతోన్మాదాన్ని రెచ్చగొట్టి పబ్బం గడుపుకోవాలన్న స్వార్థపర శక్తులకు, వ్యక్తులకు వ్యతిరేకంగా కూడా ప్రజలు ఉద్యమించారు. భారతదేశంలోని ముస్లింలకు ప్రతినిధిగా ప్రకటించుకున్న **ముస్లిం లీగ్** వేర్పాటువాద చర్యలకు వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని కూడగట్టి, మతం పేరుతో అధికారాన్ని చేపట్టాలనుకుంటున్న శక్తుల ఎత్తులను చిత్తుచేయడానికి సాహసంతో బరిలోకి దిగిన సాహసి శ్రీమతి మజీదా బానో.

ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాదులో బేగం మజీదా బానో 1919లో జన్మించారు. ఆమె తండ్రి ముస్తాఫా అహమ్మద్. ఆయన నిజాం సంస్థానంలో ఉద్యోగి. పదవ తరగతి చదువుతున్నప్పుడు ఆమె వివాహం ఉత్తర ప్రదేశ్‌కు చెందిన న్యాయవాది మహమ్మద్ సిద్ధీఖీతో జరిగింది. వివాహం తరువాత భర్తతోపాటుగా ఆమె ఉత్తర ప్రదేశ్ వెళ్ళిపోయారు. భర్త కుటుంబంతో సన్నిత సంబంధాలు గల ప్రముఖ జాతీయోద్యమ నాయకులు రఫీ అహమ్మద్ కిద్వాయ్ ప్రభావంతో ఆమె భారత జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించారు.





స్వేచ్ఛా,స్వాతంత్ర్యాల దిశగా సాగుతున్న జాతీయోద్యమం సంపూర్ణ విజయం సాధించి స్వరాజ్యం స్థాపించాలంటే, ప్రజలు మతాలకు అతీతంగా ఐక్యం కావాల్సి ఉందని ఆమె భావించారు. ఆ కారణంగా మతం పేరుతో వేర్పాటువాద రాజకీయాలు నడుపుతున్న ముస్లిం లీగ్ నాయకుల తీరుతెన్నులను విమర్శించారు. 1936లో జరిగిన ఓ ప్రదర్శనలో జాతీయవాదులైన కొందరు యువకులు ఏర్పాటు చేసిన **ఆజాద్ ముస్లిం లీగ్** లో ఆమె భాగస్వాములయ్యారు. ఆజాద్ లీగ్ ఆధ్వర్యంలో జరిగిన ప్రదర్శనలో ఆమె పాల్గొన్నారు. ఈ సందర్భంగా ముస్లింలీగ్ అధినేత ముహమ్మద్ అలీ జిన్నాకు వ్యతిరేకంగా బేగం మజీదా బానో నినదించారు.

1935 భారత చట్టం ప్రకారంగా దేశంలో ఎన్నికలు జరుగుతున్నాయి. భారత జాతీయ కాంగ్రెస్ ప్రజలందరి ప్రతినిధిగా ఎన్నికల రంగంలో దిగగా, ముస్లింలీగ్ తాను ముస్లింల ప్రతినిధిగా ప్రకటించుకుంది. ఆ ఎన్నికలలో లక్నో మహిళా నియోజకవర్గం నుండి మజీదా బానో జాతీయ కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేశారు. ఆమె **ముస్లిం లీగ్** అభ్యర్థి బేగం ఇనాం హబీబుల్లాతో పోటీ పడ్డారు. ఈ ఎన్నికలలో మౌలానా అలీ సోదరులలో ఒకరైన మౌలానా షౌకత్ అలీ తదితర ప్రముఖ నాయకులు **లీగ్** గెలుపును కాంక్షిస్తూ ప్రచారం సాగించారు. ఈ సందర్భంగా మౌలానా షౌకత్ అలీ ఖురాన్ గ్రంథాన్ని చేత బూని ఎన్నికల ప్రచారం చేస్తూ ప్రజల నుండి వాగ్దానం చేయించుకోవడాన్ని బట్టి, లీగ్ ఆ ఎన్నికలను ఎంత ప్రతిష్టాత్మకంగా తీసుకుందో అర్థం చేసుకోవచ్చు.

జాతీయ కాంగ్రెస్ అభ్యర్థి మజీదా బానో పక్షాన కాంగ్రెస్ నేతలు, లక్నో విద్యార్థులు ప్రచారం చేశారు. మత సామరస్యం కోరుతూ ముస్లిం లీగ్ నేతల వాదనలను పూర్వపక్షం చేస్తూ మజీదా పర్దాతోపాటే విస్తృత పర్యటనలు జరిపారు. ఆ ఎన్నికలలో కేవలం 175 ఓట్ల తేడాతో ఆమె ఓటమి చెందారు. అయినా ఎన్నికల జయాపజయాలతో ఏ మాత్రం నిమిత్తం లేకుండా హిందూ-ముస్లింల ఐక్యతా నినాదంతో ముందుకు సాగారు.

స్వతంత్ర భారతం అవతరించాక, దేశసేవకు అధిక ప్రాధాన్యతనిచ్చి, చివరి క్షణం వరకు మతసామరస్యం కోసం కృషి చేస్తూ ప్రజాసేవలో గడిపిన శ్రీమతి మజీదా బానో 1974 ఫిబ్రవరి 12న బీహార్ రాష్ట్రం బారాబంకీలో కన్నుమూశారు.

◆◆◆

## గాంధీజీకి ఉర్దూ భాష నేర్పిన మంచి కవయిత్రి

# బేగం రెహానా తయ్యాబ్జీ

**(1900-1975)**

**జా**తీయోద్యమంలో తాత, తల్లితండ్రులతోపాటుగా మాత్రమే కాకుండా మెట్టినింట చేరాక కూడా భర్త కుటుంబీకులతో కలసి పోరుబాట నడిచిన అవకాశం ఆనాటి స్వాతంత్ర్య సమరయోధులలో చాలా కొద్ది మందికి లభించింది. అటువంటి అదృష్టానికి నోచుకున్న అతికొద్ది మందిలో ఒకరు రెహానా తయ్యాబ్జీ.

గుజరాత్‌లోని సంపన్న తయ్యాబ్జీ కుటుంబంలో రెహానా తయ్యాబ్జీ 1900 జనవరి 27న జన్మించారు. ఆమె తల్లి ఆమినా తయ్యాబ్జీ (1866-1942), తండ్రి జస్టిస్ అబ్బాస్ తయ్యాబ్జీ (1854-1936). ఆయన గాంధీజీ చే **గుజరాతి వజ్రం** గా పిలువబడిన ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు. 1885లో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ స్థాపన జరిగినప్పటి నుండి తయ్యాబ్జీ కుటుంబీకులు అందులో సభ్యులు. ఆమె సన్నిహిత సంబంధీకులు జస్టిస్ బద్రుద్దీన్ తయ్యాబ్జీ (1844-1906) ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ అధ్యక్షులుగా పనిచేయగా తయ్యాబ్జీ కుంటుంబంలోని పలువురు మహిళలు జాతీయోద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు.

రెహానా తండ్రి జస్టిస్ అబ్బాస్ తయ్యాబ్జీ, తల్లి అమినా తయ్యాబ్జీలు మహాత్ముని నేతృత్వంతో సాగిన పలు కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఆమె తల్లి గుజరాత్‌లో మహిళల





ఆధ్వర్యంలో సాగిన కార్యక్రమాలకు స్వయంగా నాయకత్వం వహించారు. తయ్యాబ్జీ కుటుంబంలోని ప్రతిఒక్కరూ చాలా వరకు ఏదోవిధంగా జాతీయోద్యమంలో భాగస్వాములయ్యారు. ఆ కారణంగా తయ్యాబ్జీ కుటుంబం స్వాతంత్ర్యోద్యమయోధుల కుటుంబంగా చరిత్రలో ప్రత్యేక స్థానం పొందింది.

ప్రఖ్యాతి చెందిన స్వాతంత్ర్యసమరయోధుల కుటుంబంలో జన్మించిన రెహానా తయ్యాబ్జీ పెంపకం ఆ వాతావరణంలో సాగింది. ఆ ఇంట ప్రతి ఒక్కరూ ఉద్యమకారులు కావటం, ఆ ఇంటికి వచ్చే అతిథులు కూడా ఆ బాటన నడుస్తున్న యోధులు కావటంతో చిన్ననాటనే రెహానా హృదయంలో స్వేచ్ఛా, స్వతంత్ర భావాలు ప్రగాఢంగా నాటుకున్నాయి. ఆ వాతావరణం ఫలితంగా రెహానా తయ్యాబ్జీ కూడా బానిస బంధనాల నుండి విముక్తి కోసం సాగుతున్న పోరాట దిశగా పయనించారు.

ఆధునిక విద్యతోపాటుగా సాంప్రదాయక విద్యను అభ్యసించిన రెహానా గ్రాడ్యుయేషన్ చేయటంతోపాటుగా ఆంగ్లం, హిందీ, గుజరాతీ, ఉర్దూ భాషలలో మంచి ప్రావీణ్యం సంపాదించారు. తయ్యాబ్జీ కుంటుంబానికి మహాత్మాగాంధీ సన్నిహితులు కావటంతో చిన్ననాటనే రెహానాకు గాంధీజీ పరిచయం కలిగింది. ఆయనను తమ కుటుంబం లోని ఓ పెద్దగా తయ్యాబ్జీలు పరిగణించారు. ఆయనతో తమ కుటుంబ వ్యవహారాలను కూడా చర్చించి సలహాలు తీసుకున్న సందర్భాలున్నాయి. గాంధీజీ ఆమెను తన కుమార్తెగా భావించారు. ఆమెకు సంబంధించిన ప్రతి విషయంలో ఆయన ఎంతో శ్రద్ధ చూపారు. గాంధీజీ తన ఉత్తరాలలో ఆమెను **ప్రియపుత్రి, చిరంజీవి, రెహానా బేటిగా, బేటి రెహానా, ఉస్తాది సాహెబా, పాగల్ రెహానా, భోలి బేటి** అని సంబోధించారు.

మహాత్ముని సేవాగ్రాం ఆశ్రమంలో రెహానా తయ్యాబ్జీ కొంత కాలం గడిపారు. ఆ సందర్భంగా ఆమె గాంధీజీకి ఉర్దూ భాష నేర్పారు. ఆ తరువాత కూడా ఆమె గాంధీజీకి తరచూ ఉత్తరాలు రాస్తూ ఆ విషయం మీద ఎంతో శ్రద్ధచూపారు. ఆమె నుండి ఉత్తరాలు అందుకోవడం ఎంతో ఆనందదాయకమని గాంధీజీ చెప్పుకున్నారు. ఆమె నుండి ఉత్తరాలు రావటం అలశ్యమైతే ఆయన ఎంతో వ్యాకులత చెందారు. ఈ విషయాన్ని ఆమెకు రాసిన ఒక ఉత్తరంలో, **నీ ఉత్తరం అందకుంటే నా మనస్సు గందరగోళంగా ఉంటుంది** అని రాశారు. ఆ కారణంగా ఆమెను **ఉస్తాది సాహెబా అని** తన ఉత్తరాలలో సంబోధించారు.

రెహానా తయ్యాబ్జీ సూఫితత్వాభిలాషి. ఆమె అన్ని మతాల పట్ల సమాన గౌరవం

చూపారు. అన్ని మతాలు భగవంతుడ్ని చేరు మార్గాలని ఆమె భావించారు. మతాలకు అతీతంగా మానవులంతా ఒక్కటేనని, ధర్మం మానవులలో ఐక్యత పెంచేందుకు దోహదపడాలన్నారు. మహాత్ముని సేవాగ్రామంలో ఉన్న సమయంలో అక్కడ జరిగిన ప్రార్థనా సమావేశాలలో అన్ని మతాలకు సంబంధించిన ప్రార్థనా గీతాలను, చక్కని కంఠంతో గానం చేయటం ఆమె దినచర్యగా మారింది. ఆమె ఖురాన్ పఠనం అందర్ని ఆకట్టుకుంది. ప్రతి సమావేశంలో ఆమె ఖురాన్ పఠనం ప్రత్యేకంగా సాగేది. మహాత్మా గాంధీ ఆమెచేత ఖురాన్‌ను చదివించుకుని శ్రద్ధగా వినేవారు.

మత సామరస్యం బోధించే, **సూఫీ** సిద్ధాంతాల పట్ల మక్కువ గల రెహానా మతం పేరిట కలహాలు, మతస్థుల మధ్య ఘర్షణలు జరిగితే విలవిల్లాడారు. మతఘర్షణల నివారణకు, శాంతి సామరస్యాల స్థాపనకు నిరంతరం కృషిసల్పారు. ఆమె సూఫి తత్వం మతసామరస్యం, హిందూ-ముస్లింల ఐక్యత వరకు పరిమితం కాలేదు. ఆమె తాత్వికత విశ్వమానవ సోదరభావం దిశగా సాగింది. ఈ మేరకు ప్రచారకార్యక్రమాలను కూడా ఆమె నిర్వహించారు. ఆమె సలహాలను, సూచనలను స్వీకరించేందుకు, ప్రసంగాలను, ప్రార్థనా గీతాలను వినేందుకు ప్రజలు పెద్ద సంఖ్యలో కార్యక్రమాలకు హాజరయ్యేవారు. (Bharath Ke Swatantra Samgram me Muslim Mahilavonka Yogdaan : Page. 250)

రెహానా తయ్యాబ్జీ చక్కని కవయిత్రి. ఆమె స్వయంగా పలు ప్రార్థనా గీతాలను రాశారు. అన్ని మతాలకు సంబంధించిన ప్రార్థనా గీతాలను ఆమె స్వయంగా రాసి పాడి సభికులకు విన్పించి ప్రశంసలందుకున్న ఘట్టాలున్నాయి. ఆమె సేవాగ్రాం నుండి వెళ్ళిపోయాక కూడా గాంధీజీ ఆమెకు ఉత్తరాలు రాసి మరీ ప్రార్థనా గీతాలను, గజల్స్‌ను ప్రత్యేకంగా రాయించుకున్న సందర్భాలున్నాయి. **నీ ప్రార్థనా గీతాలు విననిదే నాకు బాగుండటం లేదు, నీవు వచ్చి పాడి విన్పించు** అని గాంధీజీ ఆమెకు రాసిన ఉత్తరాలలో పేర్కొన్నారంటే ఆమె గీతాలు ఆయనను ఎంతగా ఆకట్టుకున్నాయో తెలుస్తుంది. ఆమె కేవలం ప్రార్థనాగీతాలు మాత్రమే రాయలేదు. జాతీయోద్యమంలో భాగంగా ఉద్యమకారులను ఉత్తేజపర్చేందుకు ఉద్యమ గీతాలు కూడా రాశారు. ఆ పాటలను భారత జాతీయ కాంగ్రెస్ సభలు, సమావేశాల వేదికల మీద నుండి పాడి విన్పించారు.

జాతీయోద్యమంలో భాగంగా ఆమె తల్లితండ్రులతో కలసి పలు కార్యక్రమాలలో పాల్గొన్నారు. గుజరాత్‌లో మద్యపాన నిషేధ ఆందోళన, విదేశీవస్తువుల బహిష్కరణ ఉద్యమాల నిర్వహణకు గుజరాత్ మహిళల సమావేశాన్ని గాంధీజీ ఏర్పాటు చేసిన





సందర్భంగా ఆ సమావేశంలో ఆమె ప్రధాన పాత్ర వహించారు. 1930 ఏప్రిల్ 11న రెహానా తయ్యాబ్జీకి గాంధీజీ ఓ లేఖ రాస్తూ **మధ్యపానం, విదేశీ వస్తువుల బహిష్కరణ తదితర అంశాల మీద గుజరాత్ మహిళల సమావేశం ఏర్పాటు చేస్తున్నాను. ఆ సమావేశానికి నీవు, మీ అమ్మగారు తప్పక హాజరుకావాలి** అని కోరారు. ఆ సమావేశానికి రెహానా తన తల్లి అమీనా తయ్యాబ్జీతోపాటుగా హజరయ్యారు.

భారతదేశానికి మార్గదర్శకమైన ఈ ఉద్యమం సందర్భంగా మహిళలను సంఘటితం చేసేందుకు రెహానా ప్రత్యేక బాధ్యతలు స్వీకరించి ఆ బృహత్తర భూమికను నిర్వర్తించారు. ఆ సమయంలో కాంగ్రెస్ యువజన విభాగం **యూత్ లీగ్** కు ఆమె నాయకత్వం వహిస్తున్నారు. ఆ హోదాలో మహాత్ముని ఆదేశాల మేరకు ఆమె పలు కార్యకలాపాలలో పాల్గొన్నారు. ఈ ఉద్యమం సందర్భంగా ఆమె పలుమార్లు అరెస్టయ్యారు.

ఈ ఉద్యమం నేపథ్యంలో గుజరాత్ మహిళా కాంగ్రెస్ పక్షాన సమావేశం తీర్మానాలను ప్రభుత్వానికి ఎరుకపర్చేందుకు రెహానా తయ్యాబ్జీ, అమీనా తయ్యాబ్జీ, ఆమనా ఖురేషి సంతకాలతోపాటు మొత్తం మీద 24 మంది మహిళల సంతకాలతో కూడిన మహాజరును వైస్రాయికి పంపారు. ఆ మహాజరులో రెహానా తయ్యాబ్జీ సంతకాన్ని కూడా గాంధీజీ కోరడం ద్వారా ఆమె ప్రాధాన్యత వెల్లడయ్యింది.

1942 నాటి **క్విట్ ఇండియా** ఆందోళనలో ఆమె క్రియాశీలకంగా పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఊరేగింపు నిర్వహిస్తున్న ఆమెను ప్రభుత్వం అరెస్టు చేసి సంవత్సరం జైలు శిక్షకు గురిచేసింది. స్వాతంత్ర్యోద్యమ సైనికురాలుగా ఆమె లాఠీ దెబ్బలను, జైలు శిక్షలను అనుభవించారు. అరెస్టులు, లాఠీ దెబ్బలు, జైళ్ళు, స్వాతంత్ర్యోద్యమకారులకు సత్కారాలుగా భావించిన రెహానా తయ్యాబ్జీ చివరి వరకు జాతీయోద్యమంలో విరామమెరుగక పాల్గొన్నారు.

సర్వమానవ సోదరభావానికి, విశ్వశాంతి పరిరక్షణకు, బానిసత్వం నుండి మాతృదేశం విముక్తి కోసం చివరి క్షణం వరకు ఉద్యమించిన బేగం రెహానా తయ్యాబ్జీ 1975 మే 16న అవివాహితగా కన్నుమూశారు.

◆◆◆

## జైలుకెళ్ళక పోవటం అపచారంగా భావించిన

# బేగం ఖుర్షీద్ ఖ్వాజా

### (1896-1981)

**జాతీయోద్యం**లో జైలుకు వెళ్ళటం బాధ్యతగా ప్రతి ఒక్కరూ భావించారు. జైలుకు ఎప్పుడెప్పుడు పోదామని ఎదురు చూశారు. ఏ కారణంగానైనా అరెస్టు కాకపోవటం, జైలుకు వెళ్ళక పోవటం పెద్ద అపచారంగా పరిగణించారు. జైలుకెళ్ళకపోవటం అపచారంగా భావించి జైలుకెళ్ళాక ఆనందాన్ని వ్యక్తం చేసిన కుటుంబాలు ఆనాడు ఎన్నో ఉన్నాయి. అటువంటి ఉద్యమస్ఫూర్తిగల కుటుంబ సభ్యురాలు బేగం ఖుర్షీద్ ఖ్వాజా.

ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాద్ నగరంలో బేగం ఖుర్షీద్ ఖ్వాజా 1896లో జన్మించారు. ఆమె తండ్రి సర్ బులంద్ జంగ్. ఆయన హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి. ఆమె తాత సమీవుల్లా. ఆయన సర్ సయ్యద్ గా ప్రఖ్యాతి చెందిన సర్ సయ్యద్ అహమ్మద్ ఖాన్ సన్నిహిత మిత్రులలో ఒకరు.

స్వగృహంలో బేగం ఖుర్షీద్ సాంప్రదాయక విద్యను పూర్తి చేశారు. తండ్రితో పాటుగా హైదరాబాదులో నివాసం ఉన్నప్పుడు ఆమెకు సరోజిని నాయుడుతో పరిచయమయ్యింది. ఆ పరిచయం ద్వారా ఆమె స్వేచ్ఛా, స్వాతంత్ర్య భావాలతో ప్రభావితులయ్యారు. ఆ క్రమంలో జాతీయోద్యమం పట్ల ఆకర్షితులయ్యారు. 1920లో





ఆమె ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ సభ్యులయ్యారు. ఆనాటి నుండి 1981లో కన్నుమూసే వరకు ఆమె కాంగ్రెస్ సభ్యురాలుగా ఉన్నారు.

బేగం ఖుర్షీద్ అలీఘర్‌కు చెందిన న్యాయవాది ఖ్వాజా అబ్దుల్ మజీద్‌ను వివాహం చేసుకున్నారు. భర్త మజీద్ జాతీయోద్యమకారులు. వివాహానంతరం భర్తతో కలిసి ఆమె జాతీయోద్యమంలో ప్రత్యక్షంగా ప్రవేశించారు. 1921 డిసెంబరు 24, 25 తేదిలలో హైదరాబాద్ నగరంలో జరిగిన ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ సమావేశాలలో ఆమె ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రతినిధిగా భారత జాతీయ కాంగ్రెస్ సబ్జెక్ట్ కమిటీకి ప్రాతినిధ్యం వహించారు. ఆ సమావేశాలలో బేగం హసరత్ మోహాని, బేగం ముహమ్మద్ అలీ, కమలా నెహ్రూ, స్వరూపరాణి నెహ్రూలతో కలిసి ఆమె పని చేశారు.

జాతీయోద్యమంలో ప్రవేశించాక ఎదురైన మానసిక, ఆర్థిక కష్టనష్టాలను చిరునవ్వుతో భరిస్తూ లక్ష్యసాధనపట్ల దృఢచిత్తంతో ముందడుగు వేసిన బేగం ఖుర్షీద్ ప్రజల, ప్రజా నాయకుల ప్రశంసలు అందుకున్నారు. ఖిలాఫత్-సహాయ నిరాకరణోద్యమ కార్యకలాపాలలో అవిశ్రాంతంగా పాల్గొంటూ పలువురికి ఆదర్శమయ్యారు. ఈ సందర్భంగా అరెస్టుకావటం, జైలుకెళ్ళటం ప్రతి ఉద్యమకారుని కర్తవ్యంగా ప్రకటించారు. ఈ మేరకు గాంధీజీకి లేఖ రాస్తూ అందులో **నా భర్త సహచరులంతా జైళ్ళకు వెళ్ళారు. నా భర్త మాత్రం ఇంత వరకు స్వేచ్ఛగా ఉండటం పట్ల మాకు బాధగా ఉంది** అని పేర్కొన్నారు. ఆ భావనల నేపధ్యంలో బేగం ఖుర్షీద్ బాధామయ వాక్యాల మీద గాంధీజీ వ్యాఖ్యానం చేస్తూ, **నిజమైన నిబద్ధతతో కూడిన భావనలు ఇలా ఉంటాయి. స్వాతంత్ర్యం కోసం స్త్రీ, పురుషులంతా ఇలాగే జైళ్ళను నింపటానికి సంతోషంగా ముందుకు వచ్చిన రోజున స్వరాజ్యం తప్పక లభిస్తుంది** ఆశాభావాన్ని వ్యక్తంచేశారు. (Collected Works of Mahathma Gandhi, Govt. Of India Publications, New Delhi)

ఖ్వాజా అబ్దుల్ మజీద్, బేగం ఖుర్షీద్ దంపతుల త్యాగగుణ సంపన్నతను వివరిస్తూ, **మహనీయురాలైన ప్రతిష్ఠాత్మక ధర్మపత్ని** అను శీర్షికతో గాంధీజీ రాసిన వ్యాసంలో సుఖభోగాలను వదలి బేగం ఖుర్షీద్ కుటుంబం సాదాసీదా ఉద్యమకారుల జీవితాన్ని చేపట్టటం, ఆ విధంగా ఆ దంపతులు చేసిన త్యాగం, ఆమె భర్త ఖ్వాజా అబ్దుల్ మజీద్ గుణగణాలను ప్రస్తుతించారు. బేగం ఖుర్షీద్ కార్యనిర్వహణాదీక్ష, జాతీయోద్యమ లక్ష్యాల పట్ల ఉన్న నిబద్ధత గురించి గాంధీజీ ప్రత్యేకంగా ప్రస్తావించారు.

సహాయనిరాకరణ ఉద్యమం సందర్భంగా ఉద్యమకారులంతా అరెస్టులవుతూ తాను తన భర్త ఖ్వాజా అబ్దుల్ మజీద్ అరెస్టు కానందుకు ఎంతో చింతిస్తూ వచ్చారు. చివరకు తన భర్త అరెస్టు కాగానే సంతోషం వ్యక్తం చేస్తూ ఆ విషయాన్ని టెలిగ్రాం ద్వారా గాంధీజీకి తెలిపారు. ఆ టెలిగ్రాం అందుకున్న గాంధీజీ బేగం ఖుర్షీద్ ఉద్యమ స్ఫూర్తిని ప్రశంసిస్తూ **ప్రతిష్టాత్మక మహానీయుని ధర్మపత్ని** అను శీర్షికతో మరో వ్యాసం రాశారు. ఆ వ్యాసంలో **ప్రభుత్వం నా భర్తను అరెస్టు చేసిందన్న విషయం తెలుసుకున్న మీకు ఆనందం కలిగి ఉంటుంది** అని బేగం ఖుర్షీద్ ఆయనకు రాసిన లేఖలో పేర్కొన్నట్టు గాంధీజీ తెలిపారు.

ఈ అరెస్టు సమయంలో ఖ్వాజా అబ్దుల్ మజీద్ జాతీయ విశ్వవిద్యాలయం **జామియా మిలియా ఇస్లామియా** కులపతిగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. ప్రభుత్వ కళశాలలు బహిష్కరించిన, ప్రభుత్వ సహాయం నిరాకరించిన విద్యాసంస్థలలోని విద్యార్థుల కోసం, జాతీయ భావాలను ప్రచారం చేయడానికి ఆచరణాత్మక విద్యాభోధన గావిస్తున్న జామియా మిలియాను ఆయన సమర్థవంతంగా నిర్వహిస్తున్నారు. ఆ సమయంలో ఆయన అరెస్టు జరిగింది. ఆయన అరెస్టుతో ఉద్యమ కార్యకలాపాలు ఆగిపోరాదని బేగం ఖుర్షీద్ వాంఛించారు. ఆ విషయాన్ని కూడా గాంధీజీకి తెలియచేస్తూ, **నా భర్త గైర్హాజరీలో జామియా మిలియా ఇస్లామియా (అలీఘర్) కార్యకలాపాల బాధ్యతలనన్నిటినీ నేను నిర్వహించేందుకు కృషి చేస్తాను** అని రాశారు. ఈ మేరకు ఆమె భర్త అరెస్టువలన జాతీయోద్యమ కార్యకలాపాలు కుంటుపడరాదని భావించి భర్త పక్షాన ఆయన స్థానంలో బాధ్యతలు చేపట్టి జాతీయ భావాలకు పుట్టినిల్లుగా నిలచిన జామియా మిలియా ఇస్లామియా విద్యా కేంద్రం కార్యకలాపాలను ఆమె పర్యవేక్షించారు.

జాతీయ భావాలను ప్రచారం గావించేందుకు, దేశభక్తి భావనలను ప్రోదిచేయడానికి అలీఘర్ కేంద్రంగా ఆమె **హింద్** అను ఉర్దూ మాసపత్రికను 1921లో ప్రారంభించి, ఆ పత్రిక సంపాదకత్వ బాధ్యతలను చేపట్టారు. ఆ పత్రిక ద్వారా దేశభక్తి భావనల ప్రచారం, బ్రిటీషు ప్రభుత్వ వ్యతిరేక ప్రచారాన్ని సమర్థవంతంగా నిర్వహిస్తూ బ్రిటీష్ ప్రభుత్వ ఆగ్రహానికి గురయ్యారు.

మహిళల్లో విద్య ఆవశ్యకతను గ్రహించిన ఆమె, ఆ దిశగా చాలా శ్రద్ధ చూపారు. మహిళలు చదువుకుంటే తప్ప సమాజంలో ప్రగతి సాధ్యం కాదని ఆమె నమ్మకం.





జాతీయోద్యమం విజయవంతం కావాలంటే మహిళల్లో చైతన్యం రావాలనీ అది అక్షర జ్ఞానం ద్వారా మాత్రమే సాధ్యమౌతుందని ఆమె విశ్వసించారు. ఈ మేరకు తన విశ్వాసాన్ని ఆచరణలో చూపేందుకు ఎంతగానో శ్రమించారు. ప్రజలలో అక్షర జ్ఞానం కల్గించేందుకు ప్రచార కార్యక్రమాల కంటే విద్యా వ్యవస్థల నిర్మాణం ద్వారా ఆ లక్ష్యాలు సాధ్యమౌతాయని ఆమె తలిచారు. ఈ మేరకు 1930లో అలహాబాద్‌లో ఆడపిల్లలు, మహిళల కోసం **హమీదియా బాలికల సెకండరీ స్కూల్ (Hamidiya Girls Secondary School)** స్థాపించారు. ఆ విద్యాసంస్థ ఆమె కళ్ళ ఎదుట మహిళలలో విద్యాసుగంధాలను వెదజల్లుతూ క్రమక్రమంగా కళాశాల స్థాయికి ఎదిగింది.

ఖద్దరు ప్రచార కార్యక్రమాలలో ఆమె అత్యంత ఆసక్తి చూపారు. ఆశయాలను ఆచరణలో చూపటం ద్వారా ప్రజలను ఆకర్షించారు. స్వయంగా ఖద్దరు ధారణ చేశారు. నూలు వడకటం మాత్రమే కాకుండా, నూలువడకడాన్ని అమె ప్రజలకు, ప్రధానంగా మహిళలకు, యువతులకు నేర్పారు. జామియా మిలియా ఇస్లామియా విద్యార్థులకు కూడా ఆమె నూలు వడకటం నేర్పారని గాంధీజీ లేఖల ద్వారా వెల్లడవుతుంది.

మాతృభూమి విముక్తి కోసం ఉద్యమించిన ఫలితంగా బ్రిటిష్ సామ్రాజ్య వాదుల నుండి దేశానికి విముక్తి లభించినప్పటికి, దేశం విభజనకు గురవటం పట్ల బేగం ఖుర్షీద్ బాగా కదలిపోయారు. ఆనాటి నుండి రాజకీయ రంగం నుండి వైదొలగి విద్యా, సామాజిక సేవారంగాలకు ఆమె అంకితమయ్యారు. ఈ మేరకు అటు మాతృదేశ సేవ, ఇటు ప్రజాసేవకు అమూల్యమైన జీవితాన్ని అర్పితం చేసిన సమరశీల యోధురాలు బేగం ఖుర్షీద్ ఖ్వాజా 1981 జులైలో తుదిశ్వాస విడిచారు.

◆◆◆

> బ్రిటీష్ న్యాయస్థానం ఎటువంటి శిక్షనైనా విధించనివ్వండి, అది జైలు శిక్ష, బహిష్కరణ, జీవిత ఖైదు, ద్వీపాంతరవాసం, చివరకు ఉరిశిక్ష అయినా కానివ్వండి, తల వంచాల్సిన అవసరం లేదన్నాను..భారతదేశంలో సోదర-సోదరీమణులంతా ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమం కోసం ఉద్యమించి, ప్రభుత్వం అనుసరిస్తున్న అణిచివేత విధానాలను వ్యతిరేకిం చాలి..ఖిలాఫత్ ఉద్యమం ప్రతి ఒక్కరి నుండి అత్యున్నత స్థాయి అర్పణను ఆశిస్తుంది. ఈ ధర్మపోరాటంలో ప్రతి ముస్లిం ధనమాన ప్రాణాలు అర్పించేందుకు సర్వదా సిద్ధంగా ఉండాల్సిన సమయమిది. **– బేగం జాఫర్ అలీ ఖాన్**



## మత కలహాల మధ్యకు నడిచిన అహింసాయోధురాలు

# బీబీ అమతుస్సలాం

**(1907-1985)**

**స్వా**తంత్ర్యోద్యమ చరిత్రలో భాగంగా పరాయి పాలకుల బానిసత్వం నుండి గాంధేయ మార్గాన మాత్రమే స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు సాధ్యమని భావించి మహాత్ముని సాన్నిహిత్యంలో జీవితచరమాంకం వరకు గడిపిన మహత్తర చారిత్రక అవకాశం అతికొద్ది మందికి మాత్రమే దక్కింది. అటువంటి అద్భుత అవకాశాన్ని సొంతం చేసుకున్న అదృష్టవంతులలో ప్రముఖస్థానం ఆక్రమించారు బీబీ అమతుస్సలాం.

భారత జాతీయోద్యమం పట్ల అపార గౌరవాభిమానాలను ఆచరణలో వ్యక్తం చేసిన పాటియాలా రాజపుతానా పరివారంలో 1907లో బీబీ అమతుస్సలాం జన్మించారు. తల్లి పేరు అమతురైహమాన్. తండ్రి కల్నల్ అబ్దుల్ హమీద్ పాటియాలా సంస్థానంలో ఆర్థిక మంత్రి. ఆయన 1920 ప్రాంతంలో కన్నుమూశారు. ఆరుగురు అన్నదమ్ములకు ఏకైక చెల్లెలిగా అమతుస్సలాం గారాబంగా పెరిగారు.

చిన్ననాటి నుండి స్వేచ్ఛా స్వభావాన్ని వ్యక్తం చేసిన ఆమె సమకాలీన సమాజాన్ని అధ్యయనంచేసి పురాతన రీతి రివాజులను అహేతుక ఆచార, సంప్రదాయాలను వ్యతిరేకిం చారు. సామాజిక, రాజకీయ సమస్యల పట్ల మంచి అవగాహన కలిగి ఉన్నా, శారీరకంగా చాలా బలహీనం కావటంతో ఆమెకు ఆరోగ్యం అంతగా సహకరించేది కాదు.





అమతుస్సలాం 1930–1931 ప్రాంతంలో మహాత్ముని సేవాగ్రాం ఆశ్రమం వచ్చి చేరారు. పాటియాలా సంస్థానంలోని సనాతన ముస్లిం కుటుంబంలోని ఏకైక పుత్రిక ఆశ్రమంలోకి ఎలా వచ్చారన్న విషయం ఆసక్తిదాయకం. ఈ క్రమాన్ని **బాపూ కే సాత్** అను వ్యాసంలో ఆమె స్వయంగా వివరించారు. ఆ కథనం ఇలా సాగింది.

**నా 13 సంవత్సరాలు వయస్సులో నేను ఖురాన్ మజీద్‌ను అనువాదంతో సహా పఠించాను. కొన్ని ధార్మిక గ్రంథాలను కూడా అధ్యయనం చేశాను. మా కుటుంబంలో పర్దాను కఠినంగా అమలు చేసేవారు. స్వంత అన్నదమ్ముల ఎదుట కూడా సంచరించడానికి అనుమతి లభించేదికాదు. ఆ కారణంగా స్కూలుకు వెళ్ళే ప్రశ్న తలెత్తలేదు. నాన్న నన్ను అలీఘర్‌లోని బాలికల స్కూలుకు పంపాలనుకున్నారు. జాతి అభివృద్ధి నిమిత్తం సామాజిక ఆంక్షలను ఉల్లంఘించగల సాహసం ఆయనకుంది. ఆయన మరణించటంతో దురదృష్ట వశాత్తు ఆ అవకాశం నాకు లభించలేదు. ఆయన ఆకస్మికంగా మృత్యువాత పడ్డారు. ఆ కారణంగా నా చదువు ఉర్దూ రాయటం, చదవటం వరకు పరిమితమైంది.**

**నా పెద్దన్న ముహమ్మద్ అబ్దుర్రషీద్ ఖాన్ జాతిజనుల సేవచేయాలన్న ఆలోచనలను నాలో కల్గించారు. బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా 1920లో సాగిన ఖిలాఫత్–సహాయ నిరాకరణ ఉద్యమంలో ఆయన పాల్గొన్నారు. నా వివాహాన్ని త్వరితగతిన చేయాలనుకుంటున్న మా అమ్మకు చిన్న వయస్సులో నా వివాహం చేయటం మంచిది కాదని ఆయన నచ్చచెప్పారు. ఒకవేళ నీవు నామాట వినకుండా చెల్లెలి వివాహం చేయదలచుకుంటే తాను ఆ వివాహానికి రానన్నారు. ఆ హెచ్చరికతో చిన్నన్నయ్యల ప్రమేయం లేకుండా పోయింది. అప్పటికి నా వివాహప్రయత్నాలు ఆగిపోయాయి.**

**చిన్నప్పటి నుండి విలాసవంతంగా గడపటం, విలువైన వస్త్రాలు, ఖరీదైన ఆభరణాలు ధరించటం అంటే అయిష్టత ఉండేది. నా ఎదుట ఒక లక్ష్యంగాని, నా ఇష్టాయిష్టాలను అమ్మతో, అన్నయ్యలతో వ్యక్తంచేయగల సాహసం గాని లేదు. ఏకైక కుమార్తె కోసం అమ్మ ఎల్లప్పుడూ మంచి మంచి దుస్తులు, ఆభరణాలు తయారు చేయించేది. అవి నాకు నచ్చేవి కావు. చిన్ననాటి నుండి నా ఆరోగ్యం అంతగా మంచిది కాదు.**

**సబర్మతీ ఆశ్రమం వెళ్ళేముందు నేను టి.బి వ్యాధికి గురయ్యాను. ఈ మధ్యలో మళ్ళీ అమ్మ నా పెండ్లి గురించి పెద్దన్నయ్య మీద ఒత్తిడి తీసుకురా సాగింది.**



**బొంబాయిలోని మా కుటుంబ వైద్యులు డాక్టర్ బలమౌర్యను ఆయన సంప్రదించారు. నిరంతరం జ్వరంతో భాథపడుతూ అమె వివాహం చేసుకోవటం ప్రమాదకరమని, మూడేండ్లు జ్వరం రానట్టయితే వివాహం చేయవచ్చని ఆయన అన్నారు. ఆ అవకాశాన్ని నేను దొరకపుచ్చుకుని ఆరోగ్యం చెడగొట్టు కోసాగాను. ఆ దుష్ఫలితాలను ఈనాటికి కూడా నేను అనుభవిస్తున్నాను.**

**ఇరవై సంవత్సరాల వయస్సులో నా ఆరోగ్యం కొంత కుదుటపడటంతో అన్నయ్యలు నా పెళ్ళి ప్రయత్నాలను మళ్ళీ ప్రారంభించారు. నా ఇష్టాయిష్టాలు ఎవ్వరికీ పట్టలేదు. ఆ అనివార్య పరిస్థితులలో మీకు ఎక్కడ మంచిది అన్పిస్తే అక్కడ నా వివాహం చేయండి. అయితే నా భర్త రెండవ పెండ్లి చేసుకోడానికి నా పూర్తి అనుమతి ఉంటుందని నా అభిమతాన్ని నేను ప్రకటించాను. నా అభిప్రాయంతో అన్నయ్యలకు ఏకీభావన ఉన్నా, తండ్రి మరణానంతరం ఆరుగురు అన్నదమ్ములు ఉండి కూడా చెల్లెలు వివాహం చేయలేదని సమాజం ఎత్తిపొడుస్తుందని భయం కూడా ఉంది.**

**మా పెద్దన్నయ్య అబ్దుర్రషీద్ ఖాన్ 1922లో జిల్లా కాంగ్రెస్ కమిటి అధ్యక్షులయ్యారు. ఆయన ఉద్యమంలో పాల్గొన్నందుకు ఆరు మాసాలు జైలుశిక్షకు గురయ్యారు. నేను బుర్ఖా ధరించి అంబాలాలోని వీధుల్లో తిరిగి ఖద్దరు ప్రచారం చేయసాగాను. పలు సమావేశాలు, సభలకు హజరు కాసాగాను. బేగం ముహమ్మద్ అలీ జౌహర్, ఆయన తల్లి బీబీ అమ్మల పర్యటనలు తరచుగా పంజాబులో జరిగేవి. ఆ పర్యటనల ప్రభావం నామీద ఉండేది. ప్రజాసేవ చేయాలన్న ఉత్సాహం పెరగసాగింది. మా అన్న ఆరు మాసాలు జైలులో ఉన్నప్పుడు మా పిల్లల శరీరాల మీద ఖద్దరే ఖద్దరు కన్పించింది. అమ్మ చాలా సున్నితం. అందువలన ఆమె ఖద్దరు ధరిస్తే ఆమె నాజూకు శరీరం**





**గాయాలమయమయ్యేది. ఖిలాఫత్ ఉద్యమం సందర్భంగా హిందూ-ముస్లింలలో వ్యక్తమైన ఏకతా భావనను మరువలేను. బాపూ 21 రోజులపాటు నిర్వహించిన వ్రతం నా హృదయం మీద గాఢమైన ప్రభావం వేసింది.**

**నా ఎదుట భవిష్యత్తుకు సంబంధించిన ప్రశ్నలు తలెత్తాయి. వివాహం చేసుకోదలచుకో లేదు, అయితే జీవితానికి ఏదో లక్ష్యం ఉండాలి. బాపూ నిర్వహిస్తున్న పలు ఆందోళనా కార్యక్రమాల గురించి వార్తా పత్రికల ద్వారా తెలుసుకుంటున్నాను. దండి యాత్రలో పాల్గొనాలని ఆసక్తి కలిగింది. స్వయంగా స్వేచ్ఛను కోల్పోయినదానను. ఆందోళనా కార్యక్రమాలలో పాల్గొనటం ఎలా సాధ్యం?...బ్రిటీషు వారి బానిసత్వంలో న్యాయవాద వృత్తి చేయకూడదని అన్నయ్య అబ్దుర్రషీద్ నిర్ణయించుకున్నారు. ఆయన స్నేహితుడు ఆయనను ఇండోరు మహారాజు కార్యదర్శిగా ఇండోరు తీసుకెళ్ళారు.**

ఆ క్రమంలో అమతుస్సలాం దేశసేవలో గడపాలని నిశ్చయించుకున్నారు. ఇండోరు వెళ్ళక ముందు జాతీయోద్యమకారుడైన అబ్దుర్రషీద్ జాతీయోద్యమం విశేషాలను అమతుస్సలాంకు వివరించేవారు. జాతీయ భావాలను ఉద్బోధించే గ్రంథాలను ఆయన ఇంటికి తెచ్చేవారు. ఆ గ్రంథాలను, వార్తాపత్రికలను చదువుతూ జాతీయోద్యమం పట్ల ఆమె ఆసక్తి పెంచుకున్నారు. గాంధీజీ గురించి, అలీ సోదరుల తల్లి ఆబాది బానో బేగం, ముహమ్మద్ అలీ భార్య అంజాది బానో బేగం సేవల గురించి పత్రికల ద్వారా తెలుసుకున్నారు.

మహాత్ముని అహింసా సిద్ధాతం, ఆయన వ్యక్తిత్వం పట్ల అమతుస్సలాం బాగా ఆకర్షితులయ్యారు. ఆయన రాసిన ఆత్మకథను కూడా ఎంతో ఆసక్తిగా చదివారు. ఆ పుస్తకం ఆమెలో నూతన ఉత్తేజాన్ని కలిగించింది. భవిష్యత్తుకు సంబంధించిన ప్రశ్నకు సమాధానం దొరికింది. ఆమెకు నూతన మార్గం గోచరించింది. ఆ ప్రభావంతో మహాత్ముని బాటలో పయనించాలని ఆమె నిశ్చయించుకున్నారు. ఆ సమయంలో మహాత్ముడు సబర్మతీ ఆశ్రమంలో ఉన్నారు. అమె కూడా సబర్మతి ఆశ్రమంలో చేరాలన్న నిర్ణయానికి వచ్చారు. ఆమె అనారోగ్యం అందుకు అడ్డుగా నిలచింది. ఆ కారణంగా, ఆశ్రమ జీవితంలోని కఠిన నియమనిబంధనల మూలంగా ఆమెకు ఆశ్రమ ప్రవేశం సులభంగా లభించలేదు.

ఈ విషయాన్ని కూడా ఆమె వివరించారు. ఆ వివరణ ప్రకారంగా, **నేను సబర్మతీ ఆశ్రమం వెళ్ళదలిచానని అన్నయ్యలతో చెప్పాను. ఓ నవ్వునవ్వి వారు ఊరకున్నారు.**



**నా ఇబ్బంది ఏమిటంటే నాకెవ్వరూ తెలియదు. బాపూతో కూడా ఎప్పుడూ కలవలేదు. తరచుగా మీరాబెన్ పేరు మాత్రం చదివాను. ఆమెకు లేఖ రాశాను. చాలా కాలం ఎదురు చూశాక, మీరు ఇక్కడకు రావటంలో ఉద్దేశ్యం ఏమిటీ అని ప్రశ్నిస్తూ , మా ఇంటి విషయాలు అడుగుతూ ఆశ్రమ నిర్వహకులు నారాయణ దాస్ గాంధీ నుండి ఉత్తరం వచ్చింది. ఇంటిలో ఎవ్వరూ బాధపడరు కదా అంటూ నా ఆరోగ్యం గురించిన మెడికల్ సర్టిఫికేట్‌ను ఆయన అడిగారు.**

అబద్ధాలు చెప్పి ఫ్యామిలీ డాక్టరు నుండి తప్పుడు సర్టిఫికేట్ సంపాదించి ఆశ్రమంలో చేరటం ఆనాడు అమతుస్సలాంకు అంత కష్టం కాదు. అయినా ఆమె నిజాలు నిర్భయంగా తెలిపి ఆశ్రమంలో చేరాలనుకున్నారు. ఆపాటికి ఆమెను పట్టిపీడిస్తున్న టి.బి. తగ్గిపోయింది. ఆ విషయం పేర్కొంటూ సర్టిఫికేటు ఇవ్వాల్సిందిగా ఆమె తమ కుటుంబ డాక్టర్‌ను అభ్యర్థించి సర్టిఫికేట్ సంపాదించారు. ఆ సర్టిఫికేటులో **నాలుగు ఏండ్ల నుండి ఆమె నా వద్ద టి.బి. వ్యాధికి చికిత్స తీసుకుంటుంది. ప్రస్తుతం ఆ వ్యాధి నయమైంది. అయితే ఆమె దేహం ఆశ్రమ నియమనిబంధనలకు తట్టుకోలేదు** అని డాక్టర్ రాశారు. ఆ సర్టిఫికేటుతో తన అభ్యర్థన పత్రాన్ని ఆమె సబర్మతీ ఆశ్రమం పంపారు. ఆ అభ్యర్థన పత్రంతోపాటుగా **మీతోపాటుగా నేను కూడా దేశసేవ చేయాలనుకుంటున్నాను. శారీరక బలం లేని కారణంగా నాకు అనుమతి లభించటంలేదు. ఈ విషయమై మీరు దయ ఉంచాలి** అని గాంధీజీని వేడుకుంటూ అమతుస్సలాం ప్రత్యేకంగా లేఖ రాశారు.

ఆ తరువాత కూడా చాలా కాలంవరకు ఆశ్రమం నుండి జవాబు రాలేదు.





ప్రత్యుత్తరం కోసం ఎదురు చూస్తూ క్షణమొక యుగంగా ఆమె గడపసాగారు. చివరకు సమాధానం వచ్చింది. ఆ లేఖలో **మిమ్మల్ని ఆశ్రమంలో చేర్చుకోలేము. ఆశ్రమ జీవితం చూడాలనుకుంటే మాత్రం మీరు అతిథులుగా ఇక్కడకు రావచ్చును** అని పేర్కొన్నారు. అతిథిగా అనుమతించటమే చాలనుకున్న ఆమె సబర్మతి వెళ్ళేందుకు సోదరులను డబ్బు అడగకుండా బలవంతంగా అమ్మ ధరింపచేస్తున్న ఆభరణాలను విక్రయించి, వచ్చిన డబ్బును ప్రయాణఖర్చులకు ఉపయోగించుకుని ఆశ్రమం చేరారు. ఈ విధంగా గాంధీజీ సన్నిహిత వర్గంలో స్థానం పొంది, స్వాతంత్రోద్యమ చరిత్రలో ప్రత్యేకతను సంతరించుకున్న గాంధేయవాది అమతుస్సలాం ఆటంకాలన్నీ అధిగమించి తన 25 సంవత్సరాల వయస్సులో సబర్మతీ ఆశ్రమనివాసి అయ్యారు.

ఆశ్రమపు కఠిన నియమనిబంధనలను పాటిస్తూ, అంకితభావం, నిబద్ధత, సేవాతత్పరతతో, చక్కని క్రమశిక్షణతో ఆశ్రమవాసులలో ఒకరిగా ఆమె ఇమిడిపోయారు. ఆ క్రమంలో ఆమె శ్రీమతి కస్తూర్బాకు, మహాత్మాగాంధీకి కన్నబిడ్డతో సమానమయ్యారు. ఆ దంపతులకు కన్నకూతురుగా సేవలందించారు. **ఆశ్రమంలో అతిథిగా ఆహ్వానించబడిన ఆమె చివరకు ఆశ్రమ సేవికయ్యారు.** ఒక ప్రసిద్ధ ముస్లిం రాజపుతానా జాగీర్దార్ కుటుంబానికి చెందిన అమ్మాయి ఆశ్రమంలో చేరి అవివాహితగా జాతీయోద్యమానికి తనను తాను సమర్పించుకోవటం ఆనాడు ఊహించని సంఘటన.

అమతుస్సలాం అన్ని కష్టాలను-నష్టాలను, అనారోగ్యం కారణంగా ఏర్పడిన శారీరక బలహీనతలను దృఢ సంకల్పంతో అధిగమించి మహాత్ముని ప్రశంసలకు పాత్రురాలయ్యారు. మహాత్ముని **ప్రియమైన పుత్రిక** గా ఖ్యాతిగాంచారు. 1922లో గాంధీజీ సబర్మతీ ఆశ్రమం మూసివేశారు. ఆ సమయంలో మహాత్ముని అనుమతితో అనారోగ్యాన్ని ఏమాత్రం లెక్కచేయక ఆశ్రమంలోని ఇతర మహిళలతో ఆమె కూడా జైలు కెళ్ళారు. ఆమె జైలు నుండి విడుదల కాగానే సేవాగ్రాం వచ్చి బాపూజీకి వ్యక్తిగత సహాయ కురాలిగా బాధ్యతలు చేపట్టారు. ఆ పాత్రలో ఆమె గాంధీజీకి అత్యంత సన్నిహితంగా మెలుగుతూ అన్ని సందర్భాలలో, అన్ని పర్యటనలలో ఆయన వెంట ఉన్నారు.

బాపూజీ రౌండ్ టేబుల్ సమావేశానికి వెళ్ళిన సందర్భంగా అమతుస్సలాం తన జీవితంలోని అతి ప్రధాన నిర్ణయం తీసుకున్నారు. ఆ నిర్ణయం ప్రకారంగా, స్వరాజ్య సాధనతోపాటుగా హిందూ -ముస్లింల ఐక్యత, హరిజనుల సంక్షేమం తన జీవిత లక్ష్యమని ప్రకటించారు. ఈ విషయం తెలుసుకున్న బాపూజీ ఆమెకు లేఖ రాస్తూ నీవు సేవా

కార్యక్రమాల నిర్వహణకు తొందర పడవద్దు. ముందు నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో అని సూచించారు. ఆ సూచన ఆమె నిర్ణయాన్ని ప్రభావితం చేయలేకపోయింది. ఆమె నిర్దేశించుకున్న దిశగా ముందుకు సాగిపోయారు. అనారోగ్యం కూడా లెక్కచేయక సేవా కార్యక్రమాలను నిర్వహిస్తూ ముందుకు సాగుతున్న ఆమె కృషిని గమనించిన గాంధీజీ తన సన్నిహితులకు, మిత్రులకు రాసిన ఉత్తరాలలో అమతుస్సలాంను ప్రశంసావాక్యాలతో ముంచెత్తారు.

1944 ప్రాంతంలో ముహమ్మద్ అలీ జిన్నాను గాంధీజీ QAID-I-AZAM అని సంబోధించడంలో ఆమె ప్రధాన పాత్ర వహించారు. ఈ విషయాన్ని మౌలానా అబుల్ కలాం ఆజాద్ తన **ఇండియా విన్స్ ఫ్రీడం**లో పేర్కొన్నారు. ముహమ్మద్ అలీ జిన్నా ఇంటర్వ్యూను కోరుతూ మహాత్ముడు జిన్నాకు లేఖ రాస్తున్న సందర్భంగా, QAID-I-AZAM అని జిన్నాను సంబోధించాల్సిందిగా అమతుస్సలాం గాంధీజీని సలహా ఇచ్చారు. ఆ విధంగా ఉర్దూ పత్రికలు సంబోధిస్తున్నాయని అమె ఆయనకు తెలిపారు. ఆ సలహా పరిణామాలను ఆలోచించకుండా జిన్నాను మహాత్ముడు QAID-I-AZAM **అని తన లేఖలో సంబోధించటంతో జిన్నా వ్యక్తిగత ప్రతిష్ట అనూహ్యంగా పెరిగింది.** అది **భారత రాజకీయాలలో పెనుమార్పుకు కారణమయ్యిందని** మౌలానా పేర్కొన్నారు. (India Wins Freedom, Maulana Abul Kalam Azad, Orient Longman, Hyderabad, 1995, Page. 96-97) ఈ విధంగా అమతుస్సలాం భారతదేశ చరిత్రలోని ఓ కీలక సమయంలో తనదైన పాత్రను పోషించి చరిత్రమలుపుకు కారణమయ్యారు.

మహాత్ముని బాటన జాతీయోద్యమంలో నడిచిన బీబీ అమతుస్సలాం హిందూ, ముస్లిం ఐక్యతా చిహ్నామయ్యారు. మతకలహాలను నివారించేందుకు ఆమె నిరంతరం కృషి సల్పారు. మత ఘర్షణలు జరుగుతున్న ప్రాంతాలకు ఆమె ఎంతో సాహసంగా వెళ్ళి ఆ కల్లోలిత ప్రాంతాల ప్రజలను ఆదుకున్న ఘట్టాలు ఉన్నాయి. వాయువ్య సరిహద్దులు, సింధ్, నౌఖాళి ప్రాంతాలలో మతకలహాలు విజృంభించినప్పుడు మత సామరస్యం ప్రబోధించేందుకు తన ప్రత్యేక దూతగా గాంధీజీ ఆమెను పంపారు.

వాయువ్య సరిహద్దులలో భయంకర మత ఘర్షణలు ఉధృతంగా సాగుతున్నప్పుడు ఆ ప్రాంతాలకు ఆనేక కష్టనష్టాలకోర్చి ఆమె వెళ్ళారు. దట్టమైన అడవుల గుండా గుర్రం మీద స్వారి చేస్తూ మతకలహాల బారిన పడిన ప్రాంతాలకు వెళ్ళి అన్ని వర్గాల ప్రజానీకంతో కలసి పోయి హిందూ ముస్లింల ఐక్యతను సాధించటంలో ఆమె చూపిన తెగువ నేర్పు ప్రతి ఒక్కరి ప్రశంసలందుకుంది.





సింధ్ ప్రాంతంలో మత ఘర్షణలు జరుగుతుండగా అమతుస్సలాంను అక్కడకు పంపుతూ ఆయన సన్నిహితులు ఆనంద్ హింగోరికి 1940 నవంబరు 6న గాంధీజీ లేఖ రాశారు. ఆ లేఖలో, **సింధ్‌లో జరుగుతున్న భయానక ఘర్షణలను ఆపేందుకు ఆమె ప్రాణాలను అరచేతిలో పెట్టుకుని వస్తుంది...ఆమె చాలా ధైర్యస్థురాలు, హింసాకాండను అడ్డుకునేందుకు ఆమె తన ప్రాణాలను సైతం పణంగా పెట్టగలదు** అని ఆ ప్రాంతంలోని తన ఇతర పరిచయస్తులకు రాసిన ఒక లేఖలో గాంధీజీ పేర్కొన్నారు.

ఈ మేరకు మత ఘర్షణలలో భాగంగా హింస ప్రజ్వరిల్లినప్పుడల్లా,వాటిని నిరోధించేందుకు ప్రజలలో స్నేహభావాన్ని పెంపొందించి శాంతి,సామరస్యాలు కాపాడేందుకు ఆమె చేసిన కృషిని **సరిహద్దు గాంధీ** ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్ 1943లో రాసిన ఉత్తరంలో ఎంతగానో కొనియాడారు.

నౌఖాళి మత కలహాలలో అక్కడ జరుగుతున్న హత్యాకాండను, హింసాత్మక వాతావరణాన్ని నివారించేందుకు మహాత్ముని ఆదేశాల మేరకు ఆమె వెళ్ళారు. అక్కడి పరిస్థితులను అదుపులోకి తెచ్చేందుకు శతవిధాల ప్రయత్నించి చివరి అస్త్రంగా ఆమె సత్యాగ్రహ దీక్షను చేపట్టారు. గాంధేయవాదిగా ఆమె చేపట్టిన సత్యాగ్రహదీక్ష 20 రోజులపాటు సాగింది. ఆమెలో ఉన్న చిత్తశుద్ధి, హిందూ-ముస్లింల మధ్యన ఆమె కోరుకుంటున్న ఐక్యత పట్ల ఉన్న నిబద్ధతను అర్థంచేసుకున్న ఇరువర్గాలు మతసామరస్య వాతావరణం ఏర్పడేందుకు దోహదపడ్డాయి. ఆ తరువాత గాంధీజీ అక్కడకు వెళ్ళి ఆయన స్వయంగా అందించిన పళ్ళరసం సేవించి అమతుస్సలాం సత్యాగ్రహ దీక్షను విరమించారు. ఈ విధమైన సాహసోపేత కార్యక్రమాలతో గాంధీజీ నిజమైన వారసురాలుగా ఆమె ఖ్యాతిని దక్కించుకున్నారు.

స్వేచ్ఛా భారతం కోసం కలలుగన్న జాతీయోద్యమకారులు తాము కన్నకలలను భగ్నం చేస్తూ ఇండియా ముక్కలయ్యింది. ఆ విభజన కూడా మతం పేరిట సాగటంతో అమతుస్సలాం చలించి పోయారు. ఆ విఘాతం నుంచి బయట పడేలోపుగా గాంధీజీ హత్యకు గురయారయ్యారు. కన్నబిడ్డలా ఆదరించిన మార్గనిర్ధేశం చేసి, అనారోగ్యపీడిత శరీరానికి మానసిక స్థైరాన్ని కలుగచేసే ఉపదేశం ఇచ్చిన మహాత్ముడు ఆకస్మికంగా అంతర్ధానమయ్యేసరికి ఆమె తట్టుకోలేక పోయారు. ఆ ఆవేదన నుండి త్వరిత గతిన బయటపడి గాంధీజీ చూపిన బాటలో ప్రజల సేవకు ఆమె పూర్తిగా పునరంకితం అయ్యారు.



విభజన సమయంలో ఎదురైన భయానక పరిస్థితుల బాధితులను ఆదుకునేందుకు ఆమె బాగా శ్రమించారు. నిస్సహాయ మహిళల సమస్యను అమతుస్సలాం ప్రధానంగా స్వీకరించారు. మృదులా సారాబాయి, సుభద్రా జోషిలతో కలసి అటు పాకిస్థాన్ ఇటు ఇండియా నుండి వేరుపడిన మహిళలను తమవారున్న ప్రాంతాలకు సురక్షితంగా చేర్చటం కోసం అమితంగా శ్రమించారు. ఈ పని మీద ఆమె పలుమార్లు పాకిస్థాన్ కూడా వెళ్ళారు.

ఆ తరువాత పంజాబ్‌లోని రాజపూర్ గ్రామంలో తనను కన్న కూతురులా చూసుకున్న కస్తూర్బా గాంధీ పేరిట **కస్తూర్బా మందిరం** అను ఆశ్రమాన్ని నెలకొల్పారు. ఆశ్రమంలో మహిళలకు చేతి వృత్తులను నేర్పటం, అక్షర జ్ఞానం అందించటం తదితర కార్యక్రమాలను చేపట్టారు. నిస్సహాయులైన మహిళలు తమ కాళ్ళమీద తాము నిలబడగలిగే ఆర్థిక బలాన్ని చేకూర్చేందుకు పలు పథకాలను రూపొందించి అమలు చేశారు. ఈ ఆశ్రమానికి సంబంధించి పలు శాఖలను ఆమె ఏర్పాటు చేశారు. అంటరానితనం మీద యుద్ధం ప్రకటించారు. దళిత జనులలో అక్షరజ్యోతులను వెలిగించేందుకు ప్రయత్నించారు. ఆశ్రమంలో కార్యకలాపాలను ఆమె తన పర్యవేక్షణలో నిర్వహిస్తూ అటు దళితుల, ఇటు మహిళల సేవలకు అంకితమయ్యారు.

సంపన్న జమీందారీ కుటుంబం నుండి తన భాగంగా లభించిన అతి విలువైన ఆస్థిపాస్థులను కస్తూర్బా ఆశ్రమ కార్యకలాపాల నిర్వహణకు వినియోగిస్తూ హరి జనోద్ధరణకు, నిస్సహాయ మహిళలకు చేయూతనివ్వటం కోసం ఎన్నో కార్యక్రమాలను, వ్యవస్థలను అమతుస్సలాం రూపొందించారు. శిశు సంక్షేమ కార్యాలయాలు, పాఠశాలలు,





నర్సరీలు, ఖాదీ కార్ఖానాలు, కుటీర పరిశ్రమలు, చేతివృత్తులలో శిక్షణ ఇచ్చే శిక్షణాలయాలను స్థాపించారు. ఈ కార్యక్రమాల వలన వేలాది అవసరార్థులకు పని లభించింది. ఎంతో మంది మంచి శిక్షణ పొంది ఆర్థిక పరిస్థితులను మెరుగుపర్చుకోవటం స్వయంగా గమనించిన ఆమె తన తల్లితండ్రుల ద్వారా లభించిన ఆస్థిపాస్థులు ఇంతమంది జీవితాల్లో వెలుగు నింపుతున్నందుకు ఎంతో సంతోషించారు.

జాతి సమైక్యత, సమగ్రతలను పటిష్ట పర్చేందుకు, హిందూ ముస్లింల మధ్యన ఐక్యతా భావనలను ప్రచారం గావించేందుకు, స్నేహపూరిత వాతావరణం పటిష్టం చేయాలని సంకల్పించిన ఆమె **హిందూస్థాన్** అను ఉర్దూ పత్రికను నడిపారు. ఈ పత్రిక ద్వారా గాంధేయ సిద్ధాంతం మహాత్ముని ఉపదేశాల ప్రచారం నిర్వహించారు. ఈ ప్రచారకార్యక్రమంలో భాగంగా ఆమె పలు రాష్ట్రాలలో పర్యటించటం మాత్రమే కాకుండా జపాన్ లాంటి దేశాలకు కూడా వెళ్ళివచ్చారు. ఈ సందర్భంగా మాతృభాష ఉర్దూ కాకుండా పంజాబీ, ఒరియా, బెంగాలి, తెలుగు, తమిళం, ఆంగ్లం, జపానీస్ భాషలను ఆమె నేర్చుకున్నారు.

1961లో తొలిసారిగా భారత దేశం వచ్చిన ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ వెంట ఉండి ఆయనకు సేవలందచేశారు. ఆయనతోపాటు దేశవ్యాప్త పర్యటనలో పాల్గొన్నారు. 1962లో చైనాతో యుద్ధం వచ్చినప్పుడు దత్త కుమారుడు సునీల్ కుమార్ సహాయంతో మన వీర జవానులకు సేవలందించారు. హెలికాప్టర్ ద్వారా నేఫా తదితర ప్రాంతాలు పర్యటించి ఆహారం, దుస్తులు, మందులు అందచేశారు. 1965 నాటి పాకిస్థాన్ యుద్ధం సందర్భంలో కూడా ఆనారోగ్యాన్ని కూడా లెక్కచేయక లద్దాఖ్ ప్రాంతంలో ఉన్న మన సైనిక యోధులకు ఆహారం, దుస్తులు తదితర సదుపాయాలను కలుగజేశారు.

ఈ మేరకు ఒకవైపున నిరంతరం అనారోగ్యంతో పోరాటం సాగిస్తూ మరోవైపున బ్రిటీషు పాలకులతో పోరులో ముందుకు సాగుతూ, ఆ తరువాత సామాజిక సమస్యల పరిష్కారం కోసం శ్రమిస్తూ జీవిత చరమాంకం వరకు గాంధేయ మార్గంలో సమరశీల జీవితాన్ని గడిపిన బీబీ అమతుస్సలాం 1985 అక్టోబర్ 29న కన్నుమూశారు.

◆◆◆



## జాతీయోద్యమకారుల, శ్రమజీవుల అక్కయ్య

# హాజఁరా ఆపా

**(1910-)**

**భా**రత జాతీయోద్యమంలో భాగస్వాములైన పలువురు మహిళలు ఒకవైపున బ్రిటీషర్ల నుండి మాతృదేశాన్ని విముక్తం చేయటం కోసం పోరాడుతూనే, స్వతంత్ర భారతంలో శ్రమజీవుల సంక్షేమాన్ని కాంక్షిస్తూ ఆ దిశగా అవిరళ కృషి సాగించారు. ఈ మేరకు అటు పరాయిపాలకులతో, ఇటు స్వదేశంలోని కార్మిక-కర్షక జనావళి సంక్షేమం కోసం అసమానతలకు వ్యతిరేకంగా అహర్నిశలు పోరాటాలు సాగించి ఉభయ పాత్రలను సమర్థవంతంగా పోషించిన మహిళా ప్రముఖులలో అగ్రగణ్యులు శ్రీమతి హాజఁరా బేగం.

జాతీయోద్యమకారులు, శ్రమజీవులచే ఎంతో ఆప్యాయంగా **హాజఁరా ఆపా** (హజరా అక్కయ్య) అని పిలిపించుకున్న హాజఁరా 1910 డిసెంబరు 22వ తేదిన ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం షహరన్‌పూర్‌లోని సంపన్న కుటుంబంలో జన్మించారు. ఈ ప్రాంతం అప్పుడు రాంపూరు సంస్థానంలో ఉండేది. ఆమె తండ్రి ముంతాజుల్లా ఖాన్ డిప్యూటీ కలక్టరు. నవాబు వంశస్థురాలు కావటంతో ఆమె క్వీన్ మేరీస్ కళాశాల లాంటి ప్రసిద్ధిగాంచిన విద్యాసంస్థలలో చదువుకున్నారు. చిన్నప్పటి నుండి ఆమె ఆటపాటలతో పాటుగా చదువులో అగ్రగామి. కళాశాలలో ఆమె చాలా చురుకైన విద్యార్థినిగా అధ్యాపకుల





మన్ననపొందారు. (మేరే జీవన్ కీ కుచ్ యాదేఁ (హిందీ), డాక్టర్ జడ్.ఎం. అహ్మద్, భారత కమ్యూనిస్ట్ పార్టీ, లక్నో, 1997, పేజీ.132)

బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటం చేస్తున్న యోధుల గురించి చిన్ననాటనే హాజఁరా బేగం విన్నారు. పోలీసు అధికారి అయిన తండ్రితోపాటుగా ఆమె మీరట్ నగరంలో ఉన్నారు. ఆ సమయంలో మీరట్ కుట్రకేసుకు సంబంధించిన విప్లవకారులను నిర్బంధంలోకి తీసుకుని ఆమె నివాసం ఉంటున్న బంగ్లా ప్రాంతంలో ఉంచటం జరిగేది. ఆ వాతావరణాన్ని గమనించిన ఆమెకు ఆ విప్లవకారులు ఎవరన్న విషయం మీద ఆసక్తి పెరిగి తండ్రిని అడిగారు. ఆయన సమాధానం చెప్పకున్నా వార్తాపత్రికల ద్వారా వారంతా బ్రిటీషు ప్రభుత్వాన్ని వ్యతిరేకిస్తున్న యోధులని తెలుసుకున్నారు. ఈ మేరకు తొలిసారిగా బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్న యోధుల పరోక్ష పరిచయం ఆమెకు లభించింది.

ఆమె అభిష్టానికి వ్యతిరేకంగా అబ్దుల్ జమీల్ ఖాన్‌తో హాజఁరా వివాహం జరిగింది. ఆ వివాహ బంధం ఎంతోకాలం నిలువలేదు. భర్త అబ్దుల్ జమీల్ ఖాన్ ఉన్నత స్థాయి పోలీసు అధికారి కావటంతో జాతీయ, స్వతంత్రభావాలు గల హాజఁరాకు అతనితో కుదరలేదు. అప్పటికి ఆ దంపతులకు సమీఖాన్ అను కుమారుడు కలిగాడు. కుమారుడు కలిగినా కూడా ఆ పోలీసు భర్తతో ఆమెకు పొసగకపోవటంతో తండ్రికి విషయం తెలిపి 1932లో భర్త నుండి విడాకులు తీసుకున్నారు.

ఆ తరువాత తండ్రి ప్రోత్సాహంతో1933లో తన బిడ్డతో సహా విద్యాభ్యాసం కోసం హాజఁరా లండన్ వెళ్ళారు. లండన్‌లోని మాంటిస్సోరి కళాశాలలో విద్యాభ్యాసం సాగించారు. ఇంగ్లాండులో జాతీయ భావాలు, సామ్యవాద భావాలు గల సజ్జాద్ జహీర్, జైనుల్లాబిదీన్ లాంటి యువకుల బృందంతో ఆమెకు పరిచయం కలిగింది. ఆ పరిచయం ద్వారా కమ్యూనిస్టు సాహిత్యాన్ని అధ్యయనం చేసిన ఆమె సామ్యవాద సిద్ధాంతం పట్ల అభిమానం, బ్రిటీషు సామ్రాజ్యవాద శక్తుల పట్ల వ్యతిరేకత పెంచుకున్నారు.

మాతృదేశం నుండి బ్రిటీష్ సామ్రాజ్యవాద శక్తులను వెళ్ళగొట్టేందుకు శ్రమించాలని నిర్ణయించుకున్నారు. ఆ క్రమంలో అంతర్జాతీయ స్థాయిలో జరిగిన సభలు, సమావేశాలు, చర్చలలో పాల్గొని బ్రిటీష్ సామ్రాజ్యవాదం, యుద్ధకాంక్షకు వ్యతిరేకంగా మాట్లాడి, ప్రసంగాలు చేసిన హాజఁరాకు బ్రిటీషు వ్యతిరేక ఉద్యమకారులలో ప్రత్యేక గుర్తింపు



భర్త, కూతురుతో హాజ్రా

లభించింది. లండన్‌లో ఓసారి జరిగిన మేడే సందర్భంగా ఆమె ఎర్రజెండా చేతపట్టి ఎంతో ధైర్యాన్ని ప్రదర్శిస్తూ, ఊరేగింపు అగ్రభాగాన నిలబడి సహచరులను సహితం ఆశ్చర్యచకితులను చేశారు.

ఇటలీలో జరిగిన అంతర్జాతీయ సమ్మేళనంలో ఆమె పాల్గొన్నారు. అంతేకాకుండా బ్రిటీషు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ బ్రెజిల్‌లో జరిగిన అంతర్జాతీయ సమావేశంలో ఆమె భారతీయ ప్రతినిధిగా భాగస్వామ్యులయ్యారు. ఆ క్రమంలో 1935లో భారతీయ విద్యార్థి బృందంలో సభ్యురాలిగా హాజ్రా బేగం సోవియట్ రష్యాకు వెళ్ళారు. ఈ విధంగా రష్యా సందర్శించిన మొట్టమొదటి భారతీయ ముస్లిం మహిళగా బేగం హాజ్రా ఖ్యాతి గడించారు. (Bharath Ke Swatantra Samgram me Muslim Mahilavonka Yogdaan : Page. 281)

లండన్‌లోని మాంటిస్సోరీ కళాశాలలో డిప్లొమా పూర్తయ్యాక హాజ్రా ఇండియా తిరిగి వచ్చారు. ఇండియా రాగానే 1935లో లక్నోలోని కరామత్ హుస్సేన్ బాలికల





కళశాలలో అధ్యాపకురాలిగా బాధ్యతలు స్వీకరించారు. ఆ కళాశాలలో ఒక వైపున ఉద్యోగం చేస్తూ, మరొకవైపున పి.సి. జోషి తదితర ప్రముఖ ఉద్యమకారులతో కలసి కమ్యూనిస్టు పార్టీ రహస్య కార్యకలాపాలలో నిమగ్నమయ్యారు. 1935లో ప్రముఖ కవి సజ్జాద్ జహీర్‌తో కలసి అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం ఏర్పాటు, ప్రథమ సమావేశం నిర్వహణలో పాల్గొని ఆమె ఆ సంఘ వ్యవస్థాపక సభ్యురాలయ్యారు.

1935లో ప్రముఖ విద్యావేత్త, కమ్యూనిస్టు నాయకుడు డాక్టర్ జైనుల్లాద్దీన్ అహమ్మద్‌ను హాజ్రా వివాహమాడారు. డాక్టర్ జడ్.ఎ. అహమ్మద్‌గా ప్రసిద్ధుడైన ఆయనను ఆమె తొలుత లండన్‌లో కలుసుకున్నారు. డాక్టర్ అహమ్మద్ ఇండియా వచ్చాక ఆయన కూడా కమ్యూనిస్టు పార్టీలో పనిచేస్తూ ఆమెకు సన్నిహితులయ్యారు. ఆ వివాహం 1935 మే 20న సయ్యద్ సజ్జాద్ జహీర్ తండ్రి లక్నో హైకోర్టు ప్రధాన న్యాయాధికారి సయ్యద్ వజీర్ హస్ గృహంలో జరిగింది. ఆనాటి నుండి భార్యభర్తలు అటు స్వరాజ్య సాధన, ఇటు శ్రమజీవుల సంక్షేమం కోసం ఉద్యమించారు.

1935 ప్రాంతంలో బేగం హాజ్రా, డాక్టర్ జైనుల్లాబిద్దీన్‌లు భారత జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించారు. రహస్యంగా ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలలో చురుగ్గా వ్యవహరిస్తున్న ఆ దంపతులు పోలీసు అధికారుల దృష్టిలో పడ్డారు. ఆ కారణంగా ఉద్యోగాలకు రాజీనామా ఇచ్చి పూర్తికాలపు ఉద్యమకారులయ్యారు. డాక్టర్ భరద్వాజ్ నాయకత్వంలో సజ్జాద్ జహీర్, డాక్టర్ అష్రాఫ్, డాక్టర్ జడ్.ఎ. అహమ్మద్ లతో కలసి పోలీసుల కళ్ళుగప్పి నిషేధిత కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాలతోపాటుగా భారత జాతీయ కాంగ్రెస్ కార్యక్రమాలను కూడా ఆమె సమర్ధవంతంగా నిర్వహించారు.

కమ్యూనిస్టు పార్టీ మీద నిషేధం తొలిగాక పార్టీకి సామాన్య మహిళా కార్యకర్తలు ఉండటమే అరుదైన ఆ రోజులలో బేగం హాజ్రా పార్టీ నాయకురాలిగా బాధ్యతలు చేపట్టి నిర్భయంగా నిర్వహించటం విశేషం. ఉత్తరప్రదేశ్ కమ్యూనిస్టు పార్టీ ప్రథమ సమావేశం నిర్వహణలో ప్రధాన పాత్ర పోషించిన ఆమె ఆ తరువాత అలహాబాద్ కమిటీ కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహించారు.

1936లో పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ జాతీయ కాంగ్రెస్ అధ్యక్షులయ్యాక అఖిల భాతర జాతీయ కాంగ్రెస్‌ను వ్యవస్థాపరంగా బలోపేతం చేయదలచుకున్నారు. ఆ పథకంలో భాగంగా జాతీయ కాంగ్రెస్‌కు పలు అనుబంధ సంస్థలను ఆయన

రూపొందించారు. అ సందర్భంగా హాజఁరాకు జనచైతన్య కార్యక్రమాల నిర్వహణా బాధ్యతలను ఆయన అప్పగించారు. ఆమె భర్త డాక్టర్ అహమ్మద్‌కు ఆర్థిక విభాగం బాధ్యతలను కేటాయించారు. బేగం హాజఁరా ఈ అవకాశాన్ని వినియోగించుకుని, అవిశ్రాంతంగా పలు ప్రాంతాలు పర్యటించి, తన ప్రసంగాలతో బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలను చైతన్య పర్చారు. ప్రధానంగా మహిళలను ఉద్యమింప చేయటంలో ఆమె సాధించిన ప్రగతి ఎందరికో ఆదర్శప్రాయమైంది.

ఆనాడు జరిగిన పలు ఎన్నికలలో పాల్గొని, భారత జాతీయ కాంగ్రెస్ అభ్యర్థుల గెలుపుకు హజఁరా బేగం కారణమయ్యారు. భారత జాతీయ కాంగ్రెస్ సమావేశాలలో పాల్గొని తన అభిప్రాయాలను నిష్కర్షగా వ్యక్తం చేసి నాయకుల, ప్రజల ప్రశంసలను అందుకున్నారు. ఆమె కొంతకాలం కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ సభ్యురాలిగా బాధ్యతలను నిర్వహించారు. ఆనాడు వామపక్ష భావాలు గల భారత జాతీయ కాంగ్రెస్ నాయకులుగా హాజఁరా దంపతులు గుర్తించబడ్డారు. 1937 మే లో ఆంధ్రప్రదేశ్‌లోని కొత్తపట్నంలో జరిగిన రాజకీయ శిక్షణా శిబిరంలో అధ్యాపకురాలిగా పాల్గొన్న బేగం హాజఁరా రాష్ట్ర ప్రజలకు కూడా సుపరిచితురాలు. (ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు పరకాల పట్టాభి రామారావు (విజయవాడ) గారి నుండి సమాచారం)

చిన్ననాటి నుండి ఎటువంటి లింగ వివక్షతను అంగీకరించని మనస్తత్వంగల హాజఁరా ఆ వివక్షతలకు వ్యతిరేకంగా పోరాటాలు చేయడానికి వెనుకాడలేదు. 1938 ప్రాంతంలో ఆమె కుమార్తె సలీమా గర్భంలో ఉన్నప్పుడు ప్రసవం నిమిత్తం అలహాబాద్ లోని ఆసుపత్రికి వెళ్ళగా అక్కడ ఆంగ్లేయులకు మేలు రకం సౌకర్యాలు, భారతీయులకు నాసిరకం ఏర్పాట్లు జరుగుతున్న తీరును చూసి గర్భవతైయుండి కూడా ఆ వివక్షతకు వ్యతిరేకంగా ఉద్యమించారు. ప్రసవం నిర్వహిస్తున్న డాక్టర్లకు సహకరించేందుకు నర్సింగ్ విభాగంలో మహిళలు కాకుండా పురుషులు మాత్రమే ఉండటం పట్ల ఆమె అభ్యంతరం వ్యక్తంచేశారు. ఆసుపత్రిలో మహిళా నర్సులను నియమించాలని హాజఁరా డిమాండ్ చేశారు. నర్సింగ్ విభాగంలో మహిళల ఏర్పాటు జరిగేంత వరకు ఆమె విజయవంతంగా ఆందోళన చేశారు. ఆ ఆందోళనకు మహిళల నుండి మంచి మద్దతు లభించింది. ప్రజాందోళన తీవ్రతరం కావటంతో ఆ విషయంలో పండిత జవహర్ లాల్ జోక్యం చేసుకోవాల్సి వచ్చింది. (మేరే జీవన్ కీ కుచ్ యాదేఁ (హిందీ) : పేజీ. 166-168)





1940 ప్రాంతంలో హాజఁరా బేగం, డాక్టర్ అహమ్మద్ భారత జాతీయ కాంగ్రెస్ పార్టీ నుండి బయటకు వచ్చేశారు. అప్పటినుండి ఆ ఇరువురు కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమాలలో పూర్తిగా నిమగ్నమయ్యారు. అసంఘటిత కార్మికులను సంఘటితం చేసి కార్మిక సంఘాలను స్థాపించటంలో ప్రధాన భూమిక నిర్వహించారు. ఈ క్రమంలో ఆమె అలహాబాదులో రైల్వే కూలీల సంఘం స్థాపించారు. అంతవరకు ఎవ్వరూ కూడా రైల్వేకూలీల సమస్యలు పట్టించుకున్న వారులేరు. అసలు రైల్వేకూలీల సంఘం ఏర్పాటు చేసినవారు లేకపోవటంతో రైల్వే కూలీల సంఘం నిర్మాతగా ఆమె రైల్వేకూలీల గౌరవాభిమానాలను అందుకున్నారు. ఆ కారణంగా రైల్వేకూలీలు ఆమెను తమ ప్రవక్తగా ప్రకటించుకున్నారు. ఈ కార్యక్రమాలలో ఆమెకు అలహాబాద్‌కు చెందిన షా అబ్దుల్ ఫౌజ్ సహకరించారు. (మేరే జీవన్ కీ కుచ్ యాదేఁ (హిందీ) : పేజీ. 200) ఈ సందర్భంగా ఆమె మీద దాడులు జరిగాయి. ఆమెను చంపుతామని బెదిరింపులు వచ్చాయి. బేగం హాజఁరా అ బెదిరింపులకు భయపడలేదు. ఆ ప్రమాదకర పరిస్థితులలో అలహాబాద్‌లోని రైల్వేకూలీలు అండగా నిలచి ఆమెను రక్షించుకున్నారు.

బేగం హాజఁరా మహిళా కార్మికుల సంక్షేమం పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపారు. మహిళలలో చైతన్యం కోసం సభలు-సమావేశాలు నిర్వహించారు. మతోన్మాదం వలన కలిగే అనర్థాలను వివరిస్తూ ప్రజలను చైతన్యపర్చేందుకు విశేషంగా కృషి చేశారు. మత సామరస్యం ప్రబోధించారు. హిందూ- ముస్లింల ఐక్యత కోసం పనిచేశారు. నూతన కార్మిక సంఘాల ఏర్పాటు, ఆ కార్మికుల హక్కుల రక్షణ, సంక్షేమం కోసం నిరంతరం శ్రమించారు. వృద్ధాప్యాన్ని కూడా లెక్కచేయక బేగం హాజఁరా సమాజసేవలో పాల్గొన్నారు.

ప్రజా జీవనరంగాలన్నిటిని స్పృశించి, తనదైన సేవలను అందించిన శ్రీమతి హాజఁరా బేగం గౌరవార్థం 1960లో సోవియట్ యూనియన్‌లో జరిగిన కామ్రేడ్ లెనిన్ శత జయంతి ఉత్సవాల సందర్భంగా ఆమెకు **సుప్రీం సోవియట్ జూబ్లీ అవార్డు** ప్రకటించారు. పండు వయస్సులో కూడా బేగం హాజఁరా దంపతులు కష్టజీవుల సంక్షేమం కోసం అవిశ్రాంతంగా కృషిసాగించారు.

◆◆◆

## మహిళా కార్యకర్తలచే ఆయుధం ధరింపచేసిన సమరశీలి

# సుల్తానా హయాత్ అన్సారి

**సు**దీర్ఘంగా సాగిన భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రను పరికిస్తే, వలస పాలకులకు వ్యతిరేకంగా ముత్తాత, తాత, తండ్రి, తనయులు ఉద్యమించిన కుటుంబాలు చాలా తక్కువగా దర్శనమిస్తాయి. స్వదేశాన్ని పరాయిపాలకుల నుండి విముక్తం చేయాలన్న సంకల్పం పూర్వీకుల నుండి వారసత్వంగా లభించటం, ఆ మేరకు మాతృభూమి సేవలో తరించటం లాంటి మహత్తర అవకాశం లభించిన కుటుంబానికి చెందిన తనయ బేగం సుల్తానా హయాత్.

సుల్తానా హయాత్ ముత్తాత ఖాజీ జియావుద్దీన్ ఢిల్లీ నగర ఖాజీగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. 1857లో ఆయన ఆ పదవికి రాజీనామా చేసి బ్రిటీషర్లకు వ్యతిరేకంగా తిరుగుబాటు యోధులకు సహకరించారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ సేనాని భక్త్‌ఖాన్ సలహా మీద ఆవధ్ సంస్థానానికి వెళ్ళడానికి మొగల్ పాదుషా బహుద్దూర్ షా జఫర్ నిరాకరించాక, భక్త్ ఖాన్ ఢిల్లీ నుండి తన బలగాలతో ఆవధ వైపుకు సాగారు. ఆ లోగా ఢిల్లీ పూర్తిగా ఆంగ్లేయుల వశమైంది. ఆ సమయంలో ఆంగ్లేయసైనికుల కళ్ళుగప్పి ఆవధ్‌కు పయనమైన భక్త్‌ఖాన్, ఆయన బలగాలు ఢిల్లీ నుండి తప్పుకోడానికి ఖాజీ జియావుద్దీన్ సహాయపడ్డారు. ఆ విషయం తెలుసుకున్న ఆంగ్లేయ అధికారి హడ్సన్ జియావుద్దీన్ మీద మండిపడుతూ ఆయన గృహం మీద దాడిచేశాడు. ఆస్థిపాస్తులను విధ్యంసం





చేశాడు. (Bharath Ke Swatantra Samgram me Muslim Mahilavonka Yogdaan : Page. 272)

ఆ జియావుద్దీన్ కుమారుడు ఖాజీ నజీముద్దీన్ కూడా జాతీయోద్యమకారుడు. బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా జాతీయ కాంగ్రెస్ మార్గదర్శకంలో ఉద్యమించారు. మీరట్ నగరంలోగల తమ కుటుంబ భవంతిలో కొంత భాగాన్ని ఖిలాఫత్-సహాయ నిరాకరణ ఉద్యమ కార్యాలయాలయాన్ని ఏర్పాటు చేసుకునేందుకు భారత జాతీయ కాంగ్రెస్‌కు దఖలు చేశారు. మీరట్ నగర కాంగ్రెస్‌కు 27 సంవత్సరాల పాటు అధ్యక్షునిగా ఆయన బాధ్యతలు నిర్వహించారు. (Encyclopedia of Muslim Biography, Nagendra Kumar Singh APHPC, New Delhi, 2001, Page. 485)

ఆ నజీముద్దీన్ బాటలో ఆయన కుమారుడు ఖాజీ బషీరుద్దీన్ నడిచారు. ఆయన కూడా జాతీయోద్యమ్యంలో పాల్గొన్నారు. ఆ ఖాజీ బషీరుద్దీన్ కుమార్తె సుల్తానా హయాత్. ఈ విధంగా ముత్తాత ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ యోధుడు కావటం, తాత, తండ్రి జాతీయ కాంగ్రెస్ ప్రముఖులు కావటంతో స్వేచ్ఛా-స్వాతంత్ర్య భావనలు సుల్తానాకు చిన్ననాటనే పరిచయమయ్యాయి. తాత ఖాజీ నజీముద్దీన్ సుదీర్ఘకాలం భారత జాతీయ కాం్రగెస్ మీరట్ నగర అధ్యక్షులుగా బాధ్యతలు నిర్వహించటం వలన ఆయన ఇంటికి పండిత మోతీలాల్ నెహ్రూ, మౌలానా ముహమ్మద్ అలీ, మౌలానా షౌకత్ అలీ, కమలాదేవి చటోపాధ్యాయ, మౌలానా అబుల్ కలాం అజాద్, జవహర్‌లాల్ నెహ్రూ, మౌలానా అతావుల్లా బొఖారి, డాక్టర్ సైఫుద్దీన్ కిచ్లూ, మౌలానా హఫీజుర్రెహమాన్ లాంటి ప్రముఖుల రాకపోకలు ఉండేవి. ఆ కారణంగా తాత దగ్గర ఉంటూ, ఆయనకు, ఆయన అతిథులకు సపర్యలు చేస్తూ గడిపిన సుల్తానా హయాత్‌కు చిన్ననాటనే ప్రముఖ నాయకుల పరిచయం కలిగింది.

ఆ పరిచయాలు, ఆ ప్రత్యేక రాజకీయ వాతావరణం సుల్తానా హయాత్‌లో సమరశీల భావాలకు అంకురార్పణ చేశాయి. ఆమె ఇంటిని తరుచుగా పోలీసులు వచ్చిసోదాలు నిర్వహించటంతో ఆమెకు పోలీసుల భయం లేకపోగా, బ్రిటీషు ప్రభుత్వం పట్ల వ్యతిరేకత బాగా పెరిగింది. చిన్నతనంలోనే ఆమె తాత ఖాజీ నజీముద్దీన్‌తో కలసి కాంగ్రెస్ సభలలో పాల్గొంటూ వచ్చారు. ఆ సభలలో తన సుమధుర కంఠంతో జాతీయభావాలతో నిండిన, దేశభక్తియుత కవితలు విన్పిస్తూ సభికులచే శభాష్

అన్పించుకున్నారు. ఆమె తాత గారి ప్రత్యేక శిక్షణలో చిన్న చిన్న ప్రసంగాలు చేయటం కూడా అలవాటు చేసుకున్నారు. ఆనాడు మీరట్‌లోని జుమా మసీదులో ఆమె అద్భుత ప్రసంగం చేసి బడాబడా నేతలను అబ్బురపర్చారు.

చిన్ననాటనే నాయకత్వం లక్షణాలను ప్రదర్శించి తన ఈడు పిల్లలతో కలసి ప్రత్యేక దళాన్ని ఏర్పాటు చేసుకుని సభలు, సమావేశాలు జరుగునప్పుడు ఆ కార్యక్రమాలకు విచ్చేసిన నేతలకు, సభికులకు సేవలందించటం ఆమె అలవాటు. ఈ క్రమంలో ఆమె జాతీయ కాంగ్రెస్ స్వచ్ఛంద సేవికల దళాలకు నాయకత్వం వహించారు. ఆమె విద్యాభ్యాసం చేస్తున్నప్పుడు పాఠశాలలో ప్రత్యేకంగా ఫిజికల్ ట్రైనింగ్ పొంది ఉన్నందున ఆ స్వచ్ఛంద సేవికల దళాల ఫిజికల్ ఫిట్‌నెట్ కోసం ప్రత్యేక శిక్షణా తరగతులను కూడా ఆమె నిర్వహించారు. యవతులకు లాఠీ తిప్పటం నేర్పారు. ఈ మేరకు మీరట్ నగరంలోని పలు సంఘాలు సంస్థలు, జాతీయ కాంగ్రెస్ నాయకులు, మహిళా నేతలు ఆమె సేవలను ఉపయోగించుకున్నారు.

ఆమె ధార్మికంగా నిష్టాగరిష్టురాలైనప్పటికి విభిన్న మతస్థులు కలసిమెలసి జీవిస్తున్న వాతావరణంలో సర్దుబాట్లు అవసరమని భావించారు. ఉద్యమాలను, పోరాటాలను మతం ఆసరాతో, మతం పేరుతో రూపొందించడాన్ని వ్యతిరేకించారు. హిందూ-ముస్లింల ఐక్యతకు ఈ చర్యలు విఘాతం కల్గించగలవని అభిప్రాయపడ్డారు. ముస్లింలకు ప్రత్యేక సంఘాలు, రాజకీయ పార్టీల ఏర్పాటును నిరసించారు.

1933-34 ప్రాంతంలో ఢిల్లీలోని అరబిక్ కళాశాలలో ముస్లిం మహిళల సమావేశం జరిగింది. ఆ సమావేశానికి పెద్ద ఎత్తున ఏర్పాట్లు జరిగాయి. దేశ వ్యాప్తంగా ఉన్న ప్రముఖులందరికి ఆహ్వానాలు వెళ్ళాయి. ఆ ఆహ్వానాల మేరకు ప్రముఖ మహిళా నేతలు సమావేశాలకు విచ్చేసారు. ఆ సమావేశాలలో మీరట్ ప్రతినిధులుగా సోదరి జెహరా బేగంతో కలసి బేగం సుల్తానా హయాత్ పాల్గొన్నారు. ఆ సమావేశంలో ప్రకటించిన ఉద్దేశ్యానికి భిన్నంగా ముస్లిం విద్యార్థినుల కోసం **ముస్లిం విద్యార్థినుల సమాఖ్య** ఏర్పాటుకు ప్రయత్నాలు ఆరంభమయ్యాయి. ఆ ప్రయత్నాలు సుల్తానా సోదరీమణులకు నచ్చలేదు. ఈ మేరకు ప్రవేశపెట్టిన తీర్మానాన్ని సుల్తానా హయాత్, ఆమె చెల్లెలు బేగం జొహరా బేగం తీవ్రంగా ప్రతిఘటించారు. ఆ తీర్మానం తగదంటూ ఆమె వాదన ప్రవేశపెట్టారు. ఆ ప్రతిఘటన, ఆమె సాగించిన సంవాదం సమావేశంలో సుదీర్ఘ చర్చకు





కారణమయ్యాయి. ముస్లింలీగ్ నేతల మార్గదర్శకత్వంలో సాగిన ఆ సమావేశంలో సుల్తానా హయాత్ వాదనలు వీగిపోయాయి. **ముస్లిం అయిఉంటే ముస్లింలీగ్‌లోకి చేరు** అంటూ సమావేశంలో ఒత్తిడి వచ్చినా జాతీయోద్యమకారుల వారసులైన ఆ సోదరీమణులు ఆ ఒత్తిడులకు తలవొగ్గలేదు.

1942లో ప్రారంభమైన **క్విట్ ఇండియా** ఉద్యమంలో నాటికి యువతిగా రూపాంతరం చెందిన బేగం సుల్తానా హయాత్ ఉద్యమంలో పాల్గొనటం ఆరంభించారు. **ఆనాడు ముస్లిం మహిళలేంటి మహిళలందరి మీద ఆంక్షలు ఉండేవి. మహిళలు పరోక్షంగా సహాయ సహకారాలు అందిచటం వరకు కార్యకలాపాలు పరిమితం. ఆ కారణంగా ఆమె పూర్తి స్థాయిలో కాంగ్రెస్ కార్యక్రమాలలో నిమగ్నం కాలేకపోయారు.** అందువల్ల ఆమె కూడా ప్రత్యక్షంగా కార్యక్రమాలలో పాల్గొనకుండా పరోక్షంగా ఉద్యమకారులకు సహాయపడటం కోసం తనదైన కార్యకలాపాలను రూపొందించుకున్నారు.

జాతీయ కాంగ్రెస్ పిలుపు మేరకు ప్రదర్శనలు, పికెటింగ్‌లు, ఊరేగింపులు, శాసనోల్లంఘన కార్యక్రమాలు నిర్వహిస్తున్న సందర్భంగా పోలీసుల దాష్టీకాలకు గురైన ఉద్యమకారులకు సేవలందించడానికి సుల్తానా హయాత్ అత్యధిక ఆసక్తి చూపారు. ఈ మేరకు యువతులతో ఒక సేవాదళాన్ని స్థాపించారు. ఈ దళం ఒకవైపు సేవా కార్యక్రమాలను నిర్వహిస్తూనే, మరొకవైపు బ్రిటీష్ ప్రభుత్వాన్ని చికాకు పర్చే చర్యలను ఎంతో సాహసోపేతంగా సాగించింది. బ్రిటీష్ పోలీసుల మీద సదా కన్నేసివుంచి, అధికారుల రాకపోకల గురించి ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ ఆ సమాచారాన్ని ఉద్యమకారులకు తెలపటమేకాక ఉద్యమ **కొరియర్లు** గా కూడా ఆమె పర్యవేక్షణలో దళ సభ్యులు పనిచేశారు.

ఈ సందర్భంగా ఎదురయ్యే ప్రమాదకర పరిస్థితుల నుండి బయట పడేందుకు యువతులు ఆయుధాలను ధరించాలని, ఆత్మరక్షణ కోసం పోరాట పద్ధతులను యువతులకు నేర్పాలని బేగం సుల్తానా నిర్ణయించారు. ఆ మేరకు తాత ఖాజీ నజీముద్దీన్ సహకారంతో సేవాదళ సభ్యులందరి కోసం ప్రత్యేకంగా ఆయుధాలను తయారు చేయించి, వాటిని ప్రయోగించడంలో కూడా శిక్షణ ఇప్పించారు. అనివార్య పరిసిత్థులలో ఆత్మాహుతి చేసుకోడానికి కూడా సభ్యులు సన్నద్ధంగా ఉండేట్టుగా మానసికంగా వారిని తయారు చేశారు. అయితే ఆ తరువాతి కాలంలో ఆత్మహత్య నిర్ణయం తప్పుడు నిర్ణయమని ఆమె

అంగీకరించారు.

1942 ప్రాంతంలో బేగం సుల్తానా మహాత్ముని సేవాగ్రాంలో కొంతకాలం ఉన్నారు. తాత ఖాజీ నజీముద్దీన్‌తో కలసి ఆమె గాంధీజీ మార్గదర్శకత్వంలో పలు కార్యక్రమాల నిర్వహణలో పాల్గొన్నారు. సేవాగ్రాంలో ఉన్నప్పుడు ఆమె గాంధీజీకి మరింత సన్నిహితమయ్యారు. ఆమె గాంధీజీ పుస్తకాలు, ఉత్తరాలను ఉర్దూ భాషలో తర్జుమా చేస్తూ ఆయనకు సహాయపడ్డారు. ఆమె సమర్థత, సంకల్పబలం గమనించిన గాంధీజీ ఆమెను బాగా ప్రోత్సహించారు.

స్వదేశీ ఉద్యమంలో భాగంగా సాగిన విదేశీ వస్తువుల, మద్యపాన విక్రయశాలల వద్ద జరిగిన పికెటింగ్ కార్యక్రమాలలో సుల్తానా హయాత్ చురుకుగా పాల్గొన్నారు. మహాత్ముని ప్రభావం ఎంతగా ఉన్నా, స్వతంత్ర భావాలు గల ఆమె కొన్ని విషయాలలో ఆయనతో ఏకీభవించలేక వాదనకు దిగి చివరకు గాంధీజీ చేతనే శభాష్ అన్పించుకున్న సందర్భాలు కూడా ఉన్నాయి.

ఆనాడు కరాచిలో జరగనున్న జాతీయ కాంగ్రెస్ సమావేశాల సందర్భంగా వ్యక్తిగత సత్యాగ్రహాన్ని ఓ నియమంలా కాకుండా ఓ నీతిలా అనుసరించాలన్న ప్రతిపాదన గురించి పత్రికల్లో చర్చ జరుగుతుంది. ఆ చర్చ నేపథ్యంలో సుల్తానా హయాత్ గాంధీజీకి లేఖ రాశారు. ఆ లేఖలో కాంగ్రెస్ ప్రతిపాదనను ఆయన దృష్టికి తెస్తూ, వ్యక్తిగత సత్యాగ్రహం నియమం కాకుండా నీతి అని భావించినట్టయితే అది గాంధేయ మార్గానికి విరుద్ధం కాదా? అని గాంధీజీని ఆమె ప్రశ్నించారు. ఆ ప్రశ్నకు సమాధానంగా 1942 జనవరి 27న సుల్తానా హయాత్‌కు గాంధీజీ స్వయంగా లేఖ రాస్తూ **ఈ విషయం మీద నీ అభిప్రాయం సరైనది** అని పేర్కొన్నారు.

ఓసారి **ఉర్దూ భాష ముస్లింల భాష** అని గాంధీజీ అన్నట్టుగా పత్రికలలో వచ్చింది. అది చూసిన సుల్తానా హయాత్ గాంధీజీతో విభేదిస్తూ, ఉర్దూ ముస్లింల భాష ఏమాత్రం కాదు, ఇది భారతీయులందరి భాష కాగా మీరలా ఎందుకన్నారని ప్రశ్నించారు. ఆ ప్రశ్నకు సమాధానంగా **నేను అలా అనలేదు. ఏంచేద్దాం ? పత్రికలలో చాలా విషయాలు తప్పులు రాస్తున్నారు** అని ఆయన సుల్తానాకు సమాధానం చెప్పాల్సి వచ్చింది.

1946లో ఆమెకు లక్నో నివాసి, పండితుల కుటుంబం నుండి వచ్చిన హయాతుల్లా అన్సారీతో వివాహం జరిగింది. ఆయన ఉన్నత విద్యావంతుడు, గొప్ప





సాహితివేత్త, రచయిత, జర్నలిస్టు. అన్నిటి కంటే జాతీయోద్యమ నాయకులలో ప్రముఖులు. భర్త సహచర్యంలో ఒకవైపున జాతీయోద్యమంలో పాల్గొంటూ అప్పటికే గ్రాడ్యుయేషన్ పూర్తి చేసిన అమె జర్నలిజంలో శిక్షణ పొందారు. భార్యభర్తలు జాతీయవాదులు కావటంతో జాతీయోద్యమంలో చురుకైన పాత్రను నిర్వహించారు.

బేగం సుల్తానా హయాత్ అన్సారి ముస్లిం లీగ్ వేర్పాటువాదాన్ని నిరసించారు. లీగ్ నాయకుల వాదాలను పూర్వపక్షం చేస్తూ ప్రసంగాలు చేశారు. పత్రికలలో ప్రకటనల ద్వారా విభజన ప్రమాదాన్ని ప్రజలకు తెలిపారు. చివరకు స్వదేశానికి ' స్వరాజ్యం ' సిద్ధించినా, దేశం రెండుగా చీలిపోయినందున ఆ దుఃఖభారంలో మునిగిన సుల్తానా దంపతులు క్రియాశీల రాజకీయాల నుండి నిష్క్రమించారు.

ఆ విధంగా రాజకీయాలకు దూరమైన ఆ దంపతులు, హిందూ-ముస్లింల ఐక్యతకు కృషి ప్రారంభించారు. మత వైషమ్యాలను రెచ్చగొట్టే శక్తులకు వ్యతిరేకంగా ఉద్యమించారు. ఉర్దూ భాషా పరిరక్షణోద్యమానికి ఎంతగానో చేయూతనిచ్చారు.ఈ లక్ష్యసాధన కోసం **అంజుమన్ తారఖ్ఖి-యే-ఉర్దూ** Anjuman Taraqqi-e-Urdu)అను సంస్థను స్థాపించారు. ఆ సంస్థ వ్యవస్థాపక అధ్యక్షురాలిగా ఆమె పనిచేశారు. ఉర్దూ భాషను రక్షించాలని, ఆ భాషను అభివృద్ధిపర్చాలని డిమాండ్ చేస్తూ, 20 లక్షల సంతకాలతో ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వానికి భారీ మహజరు సమర్పించారు.

మహిళలలో చైతన్యజ్యోతులు వెలిగించేందుకు సుల్తానా హయాత్ పలు మహిళా సంఘాలను, సంస్థలను స్థాపించారు. ఆ సంస్థలు ప్రస్తుతం శాఖోపశాఖలుగా విస్తరించి మహిళల సంక్షేమం కోసం కృషి చేస్తున్నాయి. మత సామరస్యానికి పాటుపడుతూ, మత మౌఢ్యానికి, అజ్ఞానానికి వ్యతిరేకంగా పోరాడుతూ, మహిళా సంఘాలకు, ప్రజా సంఘాలకు మార్గదర్శకత్వం వహిస్తూ సుల్తానా హాయాత్ అన్సారి అశేష ప్రజానీకం ప్రేమాభిమానాలకు పాత్రులయ్యారు.

◆◆◆

స్వాతంత్ర్య సమరయోధుల పెన్షన్ స్వీకరిస్తే అది నా మాతృదేశ భక్తికి నేను ఖరీదు కట్టినట్లు కాగలదు. అందువనల పెన్షన్ నాకొద్దు. **- సఫియా అబ్దుల్ వాజిద్.**

## దళిత జన హితైషి, పోలియో వ్యతిరేక పోరాటయోధురాలు

# 'పద్మశ్రీ' ఫాతిమా ఇస్మాయిల్

**(1903-1987)**

**జా**తీయోద్యమం భారతీయులలో మహత్తర సేవాతత్పరతకు ప్రేరణయ్యింది. ఆ స్ఫూర్తితో కుటుంబాలకు కుటుంబాలు ఉద్యమంలో పాలుపంచుకున్నాయి. బ్రిటీష్ వలస పాలకుల కిరాతకాలను లెక్కచేయక పోరుబాటన నడిచాయి. అటువంటి కుటుంబంలో సభ్యురాలిగా తల్లి-తండ్రి,అన్నా-తమ్ముళ్ళ బాటలోసాగి అటు జాతీయోద్యమంలో ఇటు సేవారంగంలో అద్వితీయమైన పాత్ర నిర్వహించిన మహిళ శ్రీమతి ఫాతిమా ఇస్మాయిల్.

నాటి గుజరాత్ రాష్ట్రం బొంబాయికి చెందిన ప్రసిద్ధ స్వాతంత్ర్యోద్యమ నాయకులు హాజీ ముహమ్మద్ యూసుఫ్ సోహాని కుమార్తె బేగం ఫాతిమా. ఆమె కుటుంబం సంపన్న మోమిన్ వంశానికి చెందినది. ఆమె అన్నయ్య ముహమ్మద్ ఉమర్ సోహాని. చిన్నన్నయ్య ముహమ్మద్ ఉస్మాన్ సోహాని. ఉమర్ సోహాని బొంబాయిలో ప్రముఖ వ్యాపారవేత్త. ఆ ఇరువురు సోదరులు కూడా తండ్రి మార్గంలో విముక్తిపోరాట బాటలో ముందుకు సాగారు. జాతీయోద్యమ కార్యకలాపాలు సజావుగా సాగేందుకు అవసరమగు ఆర్థిక పుష్టిని అందించటంలో ఆ సోదరులు ముందున్నారు. ఆనాడు భూరిగా విరాళాలు అందచేతలో ప్రధానంగా ఉమర్ సోహాని ప్రఖ్యాతి గడించారు.





మహాత్మాగాంధీ **తిలక్ ఫండ్** కోసం ముహమ్మద్ ఉమర్ సోహాని వద్దకు రాగా తన చెక్కుబుక్‌ను ఆయకిచ్చి ఇష్టమొచ్చినంత రాసుకోమన్నారు. గాంధీజీ లక్ష రూపాయలను రాయగా అందుకు ఆయన సంతోషంగా అంగీకరించారు. ఆ తరువాత ఖిలాఫత్ ఫండ్ కోసం ఖిలాఫత్ నేతలు ఉమర్ సోహానిని కలువగా వారికి కూడా ఆయన లక్షరూపాయాల విరాళం ఇవ్వటమే కాకుండా ఖిలాఫత్ కార్యాలయం ఏర్పాటుకు తన స్వంత భవంతిని అప్పగించారు. ఆ తరువాతి కాలంలో ఆ భవంతి **ఖిలాఫత్ హౌస్** గా పిలువబడింది. (Muslims In India, Volume -II, Naresh Kumar Jain, Manohar, New Delhi, 1979, Page : 162).

ముహమ్మద్ ఉమర్ సోహాని చాలా ఉదార స్వభావులు. జాతీయోద్యమ కార్యక్రమాల నిర్వహణకు అవసరమగు నిధుల అందచేతలో తానెప్పుడూ ప్రథమ స్థానంలో ఉండాలన్నది ఆయన అభిమతం. ఆ కారణంగా ఉద్యమనాయకులు ఆయన సహాయం కోరివస్తే అందరి కంటె అధిక మొత్తాన్ని అందించి ఆనందించటం ఆయన అలవాటు. ఆ అలవాటుకు తగ్గట్టుగా వ్యాపారంలో ఆయన అపారంగా ఆర్జించారు. ఆ క్రమంలో ఓ మాసంలో ఆయన సంపద ద్విగుణీకృతమైంది. ఆ తరువాత దురదృష్టవశాత్తు మరుసటి నెలలో అనూహ్యంగా కోట్లాది రూపాయలను ఆయన నష్టపోయారు. ఆ నష్టంతో ఆయన బాగా క్రుంగిపోయారు. ప్రజోపకర కార్యకలాపాలకు, ప్రధానంగా జాతీయోద్యమానికి ఆర్థిక సహాయం అందించటంలో ముందు ఉండలేకపోయినందున ఆయన ప్రజా జీవితం నుండి దూరం కావాలనుకున్నారు. (Muslims In India, Page : 162).

ఆ విధంగా ప్రజా జీవితం నుండి రాజకీయాల నుండి దూరమైన సోహానిని వ్యాపారంలో వచ్చిన అపారనష్టం కల్గించిన వేదన కంటే ప్రజలకు, ఉద్యమకారులకు, జాతీయోద్యమానికి తాను ఏవిధంగానూ ఉపయోగపడలేక పోయాన్న దిగులు ఆయనలో అధికమయ్యింది. ఆ బాధతో సతమతమౌతూ 36 సంవత్సరాల వయస్సులో 1926 జూలై 6న ఆయన కన్నుమూశారు. ఆ సందర్భంగా, His untimely and sudden death has removed a patriot from the country అని వ్యాఖానిస్తూ మహాత్మాగాంధీ **యంగ్ ఇండియాలో** ఆయనకు నివాళులర్పించారు.

అటువంటి ఉదార హృదయులు, త్యాగశీలుర కుటుంబంలో బేగం ఫాతిమా 1903 ఫిబ్రవరి 4వ తేదీన జన్మించారు. ఆమె తండ్రి యూసుఫ్ సోహాని, సోదరులు

ఉమర్ సోహాని, ఉస్మాన్ సోహానిలు కూడా జాతీయోద్యమకారులు. ఆ జాతీయోద్యమ నేతల గారాల పట్టిగా పెరిగిన కుమారి ఫాతిమా చిన్నతనం నుండే బ్రిటీష్ వ్యతిరేక భావాలను పుణికి పుచ్చుకున్నారు. అన్యాయాన్ని, అధర్మాన్ని ఏమాత్రం సంకోచం లేకుండా ధైర్యంగా ఎదుర్కోవటం గుణంగా ఆమె ఎదిగారు. స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల పట్ల మక్కువ ఎక్కువ. అహేతుక ఆచార, సంప్రదాయాలకు ఆమె వ్యతిరేకి. సకారాత్మకమైనా నకారాత్మకమైనా తన అభిప్రాయాన్ని నిర్భీతిగా ప్రకటించటం ఆమె అలవాటు.

1919లో ఆమె సీనియర్ కేంబ్రిడ్జి పూర్తిచేసి 1920లో బొంబాయి విశ్వవిద్యాలయం నుండి మెట్రిక్యులేషన్‌లో అత్యుత్తమ మార్కులతో ఉత్తీర్ణత పొందారు. ఉర్దూ, ఆంగ్ల భాషలలో మంచి విద్వత్తును సాధించారు. 1921-1923లో వియన్నాలో వైద్యవిద్య చదవడానికి వెళ్ళిన ఆమె అనివార్య కారణాల వలన వైద్యవిద్యను అసంపూర్ణంగా వదిలేశారు.

ప్రభుత్వ ఉన్నతోద్యోగి హసన్ ఇస్మాయిల్‌ను ఆమె వివాహమాడారు. ఆయన కూడా స్వాతంత్ర్యోద్యమాభిమాని. భర్త ప్రోత్సాహంతో స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా సాగిన స్వదేశీ ఉద్యమంలో పాల్గొనటం ద్వారా ఫాతిమా ఇస్మాయిల్ జాతీయోద్యమ రంగప్రవేశం చేశారు. స్వదేశీ వస్తువులను విక్రయిం చేందుకు, వినూత్న ఏర్పాట్లు చేసి ప్రజల, ప్రముఖుల దృష్టిని ఆకర్షించారు. విదేశీ వస్తువులను బహిష్కరించమని కోరటం మాత్రమే కాకుండా స్వదేశీ ఉత్పత్తులను ప్రజలకు అందుబాటులో ఉంచాలనుకున్నారు. ఆ ఆలోచన రావటమే తరువాయి రైలులోని ఓ ప్రత్యేక బోగీలో స్వదేశీ వస్తుసామగ్రిని నింపుకుని ఆ సామగ్రిని ప్రజలకు అందుబాటులోకి తెస్తూ, స్వదేశీ ఉద్యమ సందేశాన్ని వ్యాప్తి చేశారు. స్వదేశీ ఉద్యమంలో క్రియాశీలకంగా పాల్గొనటమే కాకుండా, స్వదేశీయులచే పలు కుటీర పరిశ్రమల స్థాపనకు ఆమె కృషి సల్పారు.

1934లో సమాజోద్ధరణలో భాగంగా మహిళలను చైతన్యవంతుల్ని చేసి సంఘటిత పర్చేందుకు సంఘాలు, సంస్థలు స్థాపించారు. **అంజుమన్ ఇస్లాహే నిశ్వా మహిళా సుధార్ సమితి** అను సంస్థను స్వయంగా ఆరంభించారు. 1935లో ఆమె అఖిల భారత మహిళా సమావేశానికి కార్యదర్శిగా నియుక్తులయ్యారు. బొంబాయి ముస్లిం మహిళలలో వయోజన విద్యా వ్యాప్తికిఎంతో కృషిచేశారు. పలు సంఘాలను, సేవా సంస్థలను స్థాపించి, ఆయా సంస్థల అభివృద్ధికి శ్రమించారు. ఈ మేరకు మహిళలలో జాగృతికోసం చేస్తున్న కృషి





ఫలితంగా 1937-1940ల మధ్యలో ఆమె అఖిల భారత మహిళా కాన్ఫరెన్స్ హాస్టల్ కార్యదర్శి బాధ్యతలు లభించాయి.

ఆ క్రమంలో 1940లో బొంబాయి ఉమెన్స్ కౌన్సిల్‌కు చెందిన లేబర్ సమితికి ఉపాధ్యక్షురాలయ్యారు. ఆ పదవిలో ఆమె కార్మికుల కుటుంబాలలో మహిళల పరిస్థితులను మెరుగుపర్చేందుకు ప్రయత్నించారు. ఆమె స్వయంగా కర్మాగారాలకు చుట్టుపక్కల ఉంటున్న కార్మికవాడలకు వెళ్ళి కార్మిక కుటుంబాల మహిళలతో వారి సమస్యల మీద చర్చించారు. ఆ మహిళల సమస్యలను ప్రత్యక్షంగా చూసి ఆ సమస్యల పరిష్కారానికి ఆచరణాత్మక మార్గాలను సూచిస్తూ మహిళల అభిమానాన్ని చూరగొన్నారు. ఈ సందర్భంగా అఖిల భారత గ్రామీణోద్యోగ సంఘం ఏర్పాటుకు పునాదులు వేశారు. సమస్యలతో సతమతమవుతున్న మహిళలు తమ సమస్యలను తాము పరిష్కరించుకుంటూ, ఆర్థికంగా బలోపేతం అయ్యేందుకు కుటీర పరిశ్రమలను, చేతి వృత్తులను ప్రోత్సహించారు. ఆ కృషిలో భాగంగా పలు మహిళా సంక్షేమసంఘాలను ఏర్పాటు చేశారు.

1942లో ప్రారంభమైన క్విట్ ఇండియా ఉద్యమంలో ఫాతిమా ఇస్మాయిల్ క్రియాశీలపాత్ర వహించారు. ఈ ఉద్యమంలో పోలీసుల అరెస్టులను తప్పించుకుంటూ ఆమె పనిచేశారు. ఒకదశలో ఆమె అజ్ఞాతంలోకి వెళ్ళారు. 1940లో రాంఘర్, 1943లో బొంబాయిలో జరిగిన అఖిల భారత జాతీయ కాంగ్రెస్ సమావేశాలకు పాతిమా ఇస్మాయిల్ హాజరయ్యారు. ఖద్దరు, స్వదేశీ ఉద్యమ ప్రచారం, స్వదేశీ ఉత్పత్తులకు ప్రోత్సాహం, హిందూ- ముస్లింల ఐక్యత ప్రధాన లక్ష్యాలుగా ఎంచుకుని ఆమె ముందుకు సాగారు. ఈ లక్ష్యాల సాధన కోసం సాగించిన ప్రయత్నాలలో భాగంగా ఆమె పలు ప్రాంతాలను సందర్శించారు.

క్విట్ ఇండియా ఉద్యమంలో ఫాతిమా ఇస్మాయిల్ చురుకైన భాగస్వామ్యం వహిస్తుండగా 1944 ప్రాంతంలో ఆమె కుమార్తె పోలియో బారిన పడింది. ఆ కారణంగా కుమర్తె అవిటితనానికి గురైంది. బిడ్డ అవిటిగా మారటంతో ఫాతిమా ఇస్మాయిల్ తీవ్రంగా కలత చెందారు. పోలియో పరిణామాల నుండి ఆమెను కాపాడుకునే ప్రయత్నాలలో లక్షలాది పిల్లలు పోలియో రక్కసి బారిన పడి వికలాంగులుగా మారుతున్న దుస్థితిని గమనించారు. సరైన చికిత్స లేని ఆ వ్యాధి నుండి పిల్లలను కాపాడుకునేందుకు వ్యాయామం ఒక్కటే కారణమని తెలుసుకున్న ఆమె ఆ దిశగా తన బిడ్డ మీద ప్రయోగాలు

చేశారు. ఆమె ప్రయోగాలు సత్ఫలితాలనిచ్చాయి. దానితో పోలియో రహిత సమాజాన్ని ఏర్పాటు చేయడం సాధ్యమని ఆమెకు విశ్వాసం కలిగింది. కష్టసాధ్యమైన ఆ మహోత్తర లక్ష్యసాధనకు పూర్తికాలపు సేవలు అవసరమని ఆమె భావించారు. ఆ క్షణం నుండి ఆమె సాగిస్తున్న బ్రిటీష్ వ్యతిరేక పోరాటానికి తాత్కాలికంగా స్వస్తి చెప్పి పోలియో నుండి బిడ్డలను కాపాడేందుకు పోలియో మీద అవిశ్రాంత పోరాటం సల్పేందుకు నడుంకట్టారు.

ఆమె గతంలో వైద్యశాస్త్ర విద్యార్థి కావటంతో పోలియో నివారణ, నియంత్రణ కార్యక్రమాల మీద ప్రత్యేకంగా శిక్షణ పొందారు. బొంబాయికి చెందిన డాక్టర్ బాలిగాతో కలిసి పోలియో రోగగ్రస్తులైన పసిబిడ్డలకు వ్యాయామం ద్వారా పోలియోను నయం చేసేందుకు 1947లో ఒక సంస్థను ప్రారంభించారు. ఆ సంస్థ కోసం పోలియో రోగగ్రస్త బిడ్డల ఆరోగ్యం కోసం ఫాతిమా ఇస్మాయిల్ పూర్తి కాలాన్ని వినియోగించటం ప్రారంభించారు. పండిత నెహ్రూ కుటుంబానికి చాలా సన్నిహితంగా మెలిగారు. ఆ కుటుంబం సహాయ సహకారాలతో పోలియో నివారణ సంస్థను, ఆ సంస్థ కార్యక్రమాలను మరింతగా విస్తరింపచేశారు.

ఈ క్రమంలో పేదరికం, అనారోగ్యం పట్టిపీడిస్తున్న కార్మికులను, అజ్ఞానం, ఆర్థిక బలహీనతలతో బానిసల కంటే దుర్భరంగా బ్రతుకులీడుస్తున్న మహిళలనూ, సాంఘిక అసమానతలు, సామాజిక దురాచారాలను, అంటరానితనంతో అత్యంత హీనంగా చూడబడుతున్న దళిత జనసముదాయాల స్థితిగతులనూ అతిసమీపం నుండి గమనించారు. ఆ అవాంఛనీయ పరిస్థితులలో మౌలిక మార్పుకోసం పనిచేయటం ఆరంభించారు. ఈ దిశగా ఆమె తన జీవితాన్ని పూర్తిగా అంకితం చేశారు. శ్రమ జీవుల పక్షాన పోరాటాలు చేశారు. ఆరోగ్యం, పరిశుభ్రత విషయాలలో చైతన్యం కోసం కృషి సల్పారు. కర్మాగారాల వాతావరణం, పరిశుభ్రత పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపారు.

జాతీయ అంతర్జాతీయ సంస్థల పిలుపు మేరకు, పోలియో వ్యాధి నివారణకు తీసుకోవాల్సిన చర్యలను, పసిబిడ్డల పట్ల తీసుకోవాల్సిన ప్రత్యేక జాగ్రత్తలను వివరిస్తూ పలు విదేశీ పర్యటనలు జరిపారు, ఆమె స్వయంగా పలు చోట్ల శిక్షణ పొందారు. స్వదేశంలో స్థాపించబడిన పలు స్వచ్ఛంద సేవా సంస్థలకు చేయూతనిచ్చారు. పోలియో పీడితులకు మాత్రమే కాకుండా అంగవికలాంగుల ఉద్ధరణకు కూడా ఆమె కృషిచేశారు. వికలాంగులకు ప్రభుత్వం నుండి సదుపాయాలు కలుగజేసేందుకు ఆమె నిరంతరం





శ్రమించారు. వికలాంగుల సేవా కేంద్రాల స్థాపనను ప్రోత్సహించారు.

ఈ మేరకు అటు పోలియో మీద అవిశ్రాంత పోరాటం చేస్తూ, ఇటు సామాజిక రుగ్మతలకు వ్యతిరేకంగా తిరుగులేని యుద్ధం ప్రకటించిన ఫాతిమా ఇస్మాయిల్ ఆచరణాత్మక సేవలను గుర్తించిన భారత ప్రభుత్వం 1957లో **పద్మశ్రీ** అవార్డుతో గౌరవించింది. దళిత ప్రజల మీద కొనసాగుతున్న సామాజిక వివక్షతకు వ్యతిరేకంగా పోరాడుతూ దళిత జనావళి అభ్యున్నతి కోసం ఆమె సాగించిన కృషి గమనించిన దళిత ప్రజలు స్వయంగా 1972లో **దళితమిత్ర** అవార్డుతో ఆమెను సత్కరించుకున్నారు. ఈ విధంగా స్వదేశంలోనే కాకుండా విదేశాలలో కూడా ఆమెకు గౌరవసత్కారాలు లభించాయి. పలు అవార్డులు ఆమె సొంతమయ్యాయి. ఆ విధంగా లభించిన పురస్కారాలన్నిటిని ఆమె మార్గదర్శకత్వంలో సాగుతున్న సేవాసంస్థల ఆర్థిక పరిపుష్టికి వినియోగించారు.

ప్రజాసేవారంగాలలో జాతీయ స్థాయిలోనే కాకుండా అంతర్జాతీయ స్థాయిలో ప్రత్యేక గుర్తింపు పొంది, స్వాతంత్ర్య సమరోద్యమకారిణిగా, పోలియో నియంత్రణకు అవిరళ కృషి సల్పిన యోధురాలిగా, భారతీయుల ప్రియతమ సంఘసేవకురాలిగా, ఖ్యాతిగాంచిన ఫాతిమా ఇస్మాయిల్ 1979 లో రాజ్యసభకు ఎన్నికయ్యారు. ఈ పదవిలో 1985 వరకు పనిచేశారు. రాజ్యసభ సభ్యురాలిగా కూడా ఆమె సంఘసేవా కార్యక్రమాలను విస్తృతంగా కొనసాగించారు.

ఈ విధంగా జీవిత చరమాంకం వరకు ప్రజాసేవలో గడిపిన శ్రీమతి ఫాతిమా ఇస్మాయిల్ 1987 అక్టోబర్ 11న కన్నుమూశారు.

◆◆◆

> నా భర్త అరెస్టు వలన బెంగాల్ ఖిలాఫత్ కమిటీ కార్యక్రమాల నిర్వహణలో ఏర్పడిన ఖాళీని నా కృషితో భర్తీ చేస్తాను. ఆయన ఇక్కడుంటే జరిగే పనులన్నీ యధాతథంగా జరుగుతాయని తెలుపుకుంటున్నాను. గతంలో నా భర్త నిర్బంధంలో ఉన్నప్పుడు నా శక్తి మేరకు ఆయన బాధ్యతలను నేను నిర్వర్తించాను. గత ఐదు సంవత్సరాల నుండి నా ఆరోగ్యం బాగాలేదు. మానసికంగా బలహీనంగా ఉన్నాను.నా ఆనారోగ్యం దృష్ట్యా నా విధిని నేను నిర్వహించేందుకు మౌలానా అనుమతించేవారు కారు. అయినప్పటికి ఈ నశ్వరమైన శరీరాన్ని ఖిలాఫత్ ఉద్యమానికి సంపూర్ణంగా అంకితం చేయాలని నిర్ణయించుకున్నాను. **–బేగం జులేఖా అబుల్ కలాం ఆజాద్.**



## వయోజన విద్యావ్యాపకురాలు, సంఘసేవిక

# 'పద్మశ్రీ' కుల్సుం సయాని

**(1900-1987)**

**భా**రత జాతీయోద్యమం ఉద్యమకారులను బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటం సాగించేందుకు మాత్రమే కాకుండా, సమాజ ప్రగతికి ఆటంకం అవుతున్న సామాజికరుగ్మతలకు వ్యతిరేకంగా పోరు సల్పడానికి చక్కని ప్రేరణ కల్గించింది. ప్రధానంగా స్వరాజ్య స్థాపనకు కృషి సాగిస్తూ స్వరాజ్యంలో ప్రజలంతా సుఖశాంతులతో ప్రగతిపథాన నడిచేందుకు అవసరమైన చక్కటి వాతావరణం సృష్టించేందుకు కృషిచేశారు. ఒకవైపు పరాయి పాలకులకు వ్యతిరేకంగా సాగుతున్న పోరాటాలకు పరోక్ష సహకారం అందిస్తూ, గాంధీజీ మార్గాన నిరక్షరాస్యులను అక్షరాస్యులను చేయటమే ప్రధాన ధ్యేయంగా ఉద్యమించిన మహిళలలో అగ్రగామి శ్రీమతి కుల్సుం.

గుజరాత్ రాష్ట్రానికి చెందిన కుల్సుం స్వాతంత్ర్య సమరయోధుల కుటుం బంలో 1900 అక్టోబర్ 21న జన్మించారు. మహాత్మాగాంధీ వ్యక్తిగత వైద్యులు, సన్నిహిత మిత్రులు డాక్టర్ రజబ్ అలీకి ఆమె ముద్దుబిడ్డ. విద్యార్థి దశలోనే జాతీయోద్యమం, సమాజ సేవ ఆమెకు పరిచయమయ్యాయి. 1917 ప్రాంతంలో తండ్రితోపాటుగా ఆమె మహాత్మాగాంధీని కలిశారు. ఆ తండ్రీకూతుళ్ళను ప్రేమతో ఆహ్వానించిన గాంధీజీ కొంత కాలం పాటు ఆమెను ప్రముఖ సంఘసేవిక జానకీ దేవి బజాజ్ వద్ద ఉండమన్నారు.





ఆ విధంగా మహాత్ముని సన్నిధిలో జానకీ దేవి బజాజ్ వద్ద ఉంటున్నప్పుడు, జాతీయోద్యమ కార్యక్రమాలు, సంఘసంస్కరణలో భాగంగా మహత్ముడి మార్గదర్శకత్వంలో ఆరంభమైన కార్యకలాపాల గురించి బేగం కుల్సుంకు ఆమె వివరిస్తూ, ముస్లిం మహిళలలో ప్రధానంగా **పర్దానషి** మహిళలలో పనిచేయటం చాలా కష్టతరమవుతున్న విషయాన్ని తెలిపారు. ముస్లిం మహిళలను సమావేశపర్చాలని ఎంత కష్టపడి ప్రయత్నం చేసినా పట్టుమని పదిమంది రావటం లేదని ఆమె ఆవేదన వ్యక్తంచేశారు. ఆ ప్రతికూలాంశం కుల్సుంలో ఆలోచనలను రగిలించింది. ఆ ఆలోచనలు ఆమెలో లక్ష్యాన్ని నిర్దేశించాయి. మహిళలలో ప్రధానంగా ముస్లిం మహిళలలో పనిచేయాలని ఆమె నిర్ణయించుకున్నారు. (Women Pioneers, Edited by Sushila Nayar & Kamala Mankekar, ariticle on Kulsum Sayani is writtern by Ushaa Mehatha, NBT, India, 2002, page. 93) ఆ నిర్ణయం మేరకు మహాత్మా గాంధీజీ సిద్ధాంతాలతో ప్రభావితమైన కుటుంబ సభ్యురాలు కనుక కుల్సుం జాతీయోద్యమంలో భాగంగా గాంధీజీ మార్గదర్శకత్వంలో సంఘ సంస్కరణ కార్యకలాపాల దిశగా ముందుకు సాగారు.

కరాచీలో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ సమావేశానికి అధ్యక్షత వహించిన ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధుడు ముహమ్మద్ రహిమతుల్లా సయాని మేనల్లుడు డాక్టర్ జాన్ ముహమ్మద్ సయానీని ఆమె వివాహమాడారు. డాక్టర్ సయాని చాలా మృదు స్వభావులు. ఆయన ప్రజల డాక్టరుగా ఖ్యాతిగాంచిన వైద్యులు. డాక్టర్ సయాని కూడా ఇటు జాతీయోద్యమ కార్యక్రమాలలో పాల్గొనటం మాత్రమే కాకుండా అటు ప్రజాసేవా కార్యక్రమాలలో చురుకుగా పాల్గొంటున్నారు. ఆయన జాతీయ కాంగ్రెస్ సభ్యులు మాత్రమే కాక ఖిలాఫత్ ఉద్యమ నాయకులు.

వివాహం తరువాత పూర్తికాలం సంఘసేవికగా ప్రజాసేవకు అంకితం కావాలనుకున్న కుల్సుం నిర్ణయాన్ని డాక్టర్ సయానీ బలపర్చడమే కాకుండా మరింతగా ప్రోత్సహించి ఆమెకు తోడుగా నిలిచారు. ఆయన నుండి లభించిన ప్రోత్సాహంతో ఉత్తేజితులైన కుల్సుం సయాని తాను వివాహానికి ముందుగానే నిర్దేశించుకున్న లక్ష్యాల సాధనకు ప్రణాళికను తయారు చేసుకున్నారు. మహిళలను చైతన్యవంతుల్ని చేయాలన్న కార్యక్రమాలలో చురుకుగా పాల్గొన్న ఆమె మహిళలలో ప్రధానంగా ముస్లిం మహిళలలో, నిరక్షరాస్యులు అధికంగా ఉండటం గమనించారు. మహిళలు ఎదుర్కొంటున్న సమస్యలకు,

చైతన్యరాహిత్యానికి ప్రధాన కారణం అవిద్యగా ఆమె గమనించారు. ఆ సమస్యల పరిష్కార దిశగా వయోజన విద్యా ప్రచారోద్యమాన్ని నిర్వహించాలని మహాత్ముడు చేసిన సూచనలతో ఆమె ప్రేరణ పొందారు. ఆ దిశగా నిరక్షరాస్యులలో అక్షరజ్యోతులను వెలిగించేందుకు కుల్సుం సయాని సంకల్పబద్ధులయ్యారు.

1927లో జాతీయోద్యమంలో భాగంగా జరుగుతున్న **చర్ఖా క్లాసు** సభ్యత్వాన్ని కుల్సుం స్వీకరించారు. సామాజిక ప్రగతికి ఆటంకమౌతున్న రుగ్మతల గురించి ప్రజలలో చైతన్యం కలిగించేందుకు ఉద్దేశించబడిన **జనజాగరణ** కార్యక్రమాలలో భాగస్వామి అయ్యేందుకు **యూనిటీ క్లబ్** సభ్యురాలయ్యారు. యూనిటీ క్లబ్ సభ్యురాలుగా ఆమె చూపిన సేవాతత్పరత, కార్యదక్షతల ఫలితంగా క్రమక్రమంగా పలు పదవులను అధిరోహిస్తూ 1930లో ఆమె క్లబ్ ప్రధాన కార్యదర్శి అయ్యారు. ఆ అవకాశాన్ని వినియోగించుకుని యూనిటీ క్లబ్ నాయకురాలిగా ప్రణాళికాబద్ధంగా కార్యక్రమాలకు ఆమె శ్రీకారం చుట్టారు.

1936లో ఆమె ప్రయత్నాలు గొప్ప మలుపు తిరిగాయి. ఆ సమయంలో జాతీయ కాంగ్రెస్ నాయకులు బాలా సాహెబ్ ఖేర్ నాయకత్వంలో బొంబాయి ప్రాంతీయ ప్రభుత్వం ఏర్పడింది. ఆయన వ్యక్తిగతంగా కూడా వయోజన విద్యకు అత్యధిక ప్రాధాన్యతనిచ్చారు. బాలా సాహెబ్ ఖేర్ వయోజన విద్యా కార్యక్రమాల పట్ల ప్రత్యేక ఆసక్తిగల ప్రముఖులు కావటం కులుస్సుంకు కలసి వచ్చింది. వయోజనులలో అక్షరాస్యతను పెంపొందించేందుకు చేపట్టాల్సిన కార్యక్రమాలు, ఆ కార్యక్రమాల నిర్వహణ – పర్యవేక్షణ కోసం స్వయంగా తన అధ్యక్షతన ఓ కమిటీ ఏర్పాటు చేశారు. ఆ కమిటీలో సహజంగా కుల్సుం సయానికి తొలి సభ్యత్వం లభించింది. ఆమె ఆశయానికి అధికారం కూడా తోడవడంతో మరింత చురుకుగా ఆమె ముందుకు కదిలారు. ఆ కృషికి గుర్తింపుగా 1939లో ఆమె ఆ కమిటీ ఉపాధ్యక్షులుగా నియుక్తులయ్యారు.

అప్పటినుండి వయోజన విద్యా కార్యక్రమాలలో ఆమె పూర్తిగా లగ్నమయ్యారు. ప్రధానంగా మహిళలలో అక్షరజ్ఞానం కలిగించేందుకు ఆమె నడుం కట్టారు. ఆమె ప్రయత్నాలు తొలిదశలో ఫలించలేదు. ప్రధానంగా ముస్లిం మహిళలకు నచ్చచెప్పటం ఆమెకు కష్టమైపోయింది. చదువు ఎందుకని ప్రశ్నించే మహిళలకు నచ్చచెప్పేందుకు ఆమె చాలా శ్రమించారు. బొంబాయి నగరంలోని మహిళల సమస్యలు తెలుసుకుంటూ, ఆ సమస్యల పరిష్కారంలో అక్షర జ్ఞానం ఎలా ఉపయోగపడుతుందో వివరిస్తూ క్రమంగా





మహిళల విశ్వాసాన్ని చూరగొన్నారు. ఆ తరువాత ఒక్కక్కొరిగా మహిళలతో సంప్రదింపులు జరుపుతూ వారందర్ని సంఘటితపర్చి, అక్షరాస్యత ఆవశ్యకతను అంగీకరింపచేశారు. వయోజన విద్యా కార్యక్రమంలో భాగంగా అవసరమగు విద్యాసామగ్రిని స్వయంగా మహిళలకు అందచేస్తూ, వారితో కలసి మెలుగుతూ వయోజన విద్యా తరగతులను ఏర్పాటు చేయగలిగారు. ఈ మేరకు బొంబాయి నగరం, ఆ పరిసర ప్రాంతాలలోని పేటలు, మురికివాడలలో నిరంతరం పర్యటిస్తూ, కార్యక్రమాలను పర్యవేక్షిస్తూ, వయోజన విద్యా వ్యాప్తికి అవిశ్రాంత కృషి ప్రారంభించారు.

ఆ నిరక్షరాస్యులలో ముస్లింలు అత్యధికులు కావటంతో ఆమె ముస్లిం మహిళల పట్ల ప్రత్యేక శ్రద్ధవహించి వయోజన విద్యా, వికాస కార్యక్రమాలలో భాగస్వాములను చేయగలగటంతో అందరి దృష్టిని ఆకర్షించారు. ఈ కార్యక్రమాల పట్ల భారత జాతీయ కాంగ్రెస్ నాయకులు అధిక శ్రద్ధను చూపటంతో స్వార్థ రాజకీయాలు రంగప్రవేశం చేశాయి. ఆమె కార్యక్రమాలకు వ్యతిరేకంగా **ముస్లింలీగ్** కార్యకర్తలు అసత్య ప్రచారాలకు దిగారు. ఆమె మీద నిందారోపణలు చేశారు. ముస్లిం జనసముదాయాలలో ఆమె కార్యక్రమాల పట్ల విముఖత కలిగించేందుకు విఫల ప్రయత్నాలు చేశారు. ఖద్దరు ధరించి వయోజన విద్యా కార్యక్రమాల పేరిట ముస్లిం మహిళలను భారత జాతీయ కాంగ్రెస్ వైపుకు ఆకర్షిస్తున్నారని కొందరు ముస్లింలీగ్ నేతలు భావించారు. అందువలన సమాంతర కార్యక్రమాలను నిర్వహించాలని ఆలోచన కూడా చేశారు. (Bharath Ke Swatantra Samgram me Muslim Mahilavonka Yogdaan (Hindi) : Page. 265)

ఆ ప్రతికూల ప్రయత్నాల వలన కుల్సుం సయాని ఏమాత్రం ప్రభావితం కాలేదు. ఆ దుష్ప్రచారాన్ని చాలా చాకచక్యంగా ఎదుర్కొన్నారు. అన్ని అవరోధాలను తేలిగ్గా అధిగమించారు. మహిళల్లో విద్యావ్యాప్తి కోసం ఆమె బొంబాయి నగరంలోని ఐదు అంతస్తుల ఎత్తుగల భవనాలను కూడా ఎంతో ప్రయాసతో ఎక్కుతూ–దిగుతూ, ఆయా అపార్టుమెంట్లలో దొరికిన కొద్దిపాటి స్థలంలో మహిళలను సమావేశపర్చి వారికి విద్యాబుద్ధులు గరుపుతున్న ఆమెలోని సద్భావన, నిజాయితీ, చిత్తశుద్ధిని ప్రజలు గ్రహించారు. ఆమెకు మద్దతు తెలిపారు. ఆ కారణంగా స్వార్థ రాజకీయ వర్గాల ప్రచారాలు ఆమె ప్రయత్నాలకు ఏమాత్రం అడ్డుకట్ట వేయలేకపోయాయి.

అవాంతరాలు అధిగమించిన కుల్సుం సయాని మరింత ఉత్సాహంతో వయోజన

విద్యావ్యాప్తి కోసం పునరంకితమయ్యారు. ఆమె అవిశ్రాంతంగా సాగించిన కృషి ఫలితంగా 30 సంవత్సరాల కాలంలో సుమారు ఐదు లక్షల మహిళలలో అక్షరజ్యోతులు వెలిగించ గలిగారు. ఆమె అంతటితో మిన్నకుండి పోలేదు. అక్షర జ్ఞానం గలిగిన మహిళలలో ఆ చెతన్యాన్ని మరింత సుస్థిరం చేయటమే కాకుండా, జాతీయ అంతర్జాతీయ వ్యవహారాలను కూడా తెలుసుకోగలిగిన స్థాయికి వారిని చేర్పించాలన్న సంకల్పంతో వయోజన విద్య పూర్తి చేసిన పాఠకులను దృష్టిలో పెట్టుకుని **మార్గాన్వేషి** అను అర్థం వచ్చే **రహబర్** అను ఉర్దూ పక్షపత్రికను ప్రారంభించారు.

భారతదేశంలో వయోజన విద్యా కార్యక్రమాల ప్రచారం కోసం ప్రారంభించబడిన తొలి పత్రికగా **రహబర్** చరిత్ర సృష్టించింది. ఈ మేరకు వయోజన విద్యావ్యాప్తి కోసం పత్రికను నడిపిన విద్యావేత్తగా కుల్సుం ఖ్యాతి గడించారు. ఈ **రహబర్** పత్రికను దేవనాగరి, గుజరాతీ లిపులలో 1960 వరకు క్రమం తప్పకుండా నడిపారు. వయోజనులకు, ఉద్యమ కార్యకర్తలకు రహబర్ కరదీపికగా వెలిసింది. ఆమె స్వయం సంపాదకత్వంలో ప్రచురితమైన రహబర్ పత్రిక ఉర్దూ, దేవనాగరి, గుజరాతి లిపులను పాఠకులకు నేర్పడానికి అతి సులువైన పద్ధతులను ప్రవేశపెట్టింది. ఆ కారణంగా రహబర్ ద్వారా డాక్టర్ తారాచంద్ లాంటి ప్రముఖ చరిత్రకారులు గుజరాతి లిపిని నేర్చుకున్నట్టు స్వయంగా ప్రకటించటం విశేషం. (Women Pioneers : Page. 94).

రహబర్ పత్రికను కుల్సుం సయాని కేవలం వయోజన విద్యావ్యాప్తికి మాత్రమే పరిమితం చేయలేదు. ప్రజలలో జాతీయ భావనలు పెంపొందించడానికి, మతసామరస్యం, హిందూ –ముస్లింల ఐక్యత, స్నేహం,శాంతి, సద్భావనల ప్రచారానికి కూడా రహబర్‌ను సాధనం చేసుకున్నారు. అహేతుక భావనలకు, అర్థంలేని ఆచార, సంప్రదాయాలకు వ్యతిరేకంగా మహిళలను చైతన్యవంతుల్ని చేయడానికి అవసరమగు సమాచారాన్ని సేకరించి రహబర్ ద్వారా పాఠకులకు అందించారు. అన్ని మతాల సాంప్రదాయాలను, అన్ని జాతుల సంస్కృతి నాగరికతలలోని విశేషాంశాలను పాఠకులకు అందుబాటులోకి తెచ్చారు. మతాలు, ఆచార సంప్రదాయాలు వేరైనా మనుషులంతా ఒక్కటేనన్న విశ్వ మానవ సోదరభావాన్ని బలంగా ప్రచారం చేశారు. ఈ సందర్భంగా సనాతన ఆచార, సంప్రదాయ రక్షకులమని ప్రకటించుకున్న ధార్మిక పండితులు, మౌల్వీలు ఆమె అభిప్రాయాలను వ్యతిరేకిస్తూ ఆమె మీద విమర్శల యుద్ధం ఆరంభించారు. ఆ విమర్శలను





ఆమె సహేతుకంగా ఎదుర్కొంటూ, తన అభిప్రాయాలను హేతుబద్ధంగా సమర్థించు కుంటూ దృఢమైన నిర్ణయాలతో కువిమర్శలను, నకారాత్మక చర్యలను సకారాత్మక సమాధానలతో తిప్పిగొట్టారు. కువిమర్శలను పక్కనపెట్టి ప్రజలలో విద్యావ్యాప్తికి, సంఘ నిర్మాణంలో ప్రజలు భాగస్వాములయ్యేట్టుగా చేయగల నిర్మాణాత్మక కార్యక్రమాల మీద దృష్టి సారించారు.

సమాజ సమగ్రాభివృద్ధికి వయోజన విద్యావ్యాప్తికి జరుగుతున్న ప్రయత్నాలు మాత్రమే చాలవని భావించిన కుల్సుం సయాని సంస్థల స్థాపనకు ప్రత్యేక కృషి ఆరంభించారు. వ్యక్తుల కంటే వ్యవస్థలు శాశ్వత ఫలితాలను తెచ్చిపెడతాయని ఆమె దృఢంగా నమ్మారు. ఆ నమ్మకంతో విద్యాసంస్థల స్థాపనకు కృషి చేశారు. విద్యావ్యాప్తికి కలసి వచ్చే ప్రజలు, ప్రముఖులతో కలసి ఆమె పలు విద్యాసంస్థల స్థాపనకు తోడ్పాటు అందించారు. ఆ విధంగా రంగం మీదకు వచ్చిన విద్యాసంస్థలు సక్రమంగా నడవడానికి అవసరమగు ఆర్థిక ఆలంబన సమకూర్చిపెట్టటంలో కూడా ఆమె సహాయసహకారాలు అందించారు.

సమాజ సేవాకార్యక్రమాలలో కూడా భాగం పంచుకుంటూ సామాజిక రుగ్మతలు, మూఢనమ్మకాల మీద పోరాటాలకు మార్గదర్శిగా నిలిచారు. సమాజాభివృద్ధికి మహిళా చైతన్యం అత్యవసరమన్న మహాత్ముని ఉపదేశానికి అనుగుణంగా మహిళా సంక్షేమ, చైతన్య కార్యక్రమాలలో నిమగ్నమయ్యారు. 1943లో అఖిల భారత మహిళా కాన్ఫెరెన్స్ గౌరవ కార్యదర్శిగా నియమితులయ్యారు. ఆమె భారత దేశమంతటా పర్యటించి మహిళల్లో చైతన్యం కోసం, అక్షరాస్యత అభివృద్ధికోసం ప్రచార కార్యక్రమాన్ని నిర్వహించారు. అఖిల భారత మహిళా కాన్ఫెరెన్స్‌ను పటిష్ట పర్చేందుకు నిరంతరం సాగించిన కృషి ఫలించి 6,500 సభ్యులున్న అఖిల భారత మహిళా కాన్ఫెరెన్స్‌లో సభ్యుల సంఖ్య కాస్తా ఆమె హయాంలో 33,500కు చేరుకుంది. (Women Pioneers : Page. 93)

స్వతంత్ర భారతదేశం అవతరించాక భవ్యభారతాన్ని నిర్మించేందుకు తగిన పథకాల అమలులో కూడా ఆమె పాలుపంచుకున్నారు. అవిశ్రాంతంగా సాగిస్తున్న సమాజ సేవ, వయోజన విద్య, సాధారణ విద్యావ్యాప్తిలో సంపాదించిన అనుభవాన్ని వినియోగించు కునేందుకు ప్రభుత్వం పలు కమిటీలు, సంస్థలలో కుల్సుం సయానికి ప్రముఖ స్థానం కల్పించింది. ఆ సందర్భంగా ఆమె ఫ్రాన్స్, చైనా, డెన్మార్క్, ఇంగ్లాండ్, వియన్నా తదితర

దేశాలను పర్యటించారు. మక్కా మదీనాలను సందర్శించారు. 1957లో యునెస్కో సమావేశంలో భారత ప్రతినిధిగా పాల్గొని మాట్లాడారు. 1958లో ఆమెను National Committe on Women's Education సభ్యురాలుగా ప్రభుత్వం నియమించింది. ఈ విధంగా అటు మహారాష్ట్ర ప్రభుత్వం, ఇతర పలు రాష్ట్ర ప్రభుత్వాలు ఇటు భారత ప్రభుత్వం ఆమెకు ప్రజాసేవా, వయోజన విద్యా, మహిళా సంక్షేమానికి సంబంధించిన పలు ప్రభుత్వ, ప్రభుత్వేతర కమిటీలలో స్థానం కల్పించి ఆయా రంగాలలో ఆమెకున్న అపార అనుభవాన్ని వినియోగించుకున్నాయి.

సుమారు ఏడు దశాబ్దాలపాటు ప్రజాసేవలో గడిన కుల్సుం సయాని మంచి రచయిత్రిగా కూడా ఖ్యాతి గడించారు. జాతీయోద్యమంలో, వయోజన విద్యావ్యాప్తిలో భాగస్వామిగా మహిళల్లో చైతన్యం కోసం నిరంతరం కృషి సల్పిన ఉద్యమకారిణిగా తన అనుభవాలను, ఆకాంక్షలను, సూచనలను పొందుపర్చుతూ పలు గ్రంథాలను రాశారు. వయోజన విద్య వ్యాప్తి కార్యక్రమాలు, స్వాతంత్ర్యోద్యమంలో మహిళల పాత్ర, సమాజసేవ, భారత్-పాకిస్థాన్‌ల మైత్రి, తదితర అంశాలను స్పృశిస్తూ, **ప్రౌఢ శిక్షా మేరే అనుభవ్, భారత్-పాక్ మైత్రి మేరే ప్రయత్న్, భారతీయ స్వతంత్ర సంగ్రాం మేఁ మహిళావోం కీ భూమిక, భారత్ మేఁ ప్రౌఢశిక్షా** తదితర గ్రంథాలను ఆమె రాశారు. ఈ గ్రంథాలు బహుళ ప్రజాదరణ పొందాయి.

ప్రజా సంఘాలు, ప్రభుత్వ సంస్థలు అసంఖ్యాకంగా అవార్డులను సమర్పించుకుని కుల్సుం సయాని సేవలను పట్ల ఉన్న గౌరవాన్ని ప్రకటించుకున్నాయి. 1959లో భారత ప్రభుత్వం **పద్మశ్రీ** అవార్డుతో ఆమెను గౌరవించింది. భారత దేశంలో మాత్రమే కాకుండా ఇతర దేశాలలో కూడా వయోజన విద్యా వ్యాప్తికి ఆమె చేసిన సేవలకు గుర్తింపుగా 1969లో **నెహ్రూ లిటరసీ అవార్డు** అందించి భారత రాష్ట్రపతి ఘనంగా సత్కరించారు. ఈ సందర్భంగా గాంధేయ మార్గంలో నిర్మాణాత్మక కృషి సల్పిన ప్రముఖ వ్యక్తిగా భారత ప్రభుత్వం ఆమెను ప్రశంసించింది. ఆమెకు **నెహ్రూ లిటరసీ అవార్డు** వచ్చినందుకు 1958లో ఇదే అవార్డు పొందిన Welthy Fisher అభినందనలు తెలుపుతూ, I rejoice that not only India but the world will catch the rays of light emanating through the noble work of Kulsum Sayani అని వ్యాఖ్యానించారు. ఆ ప్రశంసా వాక్యానికి సమాధానంగా, A Pioneer's lot in most cases is strewn with thorns - and mine





was no different. But the feeling of having done my bit for my country and my people is a reward in itself, అని కుల్సుం సయాని రాసి ఆమెలోని అతి సాధారణ స్వభావం, దేశభక్తిని చాటుకున్నారు. (Women Pioneers : Page. 96).

1970లో మహాత్ముడి శాంతి సందేశాన్ని ప్రపంచ వ్యాపితం చేసే ప్రయత్నాలలో భాగంగా పదకొండు దేశాలను కుల్సుం సయాని చుట్టి వచ్చారు. ఆ దేశాలలో శాంతి-స్నేహ సందేశాలను బలంగా విన్పించారు. భారత్-పాకిస్థాన్‌ల మధ్య స్నేహ సంబంధాలను పెంపొందించేందుకు ఆమె అవిశ్రాంతంగా శ్రమించారు. ఈ మేరకు తాను చేసిన ప్రయత్నాలను వివరిస్తూ ఆమె పుస్తకం కూడా రాశారు.

ఈ విధంగా ఒకవైపు జాతీయోద్యమంలో, మరొకవైపు వయోజన విద్యావ్యాప్తికి, ఇంకొక వైపు ప్రజాసేవారంగంలో నిరంతరం శ్రమించి, జనజీవితాలను మరింతగా చక్కదిద్దేందుకు, సమాజ సమగ్రాభివృద్ధి ప్రధాన లక్ష్యంగా సంపూర్ణ జీవితాన్ని అంకితం చేసిన వయోజన విద్యావ్యాపకురాలు, అవిశ్రాంత ఉద్యమకారిణి శ్రీమతి కుల్సుం సయాని 1987మే 27న కన్నుమూశారు.

◆◆◆

గొప్ప వ్యక్తుల తల్లులందరూ ఓ ప్రత్యేక మనస్తత్వం కలిగిన మహిళలని మనకు చరిత్ర తెలుపుతుంది. విజేతల తల్లులు ధైర్యవంతులు, సంస్కర్తల అమ్మలు ఆలోచనా పరులు, మహాత్ముల తల్లులు మహనీయులుగా మనకు దర్శనమిస్తారు. వ్యక్తిగతంగా ఒక పురుషుడి నైతికత స్త్రీ ద్వారా రూపుదిద్దుకోవడమో లేక భ్రష్టు పట్టడమో జరుగుతుంది. ఓ జాతి నైతిక విలువలు, సామాజిక ఔన్నత్యం ఆ జాతికి చెందిన తల్లుల మానసిక స్థితి మీద ఆధారపడివుంటుంది. రాజకీయ ఔన్నత్యాన్ని గుత్తకు తీసుకున్నామని చెప్పుకునే జాతులను మనం పరిశీలిస్తే ఆ జాతులలోని మహిళలు రాజకీయంగా ఎంత పరిపక్వత కలిగి ఉండేవాళ్ళో, వాళ్ళల్లో మాతృభూమి పట్ల ప్రేమ ఎంత పొంగి పొర్లేదో మనకు అర్థమౌతుంది.

**-జాహిదా ఖాతూన్ షేర్వానియా**

## తల్లి తండ్రులను మించిన త్యాగగుణశీలి

# బేగం జొహరా అన్సారి

**( -1988)**

**భా**రత స్వాతంత్ర్యోద్యమంలో వ్యక్తులు పాల్గొనటమే కాకుండా కుటుంబాలకు కుటుంబాలు పాల్గొని బ్రిటీష్ ప్రభుత్వ దాష్టీకాలను ఓర్పుతో భరించిన త్యాగశీలురైన కుటుంబ సభ్యులు జాతీయోద్యమ చరిత్రపుటలలో దర్శనమిస్తారు. ఆ విశిష్ట కుటుంబాలలో డాక్టర్ ముక్తార్ అహమ్మద్ అన్సారి కుటుంబం ఒకటి. ఆ కుటుంబానికి చెందిన మహిళారత్నం బేగం జొహరా అన్సారి.

భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షపదవిని అత్యంత సమర్థవంతంగా నిర్వహించిన స్వాతంత్ర్యోద్యమ నాయకులలో అగ్రగణ్యుడిగా ఖ్యాతిగాంచారు డాక్టర్ ముక్తార్ అహమ్మద్ అన్సారి. అనితర సాధ్యమైన దయాగుణంతో స్వయంగా మహాత్ముని వందనాలందుకున్న శ్రీమతి షంషున్నీసా అన్సారి, డాక్టర్ అన్సారిల పెంపుడు కూతురు బేగం జొహరా అన్సారి.

ఆనాడు జాతీయోద్యమానికి ఢిల్లీలోని డాక్టర్ అన్సారి గృహం ప్రధాన కేంద్రంగా ఉండేది. జాతీయ కాంగ్రెస్‌కు సంబంధించిన ఏ కార్యక్రమం ఢిల్లీలో జరిగినా, ఆ సమావేశాలకు హాజరయ్యేవారికి అన్సారి ఇంట ఆతిథ్యం తప్పనిసరి. చిన్నారి జొహరా ఆ సమావేశాల ప్రాంగణంలో కలయతిరుగుతూ నాయకుల ఉపన్యాసాలు, చర్చలు వింటూ





చిన్ననాటినుండే జాతీయోద్యమం పట్ల అవగాహన, ప్రముఖ నేతలతో సన్నిహిత పరిచయాలను పెంచుకున్నారు. చిన్నతనంలోనే తల్లితండ్రుల్లా తాను కూడా స్వరాజ్యం కోసం బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడాలని నిర్ణయించుకున్నారు. ఆ నిర్ణయాలకు తగ్గట్టుగానే 1926లో జాతీయోద్యమంలో ఉత్సాహంగా పాల్గొంటున్న యువకులు షౌకతుల్లాను ఆమె వివాహం చేసుకున్నారు. అప్పటినుండి ఆ యువ దంపతులు తమ కార్యక్షేత్రాన్ని మరింత విస్తరింపచేసుకుని జాతీయోద్యమంలో అమితోత్సాహంతో పాల్గొన్నారు.

ఆధునిక ఆంగ్ల విద్యావంతురాలైన జొహరా బేగం సాంప్రదాయ విద్యను శ్రద్ధతో అభ్యసించారు. ఆమెకు ఉర్దూ, పర్షియన్, ఆంగ్లం, హిందీ, అరబిక్ భాషలు బాగా వచ్చు. చరిత్ర-సామాజిక శాస్త్రాలపట్ల ఆమె అధిక శ్రద్ధచూపారని Inside India గ్రంథంలో రచయిత్రి Halide Edib పేర్కొన్నారు. ఉన్నతమైన వ్యక్తిత్వాన్ని విశాల దృక్పథాన్ని సంతరించుకున్న ఆమె సాంప్రదాయ ఆచార వ్యవహారాలను పాటించటంలో తగినంత శ్రద్ధ వహించారు. జాతీయోద్యమ మార్గంలో ఆ ఆచార సాంప్రదాయాలు ఆమెకు ఏవిధంగా ఆటంకం కానివ్వకుండా, మరెవ్వరికీ బాధాకరం కాకుండా జొహరా బేగం వ్యవహరించారు.

మహాత్మాగాంధీచే **బేటీ** అని ప్రేమతో పిలిపించుకున్న బేగం జొహరా అన్సారి వార్ధా ఆశ్రమంలో గాంధీజీ వద్ద చాలా కాలం గడిపారు. ఆశ్రమంలో ఆమె గాంధీజీకి చేదోడువాదోడుగా వ్యవహరించి, ఆయన మన్నన పొందినట్టు, గాంధీజీ రాసిన లేఖల ద్వారా తెలుస్తుంది. వార్ధా ఆశ్రమంలోని వంటగదిలో ఆమె బేగం అముత్సలాంకు సహకరించేదని గాంధీజీ పేర్కొన్నారు. ఉర్దూ భాషను నేర్పేందుకు జొహరాను తన గురువుగా వ్యవహరించమని గాంధీజీ స్వయంగా కోరటం విశేషం. ఆమె గాంధీజీకి చక్కని ఉర్దూ నేర్పారు. గాంధీజీ నేర్చుకున్న ఉర్దూభాషా పరిజ్ఞానాన్ని మరింత పెంచుకోడానికి జొహరా బేగం రాసిన లేఖలు ఎంతో తోడ్పడ్డాయి. ఆశ్రమం నుండి వెళ్ళిపోయాక కూడా ప్రతి వారం గాంధీజీకి ఉత్తరం రాయటం ఆమె అలవాటు. ఆ లేఖలు ఉర్దూ భాషాభివృద్ధికి అవసరమగు సలహాలతో నిండి ఉండేవి. ఈ లేఖలను ప్రస్తావిస్తూ, **ఆమె లేఖలు నా ఉర్దూ భాషాభివృద్ధికి ఎంతగానో తోడ్పడ్డాయి...ప్రతివారం వచ్చే ఆమె లేఖల కోసం నేను ఎదురు చూసేవాడ్ని** అని మహాత్ముడు పలుసార్లు పేర్కొనటం విశేషం.

జాతీయోద్యమంలో భాగంగా జైలుకెళ్ళేందుకు జోహరా అన్సారి ఉవ్విళూరారు. బ్రిటీషు బానిస బంధనాల నుండి దేశాన్ని విముక్తం చేయటంలో భాగంగా జైలుకు వెళ్ళడం ఎంతో గౌరవమని ఆమె భావించారు. ఈ విషయమై గాంధీజీ అనుమతి కోరుతూ ఆయనకు ఆమె పలు ఉత్తరాలు రాశారు. ఆ ఉత్తరాలకు సమాధానంగా, ఆమె ఆరోగ్యం దృష్ట్యా **కొంత సహనం వహించు. నీవు జైలుకు వెళ్ళేందుకు ఒక రోజున నేను తప్పకుండా అనుమతిస్తా**, అని 1941 జూన్ 19నాటి లేఖలో గాంధీజీ ఆమెకు నచ్చచెప్పారు.

చిన్నతనంలో తల్లితోపాటుగా జాతీయ కాంగ్రెస్ సమావేశాలు ఎక్కడ జరిగినా అక్కడకు తాను హాజరయ్యేదానినని ఆమె స్వయంగా చెప్పుకున్నారు. ఆ సమయంలో సేవాదళం కార్యకర్తలు నిర్వహించే పనులలో తాను భాగం పంచుకునేదానినని బేగం జొహరా పేర్కొన్నారు. స్వాతంత్ర్య సమరయోధులైన తల్లిదండ్రుల వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్న జోహరా అన్సారి జాతీయ కాంగ్రెస్ పిలుపు మేరకు జరిగిన ప్రతి కార్యక్రమంలో పాల్గొన్నారు.

జాతీయోద్యమ నేతలు, ప్రధానంగా గాంధీజీ ఆమెకు అప్పగించిన ప్రతి పనిని ఎంతో సమర్థవంతంగా నిర్వహించి ప్రశంసలందుకున్నారు. భారతదేశం నుండి బ్రిటీష్ పాలకులను పూర్తిగా తరిమివేసి సంపూర్ణ స్వరాజ్యాన్ని సాధించుకోవాలంటే, భారతీయ జన సముదాయాలలో ఐక్యతావశ్యకతను అమె గ్రహించారు. ఆ కారణంగా ఆమె హిందూ – ముస్లింల ఐక్యతను ప్రగాఢంగా వాంఛించారు. మతం పేరుతో ఆనాడు సాగిన వేర్పాటువాద ధోరణులను తీవ్రంగా నిరసించారు. మత సామరస్యాన్ని కాపాడాలని, మత విద్వేషం కూడదని, మతాన్ని రాజకీయాలతో ముడి పెట్టరాదని ఆమె విస్తృతంగా ప్రచారం చేశారు.

బేగం జొహరా అన్సారి దానగుణంలో తన తల్లిదండ్రులకు ఏమాత్రం తీసిపోకుండా వ్యవహరించారు. ఆమె తన కుటుంబానికి చెందిన ఆస్థిపాస్తులను జాతీయ ప్రయోజనాల కోసం త్యాగం చేయడానికి వెనుకాడలేదు. జాతీయోద్యమంలో పాల్గొన్న యోధుల కుటుంబాలను ఆమె ఆర్థికంగా ఆదుకున్నారు. 1946లో జరిగిన ఎన్నికల సందర్భంగా అఖిలభారత ముస్లింలీగ్ నాయకులు సాగిస్తున్న వేర్పాటువాద రాజకీయాలను ఎదుర్కొనడానికి నిధులు అవసరమని ఆమె తలచారు. ఐక్యతను చెడగొట్టి, ప్రజలలో విభజనకు కారణమవుతున్న విద్వేష, విభజన రాజకీయాలను ఆమె సహించలేకపోయారు.





ఆ శక్తుల పరాజయాన్ని ఆమె ఆశించారు. అందుకు అవసరమగు నిధులను అందించేందుకు ఆమె ముందుకు వచ్చారు.

ఆనాటికి డాక్టర్ అన్సారి అపార ఆస్థిపాస్తులు జాతీయోద్యమ కార్యక్రమాల కోసం కరిగి పోయాయి. స్వాతంత్ర్య సమరయోధులకు, కార్మిక ప్రముఖులకు, దేశ, విదేశీ ప్రముఖులకు ఎంతో గౌరవాభిమానాలతో అతిధ్యమిచ్చి, జాతీయోద్యమంలో నాయకుల చారిత్రక చర్చలకు, సంచలన నిర్ణయాలకు వేదికగా నిలిచిన DAR-US-SALAM భవంతి తప్ప మరోక విలువైన అస్తి ఆమెకు కన్పించలేదు. ఆ సమయంలో జాతి ప్రయోజనాల కోసం ఎంతటి త్యాగానికైనా సిద్ధమని ఆమె, ఆమె భర్త షౌకత్ అన్సారి ప్రకటించారు. ఆ ప్రకటనకు తగ్గట్టుగా DAR-US-SALAM భవంతిని, ఆ భవనం చుట్టూ ఉన్న సువిశాలమైన ఆవరణను అమ్మేశారు. ఆ విధంగా DAR-US-SALAM ను విక్రయించగా లభించిన సొమ్మును జాతీయ కాంగ్రెస్ నాయకుల ఎన్నికల ప్రచారం కోసం జోహరా అన్సారి దంపతులు వ్యయం చేశారు. రాజప్రసాదాన్ని మించిన DAR-US-SALAM భవంతిని విక్రయించాక జోహరా అన్సారి దంపతులు మరొక చిన్న గృహంలోకి మారి అతి సాదాసీదా జీవితం గడిపారు.

భారతదేశం స్వతంత్ర దేశంగా అవతరించాక ఇతర నాయకుల వారసుల్లా ఆమెగాని ఆమె భర్తగాని ప్రభుత్వంలో ఎటువంటి పదవులను స్వీకరించలేదు. లక్షలాది రూపాయల ఆస్తిని జాతీయ కాంగ్రెస్ కార్యక్రమాలకు వినియోగించి అతి సామాన్య గృహిణిగా జీవితం గడిపిన జోహరా తమ ఆర్థిక పరిస్థితులు ఎంత దారుణంగా ఉన్నా చెయ్యిచాచి ఎవ్వరిని సహాయం అడగలేదు. ప్రభుత్వం సహకారం ఆశించలేదు.

స్వాతంత్ర్యోద్యమం కోసం, ప్రజల ప్రయోజనాల కోసం, మత సామరస్యం కాపాడేందుకు, ప్రజలలో పరస్పరం సద్భావనలను పరిపుష్టం చేసేందుకు తమ జీవితాలు, ఆస్థిపాస్తులు కొంతవరకైనా ఉపయోగపడినందుకు సంతోషిస్తూ ఆమె కాలం గడిపారు. చివరకు 1988 జూలై 28న ఇంగ్లాండ్‌లో దానగుణసంపన్నురాలు శ్రీమతి బేగం జొహరా అన్సారి అంతిమ శ్వాస విడిచారు.

◆◆◆



## మాతృదేశ సేవలో సర్వస్వం త్యాగం చేసిన

# ముహమ్మద్ గౌస్ ఖాతూన్

**(-1990)**

**స్వా**తంత్ర్యోద్యమంలో ప్రత్యక్ష, పరోక్ష కార్యాచరణ కలిసికట్టుగా సాగుతుంది. ప్రత్యక్ష కార్యక్రమాలలో ధైర్యసాహసాలు ప్రధానం కాగా, పరోక్ష కార్యకలాపాలకు సమర్పణ, సహనం, ఓర్పు, త్యాగాలు ప్రాణం. పరోక్ష కార్యాచరణలో భాగంగా త్యాగాల బాటలో నడిచిన మహిళ శ్రీమతి ఖాతూన్ బీబీ.

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు ముహమ్మద్ గౌస్ బేగ్ జీవిత సహచరిణి ఖాతూన్ బీబీ. భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో ప్రత్యేకస్థానం పొందటమేకాక, మహాత్ముని అభినందనలు అందుకున్న **చీరాల-పేరాల పోరాటం, పెదనందిపాడు పన్నుల నిరాకరణ ఉద్యమం**లో ముహమ్మద్ గౌస్ బేగ్ పాల్గొన్నారు. ఖాతూన్ బీబీ మాత్రం ప్రత్యక్షంగా జాతీయోద్యమ కార్యక్రమాలలో పాల్గొనలేదు. పరోక్షంగా జాతీయోద్యమానికి సర్వం త్యాగం చేశారు. భర్తకు అన్ని విధాల అండదండలుగా నిలవటమే కాక, జాతీయోద్యమ నేతలు భోగరాజు పట్టాభి సీతారామయ్య, దుర్గాబాయమ్మ, టంగుటూరి ప్రకాశం పంతులు లాంటి ప్రముఖులకు తన ఇంట ఆతిధ్యం కల్పించారు. జాతీయ కాంగ్రెస్ నాయకులు, కార్యకర్తల పట్ల ఖాతూన్ ఎంతో ఆదరణ, ఆప్యాయతలు చూపారు. ఆమె ఇల్లు ఉద్యమకారులకు స్వంత గృహం లాగుండేది.





1921 నాటి సహాయ నిరాకరణ ఉద్యమంలో మహమ్మద్ గౌస్ బేగ్‌ను బ్రిటిష్ ప్రభుత్వం అరెస్టు చేసి ఒక సంవత్సరం జైలు, వెయ్యి రూపాయల జరిమానా విధించింది. జరిమానా కట్టటానికి డబ్బు కావాల్సి వచ్చింది. చేతిలో చిల్లిగవ్వలేని సమయంలో ఖాతూన్ బంగారాన్ని అమ్మి జరిమానా కట్టారు. ఆ తరువాత మరోసారి గుంటూరు జిల్లా, పెదనందిపాడు పన్నుల నిరాకరణ ఉద్యమంలో క్రియాశీలక పాత్ర వహించిన గౌస్ బేగ్‌ను ప్రభుత్వం అరెస్టు చేసి, సంవత్సరం జైలు, వెయ్యిరూపాయల జరిమానా విధించింది. ఆ సమయంలో కూడా జరిమానా కట్టేందుకు డబ్బు లేనందున, ఖాతూన్ తన వంటి మీద ఉన్న బంగారాన్ని పూర్తిగా అమ్మగా వచ్చిన సొమ్ముతో జరిమానా కట్టారు. ఆడంబరాలెరుగని ఆ తల్లి అప్పటి నుండి తన జీవితంలో మరెప్పుడూ బంగారం ధరించలేదు.

గౌస్ బేగ్ శాసనోల్లంఘన ఉద్యమంలో గుంటూరు జిల్లా ఉద్యమ బాధ్యతలను నిర్వహించారు. అందుకు ఆగ్రహించిన ప్రభుత్వం ఆయన చరాస్థిని వేలం వేసి, లభించిన నగదును జరిమానా క్రింద జమ చేసుకుంది. ఈ చర్యల పట్ల ఖాతూన్ ఏ మాత్రం చలించకపోగా మాతృభూమి రుణం తీర్చుకునే అవకాశం లభించిందని సంతోషించారు. బంగారం, నగదు నట్రా, పొలం పుట్రా కర్పూరంలా కరిగిపోతున్నా, పేదరికం చుట్టుముడుతున్నా, బేగ్ దంపతులు బేఖాతర్ అన్నారు. మాతృభూమి కోసం సర్వం త్యాగం చేయగలిగిన అదృష్టం లభించిందంటూ పొంగి పోయారు.

జాతీయోద్యమంలో పాల్గొంటున్న కార్యకర్తలు, నాయకులు కుటుంబాలను వదలి వచ్చి బ్రిటీష్ ప్రభుత్వపు క్రూరత్వానికి గురవుతున్నప్పుడు, ఆ మాత్రం సేవలందించి మాతృభూమి రుణం తీర్చుకోలేకపోతే ఎలా? అంటూ ప్రశ్నించిన ఖాతూన్ ఆస్తిపాస్తులన్నీ హరించుకు పోతున్నా ఏమాత్రం చింతించలేదు. స్వదేశీ వస్త్రధారణకు, స్వదేశీ వస్తు వినియోగానికి అధిక ప్రాధాన్యతనిచ్చారు. ఆమె ఖాదీ ప్రచారంలో ఎంతో శ్రద్ధగా పాల్గొన్నారు. జీవితాంతం ఖద్దరు ధరించారు. మహమ్మద్ గౌస్ బేగ్ 1976లో మరణించగా శ్రీమతి ఖాతూన్ 1990 నవంబరు 20న తనువు చాలించారు.

◆◆◆



## సాంఘిక బహిష్కరణలకు వెరవని ధీమంతురాలు

# హాజరా బీబీ ఇస్మాయిల్

**(-1994)**

**జీ**విత భాగస్వాములతో పాటుగా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని త్యాగాలతో చరిత్ర సృష్టించిన మహిళల జీవిత విశేషాలను కొంతలో కొంతవరకు జాతీయోద్యమ చరిత్ర మనకు అందిస్తుంది. బానిస బంధనాల విముక్తి కోసం పోరాడుతున్న సహచరుడు కన్నుమూసినప్పటికీ, ఆయన నడిచిన సన్మార్గం వీడకుండా, ముందుకు సాగిన మహిళలు అరుదుగా కన్పిస్తారు. శ్రీమతి హాజరా బీబీ అటువంటి అరుదైన మహిళామణులలో ఒకరు.

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు మహమ్మద్ ఇస్మాయిల్ సాహెబ్ ఆంధ్రప్రదేశ్, గుంటూరు జిల్లా తెనాలి కేంద్రంగా జాతీయోద్యమంలో పాల్గొన్నారు. ఆయన భార్య హాజరా బీబీ. గాంధీజీ ప్రబోధంతో ప్రభావితులైన ఆయన ఖద్దరు ప్రచారోద్యమంలో అమితోత్సాహంతో పాలుపంచుకున్నారు. గుంటూరు జిల్లాలో తొలి **ఖద్దరు దుకాణం** ప్రారంభించి, ఖద్దరు ప్రచారంలో నిత్యం నిమగ్నమై ఉండే భర్తకు హాజరా బీబీ అపూర్వమైన తోడ్పాటునిచ్చారు.

అఖిల భారత ముస్లింలీగ్ ప్రభావం తెనాలిలో కొంత ఉండేది. ఖద్దర్ ఇస్మాయిల్ దంపతులు భారత జాతీయ కాంగ్రెస్‌లో కొనసాగటం, గాంధీజీ విధానాల పట్ల అత్యంత





గౌరవభావంతో ఉండటం లీగ్ కార్యకర్తలకు, లీగ్ అభిమానులకు ఇష్టం లేకపోయింది. ఆ కారణంగా ఆ దంపతులు అవస్థలు ఎదుర్కోవాల్సి వచ్చింది. ఆ సమయంలో హాజరా బీబీ ఎంతో ఓర్పుతో కుటుంబ వ్యవహారాలను సరిచూసుకుంటూ, తన ఇంటికి వచ్చే జాతీయోద్యమ కార్యకర్తలకు అవసరమైన సహాయ సహకారాలు అందిస్తూ భర్తకు అండగా నిలిచారు.

జాతీయోద్యమకారుడు ముహమ్మద్ ఇస్మాయిల్ పలుసార్లు జైలు పాలైనప్పటికీ హాజరా అధైర్యపడలేదు. జాతీయోద్యమ కార్యకర్తగా భర్త జైలుకు వెళ్ళటం గౌరవంగా భావించి ప్రోత్సహించారు. పిల్లలకు జాతీయవిద్యను అందించాలన్న లక్ష్యంతో స్వసమాజం నుండి వ్యతిరేకత వ్యక్తమవుతున్నా, ఆడబిడ్డలను జాతీయ విద్యాబోధన గావించే హిందీ పాఠశాలకు పంపారు. ఈ పద్ధతులు నచ్చని వ్యక్తులు ఇస్మాయిల్ కుటుంబాన్ని అప్రకటిత సాంఘిక బహిష్కరణకు గురిచేశారు. ఆ చర్యకు ఆమె ఏ మాత్రం చలించలేదు. భర్త ఇస్మాయిల్‌గాని తాను గాని నడుస్తున్నది గాంధీ మార్గంలో కనుక ఎవరు ఏమనుకున్నా, ఏమి చేసినా ఎదుర్కోవడం తప్ప గాంధీబాట నుండి వెనుదిరిగేది లేదని హాజరా స్థిరంగా నిర్ణయించుకుని, ఆ నిర్ణయం ప్రకారంగా ముందుకు సాగారు.

జాతీయోద్యంలో ముహమ్మద్ ఇస్మాయిల్ మొత్తం మీద ఏడు సంవత్సరాల పాటు జైలు జీవితం అనుభవించారు. చివరి సారిగా జైలులో అనారోగ్యంపాలై, ఆ తరువాత 1948లో ఆయన కన్నుమూశారు. ఆయన కన్ను మూశాక స్వాతంత్ర్య సమరయోధులకు ఇచ్చే భూమిని ప్రభుత్వం ఆమెకు సంక్రమించ చేయదలచింది. స్వాతంత్ర్య సమర యోధురాలుగా తమ దేశభక్తికి విలువ కట్టటం ఇష్టం లేని ఆమె ప్రభుత్వం ఇవ్వదలచిన భూమిని తిరస్కరించారు.

ప్రభుత్వం ఇస్తానన్న భూమిని తిరస్కరించటం మాత్రమే కాకుండా తన భర్త వాగ్దానం నెరవేర్చేందుకు తెనాలి సమీపాన గల కావూరు వినయాశ్రమానికి రెండున్నర ఎకరాల విలువైన మాగాణి భూమిని ఆమె దానం చేశారు. స్వాతంత్ర్యయోధుల సమావేశస్థలిగా భాసిల్లిన **ఖద్దరు విక్రయశాల**ను భర్త మరణానంతరం కూడా తన బిడ్డల చేత నిర్వహింప చేశారు. చివరివరకు ఖద్దరు ధరించారు. చివరి క్షణం వరకు గాంధీజీ బాటలో భర్త ఆశయాలకు అనుగుణంగా జీవితం గడిపిన శ్రీమతి హాజరా బీబీ 1994లో తుది శ్వాస విడిచారు.

◆◆◆

# జమిందారీ దాష్టీకాన్ని సాయుధంగా ఎదుర్కొన్న

# భక్తావర్ మాయి

**(-1946)**

**భా**రతీయ ముస్లిం మహిళలు జాతీయోద్యమంలో పాల్గొనటమే కాకుండా, బ్రిటీష్ ప్రభుత్వ వత్తాసుదారులుగా మారి ప్రజలను హింసిస్తున్న ప్రజాకంటకులను ధైర్య సాహసాలతో ఎదుర్కొన్న సంఘటనలు కూడా చరిత్రలో దర్శనమిస్తాయి. జమిందారీ దాష్టీకాలను ప్రతిఘటించే క్రమంలో గ్రామ ప్రజలను ఆదుకునేందుకు ఆయుధం ఎత్తుకుని చరిత్రకెక్కిన మహిళలలో శ్రీమతి భక్తావర్ మాయి ఒకరు.

భక్తావర్ మాయి వాయువ్యసరిహద్దు రాష్ట్రం (ప్రస్తుతం పాకిస్థాన్ భూభాగం) లోని సింథ్ ప్రాంతం లాషారి గ్రామానికి చెందిన ఆడపడుచు. ఆమె భర్త వలి ముహమ్మద్ లాషారి. అతను సామాన్య రైతు. ఆ ప్రాంతపు జమిందారు పరమ క్రూరుడు. బ్రిటీషర్ల తొత్తు. ఆతడు రైతుల శ్రమను దోచుకుంటూ విలాసవంతమైన జీవితానికి అలవాటుపడ్డాడు. ఈ విషయమై ఎవ్వరైనా జమిందారునిగాని, అతని వత్తాసుదారులను గాని ప్రశ్నిస్తే అంతటితో వారికి నూకలు చెల్లినట్టే.

అది 1946 నాటి సంఘటన. భారతదేశం పరాయిపాలకుల పాలనలో ఉంది. ఆ పాలకవర్గాల తాబేదారులైన జమిందారుల రాజ్యం గ్రామాలలో సాగుతూనే ఉంది. లాషారి గ్రామ రైతులు ఆరుగాలాలు శ్రమపడి పండించుకున్న పంటను ఇళ్ళకు తెచ్చుకుని





ఆనందిస్తున్నారు. జమిందారుకు అప్పగించాల్సిన పంటభాగాన్ని చెల్లించేందుకు సిద్ధంగా ఉన్నారు. జమిందారు అత్యధిక భాగాన్ని కోరాడు. ఆ కోరికను మన్నించలేమని రైతులు మొరపెట్టుకున్నారు. ఆగ్రహించిన జమిందారు తన మనుషులను లాషారి గ్రామానికి పంపాడు. ఆ గూండాలు రైతుల కష్టార్జితాన్ని ఎత్తుకుపోవటానికి రాగా, బక్క జీవులలో రోషం రగిలించి, ధైర్యం చెప్పి జమిందారు అనుచరులను ఎదుర్కొనేందుకు ఆమె రంగం సిద్ధం చేశారు.

ఆ పరిస్థితులను గమనించిన జమిందారు గూండాలు పోలీసులను తమకు వత్తాసుగా పిలిపించుకుని గ్రామస్థుల మీద విరుచుకుపడ్డారు. భక్తావర్ దంపతులు జమిందారు మూకలకు తగిన బుద్ధిచెప్పాలని నిర్ణయించుకున్నారు. భార్యభర్తలిరువురు సాయుధులై ధర్మపోరాటానికి సిద్ధమయ్యారు. ఈ దాడిలో భర్త వలి మహమ్మద్ లాషారి తీవ్రంగా గాయపడినా ఆమె ఏ మాత్రం అధైర్య పడకుండా గ్రామస్థులలో ఉత్సాహం నూరిపోస్తూ, జమిందారి మూకల మీద విరుచుకుపడ్డారు. సాయుధ శిక్షణ పొందిన గూండాలను ఎదుర్కోవడం గ్రామీణులకు అసాధ్యమైంది. ఆ పోరాటంలో భక్తావర్ గుండెలను చీల్చుకుంటూ తుపాకి గుండ్లు దూసుకు పోవటంతో ఆమె నేల కూలింది. నేల కూలిపోతూ కూడా **ఒక్క గింజ కూడా రాక్షసులకు అందనివ్వకండి** అని కోరుదతూ ఆ యోధురాలు కన్నుమూసింది.

ఆనాటి సంఘటనలో ఆమె ప్రదర్శించిన త్యాగాన్ని ప్రజలు మర్చిపోలేదు. భక్తావర్ ధైర్యసాహసాలను జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఈనాటికి కూడా ఆమె అమరగతిని పొందిన రోజున సింథ్ ప్రాంతంలోని ప్రజలు, ఆమె పట్ల గౌరవాభిమానాలు వ్యక్తం చేస్తూ చెడు మీద మంచి సాధించిన విజయంగా భావిస్తూ ఉత్సవాలు జరుపుకోవటం విశేషం.

భక్తావర్ మాయి త్యాగనిరతి, ధైర్యసాహసాలను ప్రస్తుతిస్తూ **మనం మృత్యువు నీడలో ముందుకు సాగాల్సి ఉంది. మన కోసం భక్తావర్ మాయి తన రక్తం, చివరకు తన ప్రాణం ధారబోసింది. ఆమె రక్తం ఈనాటికి సత్యమార్గాన నడుస్తానంటుంది. మనల్ని ధైర్యంగా మున్ముందుకు సాగమంటుంది** అని ప్రసిద్ధ సింధీ కవి శౌక్ అయాజ్ రాసిన కవిత, 1967లో ప్రముఖ సాహిత్యకారులు మునీర్ మానక్ ఆమె త్యాగాన్ని ధైర్యసాహసాలను కీర్తిస్తూ రాసిన నాటకం లోకప్రసిద్ధమయ్యాయి.

◆◆◆

## మాతృదేశ సేవ విలువకట్టరానిదని ప్రకటించిన

# సఫియా అబ్దుల్ వాజిద్

**(1905-)**

**ఈ** గడ్డ మీద పుట్టి పెరిగి, ఇక్కడి గాలి పీల్చి, నీరు తాగిన ప్రతి ఒక్కరూ తమ ప్రతిభా సంపన్నతను బట్టి మాతృభూమి రుణం తీర్చుకోవాల్సి ఉంటుంది. మనిషి తాను సాధించినదంతా స్వశక్తి ద్వారా మాత్రమే సాధించాడని భావిస్తాడు. ఈ దేశం కోసం ఏ కించిత్తు పనిచేసినా తానేదో సేవ చేస్తున్నట్లు భుజకీర్తులు తగిలించుకుంటాడు. ప్రతిభా సామర్థ్యాలన్నీ ఈ నేలతల్లి బిడ్డలు అందించిన ఉమ్మడి ఆస్తి అని గ్రహిస్తే, అప్పుడు మాత్రమే ఈ గడ్డకు తాను ఎంత రుణపడి ఉన్నాడో అర్థం చేసుకుని ప్రవర్తిస్తాడు. ఆ దిశగా మాతృదేశ విముక్తి కోసం తాను చేసినదంతా తల్లి రుణం తీర్చుకోవడమేనని తన ప్రవర్తన ద్వారా తెలియజేసిన మహిళ శ్రీమతి సఫియా అబ్దుల్ వాజిద్.

శ్రీమతి సఫియా అబ్దుల్ వాజిద్ 1905లో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో జన్మించారు. ఆయన తాత, తండ్రి ఉన్నతాధికారులు. విశాల దృక్పథం గల కుటుంబమది. అలహాబాద్ విశ్వవిద్యాలయంలో ఆమె పోస్టుగ్రాడ్యుయేషన్ చేశారు. చిన్నతనం నుండి తాత తండ్రుల వద్దకంటే జాతీయ భావాలు గల మేనమామ సయ్యద్ అబ్దుల్ వదూద్ వద్ద పెరగటంతో, ఆమెకు జాతీయోద్యమం పట్ల అధిక ఆసక్తి కలిగింది. ఆమె ప్రముఖ న్యాయవాది మౌల్వీ





అబ్దుల్ వాజిద్ బరేల్విని వివాహమాడారు. ఆయన బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో పాల్గొంటున్న జాతీయవాది. పుట్టినింటనే కాకుండా, మెట్టినింట కూడా ఆమెకు జాతీయ భావాల సమర్థకులు తోడు కావటంతో భారత జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించి, బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగిన రహస్య కార్యకలాపాలలో ఆమె పాల్గొన్నారు.

ఈ కారణాన్ని సాకుగా చూపి ప్రభుత్వం ఆమెను లెక్చరర్ ఉద్యోగం నుండి తొలగించింది. ఆమె కార్యనిర్వహణా దక్షత, రాజకీయాల పట్ల గల అవగాహనను గమనించిన మహాత్మాగాంధీ **పర్దా** ను వదిలి ప్రత్యక్ష రాజకీయాలలోకి రావాల్సిందిగా స్వయంగా ఆహ్వానించారు. భర్త కూడా గాంధీజీ మాటను గౌరవిస్తూ ఆమెను ప్రోత్సహించారు. అప్పటినుండి ఆమె జాతీయోద్యమ నాయకురాలిగా పలు కార్యక్రమాలను నిర్వహించి ప్రజాదరణతోపాటుగా జాతీయ స్థాయి గుర్తింపు పొందారు.

భారతదేశం స్వతంత్ర దేశంగా అవతరించాక ఆమె అందించిన త్యాగమయ సేవలకు గుర్తింపుగా భారత ప్రభుత్వం ఆమెకు స్వాతంత్ర్యసమరయోధుల **పెన్షన్** మంజూరు చేసింది. ప్రభుత్వాధినేతలు తన కృషిని జ్ఞప్తియందుంచుకున్నందుకు కృతజ్ఞతలు తెలియజేస్తూ పెన్షన్‌ను నిరాకరించారు. ఈ సందర్భంగా ఆమె మాట్లాడుతూ, **స్వాతంత్ర్య సమరయోధుల పెన్షన్ స్వీకరిస్తే అది నా మాతృదేశ భక్తికి ఖరీదు కట్టినట్లు కాగలదు** అని ప్రకటించారు. ఆమె కుటుంబం ఆర్థిక ఇబ్బందులను ఎదుర్కొంటున్నప్పటికీ పెన్షన్ సౌకర్యాన్ని తిరస్కరించారు.

1952లో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో సఫియా అబ్దుల్ వాజిద్ కాంగ్రెస్ పార్టీ టిక్కెట్టు మీద పోటీచేశారు. ప్రజలు ఆమెను గెలిపించి శాసనసభకు పంపారు. ప్రజా ప్రతినిధిగా 1957 వరకు ఆమె పనిచేశారు. శాసనసభ్యురాలిగా రాష్ట్ర భవిష్యత్తు నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించారు.

పండు వయస్సులో కూడా జాతి జనుల సేవలో గడిపిన సఫియా అబ్దుల్ వాజిద్ తానేదో ప్రజాసేవ చేస్తున్నట్లుగా ప్రకటించుకోలేదు. తాను ప్రత్యేకంగా త్యాగాలు చేసింది ఏమిలేదని, ఈ గడ్డ మీద పుట్టిపెరిగి నందున గడ్డ రుణం తీర్చుకుంటున్నానని వినమ్రపూర్వకంగా తెలుపుకున్నారు.

◆◆◆

# జనచైతన్య కార్యక్రమాల నిర్వహణలో దిట్ట

# ఫాతిమా బేగం

**భా**రత స్వాతంత్రోద్యమంలో మహిళలు తమ సహజ పరిమితులకు మించిన భాగస్వామ్యాన్ని అందించారు. బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రత్యక్ష కార్యకలాపాలలో పాల్గొని కొందరు పోరాటరంగాన అగ్రభాగాన నిలిస్తే మరికొందరు పరోక్షంగా జాతీయోద్యమానికి క్రియాశీలక తోడ్పాటు నిచ్చారు. ప్రత్యక్షంగా పోరాటంలో పాల్గొన్న మహిళల వివరాలు కొంతలో కొంతగానైనా అందుబాటులో ఉన్నాయి. ఎందువల్లనంటే ప్రభుత్వాలు, తమను ఎదిరిస్తున్న ప్రతి ఒక్కరి వివరాలను సేకరించి, వ్యక్తిగత రికార్డులను భద్రపరుస్తాయి. ఉద్యమాలకు, ఉద్యమకారులకు పరోక్షంగా తోడ్పాటు నందించిన వారి గురించి రికార్డుల పరంగా సమాచారం లభించే అవకాశాలు అంతగా ఉండవు. అటువంటి వ్యక్తులు ఎంతటి త్యాగమయ సేవలను అందించినా, గొప్ప బాధ్యతలు నిర్వర్తించినా ఆయా వివరాలు గుప్తంగానే ఉండిపోతాయి. ఈ విధంగా పరోక్షంగా జాతీయోద్యమానికి ఎనలేని తోడ్పాటు అందచేసిన మహిళ శ్రీమతి ఫాతిమా బేగం.

బేగం ఫాతిమా పంజాబ్ రాష్ట్రానికి చెందిన స్వాతంత్ర్య సమరయోధురాలు. ఆమె జాతీయ కాంగ్రెస్ పంజాబ్ రాష్ట్ర శాఖ సభ్యురాలు. జాతీయోద్యమ లక్ష్యాలను ప్రజలకు వివరించి ఉద్యమ కార్యక్రమాల వైపు వారిని ఆకర్షించి ఉద్యమంలో చురుకుగా





పాల్గొనేట్టుగా చేయటంలో ఆమె దిట్టగా ఖ్యాతిగడించారు. ఈ విశిష్టతను గమనించిన జాతీయ కాంగ్రెస్ నేతలు ప్రత్యేకంగా జనచైతన్య కార్యక్రమాల బాధ్యతలను ఆమెకు అప్పగించారు.

బేగం ఫాతిమా 1939 నుండి 1940 వరకు పంజాబ్ రాష్ట్రమంతా పర్యటిస్తూ జాతీయోద్యమ లక్ష్యాలను, స్వరాజ్యం సాధించాల్సిన అవసరాన్ని ప్రజలకు వివరిస్తూ, బ్రిటీష్ వ్యతిరేక పోరాటంలో ప్రజలను కార్యోన్ముఖులను చేయటంలో అద్వితీయ ప్రతిభను కనపర్చారు. ఆమె ఆకర్షణీయమైన విగ్రహం, ఆకట్టుకునే వ్యక్తిత్వంతో ప్రజలను తనవైపుకు ఇట్టే తిప్పుకునేవారు. విషయ వివరణ, ప్రత్యర్థుల వాదనను తిప్పికొడుతూ సాగించే సంవాదం, ప్రత్యర్థులను సహితం సమ్మోహితులను చేయటం ఆమె విశిష్టత.

భారత జాతీయ కాంగ్రెస్ ఆదేశాల మేరకు రాష్ట్రంలో పలు సభలను, సమావేశాలను ఆమె ప్రతిభావంతంగా నిర్వహించారు. స్వయంగా ఆమె మంచి వక్త కావటంతో ప్రజల నుద్దేశించి ప్రసంగిస్తూ, ప్రతి ఒక్కరిలో స్వరాజ్య కాంక్షను రగిలించారు. స్వరాజ్య సాధనా మార్గంలో ధనమాన ప్రాణాలను అర్పించేందుకు ప్రజలను సన్నద్ధం చేశారు. స్వాతంత్ర్య సంగ్రామ పోరాటయోధులను సమీకరించటం, నిబద్ధత గల ఉద్యమకారులను ఎంపిక చేయటంలో దిట్టగా ఆమె జాతీయ నాయకుల ప్రశంసలు పొందారు.

ఆ రోజుల్లో ఉద్యమకారుల మీద బ్రిటీష్ గూఢచారి దళం ఎల్లప్పుడూ తీవ్ర నిఘా ఉంచేది. బ్రిటీష్ పోలీసులు ఎంత అప్రమత్తంగా ఉన్నా వారి కన్నుగప్పి ఆమె తన కార్యకలాపాలను నిరాఘాటంగా సాగించారు. జాతీయ కాంగ్రెస్ ఆదేశాల మేరకు పంజాబ్ శాఖ అప్పగించిన బాధ్యతలన్నిటినీ చాకచక్యంగా నిర్వహించిన ఫాతిమా బేగం జీవిత విశేషాలు చరిత్రపుటలలో సమగ్రంగా నిక్షిప్తం కాలేకపోయాయి.

జాతీయోద్యమ నాయకుల సంభాషణలలోని ప్రస్తావనలు, నేతలు పరస్పరం రాసుకున్న లేఖలలో దొర్లిన వాక్యాలు, ఆమె కార్యకలాపాలతో పరిచయం ఉన్న మాజీ రాజ్యసభ సభ్యులు డాక్టర్ హాషీం కిద్వాయ్ లాంటి పెద్దలు వెల్లడించిన వివరాల ద్వారా మాత్రమే ఫాతిమా బేగం ప్రశంసనీయ పాత్రకు సంబంధించిన విశేషాలు నమోదు కాగలిగాయి.

◆◆◆

## ఇండియన్ యూనియన్‌లో నైజాం విలీనం కోరిన

# నఫీస్ ఆయేషా బేగం

**భా**రత స్వాతంత్ర్యోద్యమంలో ప్రజానీకం పరోక్షంగా ప్రత్యక్షంగా పాల్గొన్నారు. పాలక పక్షాలకు వ్యతిరేకంగా ప్రత్యక్ష కార్యాచరణకు దిగిన వారికి పలురకాల శిక్షలు ప్రతిఫలంగా లభించాయి. వారి వివరాలు అందుబాటులో ఉంటున్నాయి. పరోక్షంగా జాతీయోద్యమానికి సహాయ సహకారాలు అందించి పోలీసుల చిట్టాలకు ఎక్కకుండా ఉండిపోయిన తెలుగు ఆడపడుచులు ఎందరో ఉన్నారు. ఆ తల్లుల త్యాగాలు ఎంత శ్లాఘనీయమైనవైనా అవి అక్షరరూపం ధరించకపోవటంతో ప్రజలకు అందుబాటులో లేకుండా పోయాయి.

ప్రత్యక్ష పోరులో శిక్షలకు గురైనవారి వివరాలు పోలీసుల రికార్డులలో నిక్షిప్తమై ఉన్నందున కొంతలో కొంత సమాచారం లభ్యం అవుతుంది. ఈ మేరకు పోలీసు రికార్డుల ఆధారంగా తయారైన గ్రంథాలలో స్థానం పొందిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి చెందిన మహిళా యోధురాలు శ్రీమతి నఫీస్ ఆయేషా బేగం.

ఆంధ్రప్రదేశ్ ప్రస్తుత రాష్ట్ర రాజధాని హైదరాబాద్‌కు చెందిన జనాబ్ హమీద్ ఆలీఖాన్ కుమార్తె ఆయేషా బేగం. తండ్రి జాతీయ భావాలతో ప్రభావితురాలైన ఆయేషా బేగం హైదరాబాద్ కేంద్రంగా జాతీయోద్యమంలో పాల్గొన్నారు. స్వతంత్ర భారత దేశం





అవతరించాక ఇండియన్ యూనియన్‌లో చేరడానికి నిరాకరించిన నైజాం సంస్థానాధీశుల పట్ల నఫీస్ ఆయేషా బేగం నిరసన వ్యక్తంచేశారు. నిజాం సంస్థానం భారతదేశంలో విలీనం కావాలని, నైజాం సంస్థానంలోని వాసులంతా భారతదేశ పౌరులుగా పరిగణించ బడాలని ఆమె ఆకాంక్షించారు.

ఈ ఆకాంక్షకు భిన్నంగా నిజాం సంస్థానాధీశులు, ఆయన మద్దతుదారులు వ్యవహరించటంతో ప్రజలు నిరసన వ్యక్తంచేశారు. ఈ నిరసనలు ప్రదర్శనలుగా మారాయి. ఈ వ్యతిరేక ప్రదర్శనల పట్ల ఆగ్రహించిన నిజాం ప్రభుత్వం ప్రదర్శనకారులను నిర్బంధించింది. అరెస్టుల పర్వం సాగించింది.

ఈ అరెస్టులలో భాగంగా ఆయేషా బేగం కూడా జైలు పాలయ్యారు. ఆమెను 1948, 16న అరెస్టు చేశారు. హైదరాబాద్ సెంట్రల్ జైలులో నిర్బంధించారు. ఆ అరెస్టులు ఆమెను అధైర్యపర్చలేదు. జైలు నుండి విడుదల తరువాత కూడా ఆమె లక్ష్య సాధన పట్ల నిబద్ధతతో సాగారు. చివరకు ఇండియన్ యూనియన్‌లో నైజాం సంస్థానం విలీనమైంది.

ఆ యోధురాలి పూర్తి వివరాలు తెలియలేదు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆధ్వర్యంలో డాక్టర్ సరోజిని రెగాని సంపాదకత్వంలో రూపొందించిన Who's who of Freedom Struggle in Andhra Pradesh? సంపుటాలలో స్థానం పొందగలిగిన ఏకైక ముస్లిం మహిళ ఆయేషా బేగం కావటం విశేషం. ఆ గ్రంథంలో ఆమె అరెస్టుకు సంబంధించిన వివరాలను, కొద్దిపాటి వ్యక్తిగత విశేషాలను పేర్కొనటంతో ఆ మాత్రమైనా ఆమె గురించి తెలుసుకునే అవకాశం కల్గింది.

◆◆◆

> పాలకులు ప్రజలకు వ్యతిరేకంగా అన్యాయాలకు, అక్రమాలకు పాల్పడుతూ నియంతల్లా వ్యవహరిస్తుంటే,జనసముదాయాలన్నీ ఏకమై నియంతృత్వశక్తుల మీద విరుచుకు పడాలి...వినాశన మార్గం నుండి మంచి మార్గం వైపుకు పాలకవర్గాలు మళ్ళేంత వరకు ఉద్యమాలు ఉధృతంగా సాగాలి. అంతిమంగా ప్రజలు విజయం సాధిస్తారు. ..మన మాతృభూమి భవిష్యత్తు దృష్ట్యా, మన గౌరవాన్ని కాపాడేందుకు ఈ గడ్డమీది ప్రతి హిందూ-ముస్లిం ఈనాడు భుజం భుజం కలిపి పోరాడాల్సిన బాధ్యత ఉంది.
>
> **-బేగం జాఫర్ అలీ ఖాన్**



## తెలంగాణ పోరులో కమ్యూనిస్టు యోధురాలు

# జమాలున్నీసా బాజి

జాతీయోద్యమంలో ప్రవేశించి తద్వారా బ్రిటీషర్ల బంధనాల నుండి విముక్తి కోసం పోరాటం మాత్రమే కాకుండా విముక్తి పోరాటాల స్ఫూర్తితో సమతా-మమతల వ్యవస్థలను స్థాపించి జాతి జనులకు ఉత్తమోత్తమ వ్యవస్థను అందించాలన్న లక్ష్యంతో ముందుకు సాగిన మహిళలు ఎందరో. ఆ క్రమంలో ఇండియన్ యూనియన్‌లో నైజాం విలీనం కోరుతూ సాగిన ఉద్యమంలో పాల్గొనటమే కాకుండా ఆతరువాత సాగిన తెలంగాణ సాయుధ పోరాట సమయంలో ప్రజల పక్షం వహించి పోరుబాటన నడిచిన మహిళా ఉద్యమకారులలో జమాలున్నీసా బాజి ఒకరు.

జమాలున్నీసా 1915 ప్రాంతంలో హైదరాబాదు సంస్థానంలో జన్మించారు. ఆమె తల్లి హైదరాబాదుకు చెందినవారు కాగా తండ్రిది ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం. ఆయన నైజాం సంస్థానంలో న్యాయాధికారిగా పనిచేశారు. కుటుంబంలోని పెద్దలు ఆచార సంప్రదాయాల పట్ల అనురక్తులైనప్పటికి తల్లితండ్రులు మాత్రం ఉదార స్వభావులు. తల్లి తండ్రులు చిన్ననాటి నుండే తమ పిల్లలకు తగినంత స్వేచ్ఛ కల్పించారు. ప్రధానంగా తండ్రి నుంచి లభించిన స్వేచ్ఛ ఫలితంగా చిన్నతనంలోనే జమాలున్నీసాకు స్వతంత్ర భావనల తోపాటుగా జాతీయ భావనలు అలవడ్డాయి.





పదమూడు సంవత్సరాల వయస్సులోనే ఆమె ' నిగార్ ' పత్రికను చదవటం ఆరంభించారు. లక్నోకు చెందిన నియాజ్ ఫతేపూరి సంపాదకత్వంలో నిగార్ పత్రిక వచ్చేది. ఆ పత్రిక, ఛాందసత్వానికి, మతమౌఢ్యానికి, మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా పోరాడటమే కాకుండా స్వాతంత్ర్యం, సామ్రాజ్యవాద వ్యతిరేక లక్ష్యాన్ని ముందుకు తీసుక పోవడానికి కృషిచేసింది. అందువల్ల యీ పత్రిక అత్యంత ప్రమాదకరమైనదని నైజాం ప్రభుత్వం భావించి హైదరాబాదు సంస్థానంలోకి దాని ప్రవేశాన్ని నిషేధించింది. (హైదరాబాదు సంస్థానంలో రాజకీయ చైతన్యం, విద్యార్థి-యువజనుల పాత్ర (1938-1956), ఎస్.ఎం.జవాద్ రజ్వి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1985, పేజి.25).

నిషేదిత నిగార్ పత్రిక ప్రభావం వలన మతపరమైన ఛాందసాలకు వ్యతిరేకంగా, బ్రిటీషర్ల మిత్రుడిగా మారిన నైజాం సంస్థానాధీశుడ్ని నిరశిస్తూ జమాలున్నీసా ఉద్యమించారు. ఆమె అభిప్రాయాల స్థిరత్వానికి కుటుంబ వాతావరణం కూడా తోడ్పడింది. మత సంబంధమైన కొన్ని ఆచార సంప్రదాయాల విషయంలో కూడా సమకాలీన సమాజం అభిప్రాయాలకు భిన్నంగా ప్రవర్తించటం వలన జమాలున్నీసా స్వజనుల నుండి చాలా ఇక్కట్లను ఎదుర్కొన్నారు. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, **మమ్మల్ని కాఫిర్లనేవాళ్ళు. మతద్రోహులని పిలిచేవాళ్ళని** జమాలున్నీసా స్వయంగా చెప్పుకున్నారు. ఈ మేరకు స్వతంత్ర భావాలతో ఉద్యమిస్తున్న ఆ కుటుంబ సభ్యుల పద్ధతులు సరికాదంటూ బంధువులు ఎంతగా చెప్పినా ఆ కుటుంబ సభ్యులు తమదైన మార్గంలో ముందుకు సాగారు. తొలిదశలో బ్రిటీషర్లకు వ్యతిరేకంగా జాతీయోద్యం పట్ల మొగ్గు చూపిన జమాలున్నీసా చివరివరకు ఆ పోరుబాటన నడవటమే కాకుండా కమ్యూనిస్టుగా తన పోరాట పరిధిని మరింతగా విస్తృత పర్చుకున్నారు.

స్వతంత్ర ఆలోచనలు, ఉదార స్వభావం గల కుటుంబంలో జన్మించి, ఆ వాతావరణంలో ఎదిగిన జమాలున్నీసా వివాహం సంకుచిత ఆలోచనలు గల కుటుంబంలో జరిగింది. ఆ కారణంగా అత్తవారింటి వాతావరణంతో అలవాటు పడేందుకు తొలిదశలో ఆమె చాలా ఇబ్బందులు పడ్డారు. ఈ విషయాన్ని ఆమె వివరిస్తూ **మా అత్తవారిల్లు చాలా వెనుకబడ్డ కుటుంబం. మొదట్లో చాలా బాధవేసేది. కష్టంగా అనిపించేది. నేను కొంత సరిపుచ్చుకోవాల్సి వచ్చేది...నన్ను ఒక సంవత్సరం దాకా మా వాళ్ళు మా అమ్మ**

**ఇంటికి పోనివ్వలేదు. మా నాన్న నన్ను ఇంటికి తీసుకెళ్ళుతుండేవాడు. నా భర్త అన్న, అతని భార్య చాలా సంకుచిత స్వభావం కలవారు. ఎవర్నీ బయటకు వెళ్ళనిచ్చేవారు కారు. మూడు సంవత్సరాలు నేను ఒక కుటుంబ స్త్రీగానే ఉన్నాను- కుట్టుపని నేర్చుకున్నాను. ఇంట్లో కట్టేసినట్టుండేది కాని నాకున్న కొన్ని అభిప్రాయాలను మాత్రం నేను దాచలేదు. పుస్తకాలు చదివేదాన్ని కాని ఎదో సర్దుకుపోయేదాన్ని-కుటుంబ జీవితంలో. తర్వాత మేం వేరే ఇల్లు ఉస్మాన్‌పురా కట్టెల మండి దగ్గర తీసుకున్నాం. నా కొడుకప్పుడు మూడేళ్ళవాడు. సెలవుల్లో మా నాన్న దగ్గరకు వెళ్ళుతుండేదాన్ని. అది మా అత్తగారింట్లో ఇష్టం ఉండేది కాదు.** అటువంటి ప్రతికూల వాతావరణంలో కూడా ఆమె తన చిన్ననాటి స్వతంత్ర భావనలను వదులుకోలేదు. ఆ తరువాతి కాలంలో అత్తవారింటి వాతావరణంలో కొంత మార్పు వచ్చింది. ఆ మార్పులతో తాత్కాలికంగా తెరపడిన కార్యకలాపాలను మరింత ఉత్సాహంతో జమాలున్నీసా ఆరంభించారు.

చిన్నతనంలోనే జాతీయోద్యం పట్ల ఆకర్షితురాలైన జమాలున్నీసా స్వదేశీ ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. ఈ విషయాన్ని ఆమె స్వయంగా ప్రస్తావిస్తూ, **స్వదేశీ ఉద్యమం కూడా మమ్మల్ని ప్రభావితం చేసింది. నేను స్వదేశీ బట్టలనే కట్టుకునేది.** (మనకు తెలియని మన చరిత్ర ః పేజి. 173) అని అన్నారు. ఆ సమయంలో జమాలున్నీసా కుటుంబం మీద స్వాతంత్ర్యసమరయోధుడు, ప్రసిద్ధ కవి మౌలానా హస్రత్ మోహని ప్రభావం ఉంది. ఆమె కుటుంబానికి ఆయన దగ్గర బంధువు. హైదరాబాదు వచ్చి మల్లేపల్లి మసీదు వద్ద ఆయన కొన్ని సంవత్సరాలు ఉన్నారని, ఆయనకు తమ కుటుంబంతో సన్నిహిత బంధుత్వ సంబంధాలున్నాయని జమాలున్నీసా చెప్పుకున్నారు. మౌలానా మోహాని చాలా చురుకైన స్వదేశీ ఉద్యమకారుడు. జాతీయోద్యమంలో ఆయన బ్రిటీషర్లకు వ్యతిరేకంగా పోరాడుతూ పలుమార్లు జైళ్ళపాలయ్యారు. ఆయనను సహచరులు ' ఫైర్ బ్రాండ్ ' గా పరిగణించేవారు. అటువంటి యోధునితో ఏర్పడిన పరిచయం జమాలున్నీసా కుటుంబ సభ్యులను జాతీయోద్యమం, స్వదేశీ ఉద్యమం, సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమాల దిశగా నడిపించాయి.

ఆ కారణంగా జమాలున్నీసా జాతీయోద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. అయినప్పటికి చేయాల్సినంతగా చేయలేదని ఆమె చెప్పుకున్నారు. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, **మొదట్నించి జాతీయోద్యమంలో వుండేవాళ్ళం. మేమేం చేయడం లేదని**





**ఎప్పుడూ అన్పించేది. మేము అజంతాలో వున్నప్పుడు ముహమ్మద్ అలీ, ఆయన భార్య అక్కడికొచ్చారని తెలిసింది. మేము, అఖ్తర్ (సోదరుడు) మా పెద్ద నాన్న మా పాకెట్ మనీ -15, 20 రూపాయలు జమచేసి బేగం ముహమ్మద్ అలీకి ఇచ్చాం,** అని చెప్పుకున్నారు. (మనకు తెలియని మన చరిత్ర (తెలంగాణా రైతాంగపోరాటంలో స్త్రీలు–ఒక సజీవ చరిత్ర), స్త్రీ శక్తి సంఘటన, హైదరాబాద్, 1986, పేజి. 175).

ఆనాడు నిజాం సంస్థానంలో జాతీయోద్యమ భావాలు వ్యక్తం చేయటం కాదు కనీసం మనస్సులో ఉండటం కూడా పెద్ద అపరాధంగా భావిస్తున్న భయానక వాతావరణం. స్వతంత్ర ఆలోచనలు కలిగి ఉండటమే చాలా పెద్ద నేరం. ఆ వాతావరణంలో జమాలున్నీసా స్వతంత్ర భావనలు కలిగి ఉండటమే కాకుండా స్వదేశీ ఉద్యమంలో ఆచరణాత్మకంగా పాల్గొనటం జాతీయోద్యమానికి ఆర్థికంగా తోడ్పటం చాలా ప్రమాదకరమైన ప్రయత్నం. అటువంటి సాహసాన్ని జమాలున్నీసా ప్రదర్శించారు. జాతీయోద్యమ నిధికి చిన్న వయస్సులోనే తన పాకెట్ మనీని అందచేసి జాతీయోద్యమంలో భాగస్వాములు కావటం విశేషం.

జాతీయోద్యమంలో పాల్గొన్న జమాలున్నీసా బాజి ఆ తరువాత సంతరించుకున్న కమ్యూనిస్టు భావాల కారణంగా క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనలేదు. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, **క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనలేదు. కాని ఆ ఉద్యమం పట్ల, ఉద్యమకారుల పట్ల సానుభూతి ఉండేదని,** అమె స్వయంగా చెప్పుకున్నారు. అనాడు బాజి కుటుంబం గాంధీ కంటే సుబాష్ చంద్రబోసు అభిప్రాయాలతో ఏకీభవించారు. ఈ విషయాన్ని కూడా అమె స్పష్టంచేస్తూ **గాంధీ కంటె నెహ్రూనే ఇష్టపడేవాళ్ళం. సుభాస్ బోస్ కాంగ్రెస్ నుంచి తీసేసినపుడు మాకు చాలా కోపం, బాధ కలిగింది** అన్నారు. (మనకు తెలియని మన చరిత్ర ః పేజి. 175).

జమాలున్నీసాకు చిన్నతనంలో సరైన పాఠశాలలో విద్య లభించలేదు. అయినా ఆ తరువాతి కాలంలో స్వయంగా శ్రమించి ఉర్దూ, ఆంగ్ల భాషలను అమె నేర్చుకున్నారు. ఆ విధంగా సంపాదించుకున్న బాషా పరిజ్ఞానంతో చెల్లెలు రజియా బేగంతో కలసి సాహిత్య సమావేశాలకు హజరయ్యారు. ఆ క్రమంలో హైదరాబాదు నగరంలోని మలక్‌పేట లోగల తమ గృహాన్ని సాహిత్యకారుల కూడలిగా మార్చారు. ఆమె ' బజ్మె ఎహబాబ్ '



**సోదరి రజియా బేగంతో జమాలున్నీసా బాజి**

పేరుతో సాహితీ మిత్రుల సంఘం ఏర్పాటు చేశారు. ఆ సంఘం ఆధ్వర్యంలో వారి ఇంట సాహితీ సమావేశాలు, చర్చలు, గోష్ఠులు జరిపారు. ఆ సమావేశాలలో పలువురు యువ రచయితలు-కవులు పాల్గొనేవారు. ఆ సత్సంగంలో సాహిత్య చర్చలకు మాత్రమే పరిమితం కాకుండా ప్రజల సమస్యల గురించి, జాతీయోద్యమం గురించి, సామ్యవాద భావాల గురించి, కమ్యూనిస్టు పార్టీ గురించి, అహేతుకు ఆచారసంప్రదాయాల మీద విస్తృతంగా చర్చలు సాగేవి. ఆ చర్చలలో జమాలున్నీసా తన సోదరి రజియా మాత్రమే కాకుండా ఆమె అన్నదమ్ములు కూడా భాగస్వామ్యులయ్యేవారు.

ఆ కార్యక్రమాలలో భాగంగా ఏర్పడిన భావాల మూలంగా పరాయి పాలకుల పెత్తనం నుండి మాత్రమే కాకుండా మతమౌఢ్యం, ఛాందసం భావాల నుండి కూడా ప్రజలు విముక్తి కావాలని ఆమె ఆశించారు. ఇస్లాం మతం ప్రబోధించిన మౌలిక ధార్మిక సూత్రాలకు వ్యతిరేకంగా వివిధ అహేతుక కర్మకాండలు స్వమతస్థులలోని ఆచార సంప్రదాయాలలో చోటు చేసుకున్నాయని ఆమె అభిప్రాయపడ్డారు. అటువంటి అహేతుక సంప్రదాయాలను ఆమె నిరాకరించారు. ఆ వివాదాస్పద విషయాల మీద చర్చలు జరిపారు. ముహమ్మద్ ప్రవక్త పుట్టిన రోజు పండుగను (మిలాద్- యే-నబి) పురస్కరించుకుని చర్చా కార్యక్రమాలను నిర్వహించారు. ఆ సందర్భంగా ఇస్లాం మతం యొక్క నిజమైన సారాంశం వివరిస్తూ, కొంత మంది ముస్లింలు అనుసరిస్తున్న అహేతుక





కర్మకాండల గురించి చర్చించి, హేతుబద్ధం కాని అనాచార సంప్రదాయాలను తిరస్కరించాల్సిందిగా ప్రజలను కోరారు. ఆ కాలంలో అమలులో ఉన్న పర్దా పద్ధతిని తిరస్కరించారు. ఆ తిరస్కారం స్వజనుల ఆగ్రహానికి కారణమైనప్పటికి జమాలున్నీసా లెక్కచేయలేదు. ఆగ్రహించిన సన్నిహితులకు విషయాన్ని తర్కబద్ధంగా వివరించి నచ్చ చెప్ప ప్రయత్నించారు. ఈ సందర్భంగా కుటుంబ సభ్యుల నైతిక మద్దతు వలన తన అభిప్రాయాల మీద జమాలున్నీసా బాజి చివరివరకు సుదృఢంగా నిలిచారు.

జాతీయోద్యమ కార్యక్రమాలలో తనదైన పాత్ర నిర్వహిస్తూ వచ్చిన జమాలున్నీసా క్రమక్రమంగా కమ్యూనిస్టు ఉద్యమం పట్ల ఆకర్షితులయ్యారు. కమ్యూనిజం ప్రభావానికి ఆమె ఒక్కతే లోనుకాలేదు. ఆమె సోదరులు అన్వర్, జఫర్, సోదరి రజియా బేగం కూడా ప్రభావితులయ్యారు. కమ్యూనిజం సాహిత్యాన్ని పఠిస్తూ సిద్ధాంత పరిజ్ఞానాన్ని పెంచుకుంటూ ప్రజలలో కలిసి పనిచేయటం ఆరంభించారు. అన్ని రంగాలలో సమానత్వం సాధించటం, సమసమాజ స్థాపన అను మహోత్తర లక్ష్యాలను సాధించేందుకు కమ్యూనిజం ద్వారా మాత్రమే సాధ్యమని నమ్మిన జమాలున్నీసా బాజి కుటుంబ సభ్యులు ఆ దిశగా ఎంతో నిబద్ధతతో ముందుకు సాగారు. ఆ లక్ష్యసాధనకు తమ ప్రాణాలు బలిపెట్టడానికి కూడా ఆమె అన్నదమ్ములు జఫర్, అన్వర్‌లు సిద్ధమయ్యారు. ఆ సోదరులకు మద్దతుగా జమాలున్నీసా బాజి అమె చెల్లెలు రజియా బేగం, ఇతర కుటుంబ సభ్యులు కూడా కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాల ప్రచారానికి తోడ్పడ్డారు. ఆనాడు కమ్యూనిస్టు పార్టీ మీద పలు ఆంక్షలు, నిషేధాలు అమలులో ఉన్నప్పటికి పోలీసుల, గూఢచారుల కంటపడకుండా తమ ఇంటిని రహస్య కేంద్రంగా చేసుకుని జమాలున్నీసా ఎంతో ధైర్యంతో పార్టీ కార్యకలాపాలను నిర్వహించారు.

జమాలున్నీసా కుటుంబం వామపక్షభావాల వైపుగా సాగించిన ప్రస్తానం గురించి స్వయంగా ఆమె ఈ విధంగా వెల్లడించారు. ఆ కథనం ప్రకారం, **మొదట్నించీ మేము వామ పక్షానికి దగ్గరగా వుండేవాళ్ళం. 1941లో అభ్యుదయ రచయితల సంఘం అని ఒకటి వుండేది. మఖ్దూం, నజర్ హైదరాబాద్ ఎప్పుడూ వస్తూండేవారు. మేం నలుగురు అక్క చెల్లెళ్ళం. ఈ మీటింగులకి బహిరంగంగా వెళ్ళేవాళ్ళం. అమ్మకూడా వచ్చేది. కొంతమంది చిల్‌మన్ల** (చాటుకోసం చేసిన ఏర్పాటు) **వెనుక కూర్చునేవాళ్ళు....సజ్జాద్ జహీర్, ఓంకార్, పర్షాద్ లాంటి వాళ్ళు చాలా మంది అండర్‌గ్రౌండ్‌లో వున్నప్పుడు మా**

**యింట్లో వుండే వాళ్ళు. 1947 తర్వాత లక్నోలో హిందీ కాన్ఫరెన్స్-మౌలానా ఎసియాటిక్ కాన్ఫరెన్స్- వెళ్ళాం. అక్కడ ఎర్రజెండాలు ఎగరేశాం. చాలా మంది అరెస్టయ్యారు.**

ఆ క్రమంలో ప్రముఖ కమ్యూనిస్టు నేత ప్రమీలా తాయిని జమాలున్నీసా కలుసుకున్నారు. 1946లో ఆమె కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం తీసుకున్నారు. 1946 నవంబరులో పార్టీ మీద నిషేధం విధించబడింది. కమ్యూనిస్టు పార్టీ మీద విధినిషేధాల కారణంగా, నిజాం ప్రభుత్వం చర్యల మూలంగా చాలా రహస్యంగా ఆమె కార్యకలాపాలను నిర్వహించాల్సి వచ్చేది. నాయకులకు, పార్టీ కార్యకర్తలకు ఆశ్రయం కల్పించటం, ఆహారం అందించటం, నాయకుల మధ్య సమాచారం చేరవేయటం, ఆయుధాలను సరఫరా చేయటం, ఆయుధాలను దాచిపెట్టటం లాంటి బాధ్యతలను జాగ్రత్తగా నిర్వహించారు. ఈ విషయంలో అమె కుటుంబ సభ్యులు కూడా ఎంతో సాహసంతో కార్యక్రమాలలో ప్రముఖ పాత్రవహించారు. ఆ విషయాలను కూడా అమె ఈ క్రింది విధంగా వెల్లడించారు.

**నేను బయటకు వెళ్ళలేకపోయేదాన్ని కాదుకాని అండర్ గ్రౌండ్‌లో ఉన్నవాళ్ళు వచ్చి ఉండిపోయేవారు. భర్తతో వాళ్ళు నా అన్న స్నేహితులని చెప్పేదాన్ని. మా కుటుంబం వాళ్ళనంతా చూసి క్రమంగా ఆయనకొక నమ్మకం కుదిరింది. నా అన్న తమ్ముళ్ళంతా కాలేజీలు వదలి ఉద్యమంలో చేరి చాలా బాధలుపడ్డారు. అయుధాలిక్కడే దాచేవారు. అన్వర్, జఫర్, నా అన్న వరస హఫీజ్ వీళ్ళంతా కలసి పనిచేసేవారు. వాళ్ళంతా అరెస్టయ్యారు. అన్వర్ చాలా సీరియస్ జబ్బుతో బాధపడుతుండేవాడు. ఖమర్, మజర్ అండర్ గ్రౌండ్‌లో ఉండి అరెస్టయ్యారు. అన్వర్ అత్తగారిల్లు ఎక్కడో దూరంగా హబ్సీగూడా రామాంతపూర్‌లో వుండేది. మఖ్దూం, ఓంకార్ అక్కడే ఉండేవాళ్ళ. మఖ్దూం, జఫర్, షఫీఖ్, బెవ్‌జద్‌తోపాటు అరెస్టయ్యాడు....జఫర్ సాయుధ పోరాటం జరుగుతున్నప్పుడు ఊళ్ళకి వెళ్ళి, అక్కడి పరిస్థితులను చూసి నిరాశతో తిరిగి వచ్చాడు. జఫర్ రివాల్వర్లను దాచిపెడితే, అఖ్తర్ వాటిని ఒక పెట్టెలో పెట్టి పోలీసులు వచ్చిప్పుడు వాటిపైన కూర్చుంది. ఆమె మురాద్ నగర్ వెళుతూ రివాల్వర్ నాకిచ్చింది. నేను దాన్ని ఇక్కడే దాచాను.**

**జిన్నా ఇంటిర్మ ప్రభుత్వానికి వ్యతిరేకంగా నల్లజెండాల ప్రదర్శనలిమ్మని పిలుపునిచ్చాడు. అందరూ దాన్ని పాటించారు. కాని మేము పాటించలేదు. మా అన్నలు ఎర్రజెండా ఎగురవేశారు. చుట్టుపక్కల వాళ్లంతా ఇష్టపడలేదు. రాజ్ బహుదుర్ గౌడ్, జవార్ (జవ్వాద్ రజ్వీ) హస్పిటల్ నుంచి తప్పించుకుని ఇక్కడికే మొదలు వచ్చారు. 1947 ప్రారంభంలో ఎక్కడ చూసినా పోలీసులుండేది. రిక్షాకు పర్దాకట్టించి వాళ్ళనిక్కడి**





**నుంచి వేరొకచోటుకి తీసుకెళ్ళాం. రాజ్ మమ్మల్ని అండర్ గ్రౌండ్ వెళ్ళిపొమ్మన్నాడు. అఖ్తర్ మధ్యలో ఒకసారి పెరోల్ మీద వచ్చి వెళ్ళిపోయాడు.**

**1948లో నా భర్త చనిపోయాడు. నేను తెలుగు నేర్చుకోవడం ప్రారంభించాను. పార్టీ కోరకు డబ్బువసూలు చేయటం మొదలుపెట్టాను. తాయి (ప్రమీలా తాయి) యశోధాబెన్, బ్రిజ్‌రాణి అంతా కార్యక్రమాల్లో పాల్గొన్నారు. పార్టీ మీద నిషేధం వచ్చిన తర్వాత అంతా ఇక్కడికి రావడం ప్రారంభించారు. అభ్యుదయ రచయితల సమావేశాలు కూడా జరిగేవి.**

కమ్యూనిస్టు **పార్టీలో విభేదాలు ఎక్కువైపోయాయి. ఆర్.యన్(రావి నారాయణ రెడ్డి) బొంబాయి వెళ్ళాడు. తర్వాత అఖ్తర్, గోపాలన్( ఎ.కే.గోపాలన్), జ్యోతిబసు, ముజఫర్ అహమ్మద్‌తో ఏర్పడిన డెలిగేషన్ ఒకటి వచ్చి-1951లో సాయుధ పోరాటం కొనసాగించాలా విరమించాలా అనే విషయం చర్చించడానికి వచ్చారు. మా ఇంటి ముందున్న యింట్లో వాళ్ళు ఉండడానికి ఏర్పాటు చేశాము. మా నాన్న సహాయం చేశాడు. చాలా రాత్రి వరకు మీటింగులు, చర్చలు జరిగేవి.** అని ఆనాటి విషయాలను జమాలున్నీసా వివరించారు.

ఈ విధంగా పోరాట కార్యక్రమాలలో పాల్గొన్న జమాలున్నీసా బాజి కమ్యూనిస్టు పార్టీ పోరాటాన్ని విరమించుకున్న తరువాత కూడా పార్టీపరంగా ప్రజలలో పనిచేయటం ఆరంభించారు. ప్రధానంగా మహిళలలో ఆమె ఎక్కువగా పని ప్రారంభించారు. ఆ విశేషాలను ప్రస్తావిస్తూ, **పోరాటం విరమించుకున్న తర్వాత, మహిళా సంఘాలు ప్రారంభించాం. కామ్రెడ్ ఘనీ అసిఫ్‌నగర్‌లో అతని భార్యతో ఒక మహిళా సంఘం పెట్టాడు. పర్దావేసుకునే స్త్రీలు ఒక సెంటర్ నుంచి ఇంకో సెంటర్ వెళ్ళేవారుకారు. ఆఘాపురాలో ఒక రాత్రి బడి, మాస్క్ దగ్గర ఇంకో సెంటర్ పెట్టారు. కథలు, గోర్కీ రచనలు చదివేవాళ్ళం. చాలా రోజులు అలా చేశాం. కొంతమంది అమ్మాయిలు పార్టీ సభ్యురాళ్ళయ్యారు. ఎన్నికల్లో పనిచేశారు. నాతో కలసి గుంటూరు, విజయవాడకు వచ్చారు. ఇప్పుడు వాళ్ళంతా పెళ్ళిల్లు చేసుకుని, ఏమీ చేయటం లేదని** ఆమె పేర్కొన్నారు.

కమ్యూనిస్టు పార్టీకార్యక్రమాలలో చురుకుగా పాల్గొన్న పలువురు పార్టీ కార్యక్రమాల నుండి క్రమంగా దూరమైప్పటికి జమాలున్నీసా మాత్రం తన ప్రజాచైతన్య కార్యక్రమాలలో కొనసాగారు. ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు మగ్దూం మొహిద్దీన్ మార్గదర్శకత్వంలో ఆమె తన కార్యకలాపాలను సాగించారు. ఆ వివరాలను ఆమె ఈ

విధంగా పేర్కొన్నారు.

**1952లో మఖ్దూం విడుదలయిన తర్వాత నన్ను స్త్రీలతో పనిచేయమన్నాడు. మేమెట్లా చేయగలుగుతాం ? తాయి (ప్రమీలా తాయి) ఇంకా విడుదల కాలేదు. ఆహార ధాన్యాల ధరల సమస్య బాగా పనికొచ్చింది. ముస్లింలలో నిరుద్యోగ సమస్య చాలా ఎక్కువైపోయింది. ఈ సంఘాలు వారిని ఆకర్షించలేదు. ఇంకా కొంత ఆకర్షణీయమైనవి కావాల్సి వచ్చింది. ఓంకార్ స్త్రీల ప్రజాస్వామ్య సంఘం పెట్టడానికి తోడ్పడ్డాడు. దాని నియమావళి తయారు చేశాడు. నలభై మంది స్త్రీలు కుట్టుపని, చేతిపని నేర్చుకునేవారు. మేము రాయటం, చదవటం నేర్పించేవాళ్ళం. పత్రికలు పుస్తకాలు కొనేవాళ్లం. చదవటం, చర్చలు పెట్టడం చేసేవాళ్ళం. డబ్బు సరిపోయేది కాదు. కోఆపరేటివ్ ఇనస్పెక్టరు కోఆపరేటివ్ పెట్టమని సలహా యిచ్చాడు. చాలా మంది కాలేజీ టీచర్లు షేర్ హోల్డర్స్‌గా చేరారు. ఆడవాళ్ళకు జీవనాధారం చూపించటం, ఏదైనా పనిగానీ ఒక స్కిల్‌గాని నేర్పించటం ఆ కోపరేటివ్ ఆశయం. చాలా మంది పరీక్షలిచ్చి పాసయ్యారు కూడా. ఇప్పుడు కూడా ఆ పని జరుగుతుంది కాని, తక్కువ శక్తితో, ఇద్దరు టీచర్లున్నారు. తెలుగు, ఉర్దూ ఎనిమిదవ తరగతి దాకా నేర్పుతారు. టెక్నికల్ ఏడ్యుకేషన్ బోర్డు కూడా దీన్ని గుర్తించింది. మహబూబ్‌నగర్, ఆదిలాబాద్ బ్రాంచ్‌లు కూడా ఉన్నాయి.**

గతంలో **పర్దాలాంటి సమస్యల గురించి చర్చించేవాళ్ళం. చాలా మంది రజియా సజ్జార్ జహీర్, ఇస్మత్ చోగ్తాయి లాంటి వాళ్ళు వచ్చి మాట్లాడేది. ఆరోజుల్లో స్త్రీలు చదువుకున్న వాళ్ళు రాకపోయినప్పటికి ప్రశ్నలడిగి ఎన్నో నేర్చుకునేవారు. ఇప్పుడెవరికీ ఆ కుతూహలం లేదు. పార్టీ గురించిగాని, రాజకీయ సమస్యల గురించి కానీ తెలియదు. బహుశ గల్ఫ్‌దేశాల నుంచి వచ్చే డబ్బు కారణం కావచ్చు. కొంత వరకు పార్టీకి ఆసక్తి లేదు. ఏమి పట్టించుకోదు. మహిళా ప్రజాస్వామిక సంఘం ఏమైనా కాన్ఫెరెన్స్ కెళ్ళాల్సి వచ్చినప్పుడే పనికొస్తుంది.**

ఆ విధంగా స్థానికంగా మహిళలలో పనిచేస్తూ జాతీయస్థాయి కార్యక్రమాలలో కూడా ఆమె చురుకుగా పాల్గొన్నారు. స్వయంగా ఇతర ప్రాంతాలలో జరుగుతున్న సభలు, సమావేశాలకు హాజరయ్యారు. ఆనాడు జమాలున్నీసా, ఆమె సహచరులు ఎదుర్కొన్న ఇబ్బందులు అమె మాటల్లో ఇలా ఉన్నాయి.

**1952-53లో ఢిల్లీ కాన్ఫెరెన్స్‌లో మేము అఖిలభారత మహిళా కాన్ఫెరెన్స్** (AIWC) **నుంచి వేరుపడ్డాం. 54లో కలకత్తా సమావేశంలో మహిళా ప్రజాస్వామిక**





**సమాఖ్య నిర్ణయించబడి, ఒక నియమావళి తయారు చేశారు. రేణు చక్రవర్తి, హజ్రబేగం** (హజ౦రా బేగం) **పాల్గొన్నారు. అఖిల భారత మహిళా కాన్ఫరెన్స్..కలకత్తా, ఢిల్లీ సమావేశాలకి వెళ్ళాను. ఇక్కడ పని చేస్తున్న బద్రున్నిసాను తీసుకెళ్ళాను. ఆమెకు రెండేళ్ళ పాప వుండేది. ఆమె కాన్ఫరెన్స్‌లో పాల్గొన్నట్టు పేపర్లో వస్తే ఆమె అత్తవారి వాళ్ళు అభ్యంతరం పెట్టారు. తర్వాత ఆమె భర్త విడాకులిచ్చాడు. ఆమె చాలా భయపడిపోయి ఇక్కడేవుండేది. ఆమెనోక ముసలతనికిచ్చి పెళ్ళి చేయాలని చూశారు. ఆమెకది ఇష్టం లేక ఒప్పుకోలేదు. ఇక్కడే టీచరు పనిచేస్తూ, ఎంతో బాగా పనిచేస్తుంది. ఇప్పుడు చాలా మంది స్త్రీలు కోఆపరేటివ్ సెంటరుకి నేర్చుకోవటానికి వస్తారు. కాని చాలా కొద్దిమంది పని చేయడానికి వస్తారు. వాళ్ళకు పని అంతగా అవసరం లేదు. వాళ్ళవాళ్ళెవరో ఒకరు వాళ్ళవాళ్ళెవరో ఒకరు బయట పనిచేస్తుంటారు కాబట్టి. మా బంధువోక అమ్మాయి క్లాసులు తీసుకోడానికి ప్రయత్నించింది. కాని ఎక్కువమంది రాలేదు. నాకేవిధంగా పనిసాగించాలో తెలియటం లేదు. మతోన్మాదము కూడా కొంత కారణమైయుంటుంది. ఇదివరకు పర్దాను వ్యతిరేకించడానికి ప్రయత్నించారు. ఇప్పుడట్లాకాదు. ఇదివరకు ముస్లిం స్త్రీలు ఊరేగింపుల్లో వచ్చేవారు. నేనే ఎన్నో సార్లు ఎలక్షన్ మీటింగులకి, కాంపేన్లకి (ప్రచారం) తీసుకెళ్ళాను. హిందూ స్త్రీలు కూడా అంతగాపట్టించుకోవటం లేదు.**

ఆ ప్రతికూల వాతావరణంలో కూడా జమాలున్నీసా కమ్యూనిస్టు కార్యకర్తగా ఎంతో నిబద్ధతతో కొనసాగారు. పార్టీనాయకులు ఎక్కడకు వెళ్ళమంటే అక్కడకు వెళ్ళి బాధ్యతలను నిర్వహించారు. తెలంగాణా ప్రాంతానికి మాత్రమే ఆమె పరిమితం కాకుండా పలు ప్రాంతాలలో పర్యటించారు. ఆ సమయంలో ప్రజలు ప్రధానంగా మహిళలు వారి పట్ల ఏవిధంగా స్పందిచారో ఆమె వివరించారు. ఆమెకు తెలుగు పూర్తిగా రాదు. ఆ కారణంగా తెలుగు మాట్లాడే ప్రజలతో పూర్తిగా మమేకం కాలేకపోయారు. ఆ విషయాన్ని ఆమె ఇలా చెప్పారు. **తెలుగు తెలిసి ఉంటే ఇంకా పని చేయడానికి తోడ్పడేది. చాలా మంది బాగా ఉత్సాహంగా ఉండే అమ్మాయిలుండేవారు. ఇప్పుడు వాళ్ళ పేర్లు జ్ఞాపకం రావటం లేదు. మమ్మల్నెక్కడకి వెళ్ళమంటే అక్కడికి వెళ్ళేవాళ్ళం, ఎక్కడికి ఎలా వెళ్ళడం అనికూడా అడక్కపోయేవాళ్ళం. ఆర్.వి (రావి నారాయణరెడ్డి) వెళ్ళమనేవాడు. మేం వెళ్ళిపోయేవాళ్లం. ఒకసారి ఆర్.యన్.తో మిర్యాలగూడ వెళ్ళాం...బోన్‌గిర్, హుజూర్‌నగర్ ఎలక్షన్ ప్రాపగాండాకు వెళ్ళాం. ఒక ముసలమ్మ నన్ను తీసుకెళ్ళి భోజనం పెట్టింది.**

**కామ్రేడ్లని ఎప్పుడూ బాగా చూసుకునేవారు ప్రజలు.**

జమాలున్నీసా కుటుంబం యావత్తు అటు కమ్యూనిస్టులు కావటంగాని లేదా కమ్యూనిస్టు సానుభూతిపరుగా మెలగటం వలన, ఆ క్రమంలో కుటుంబ సభ్యులు ప్రదర్శించిన నిబద్ధత మూలంగా కమ్యూనిస్టుపార్టీలో ప్రముఖులుగా వెలుగొందుతున్న వ్యక్తులతో సత్సంబంధాలు కుదిరాయి. ఆ కారణంగా ఆమె చెల్లెలు, తమ్ముళ్లకు ఖైఫీ అజ్మీ లాంటి ప్రముఖ కవుల కుటుంబం నుండి సంబంధాలు వచ్చాయి. ఆ విషయాన్ని కూడా జమాలున్నీసా ఈ విధంగా వివరించారు.

**ఖైఫి అజ్మీ నా చిన్న ఆడబిడ్డను పెళ్ళిచేసుకున్నాడు. జకియా(నా చిన్న చెల్లెలు)ను విశ్వామిత్ర ఆదిల్‌కిచ్చి పెళ్ళిచేస్తే బాగుంటుందని ఆయన అన్నాడు. ఆదిల్ పార్టీ సభ్యుడవడమే ముఖ్యకారణం. అంటే పార్టీసభ్యులంటే ఆరోజుల్లో మంచి అభిప్రాయ ముండేది. వ్యక్తిగత సామర్థ్యముగాని, క్లాసు కల్చరల్ బ్యాక్‌గ్రౌండ్ గురించిగాని ఆలోచించే వాళ్ళం కాదు. బతుల్ ఇంకోక ఉదాహరణ. ఆమె పార్టీసమావేశాల కొచ్చేది. పాటలు పాడేది, కవిత్వం చదివేది. ఆమె ఒక నవాబు కూతురు. పార్టీలోకి వచ్చింది. ఆమె తండ్రికి ఇంకోక స్త్రీతో సంబంధముండేది. తన తల్లి చనిపోయిందనే కసితో బతుల్ పార్టీలో చేరింది. అటువంటప్పుడు ఎన్నాళ్ళుంటుంది పార్టీలో ? కొంతవరకు కమిట్‌మెంట్, ఆసక్తి ఉండి రావటం వేరు-ఆమెకొక పదకొండు సంవత్సరాల కొడుకు కూడా ఉండేవాడు. ఆ దశలో పార్టీలోకి చాలా మంది స్త్రీలు, పురుషులు వచ్చారు. పార్టీ వాళ్ళకు సైద్ధాంతికంగా సరియైన శిక్షణ కూడా ఇవ్వలేదు. మానసికంగా బతుల్ షియా అవటం వల్ల బాధను ఓర్చుకోగల్గాలి అనే భావంతోనూ, తన మానపసిక సమస్యలతోనూ పార్టీలోకి వచ్చింది. వాటిని దాటలేకపోయిదామె. తర్వాత ఆమె భర్తను వొదిలేసింది. పార్టీ మళ్ళీ కలపడానికి ప్రయత్నించింది. కాని చేయలేకపోయింది. పార్టీ ఆమెను సపోర్టు చేసింది. జహీర్ ఇంకో ఉదాహరణ. చాలా క్లిష్ట పరిస్థితులలో ఆమె కుటుంబాన్ని వదలి, పార్టీలో కొచ్చింది. మోయిస్‌ను పెళ్ళిచేసుకుంది. ఇద్దరూ పార్టీలో చాలా ఆక్టివ్‌గా ఉండేవాళ్ళు, ఆమె చివరిదాకా. మూడేళ్ళ క్రితం ఆమె కాన్సర్‌తో చనిపోయింది. అతను మెదక్ పార్టీ యూనిట్‌కి సెక్రటరీ.**

**ఇప్పుడు పార్టీలో సరియైన ప్రోగ్రాం గాని, పనిగాని లేదు. పైగా ఆత్మవిమర్శన చేస్తూవుంటాము. నేను అమ్మాయిలనీ, అబ్బాయిలనీ పిలిచి మీటింగులు పెట్టాను.**





**మహేంద్ర కూడా వచ్చాడు. ఎలక్షన్ల తర్వాత ఎవరూ పట్టించు కోలేదు. యువకుల్ని చైతన్యవంతుల్ని చేసి కార్యకర్తలుగా తయారుచేయడానికి ఎటువంటి గట్టిప్రోగాం లేదు. చిన్నవాళ్ళను తేవాలి. మేమింకా ఎన్నాళ్ళు చేస్తాము ? 25,30 సంవత్సరాలు చేశాము. పార్లమెంటరీ బై ఎన్నికలప్పుడు రాజ్ (రాజ్ బహదుర్ గౌడ్) కి చెప్పాను- ఎక్కువగా వోటు వచ్చింది ఆసిఫ్ నగర్ నుంచి-2200 దాకా, దాంట్లో 25-30 దాకా మా కుటుంబందే. రాజ్ అభ్యర్థి కాబట్టి మేమే తప్పనిసరిగా పనిచేయాలనుకున్నాం.**

చివరి వరకు కమ్యూనిస్టుగా కొనసాగిన ఆమె ఆనాటి త్యాగాలను, ఈ వివరాలను తెలిపేనాటికి కమ్యూనిస్టు పార్టీపరిస్థితి, పార్టీనాయకులు వారి కుటుంబాల తీరుతెన్నులను తన కుటుంబ సభ్యుల త్యాగాలతో పోల్చుతూ తన బాధను ఈ క్రింది విధంగా వ్యక్తంచేశారు.

**ఇక, ఇప్పుడు పార్టీ లీడర్ల పిల్లల్ని చూస్తే...వాళ్ళు పార్టీకై ఏమి చేయరు. కొంత మంది మాస్కో వెళ్ళి వచ్చారు. అయితే పార్టీకేంచేశారు? నా అన్నదమ్ములా-జఫర్ ఆక్సిడెంటులో చనిపోయాడు. అన్వర్ చాలా కష్టాలు పడ్డాడు. జాల్నా జైలులో వున్నాడు. ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిని తర్వాత చనిపోయాడు. ఆయన కూతురు ఎం.ఎస్. సి చేస్తున్నది. భార్య తర్వాత చదువుకుని ఉద్యోగం చేసింది...ఆ రోజుల్లో 500 మంది స్త్రీలను పోగుచేయగలిగేదాన్ని. ఇప్పుడు 50 మంది రారు** అంటూ అమె నిరాశను వ్యక్తం చేశారు.

ఈ విధంగా జాతీయోద్యమం, నిజాం వ్యతిరేకపోరాటం, తెలంగాణా రైతాంగ పోరాటాలలో చురుకుగా పాల్గొన్న జమాలున్నీసా చివరి వరకు ప్రజలకోసం పనిచేస్తూ గడిపారు.

(ఈ వ్యాసం ప్రధానంగా 1986లో స్త్రీ శక్తి సంఘటన (హైదరాబాద్) ప్రచురించిన ' మనకు తెలియని మన చరిత్ర (తెలంగాణా రైతాంగపోరాటంలో స్త్రీలు-ఒక సజీవ చరిత్ర) ' గ్రంథంలోని జమాలున్నీసా బాజి, ఆమె సోదరి రజియా బేగం తమ ఇంటర్వ్యూలో వెలిబుచ్చిన సమాచారం ఆధారంగా రూపొందించటం జరిగింది. ఆ గ్రంథం సంపాదకులు, ప్రచురణకర్తలకు నా ధ◆◆◆ాలు. - రచయిత.)

ఐక్యంగా ఉండమని మనకు పలు అనుభావాలు నేర్పుతున్నాయి,ఈ దేశంలోని హిందూ -ముస్లిం- శిక్కు- ఈశాయి ప్రజలంతా ఐక్యంగా ఉద్యమించనట్లయితే మన లక్ష్యం ఏనాటికి సిద్ధించజాలదు. **- ఆబాది బానో బేగం**

## తెలంగాణ రైతాంగపోరాటంలో పోరుబిడ్డలను ఆదుకున్న ధైర్యశాలి

# జైనాబీ

**బ**లమైన శత్రువును సాయుధంగా ఎదుర్కోవడం కష్టతరమైనప్పటికి సాయుధ పోరాట యోధులకు ఆశ్రయమిచ్చి ఆదుకుని కడుపులోపెట్టుకుని కాపాడగల ప్రజల అండదండలు లభించినట్టయితే ఏ పోరాటమైనా ముందుకు సాగుతుంది. శత్రుగూఢాచారి డేగకళ్ళనుండి తప్పించుకోని ఆశ్రయమివ్వటం, ఆదుకొనటం సామాన్య ప్రజలకు కష్టతరమైన పని. ఆ కర్తవ్యాన్ని నిర్వహించబూనుకున్న ప్రజలు అత్యంత జాగురూకులై మెలగాల్సి ఉంటుంది. కట్టుతప్పితే, పట్టుజారితే ఆదుకున్న వారి ప్రాణాలకు మాత్రమే కాకుండా ప్రాణాలకు తెగించి పోరాడుతున్న ఉద్యమకారుల ప్రాణాలకు, ఉద్యమాల మనుగడకు పెనుప్రమాదం దాపురించగలదు. అటువంటి క్లిష్టతరమైన బాధ్యతలను ఆంధ్రప్రదేశ్‌లో సాగిన తెలంగాణ సాయుధ పోరాటంలో సాహసోపేతంగా నిర్వహించిన పలువురు మహిళలున్నారు. ఆనాటి మహిళామతల్లులలో శ్రీమతి జైనాబీ ఒకరు.

అటు నిజాం పాలకులకు చెందిన రజాకారుల, ఇటు భారతీయ సైన్యం కళ్ళుగప్పి తెలంగాణ రైతాంగపోరాట యోధులకు అండదండలుగా నిలచిన జైనాబీ రాజారం గ్రామం నివాసి. చిన్నతనంలో భర్తను పోగొట్టుకున్న ఆమె తన అన్నదమ్ములు, ఒక్కగానొక్క కుమారునితోపాటు రాజరంలో ఉంటున్నారు. అన్నదమ్ములు, కుమారుడు కూలీనాలీ చేసుకుని బ్రతుకు బండిన భారంగా ఈడ్చుతున్న కుటుంబం ఆమెది. భయానక పేదరికం





తన కుటుంబాన్ని పట్టిపీడిస్తున్నట్టుగా చుట్టుప్రక్కల ఉన్న ప్రజానీకాన్ని చుట్టుముట్టి ఏ విధంగా సతాయిస్తుందో స్వయం ఆమెది.

ఆనాడు తెలంగాణ ప్రాంతంలో అటు నిజాం నవాబు, ఆ నిజాం నవాబు పేరుతో బ్రతికేస్తున్న భూస్వాములు వందల వేల ఎకరాలను తమ హస్తగతం చేసుకుని రైతులు, ప్రజల మీద పలు దాష్టీకాలకు పాల్పడుతున్నారు. భూమి మీద తిరుగులేని ఆధిపత్యం తెచ్చిపెట్టిన అహంకారంతో రైతాంగం మీద అంతులేని జులుం ప్రదర్శిస్తున్నారు. ఆనాడు వరంగల్ జిల్లా సూర్యాపేట తాలూకా దేశ్‌ముఖ్ జానా రెడ్డి ప్రతాప్‌రెడ్డి లక్షా 50వేల ఎకరాలకు, ఖమ్మం జిల్లా మదిర తాలూకా కల్లూరు దేశ్‌ముఖ్ లక్ష ఎకరాలకు, నల్గొండ జిల్లా జనగాం తాలూకాకు చెందిన విసున్నూర్ దేశ్‌ముఖ్ 40వేల ఎకరాలకు, సూర్యాపేట దేశముఖ్ 20వేల ఎకరాలకు, మిర్యాలగూడా తాలూకా బాబాసాహెబ్‌పేట దేశ్‌ముఖ్ 10వేల ఎకరాలకు తిరుగులేని అధిపతులు. ఈ మేరకు 5వేల నుండి 10వేల ఎకరాలు కలిగిన మరెందరో దేశముఖ్‌లు, లక్షల ఎకరాల భూమిని తమ హస్తగతం చేసుకుని రైతాంగం మీద, ఇతర ప్రజల మీద అంతులేని అధిపత్యాన్ని చలాయిస్తున్నారు. (Telangana peoples Struggle and its lessons, P.Sundaraiah, Foundations Books, New Delhi, Page.9-10)

ఈ భూస్వాములు ప్రజలను గడ్డిపోచల్లా పరిగణిస్తూ, గ్రామాలలో వివిధ వృత్తులతో సేవలందిస్తున్న ప్రజలను తమ ఆజన్మాంత సేవకుల్లా లెక్కిస్తూ భయంకర వెట్టిచాకిరి చేయించుకుంటున్న దారుణపరిస్థితి తెలంగాణలో తాండవిస్తుంది. సంస్థానాధీశులు, రాజకుటుంబీకులు, పైగార్లులు, జాగీద్దారులు, బంజార్దారులు, ఇజ్జద్దారులు, మక్తాద్దారులు, దేశ్ ముఖ్‌లు, అగ్రహారీకులు తదితర పేర్లతో ఈ భూస్వామ్య శక్తులన్నీ భూమిని, సంపదను తమ చెప్పుచేతుల్లో తాము అడింది ఆట పాడింది పాటగా సాగించుకుంటున్నారు.

భూస్వామి ఆధిపత్యాన్ని ప్రశ్నించినా, అభీష్టానికి కించిత్తు నిరసన వ్యక్తం చేసినా ఆత్మగౌరవం గల వ్యక్తికి ఇక నూకలుచెల్లినట్టే. ఈ మేరకు విస్నూరు దేశ్‌ముఖ్‌కు వ్యతిరేకంగా న్యాయపోరాటం దిశగా సాగిన రైతాంగ యోధులు బందగీ భూస్వాముల కుట్రలకు, కరకు కత్తులకు బలయ్యాలు. ఆయన సాగించిన వీరోచిత న్యాయపోరాటం నేపథ్యంగా రూపొందించిన **మా భూమి** నాటకం అనాడు రైతాంగ పోరాటాలకు ఎంతో స్ఫూర్తినిచ్చింది.

భూస్వాముల అక్రమాలను, ఆధిపత్యాన్ని, అహంకారాన్ని ప్రశ్నించే సాహసాన్ని రైతు జనావళిలో రగిలించింది.

ఈ మేరకు సాగుతున్న భూస్వాముల దోపిడిని అరికట్టేందుకు, ఆరాచకాలను చరమగీతం పాడేందుకు ప్రజలు కమ్యూనిస్టు పార్టీ నేతృత్వంలో ముందుకు కదిలారు. ఏమిటీ జులుం ఇంకానా? ఇకపై సాగదు అంటూ తిరగబడ్డారు. ఆ కదలిక చరిత్ర సృష్టించిన తెలంగాణ రైతాంగపోరాటానికి ఆయువుపట్టయ్యింది. ఈ పోరాటంలో ప్రజలు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. భూస్వాములకు అండగా వచ్చిన శక్తులను ప్రజలు స్త్రీపురుషుల తేడాలేకుండా ఎంతో సాహసంతో ఎదుర్కొన్నారు. అందిన ఆయుధాన్ని, వ్యవసాయ పనిముట్టును తీసుకుని పురుషులు ఎగబడగా, మహిళలు రోకలిబండ, కారం సంచుల తోపాటుగా, వడిసెల పట్టి ముందుకు వచ్చారు. ఈ విధంగా ప్రత్యక్షంగా శత్రువుతో తలపడిన వారు కొందరైతే, పరోక్షంగా పోరుబాటన నడుస్తున్న యోధులకు, దళాలకు ఆశ్రయం కల్పించటం, ఆతిధ్యమివ్వటం, ఆయుధాలను అందివ్వటం, శత్రువు రాకపోకల సమాచారాన్ని చేరవేయటం, పార్టీ నుండి అందిన ఆదేశాలను, రహస్య సమాచారాన్ని పోరాట వీరులకు అందచేయడం లాంటి వ్యవహారాలను మహిళలు చాలా సమర్థవంతంగా నిర్వహించారు.

ఆ క్రమంలో రాజారం నివాసి జైనాబీ కూడా ఇతర మహిళా యోధురాళ్ళతో సమానంగా అత్యంత ప్రధానమైన రహస్య కార్యకలాపాలను ఎంతో సమర్థతతో నిర్వహించారు. తెలంగాణ రైతాంగ పోరాటంలో ఆమె ప్రత్యక్షంగా పాల్గొనకపోయినా, పోరాటయోధులకు అన్నపానీయాలు అందిస్తూ సహాయపడ్డారు. ప్రధాన దళం నుండి తప్పిపోయిన యోధులను క్షేమంగా దళంలో చేర్చటంలో ఎంతో సాహసోపేతంగా ప్రవర్తించారు. దండు రహస్యాలు చెప్పమని వేధించిన మిలటరీ హింసాకాండను తట్టుకుని నిలబడ్డారు. భయానక చిత్రహింసలు, వేధింపులకు గురవుతూ కూడా అత్యంత రహస్యంగా అతి చాకచక్యంతో శత్రువు గూఢాచారుల కళ్ళుగప్పి దళసభ్యులకు జైనాబీ సహాయ సహకారాలు అందించి, ప్రజలు ప్రధానంగా రైతులు సాగిస్తున్న సాయుధ పోరాటం ఉజ్వలంగా సాగడానికి జైనాబీ తోడ్పడ్డారు.

ఈ విధంగా తెలంగాణ సాయుధపోరాటంలో తనదైన భాగస్వామ్యాన్ని నిర్వర్తించిన జైనాబీ గురించి ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య విరచిత 1972లో ప్రచురితమైన Telangana Peoples Struggle and its Lessons





(Page. 251- 252) లో ప్రస్తావించారు. తెలంగాణ పోరాటంలో పాల్గొన్న మహిళల గురించి ఆయన తన గ్రంథంలో పేర్కొన్న వివరాలు-విశేషాలను 1999లో ప్రజాశక్తి బుక్ హౌస్ ' తెలంగాణా పోరాటంలో స్త్రీల వీరోచిత పాత్ర ' అను పేరుతో తెలుగులో ప్రచురించిన చిన్న పుస్తకంలో (పేజి. 8-9) జైనాబీ విశేషాలను ఈ క్రింది విధంగా ఉటంకించారు.

**జైనాబీ : రాజారం గ్రామంలో ఒక పేదకుటుంబీకురాలు. చిన్నతనానే భర్త పోయాడు. ఒక్క కొడుకు, తమ్ముడు, తానూ కూలికిపోయి దాని మీద బ్రతికేవారు. చల్లా సీతారామిరెడ్డి - ఆదిరెడ్డి దళం ఆ దగ్గర గుట్టలనే కేంద్రంగా చేసుకుని పనిచేస్తుండేది. ఆ దళానికి ఆహారం అందించి వస్తుండేది జైనాబీ. భారత సైన్యాలు వచ్చిన తర్వాత పార్టీకి బాగా పలుకుబడిగల గ్రామాలన్నింటా పెట్టినట్టే రాజారంలోనూ ఒక మిలటరీ క్యాంపు పెట్టారు. దానికి భయపడకుండా, అదివరకుకన్న ఎక్కువ జాగ్రత్తలు తీసుకుంటూ, మరింత ధైర్యంగా దళాలకు ఆహారం చేరవేసే కార్యక్రమాన్ని సాగించింది. ముగ్గురు గెరిల్లా దళసభ్యులు పొరపాటున దారి తప్పి కల్సుకోలేకపోతే, వారికి రక్షణ ఇచ్చి మెల్లగా దళకేంద్రానికి పంపివేయగలిగింది.**

**ఒక రోజున మిలటరీ ఆమె ఇంటిపై దాడిచేసి, ఆమెను బాది " సీతారామిరెడ్డి ఎక్కడున్నాడో చెప్పు-నిన్ను వదిలేస్తాం " అంటూ హింసించారు. " నాకు తెలియదు " అన్నదే ఆమె జవాబు. జమేదారు అమెను బూటుకాళ్ళతో తొక్కాడు. వారి హింసాకాండకు తట్టుకుని నిలచి, మళ్ళీ పార్టీ కార్యక్రమాలలో పాల్గొంది. పేదరికం జైనాబీకి అనుభవమే! అందుకే ఆమెకు పార్టీ అంటే అంత ప్రేమ, విశ్వాసమూ.**

ఈ విధంగా తెలంగాణా పోరాట మహోన్నత దినాలలో ముస్లిం స్త్రీలు, పురుషులు ఇతర సోదర జనసముదాయాలతో కలసి ప్రజల బాగు కోసం ఎంతటి సాహసోపేత కార్యక్రమాలయినా, తమ ప్రాణాలను సైతం లెక్కచేయకుండా నిర్వహించేందుకు ముందుకు వచ్చి తమ భాగస్వామ్యాన్ని అందించారు. పరాయిపాలకులు బానిసబంధనాల నుండి విముక్తికోసం గాని, భూమికోసం-భూస్వాముల నుండి విముక్తి కోసంగాని ప్రజలు సాగించిన అహింసాయుత -సాయుధపోరాట కార్యక్రమాలలో ఇతర జనసముదాయాలతో కలసి ముస్లిం మహిళలు ఉద్యమించి చరిత్రను సృష్టించారు.

◆◆◆



# తెలంగాణ ప్రజా పోరుకు తోడ్పడిన యోధురాలు

# రజియా బేగం

**ప**రాయి పాలకుల పెత్తనం నుండి స్వదేశీయులను విముక్తిగావించేందుకు నడుం కట్టి ముందుకు నడిచిన మహిళామ తల్లులు కొందరు ఆ లక్ష్యం సాధించగానే విశ్రాతంగా కూర్చోలేదు. స్వదేశీ సంస్థానాలు ఇండియన్ యూనియన్‌లో కలవడానికి ఇష్టపడని దశలో ఆయా సంస్థానాధీశుల అభిమతాలకు వ్యతిరేకంగా ప్రజాభిప్రాయం మేరకు ఉద్యమించారు. అంతటితో ఆగకుండా భూమికోసం-భుక్తికోసం-భూస్వాముల దాష్టీకాల నుండి విముక్తి కోసం సాగిన సాయుధపోరాటంలో కూడా తమదైన పాత్ర నిర్వహించారు. ఆ తరువాత ప్రజలను చైతన్యవంతుల్ని చేస్తూ, ప్రధానంగా మహిళల సమస్యల పరిష్కారం మీద దృష్టిసారించి తామెవ్వరికీ ఏమాత్రం తీసిపోమంటూ నిరూపణకు నిఖార్సయిన నిజంగా నిలచి చరిత్ర సృష్టించిన మహిళా పోరాటయోధులలో రజియా బేగం ఒకరు.

1914 ప్రాంతంలో హైదరాబాదు సంస్థానంలో రజియా బేగం జన్మించారు. ఆమె తల్లి హైదరాబాదుకు చెందిన వారు కాగా తండ్రి ఉత్తరప్రదేశ్ రాష్ట్రానికి చెందినవారు. నైజాం సంస్థానంలోని పలు ప్రాంతాలలో ఆయన న్యాయాధికారిగా పనిచేశారు. తల్లి తండ్రులు ఉదార స్వభావులు కావటంలో తమ సంతానానికి తగినంత స్వేచ్ఛ కల్పించారు. ఆ విధంగా తండ్రి నుంచి లభించిన స్వేచ్ఛ ఫలితంగా రజియా బేగంకు అన్నదమ్ముల





తోపాటుగా చిన్ననాటనే స్వతంత్రభావనలు అలవడ్డాయి. సన్నిహిత బంధువర్గం మాత్రం సనాతన సంప్రదాయవాదులు కావటంతో రజియా బేగం, ఆమె అన్నదమ్ములు, ఆమెతో పాటు ఉద్యమాలలో పాల్గొన్న కుటుంబ సభ్యులు పలు ఇక్కట్ల పాలయ్యారు.

రజియా బేగం 12 సంవత్సరాల వయస్సులోనే తన అక్కయ్య జమాలున్నీసా బాజి ఇతర కుటుంబ సభ్యులతో కలసి ' నిగార్ ' పత్రికను చదవటం ఆరంభించారు. ఆనాడు నైజాం సంస్థానంలో నిగార్ పత్రిక మీద నిషేధం ఉంది. లక్నోకు చెందిన నియాజ్ ఫతేపూరి సంపాదకత్వంలో నిగార్ పత్రిక వచ్చేది. ఆ పత్రిక ఛాందసత్వానికి, మతమౌఢ్యానికి, మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా పోరాడటమే కాకుండా స్వాతంత్ర్యం, సామ్రాజ్యవాద వ్యతిరేక లక్ష్యాన్ని ముందుకు తీసుక పోవడానికి కృషిచేసింది. అందువల్ల ఈ పత్రిక అత్యంత ప్రమాదకరమైనదని నైజాం ప్రభుత్వం భావించి సంస్థానంలోకి దాని ప్రవేశాన్ని నిషేధించింది. (హైదరాబాదు సంస్థానంలో రాజకీయ చైతన్యం, విద్యార్థి-యువజనుల పాత్ర (1938-1956), ఎస్.ఎం.జవాద్ రజ్వి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1985, పేజి.25)

ఈ నిగార్ ఉర్దూ పత్రిక చదవటం వలన మతపరమైన ఛాందసాలకు వ్యతిరేకంగా, బ్రిటీషర్ల మిత్రుడిగా మారిన నిజాం మీద జమాలున్నీసా తనదైన స్వతంత్ర అభిప్రాయాలను ఏర్పాటు చేసుకున్నారు. ఈ విషయాన్ని వివరిస్తూ, **నేను ఏడో తరగతిలో వున్నప్పటి నుండి ప్రార్థనలు చేసేదాన్ని. ఖురాన్ చదవటం నేర్చుకున్నాను. నమాజ్ చేయటం, 'రోజా' అంటే రంజాన్ పండగప్పుడు ఉపవాసాలు చేయటం ఇవన్నీ చేసేది. కాలేజీ కొచ్చిన తర్వాత ఇవన్నీ మానేశాను. ఈ కర్మకాండలన్నీ మానేశాను. దేవుడు, కర్మకాండలు వేర్వేరనిపించింది. ' నిగార్ ' ప్రభావం ఉండేది,** అని ఆమె స్వయంగా చెప్పుకున్నారు. ఆ అభిప్రాయాల స్థిరత్వానికి ఆమె కుటుంబ వాతావరణం కూడా బాగా తోడ్పడింది. ఆమె అన్నదమ్ములు, అక్కయ్య జమాలున్నీసా కూడా స్వతంత్ర అలోచనలు కలిగిన వ్యక్తులు. ప్రజల పక్షంగా పోరాటలతో పాల్గొన్న ఉద్యమకారులు. ఆనాడు నిజాం మీద వ్యతిరేకతతోపాటుగా, మత సంబంధమైన కొన్ని ఆచార సంప్రదాయాల విషయంలో కూడా సమకాలీన సమాజానికి భిన్నంగా ప్రవర్తించటం వలన రజియా బేగం పలు ఇక్కట్లను ఎదుర్కొన్నారు. ఆ విషయాలను ప్రస్తావిస్తూ, **మమ్ముల్ని కాఫిర్లనేవాళ్ళు. మతద్రోహులమని పిలిచేవాళ్ళ**ని ఆమె చెప్పుకున్నారు. (మనకు తెలియని మన చరిత్ర

(తెలంగాణా రైతాంగపోరాటంలో స్త్రీలు-ఒక సజీవ చరిత్ర), స్త్రీ శక్తి సంఘటన, హైదరాబాద్, 1986, పేజి.173)

తల్లితండ్రులు ఉదార స్వభావులైనప్పటికి సన్నిహిత బంధువర్గం మాత్రం సనాతన సంప్రదాయవాదులు కావటంతో రజియా బేగం, ఆమె అన్నదమ్ములు, ఆమెతో పాటు ఉద్యమాలలో పాల్గొన్న కుటుంబ సభ్యులు పలు ఇక్కట్ల పాలయ్యారు. ఆ ఇబ్బందులను ఏమాత్రం ఖాతరు చేయకుండా తాము నిర్దేశించుకున్న మార్గంలో రజియా బేగం, తన సోదరి జమాలున్నీసా బాజి అన్నదమ్ములు అన్వర్, అఖ్తర్‌లతో కలసి ముందుకు సాగారు. ప్రజలను చైతన్యవంతుల్ని చేయటం ప్రధానాశయంగా సాగిన ఆమె ఆ దిశగా అందివచ్చిన ప్రతి అవకాశాన్ని వినియోగించుకున్నారు.

ఆ విషయాలను రజియా బేగం వివరిస్తూ, **మా కుటుంబం చాలా సంకుచిత స్వభావం కలది. ఒక్క మా తండ్రిగారే ఉదార స్వభావం కలవాడు. మేము పల్లెటూళ్ళో ఉండేది. బాజీ పెళ్ళయ్యిన** (జమాలున్నీసా బాజి) **తరువాత మాకు పట్నంలో ఒక చోటంటూ దొరికింది. మేము ఉర్దూ, పర్షియన్ నేర్చుకున్నాం. ఇంగ్లీషు వచ్చేదికాదు. ఒక గోడపత్రిక ' తమీర్ ' అని ప్రారంభించాం. అంతా చేత్తోనే రాసేవాళ్ళం. మేం చదివి ఇతరులను కూడా చదివించేవాళ్ళం. ఇంగ్లీషు నేర్చుకోవడం ప్రారంభించాను. రెండు డిక్షనరీలు ఉర్దూ-ఇంగ్లీషు-ఉర్దూ పెట్టుకుని నేర్చుకున్నాను. షేక్స్‌పియర్, విక్టర్ హ్యూగో చదివాను. అర్థమయినపుడు యెంతో ఆనందించాను. మెల్లిగా అనువాదాలు చేయడం ప్రారంభించాను. ' ఇవాన్ ' అనే పత్రిక చదవటం మొదలుపెట్టాను. చిన్న చిన్న కథలు రాయటం, తర్వాత ఉస్మానియా జర్నల్‌లో ప్రచురిచటం మొదలు పెట్టాను. ఒక నవల కూడా రాశాను**, అని అన్నారు. (మనకు తెలియని మన చరిత్ర పేజి.173)

ఆ విధంగా స్వయం కృషితో విద్యార్జన వైపు దృష్టిసారించిన రజియా తనకు నచ్చని ఆచారాలను పద్ధతులను ఎంతో ధైర్యంతో వ్యతిరేకించారు. ఆ ప్రయత్నంలో మిత్రులను సంఘటిపర్చి సంఘం ఏర్పాటు చేసి పలు కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు. సాహిత్య కార్యక్రమాల పట్ల అత్యధిక శ్రద్ధచూపారు. ఆ కార్యక్రమాలలో, **యూనుస్ సలీమ్, ముస్లిమ్ జియా, ఇంకా చాలమంది రచయితలు నియాజ్, జాకిర్, హుస్సేన్, సాహిర్, జిగర్, సిద్ధిఖీ లాంటి కవులు వచ్చేవాళ్లు, కొంతమంది మా ఇంట్లోనే వుండేవాళ్లు. సాహిత్యానికి సంబంధించిన కార్యక్రమాలు చాలా జరిగేవి. మేమంతా మార్క్సిస్టు సాహిత్యం**





**చదవలేదు. కాని నిగార్‌లో కొన్ని వ్యాసాలు వచ్చేవి. ఉర్దూ పత్రికలు చాలా ఉండేవి. రాజకీయల సమస్యలు కూడా చాలా చర్చించేది. యుద్ధం , జర్మనీ, హిట్లర్, మొదలైనవి. ఉర్దూ, ఇంగ్లీషు పుస్తకాలు చాలా తెప్పించుకుని ఎన్నో నేర్చుకునే వాళ్ళం**, అని రజియా వివరించారు.

చదువు మీద ఆసక్తిగల రజియా బేగం ఉన్నత చదువులు చదవాలనుకున్నారు. ప్రధానంగా ఆంగ్లం నేర్చుకోవానుకున్నారు. అందుకు ఓ యువకుడ్ని నియమించుకున్నారు. అయితే ఆ ఏర్పాటును సంబంధీకులు వ్యతిరేకించారు. ఈ విషయాన్ని ఆమె సోదరి జమాలున్నీసా బాజి చెబుతూ, **రజియాకు ఇంగ్లీషు చ్పెటానికి ఒక బ్రహ్మణ అబ్బాయి వచ్చేవాడు. మా కుటుంబం అభ్యతంతరం పెట్టింది. బంధువులంతా వెలివేశారు. చాలా కొద్దిమంది అమ్మాయిలు ఆ రోజుల్లో చదువుకునేవాళ్ళు. మా అమ్మ మమ్మలెప్పుడూ సపోర్టు చేసేది. ఒక స్నేహితురాలిలాగా**, అని తల్లితండ్రుల ధోరణిని వివరించారు. ఈ విధంగా తల్లి-తండ్రి ప్రోత్సాహంలో రజియా బేగం యం.ఎ వరకు చదువుకున్నారు. ఆమె చదువు, విముక్తి పోరాటంలో భాగస్వామ్యం పెనవేసుకుని సాగాయి.

అక్క, అన్నదమ్ములతో కలసి ఆమె కూడా జాతీయోద్యంలో భాగస్వాములయ్యారు. ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధుడు మౌల్వీ హస్రత్ మోహాని రజియా బేగం కుటుంబానికి సన్నిహిత బంధువు. ఆయన తరుచు హైదరాబాదుకు రావటమే కాకుండా ప్రపంచ యుద్ధం సమయంలో ఆయన హైదరాబాదులో చాలా కాలం ఉన్నారు. ఆయన ప్రభావం రజియా కుటుంబం మీద ఉండేది. ఆ ప్రభావం నుండి రజియా బేగం తప్పించుకోలేకపోయారు. స్వతహగా స్వేచ్ఛాయుత భావాలు గల ఆమె బ్రిటీషు బానిసత్వం నుండి విముక్తిని కోరుకున్నారు. ఆ కృషిలో భాగంగా ఆమె స్వదేశీ ఉద్యమంలో పాల్గొన్నారు. జాతీయోద్యమ కార్యక్రమాల నిర్వహణకు అవసరమగు నిధులను నాయకులకు అందచేయటంలో చిన్నతనం నుండే బాధ్యతలు నిర్వహించారు. ఈ దిశగా చురుకుగా పనిచేస్తూ కూడా **మొదట్నించీ జాతీయోద్యమంలో వుండేవాళ్ళం. మేమేం చేయడంలేదని ఎప్పుడూ అన్పించేది**, అని రజియా సోరరీమణులు చెప్పుకున్నారు.

ఆ క్రమంలో సాగుతున్న రజియా కుటుంబానికి కమ్యూనిజం పరిచయం కావటంతో ప్రజల పక్షాన నిలచి పోరాడే స్వభావం గల రజియా అక్కచెళ్ళల్లు కమ్యూనిస్టు పార్టీ వైపుకు మొగ్గుచూపారు. ఆ పరిచయం మరింత ముందుకు వెళ్ళింది. ఆ విషయాన్ని

వివరిస్తూ, **1941లో అభ్యుదయ రచయితల సంఘం అని ఒకటి వుండేది. మఖ్దూం, నజర్ హైదరాబాద్ ఎప్పుడూ వస్తూండేవారు. మేం నలుగురు అక్కచెల్లెళ్ళం. ఈ మీటింగులకి బహిరంగంగా వెళ్ళేవాళ్ళం. అమ్మకూడా వచ్చేది. కొంతమంది చిల్‌మన్ల (చాటున) వెనుక కూర్చునేవాళ్ళు...సజ్జాద్ జహీర్, ఓంకార్, పర్వాద్ లాంటి వాళ్ళు చాలా మంది అండర్‌గ్రౌండ్‌లో వున్నప్పుడు మా యింట్లో వుండేవాళ్ళు**, అని పేర్కొన్నారు.

ఆ పరిచయాల కారణంగా ఏర్పడిన నూతన అభిప్రాయాల వలన రజియా బేగం కుటుంబం 1942 నాటి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన లేదు. అయితే క్విట్ ఇండియా ఉద్యమం పట్ల సానుభూతి ఉండేదని ఆమె స్వయంగా వెల్లడించారు. 1942 ప్రాంతంలో కమ్యూనిస్టు పార్టీ మీద నిషేదం విధించిన సందర్భంగా కూడా రజియా బేగం రహస్యంగా కమ్యూనిస్టుల కార్యకలాపాలకు తొడ్పాటు అందించారు. నిజాం సంస్థానంలో కాంగ్రెస్ పార్టీ నాయకులే పలు ఇక్కట్లు పడుతుండగా, నిషేదిత కమ్యూనిస్టు పార్టీ సానుభూతిపరులుగా మరిన్ని కష్టాలు పడాల్సిన భయానక వాతావరణంలో కూడా రజియా బేగం కుటుంబం కమ్యూనిస్టు ఉద్యమకారులకు చేయూత నిచ్చారు.

ఈ కార్యక్రమాలను కొనసాగిస్తూనే 1944లో రజియా బేగం యం.ఎ పూర్తి చేశారు. చదువుకుంటూనే ఆమె తన సోదరి జమాలున్నీ బాజీలో కలసి జాతీయోద్యమ కార్యక్రమాలు, కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమాలలో రహస్యంగా పాల్గొటూ వచ్చారు. చివరకు భారతీయులు స్వరాజ్యాన్ని సాధించుకున్నాక వెనువెంటనే ఆరంభమైన ఇండియన్ యూనియన్‌లో నైజాం విలీనం కోసం సాగిన పోరాటంలో తనదైన పాత్ర వహించారు. ఆ పోరాటం అంతిమ దశకుచేరుతున్న సందర్భంగా అంకురించిన తెలంగాణ పోరాటంలో రజియా బేగం కుటుంబం యావత్తు పాల్గొంది. ఆమె సోదరి జమాలున్నీసా బాజి, ఉద్యమకారులైన తన అన్నదమ్ములు అన్వర్, అఖ్తర్ ఇతర సన్నిహిత బంధువులు కూడా తెలంగాణ పోరాటంలో ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ పాత్రధారులయ్యారు.

ఈ సందర్భంగా రజియాబేగం పోలీసుల దాష్టీకాలను ఎదుర్కొన్నారు.పలు మార్లు అరెస్టులకు గురయ్యారు. జైలులో కూడా గడిపారు. ఈ విషయాన్ని ఆమె ప్రస్తావిస్తూ, **ఆ రోజుల్లో చాలా మంది కామ్రేడ్లతో పోరాటం గురించి మాట్లాడేదాన్ని, జైల్లోవున్నప్పుడు, ఒక స్త్రీ కామ్రేడ్‌తో మాట్లాడేదాన్ని. ఒక డైరీ కూడా రాసేదాన్ని. ఆది దొరికితే ఇంకా**





**చాలా వివరాలు తెలుస్తాయి. నాకొక గది ఉండేది**, అని ఆమె అన్నారు. ఆనాడు తెలంగాణ పోరాటయోధులు రావి నారాయణ రెడ్డి నాయకత్వంతో రజియా తన సోదరి– సోదరులతో కలసి పాల్గొన్నారు. నాయకుల ఆదేశాలను తు.చ తప్పక పాటిస్తూ, ఆడమగ భేదం లేకుండా ఎటువంటి ప్రమాదకర పని అప్పగించినా, ఏ తెలియని ప్రదేశానికి వెళ్ళిరమ్మని పంపినా ఏమాత్రం అధైర్యపడకుండా ఎంతో సాహసంతో ఆ బాధ్యతలు రజియా బేగం నిర్వర్తించారు.

ఉద్యమకార్యక్రమాలలో భాగంగా పోరాట యోధులకు ఆశ్రయం కల్పిచటం, ఆయుధాలను దాచి పెట్టటం, ఉద్యకారులకు అందచేయటం, ఉద్యమకారులకు సమాచారాన్ని చేరవేయటం తదితర పనులను తమ ఇంటిని, ఆ పరిసర ప్రాంతాలను కేంద్రంగా చేసుకుని రజియా బేగం నిర్వహించారు. ప్రముఖ కమ్యూనిస్టు నేతలు డాక్టర్ మహేంద్ర, రావి నారాయణ రెడ్డి, మఖ్దూం మొహిద్దీన్, రాజ్ బహుద్దూర్ గౌడ్, జవ్వాద్ రజ్వీ తదితరులకు ఆమె ఇంట్లో ఆతిధ్యం, ఆశ్రయం లభించింది. ఆ ఆశ్రయం నుండి నాయకులను మరింత సురక్షిత ప్రాంతాలకు చేరవేయటం లాంటి కార్యక్రమాలను పోలీసుల నిరంతర నిఘా నీడల్లో కూడా రజియా సమర్థవంతంగా నిర్వహించారు.

1951 ప్రాంతంలో తెలంగాణ సాయుధ పోరాటాన్ని విరమించాలా? కోనసాగించాలా? అను అంశం చర్చనీయాశంమైంది. ఆ సమయంలో, **అఖ్తర్, గోపాలన్ ( ఎ.కె. గోపాలన్), జ్యోతిబసు, ముజఫర్ అహమ్మద్‌తో ఏర్పడిన డెలిగేషన్ ఒకటి వచ్చి– 1951లో సాయుధ పోరాటం కొనసాగించాలా? విరమించాలా? అనే విషయం చర్చించడానికి వచ్చారు... ఆ విషయం గురించి చాలా రాత్రి వరకు మీటింగులు, చర్చలు జరిగేవి** అని ఆమె వివరించారు. ఈ విషయంలో తన తండ్రి ఎంతో సహకరించారని విచ్చన నాయకులకు రజియా కుటుంబం తమ ఇంటి ముందు గల గృహంలో బస ఏర్పాట్లు చేశారని ఆమె వెల్లడించారు.

తెలంగాణ పోరాటం ముగిశాక పార్టీలో కొంత మేరకు స్తబ్దత ఏర్పడింది. ఆ తరువాత ఎన్నికలు రావటంతో రజియా ఆ కార్యక్రమాలలో నిమగ్నమయ్యారు. సోదరి జమాలున్నీసా బాజితో కలసి ఆమె ఎన్నికల ప్రచారంలో చురుకుగా పాల్గొన్నారు. చదువు మీద, మహిళా అభ్యున్నతి కార్యక్రమాల మీద ఎక్కువగా దృష్టి సారించారు. మహిళలు ఆర్థికంగా స్థిరపడేందుకు వివిధ వృత్తులలో శిక్షణ, మహిళలలో చైతన్యం కలిగించేందుకు

రాత్రి బడులు, గ్రంథాలయాలు ఏర్పాటు, ప్రగతిశీల సాహిత్యం చదివించటం, ఆయా అంశాల మీద చర్చలు జరపటం ఈ కేంద్రాలలో జరిగేది. ఈ కేంద్రాలకు ప్రమీలా తాయి లాంటి ప్రముఖులు విచ్చేశారు. ప్రముఖ కమ్యూనిస్టు నేతలు రజియా బేగం కుటుంబంలోని మహిళలు పలు మహిళా కేంద్రాలను ప్రారంభింప చేసి ఆ కార్యక్రమాలను ముమ్మరం చేశారు. ఆ కార్యక్రమాలలో భాగంగా కలకత్తా, ఢిల్లీ లాంటి ప్రాంతాలతో జరుగు అఖిల భారత మహిళా సంఘాల సమావేశాలలో ఆమె పాల్గొంటూ మహిళా ఉద్యమాలకు చేయూతనిచ్చారు.

చిన్నప్పటి నుండి రచనా వ్యాసాంగం మీద అధిక ఆసక్తి చూపిన రజియా బేగం 1944 ఎం.ఏ చేసి వుమెన్స్ కాలేజిలో లెక్చరర్ అయ్యారు. ఆ తరువాత 1966లో యూనివర్సిటీ ఆర్ట్స్ కాలేజిలో చేరారు. పర్షియన్‌లో పి.హెచ్.డి ఇరాన్‌లో చేశారు. సరోజిని నాయుడు కుమార్తె లీలామణి నాయుడుతో కలసి కాలేజీలో సాహిత్య గోష్ఠులు జరుపుతూ ఔత్సాహిక కవులకు-రచయితలకు తోడ్పాటు అందించారు. తెలంగాణ సాయుధ పోరాట కార్యక్రమాల తరువాత రజియాకు రాజకీయాల పట్ల అసక్తి తగ్గుముఖం పట్టింది. ఆ సమయంలో ఆమె తండ్రి రిటైర్ కావడంవల్ల, మిగతా వాళ్ళంతా పార్టీలో పని చేస్తుండటం వల్ల ఆమె కుటుంబ భారాన్ని మోయాల్సి వచ్చింది. ఆర్థికంగా స్థిరపడి కుటుంబ భారాన్ని మోస్తున్నప్పటి పురుషులతో సమానమన్పించకపోవటంతో ఆమె ఆవేదనకు గురయ్యారు. ఈ విషయాన్ని మరింత విస్తారంగా వివరించారు.

**ఇంట్లో అంతా తోడ్పడేవాళ్ళు. పురుషులు కూడా కొంత పనిచేసేవాళ్ళు. పిల్లలు కూడా కొంత చేసేవాళ్ళు. అయినప్పటికీ కొంత మన బాధ్యతే అన్పిస్తుంది. కొన్ని కారణాలు పరిశీలించాలి. స్త్రీగా వుండటమనేది ఒకటి. యుగాల నుంచి వస్తున్న సాంఘిక వ్యవస్థ ఆమెను తక్కువ స్థాయిలో వుంచింది. ఆర్థిక స్వాతంత్ర్యం వున్నప్పటికీ, స్త్రీ పురుషుని కంటే తక్కువగానే భావిస్తుంది. అతని మీదే ఆధారపడుతుంది. స్త్రీ ఒంటరిగా ఉండటం మనేటటువంటి భయం ఘోరమైంది, ప్రపంచమంతటా వుంది. ఆమె తను ఒంటరిగా బయటకెళ్ళడానికి భయపడతారు, పురుషులైతే ఒంటరిగా వెళతాడు, ఎవరూ బాధించరు. పురుషుడికి స్వేచ్ఛవుంది. స్త్రీలను ఏ విధంగా చూస్తారనే దాని గురించి పుస్తకాలు రాస్తున్నారు. ఈ బంధాలెలా తెంచుకుంటామనేది చూడాలి. సిండరెల్లా అనే చక్కని పుస్తకంలో, స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం ఉన్నప్పటికి ఇంకా విముక్తి పొందకుండా వుండటమనే**





**సమస్య గురించి చర్చించారు. ఆ రోజుల్లో ఆర్థిక స్వాతంత్ర్యమే ముఖ్యమైన సమస్య అనుకునేవాళ్ళం. నేను చదువుకుని, సంపాదించి ఎవరి మీద ఆధారపడకుండా వుంటానని నిర్ణయించుకున్నాను. నాన్నకు చెప్పాను, ఆయన ఏమీ అభ్యంతరం పెట్టలేదు, కాని బంధువులు విమర్శించారు. తర్వాత కూడా పెళ్ళి గురించి ఆలోచించలేదు. నాపనిలో నిమగ్నురాలినై, దాని గురించి ఆలోచించలేదు. బహుశ సరియైన సమయంలో ఎవరూ కనిపించలేదేమో! అన్ని సంబంధాలు కూడా వరకట్నం, బేరాలతో నియమించబడేవి. అవంటే అసహ్యం వచ్చి, ఎవరితోటీ ఆ విషయం గురించి మాట్లాడకపోయేది. నాన్న కూడా వాటిని వ్యతిరేకించేది. మా కుటుంబంలో చాలా మంది పెళ్ళిళ్ళు చేసుకోలేదు.**

ఈ వాక్యాలు ఆమెలోని విప్లవాత్మక భావాలకు అద్దం పడతాయి. ఆ అభిప్రాయాలతో స్నేహం చేసిన రజియా బేగం చివరి వరకు వివాహం చేసుకోలేదు. చిన్న వయస్సు లోనే జాతీయోద్యమం, ఆ తరువాత కమ్యూనిస్టు ఉద్యమం, ఆ క్రమంలో ఇండియన్ యూనియన్‌లో నైజాం విలీనోద్యమం, అటు తరువాత తెలంగాణ సాయుధ పోరాటం, కమ్యూనిస్టు ఉద్యమంలో పాల్గొన్న యోధురాలు రజియా బేగం ఉద్యమాల చరిత్రలో తనదైన ప్రత్యేక స్థానాన్ని సొంతం చేసుకున్నారు.

(ఈ వ్యాసం ప్రధానంగా 1986లో స్త్రీ శక్తి సంఘటన (హైదరాబాద్) ప్రచురించిన **' మనకు తెలియని మన చరిత్ర (తెలంగాణా రైతాంగపోరాటంలో స్త్రీలు-ఒక సజీవ చరిత్ర) '** గ్రంథంలోని రజియా బేగం ఆమె సోదరి జమాలున్నీసా బాజి తమ ఇంటర్యూలో చెప్పిన సమాచారం ఆధారంగా రూపొందించటం జరిగింది. ఆ గ్రంథం సంపాదకులు, ప్రచురణకర్తలకు నా ధన్యవాదాలు. - రచయిత)

◆◆◆

ఆ మహిళ (ఆకుపచ్చ దుస్తుల) యోధైరాలు)అద్వితీయ ధైర్యశాలి. ఆమెకు మృత్యుభయం ఏ మాత్రం లేదు. ఫిరంగులు గర్జిస్తున్నా, తుపాకులు గుండ్లను వర్షిస్తున్నా అత్యంత ధైర్యశాలి అయిన సైనికుడి మల్లే ఆమె తుపాకి గుండ్ల వర్షంలో నింపాదిగా నడిచి వెళ్ళేది. ఆమెను కొన్ని సార్లు నడిచి వస్తుంటే చూశాం. మరికొన్నిసార్లు గుర్రం మీద స్వారి చేస్తూ చూశాం. ఖడ్గవిన్యాసంలో, గురి తప్పకుండా తుపాకి పేల్చటంలో ఆమె మంచి నేర్పరి. ఆమె ధైర్య సాహసాలను చూసి ప్రజలలో ఉత్సాహం ద్విగుణీకృతమయ్యేది.

**- ప్రత్యక్ష సాక్షుల కథనం**



## విభజన బాధితులను ఆదుకున్న ఆపద్బాంధవి

# అనిస్ బేగం కిద్వాయ్

**(1906-1982)**

**ప**రాయి పాలకులను ప్రాలదోలేందుకు కుటుంబాలకు కుటుంబాలు పాటుపడిన వైనం స్వాతంత్ర్యోద్యమం పట్ల భారతీయులలో నిబిఢీకృతమైఉన్న నిష్టకు-నిబద్ధతకు రుజువు. ఆ కుటుంబాలలో నెహ్రూ కుటుంబం, తయ్యాబ్జీ కుటుంబం, ఫైజీ కుటుంబం, కిచ్లూ కుటుంబం, కిద్వాయ్ కుటుంబం లాంటి కొన్ని కుటుంబాలను ప్రధానంగా పేర్కొనవచ్చు. ఆ కుటుంబాలు అద్వితీయ త్యాగాలతో స్వాతంత్ర్యోద్యమం చరిత్రలో తమదంటూ ప్రత్యేకతను సంతరించుకున్నాయి. అటువంటి చరిత్ర కలిగిన కిద్వాయ్ కుటుంబ సభ్యురాలు అనిస్ బేగం కిద్వాయ్.

ఉత్తర ప్రదేశ్‌లోని బారాబంకిలోని షేక్ విలాయత్ అలీ ఇంట అనిస్ బేగం 1906లో జన్మించారు. తండ్రి విలాయత్ అలీ న్యాయవాది. ఆయన బ్రిటీషు ప్రభుత్వ వ్యతిరేకి. ఆంగ్లేయులకు అండగా నిలచిన అలీఘర్ మేధావులతో సరిపడని వ్యక్తి. హిందూ-ముస్లింల ఐక్యతను ఆకాంక్షించే సమరయోధులు. భారత జాతీయ కాంగ్రెస్-ముస్లింలీగ్‌ల మధ్య సయోధ్యను కోరుకున్న ప్రముఖులు. (Rafi Ahamed Kidwai, Dr.M.Hashim Kidwai, Govt. of India Publications, NewDelhi,1986, Page. 24-25)

చిన్నతనం నుండి బేగం అనిస్ తండ్రితోపాటుగా రాజకీయ, సాహిత్య సభలు,





సమావేశాలకు హాజరవుతూ తండ్రి నుండి బ్రిటీష్ వ్యతిరేకతను సంతరించుకున్నారు. ఆయన మౌలానా ముహమ్మద్ అలీ సంపాదకత్వంలోని **కామ్రేడ్**, రాజా గులాం హుస్సేన్ సంపాదకత్వంలోని **న్యూ ఎరా** పత్రికలలో ప్రత్యేక వ్యాసాలు రాశారు. తండ్రి నుండి రాజకీయ, సాహిత్య పరిజ్ఞానాన్ని, దేశభక్తి భావనలను ఆమె చిన్నతనంలోనే పుణికి పుచ్చుకున్నారు.

ఆ కుటుంబం రాజకీయంగా ఎలా ఉన్నా విద్యావిషయంలో మాత్రం సర్ సయ్యద్ అహమ్మద్ మార్గదర్వకత్వంలో మగ పిల్లలందరికి ఆంగ్ల చదువులు చెప్పించి, ఆడపిల్లలను మాత్రం దూరంగా ఉంచింది. అనిస్ బేగం సోదరులకు విద్యగరిపేందుకు ట్యూటర్లను ఏర్పాటు చేశారు. ఆ సందర్భంగా ఆమె కూడా సోదరులతో కలసి కూర్చొని ఉర్దూ, ఇంగ్లీషు భాషలను నేర్చుకున్నారు తప్ప ప్రత్యేకంగా ఆమె చదువుకోలేదు. ఆమె 12 సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడు తండ్రి ఇనాయత్ అలీ కన్నుమూశారు. ఆ కారణంగా ఆమెకు చదువుకునే అవకాశాలు లేకుండా పోయాయి.

ఆమె తమ సన్నిహిత బంధువు షఫీ అహమ్మద్ కిద్వాయ్‌ను వివాహం చేసుకున్నారు. షఫీ అహమ్మద్ ప్రముఖ జాతీయోద్యమకారుడు రఫి అహమ్మద్ కిద్వాయ్ తమ్ముడు. అన్నతోపాటుగా షఫీ అహమ్మద్ కూడా బ్రిటీషు వ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొన్నారు. సహాయనిరాకరణ ఉద్యమం సందర్భంగా తాను చేస్తున్న ప్రభుత్వ ఉద్యోగానికి రాజీనామా చేసి రఫి అహమ్మద్ కిద్వాయ్‌తో కలసి ఖిలాఫత్-సహాయ నిరాకరణ ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. ఆయన ముస్లింలీగ్ రాజకీయాలకు వ్యతిరేకి. హిందూ- ముస్లింల ఐక్యతకోసం నిరంతరం కృషి చేసిన ప్రముఖులు. (Rafi Ahamed Kidwai : Page. 34-35)

చిన్ననాటనే తండ్రి నుండి జాతీయ భావాలను సంతరించుకున్న అనిస్ బేగంకు బ్రిటీషు వ్యతిరేక భావాలు గల భర్త లభించటం, అటు పుట్టింటివారు, ఇటు అత్తింటివారు వారు కూడా జాతీయోద్యమకారులు కావటంతో ఎంతో ప్రోత్సాహం లభించింది. ఆ ప్రోత్సాహంతో ఉద్యమకార్యక్రమాలలో ఆమె మరింతగా నిమగ్నమయ్యారు. బావ, భర్త ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమాలలో అగ్రగాములుగా నిలచి పోరుబాట సాగటంతో అనిస్ బేగంకు పోలీసుల బెడద తప్పలేదు. కుటుంబంలోని ఆర్జనాపరులు ఉన్నత ఉద్యోగాలను వదలుకుని ఉద్యమబాట పట్టడంతో ఆర్థిక ఇబ్బందులు కూడా అనిస్ బేగంను చుట్టుముట్టాయి. ఆనాడు రాజకీయంగా దృఢమైన అభిప్రాయాలు గల అనిస్‌ను అటు పోలీసులుగాని ఇటు ఆర్థిక ఇబ్బందులుగాని ఏమీ చేయలేకపోయాయి. ఆమె


సాహిత్య అకాడమీ అవార్డు అందుకుంటున్న అనీస్ కిద్వాయ్

చివరికంటా స్వరాజ్యం సాధించేందుకు ముందుకు సాగారు. ఆ కుటుంబం ఆకాంక్షించిన స్వరాజ్యం సిద్ధించింది. ఆశించని విధంగా భారత దేశ విభజన జరిగింది. ఆ సందర్భంగా కిద్వాయ్ కుటుంబం వ్యాకులతకు లోనైంది. ఆ బాధ నుండి తేరుకునేలోపుగా అనిస్ మీద పెను ఉప్పెన విరుచుక పడింది. ఆమె భర్త షఫీ అహమ్మద్ కిద్వాయ్ దారుణ హత్యకు గురయ్యారు. ఆది నుండి హిందూ-ముస్లింల ఐక్యతను కోరుకుంటూ మతోన్మాదాన్ని అన్ని విధాల ఎదుర్కొన్న షఫీ అహమ్మద్‌ను మతోన్మాద జ్వాలలు బలితీసుకున్నాయి. ఆ సమయంలో ఆయన ముస్సోరి మున్సిపల్ బోర్డులో కార్యనిర్వాహక అధికారిగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. ఆ ప్రాంతంలోని హిందూ-ముస్లింల మధ్యన సామరస్యం కోసం నిరంతరం తపనపడ్డారు. ఆ దిశగా మహాత్మాగాంధీ మార్గదర్శకత్వంలో ఎంతో కృషి సల్పారు. అటు వంటి హిందూ-ముస్లిం ఐక్యతాభిలాషిని విభజన నేపథ్యంలో వెల్లువెత్తిన మతోన్మాదం పొట్టనపెట్టుకుంది.

ఆ సంఘటనతో అనిస్ బేగం చలించిపోయారు. ఏ మతోన్మాద రాక్షసి నుండి ప్రజలను కాపాడాలని ఆ దంపతులు నిరంతరం పనిచేశారో ఆ ఉన్మాదానికి ఆమె భర్త బలయ్యారు. ఆ పరిస్థితి ఆమెలో సరికొత్త ఆలోచనలకు కారణమైంది. ఈ మతోన్మాద భూతం ఎంతమందిని బలితీసుకుంటుదోనని ఆమె తపించిపోయారు. ఆ విధంగా సన్నిహితులను కోల్పోయిన కుటుంబాల పరిస్థితి ఏమిటన్న ప్రశ్న ఆమెను నిలువనివ్వలేదు. ఆ సమయంలో ఢిల్లీలో ఉన్న మహాత్మా గాంధీ వద్దకు వెళ్ళారు.

ఆనాడు దేశమంతా విభజన వాతావరణంతో ప్రజ్వరిల్లుతుంది. కుటుంబాలకు కుటుంబాలు అటు,ఇటు వెడుతున్నాయి. అమాయకులు రాక్షస ఉన్మాదానికి బలవుతున్నారు. ఈ పరిస్థితుల చేదు అనుభవాలను ప్రధానంగా మహిళలు, పిల్లలు వృద్ధులు ఎదుర్కొంటునా1్నరు. ఉన్మాదుల రక్తదాహానికి, భయానక చేష్టలకు మహిళలు బలవుతున్నారు. కూడు,గూడు లేక అల్లాడిపోతున్నారు. ఆ పరిణామాల నేపథ్యంలో





అనిస్ బేగం ఓ నిర్ణయానికి వచ్చారు. ఆ నిర్ణయానికి అనుగుణంగా శరణార్థులుగా మారిన హిందూ-శిక్కు భాధిత మహిళలకు, పిల్లలకు రక్షణ కల్పించి ఆశ్రయమిచ్చి ఆదుకునేందుకు కృషిచేయాల్సిందిగా మహాత్మాగాంధీ ఆదేశించారు. ఆయన ఆదేశాలను శిరోధార్యంగా భావించి సుభద్రా జోషి, మృదులా శారాబాయిలతో కలసి అనిస్ బేగం రంగంలోకి దిగారు.

విభజన సృష్టించిన సంక్షోభం వలన విలవిల్లాడుతున్న వేలాది మహిళలను చేరదీశారు. ఆ బాధిత మహిళలకు ధైర్యం చెప్పి శరణార్థుల శిబిరంలో ఆశ్రయం కల్పించారు. తల్లి తండ్రులను కొల్పోయిన యువతులు, భర్తలను పోగొట్టుకున్న మహిళలు, కిడ్నాప్, అత్యాచారాలకు బలైన ఆడపడుచుల సమాచారాన్ని సేకరించటం వారి కోసం అన్వేషణ సాగించటం, దొరికిన వారిని వారివారి బంధువుల వద్దకు చేర్చటం, లేనివారిని శరణార్థి శిబిరాలకు పంపించే కార్యక్రమాలలో అనిస్ బేగం అవిశ్రాంతగా శ్రమించారు.

ఈ కార్యక్రమాలలో భాగంగా ఆమె లక్నోలో ప్రత్యేక శిబిరం ఏర్పాటు చేశారు. ఈ శిబిరంలో అవసరార్థులను, అభాగ్యులను చేర్చుకుని వారి వారి స్థానాలకు వారు భద్రంగా చేరేంత వరకు వారికి ఆశ్రయం,రక్షణ కల్పించారు. మతోన్మాద రాక్షసి బారిన పడి భయవిహ్వాలులైన మహిళలకు ధైర్యం చెబుతూ వారిలో ఆత్మస్థైర్యం పెంపొందించేందుకు కృషి సల్పారు. శరణార్థుల పట్ల చూపుతున్న ప్రేమాభిమానాల వలన బాధితులకు ఆమె **అనిస్ ఆపా** (అనిస్ అక్కయ్య) అయ్యారు.

ఈ మేరకు ఆమె అందించిన సేవలకు గుర్తింపుగా అమెను రాజ్యసభకు ఎంపికయ్యారు. రాజ్యసభ సభ్యురాలుగా 1957 నుండి 1968 వరకు బాధ్యతలను నిర్వహించారు. ఈ సందర్భంగా మహిళల సంక్షేమం కోసం పలు సూచనలు చేశారు. ఆ దిశగా సంఘాలు, సంస్థలకు క్రియాశీలక సహకారమందించారు.

భారత విభజన అనుభవాలను Azadi Ki Chaon Mein పేరుతో అక్షరబద్ధం చేశారు. మతోన్మాదం సాగించిన రాక్షసత్వాన్ని వివరిస్తూ Zulum పేరుతో మరో గ్రంథాన్ని Ab Jinke Dekhne అను మరో పుస్తకాన్ని కూడా ఆమె రాశారు. ఆమె రాసిన వ్యాసాలు 1976లో Nazre Khush Guzre శీర్షికతో ప్రచురితమయ్యాయి. ఆమె సాహిత్య కృషికి ప్రతిఫలంగా సాహిత్య ఆకాడమీ ఆవార్డు కూడా లభించింది.

ఈ మేరకు రాజకీయం, సాహిత్యం,సేవా రంగాలలో అపూర్వ సేవలందించి మాతృభూమి రుణం తీర్చుకునేందుకు అవిశ్రాంతంగా శ్రమించిన అనిస్ బేగం కిద్వాయ్ 1982 జూలై 16న కన్నుమూశారు.

◆◆◆



## భారత దేశంలో తొలి మహిళా మంత్రిగా  చరిత్ర సృష్టించిన

# మాసుమా బేగం

**(1902-1990)**

**జా**తీయోద్యమంలో భాగస్వాములవటంతో పాటు స్వతంత్ర భారత ప్రభుత్వంలో కూడా బాధ్యతలు నిర్వహించగల అవకాశాలు దక్కించుకొన్న స్వాతంత్ర్యసమరయోధులు కొద్దిమంది మాత్రమే. ఆ అరుదైన అవకాశంతో పాటుగా పదవులు పొందిన పదిమందిలో ప్రథమంగా నిలచి చరిత్ర సృష్టించుకున్న భాగ్యాన్ని దక్కించుకున్న వారు అతికొద్దిమంది. ఆ అతికొద్దిమంది అదృష్టవంతుల్లో ఒకరు మాసుమా బేగం.

**ఆంధ్రప్రదేశ్ తొలి మంత్రి వర్గంలో తొలి మహిళా మంత్రి, తొలి ముస్లిం మంత్రి, మొత్తం భారత దేశంలోనే మంత్రిపదవిని నిర్వహించిన తొలి ముస్లిం మహిళ** మాసుమా బేగం 1902లో ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాద్‌లో జన్మించారు. తల్లి పేరు  తయ్యిబా బేగం(Tayyiba Begum). తల్లి మంచి విద్యావంతురాలు. **అమె భారత దేశంలోనే తొలి ముస్లిం పట్టభద్రురాలు.** తండ్రి పేరు ఖదీవ్ జంగ్. (Khedv Jung) తాత సయ్యద్ హుస్సేన్ బిల్‌గ్రామి(Syyid Husain Bilgrami).

ఆచార, సంప్రదాయ కుటుంబంలో పుట్టిన మాసుమా బేగం, ఆమె చెల్లెల్లు హైదరాబాద్ లోని మహబూబియా బాలికల పాఠశాలలో విద్యాభ్యాసం చేశారు. ఆమె





తండ్రి  వైద్యశాఖలో ఉప డైరక్టరుగా పనిచేశారు. ఆమె సోదరుడు అలీ యావర్ జంగ్ హైదరాబాదులో విద్యామంత్రిగా వుండి, తరువాత ఈజిప్టు, యగోస్లోవియాలలో భారత రాయబారి పదవి నిర్వహించారు. ఆమె వంశంలోని అకిల్ జంగ్ పి.డబ్ల్యూ.డి మంత్రి గానూ, ఆమె దగ్గరి బంధువు మోహీద్దీన్ యార్‌జంగ్  మంత్రి పదవులను నిర్వహించారు. ఆమె సన్నిహిత బంధువులంతా ఉన్నత విద్యావంతులుగాని ఉన్నత పదవులు నిర్వహించినవారు గాని కావటంతో పరిపాలనా దక్షత ఆమెకు ఉగ్గుపాలతో పెట్టినట్లయ్యింది.

1922లో  ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో చదివిన సమీప బంధువు హుసైన్ అలీ ఖాన్‌ను మాసుమా బేగం వివాహం చేసుకున్నారు. ఆతరువాతి కాలంలో ఆయన ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆంగ్ల విభాగం అధిపతిగా పనిచేశారు. ఆయన డాక్టర్ బూర్గుల రామకృష్ణారావు లాంటి ప్రముఖులకు గురువుగా గణనకెక్కారు. అంతటి విద్వత్తు, స్వతంత్ర, ఉదార భావాలు గల వ్యక్తి భర్తగా లభించటంతో చిన్నతనం నుండి సమాజ సేవా కార్యక్రమాల పట్ల ఆసక్తి చూపిన మాసుమా బేగం ఆ బాటలో ఇనుమడించిన ఉత్సాహంతో సాగగలిగారు.

తల్లితండ్రులు విద్యావంతులు కావటం, భర్తకూడా మంచి పండితుడు కావటంతో మాసుమా బేగం విద్యావ్యాప్తి పట్ల దృష్టిసారించారు. మహిళల్లో చైతన్యాన్ని చదువు ద్వారా సాధించవచ్చుని, సమస్యల పరిష్కారానికి విద్య ఇతోధికంగా తోడ్పడుతుందని ఆమె అభిప్రాయపడ్డారు. సమాజసేవా కార్యక్రమాల నిర్వహణ ద్వారా లభించిన అనుభవం మేరకు అన్ని సామాజిక రుగ్మతలకు నిరక్షరాస్యత ప్రధాన కారణమని భావించిన ఆమె ఆ రంగాన్ని ఎంచుకున్నారు.

1921లో విద్యావ్యాప్తి ప్రధాన లక్ష్యంగా గల అంజుమన్‌కు అధ్యక్షులు గా ఆమె ఎన్నికయ్యారు. భర్త అనుమతి, ప్రోత్సాహంతో  విద్యావ్యాప్తి కోసం మాత్రమే కాకుండా  సంఘసేవా కార్యక్రమాలలో, సామాజిక రుగ్మతల నివారణకు చురుకుగా పాల్గొన్నారు. పలు విద్యా, సాంఘికసేవా సంస్థల ఏర్పాటుకు కృషిచేయటమేకాకుండా ఆయా సంస్థలలో క్రియాశీలక పాత్ర నిర్వహించారు. ప్రధానంగా మహిళా సంఘాల కార్యక్రమాలకు ఎక్కువ సమయాన్ని కేటాయించారు.

1927లో  అఖిల భారత మహిళా సంస్థకు హైదరాబాద్‌లో శాఖను ఏర్పాటు

చేశారు. ఆ శాఖకు ప్రధాన కార్యదర్శిగానూ, అధ్యక్షురాలిగాను ఆమె బాధ్యతలు నిర్వహించారు. ఆ సందర్భంగా మహిళలచే అఖిల భారత మహిళా సంస్థ శాఖలను ప్రారంభింపచేసి ఆ సంస్థ కార్యకలాపాలను పర్యవేక్షించారు. ఈ మేరకు ఆమె నిర్వహించిన సేవలకు గుర్తింపుగా ఆమెకు అఖిల భారత మహిళా సంస్థ ఉపాధ్యక్ష పదవి లభించింది. ఆ హోదాలో ఆమె పలు ప్రాంతాలను విస్తృతంగా పర్యటించారు.

సంఘ సేవాకార్యక్రమాల నిర్వహణలో అవిశ్రాంతగా శ్రమిస్తూ కూడా ఆమె ఆనాటి రాజకీయల మీద దృష్టిసారించారు. జాతీయ సేవాభావాలు గల ఆమె భారత జాతీయ కాంగ్రెస్ కార్యక్రమాల పట్ల ఆసక్తి చూపారు. జాతీయోద్యమంలో భాగంగా ఉనికిలోకి వచ్చిన పలు సంస్థల్లో కార్యక్రమాలలో ఆమె సభ్యురాలిగా పాల్గొన్నారు. ఈ మేరకు అటు సమాజ సేవా కార్యక్రమాల ద్వారా, ఇటు రాజకీయ కార్యక్రమాల వైపు మొగ్గు చూపిన కారణంగా అటు ప్రజల ఇటు రాజకీయ ప్రముఖుల మన్నన పొందారు.

ఆ కారణంగా స్వతంత్ర భారతదేశం అవతరించాక 1952 లో తొలిసారిగా జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో మాసుమా బేగంను కాంగ్రెస్ అభ్యర్థిగా ఎంపిక చేశారు. ఆమె షాలిబండ అసెంబ్లీ నియోజకవర్గం నుండి ఎన్నికల బరిలో దిగారు. ప్రముఖ కవి, కమ్యూనిస్టు పార్టీనాయకుడు, కార్మికనేత మగ్దూం మోహిద్దీన్ ఆమె ప్రత్యర్థి. ఆయన పీపుల్స్ డెమాక్రటిక్ ఫ్రంట్ అభ్యర్థిగా పోటీ చేశారు. ఆ ఎన్నికలలో ఏడు వందల 74 ఓట్ల ఆధిక్యతతో మాసుమా బేగం విజయం సాధించారు.

ఆ తరువాత 1957లో మరోసారి అసెంబ్లీ ఎన్నికలకు కాంగ్రెస్ అభ్యర్థిగా ఆమె పోటీ చేసి గెలిచారు. ఈ సారి ఫత్తర్‌ఘట్టీ అసెంబ్లీ నుండి ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు అక్తర్ హుస్సేన్ ను 513 ఓట్ల ఆధిక్యతతో పరాజితుల్ని చేశారు. ఈ ఎన్నికల సందర్భంగా ఆమె నిర్వహించిన ప్రచారం తీరు కూడా ప్రజలను బాగా ఆకట్టుకుంది. ప్రచారంలో ప్రత్యర్థుల కంటే ఆమె ముందుండటం విశేషం. ప్రతిరోజు వేకువ ఝూమున ప్రచారానికి బయలు దేరి ప్రత్యర్థులు ప్రచారానికి జనంలోకి వచ్చేలోగా ఆమె తన ప్రచారాన్ని ముగించటం విశేషం. (Secluded Scholors, Gail Minault, OUP, New Delhi, 1999, Page.272-273). ముస్లిం మహిళ అయిఉండి కూడా ప్రచార కార్యక్రమంలో ప్రత్యర్థుల కంటే ముందుడడం ఆమె రాజకీయదక్షతకు నిదర్శనం.

ఈ విజయాల ద్వారా ఆమెకు ఎనలేని కీర్తిప్రతిష్టలను తెచ్చిపెట్టిన పదవులు





లభించాయి. 1957లో Congress Legislative Party Deputy Leader గా నియమితులయ్యారు. ఆ సంవత్సరంలోనే Member-in-Charage-International Relations గా ఎంపికయ్యారు. ఆ పదవిలో ఆమె తన బాధ్యతలను సమర్ధవంతంగా నిర్వహించారు. (The Legend Makers Some Eminent Muslim Women of India, Gouri Srivastava, Concept Publishing Company, New Delhi, 2003, Page. 91)

ఆ తరువాత ప్రముఖ కాంగ్రెస్ నేత దామోదరం సంజీవయ్య మంత్రివర్గంలో సాంఘిక సంక్షేమం, ముస్లిం ఎండోమెంట్స్ శాఖా మంత్రి పదవి ఆమెకు లభించింది. ఈ పదవిలో 1960 నుండి 1962 వరకు కొనసాగి, ఆంధ్రప్రదేశ్ తొలి మంత్రి వర్గంలో తొలి మహిళా మంత్రిగా, తొలి ముస్లిం మంత్రిగా, మొత్తం భారత దేశంలోనే మంత్రిపదవిని నిర్వహించిన తొలి ముస్లిం మహిళగా మాసుమా బేగం చరిత్ర సృష్టించారు.

1962లో ఫతర్ఘట్టీ నియోజకవర్గం నుండి కాంగ్రెస్ అభ్యర్థిగా స్వతంత్ర అభ్యర్థి సుల్తాన్ సలావుద్దీన్ ఒవైసీ మీద పోటీచేసి ఆమె పరాజితులయ్యారు. అప్పటి నుండి ఆమె సమాజసేవాకార్యక్రమాలకు పరిమితమయ్యారు. ప్రభుత్వ పరంగా వివిధ మహిళా, శిశు సంక్షేమ సంస్థలు, విద్యావాప్తి సంఘాలలో పలు బాధ్యతలు చేపట్టారు. హైదరాబాద్‌లోని **అంజుమన్-యే-ఖవాతీన్, లేడీ హైదరీ క్లబ్** ప్రధాన సభ్యురాలుగా, **రెడ్‌క్రాస్** సంస్థ కార్యనిర్వాహక సమితి సభ్యురాలిగా బాధ్యతలు నిర్వహించారు.

మంచి వక్త, కార్యదక్షురాలుగా ఖ్యాతిగాంచిన మాసుమా బేగం అఖిల భారత మహిళా సంస్థ నేతగా 1957లో కొలంబో, అఖిల భారత మహిళా సంస్థ ప్రతినిధి మండలి డిప్యూటీ నాయకురాలిగా 1959లో రష్యా, ఐక్యరాజ్యసమితి సమావేశాలకు జెనివా వెళ్ళి వచ్చారు. ఆ తరువాత యుగస్లోవియా, ఇండోనేషియాలలో పర్యటించారు. ఈ మేరకు అటు రాజకీయ రంగాన, ఇటు సేవారంగాన మాత్రమే కాకుండా సాహిత్య రంగాన కూడా అగ్రగామి అన్పించుకున్న మాసుమా బేగం 1990లో కన్నుమూశారు.

◆◆◆

## మహిళా చైతన్యం కోసం అహర్నిశలు శ్రమించిన

# బేగం షరీఫా హమీద్ అలీ

**జా**తీయోద్యమంలో రాజకీయ-సాంఘిక సంస్కరణలు సమాంతరంగా సాగాయి. ఆనాటి రాజకీయాలలో ప్రత్యక్షంగా పాల్గొనలేక పోయిన ఉద్యమకారులు సామాజిక సంస్కరణల పోరులో భాగస్వాములయ్యారు. ఈ విధంగా రాజకీయోద్యమంలో పరోక్షంగా పాల్గొంటూ సంస్కరణోద్యమంలో పత్యక్షంగా కార్యాచరణకు దిగిన యోధులలో బేగం షరీఫా హమీద్ అలీ ఒకరు.

ప్రగతిశీల భావాలను స్వాగతించే కుటుంబంలో ఆమె జన్మించారు. ఉర్దూ, గుజరాతీ, ఆంగ్లం, సింధి, మరాఠి, ఫ్రెంచ్ భాషలను నేర్చుకున్నారు. చిత్రకళ, సంగీతంలో మంచి పట్టు సంపాదించారు. ఇండియన్ సివిల్ సర్వీసెస్ అధికారి హమీద్ అలీని ఆమె వివాహం చేసుకున్నారు.

భర్త హమీద్ అలీ ప్రోత్సాహంలో ఆమె భాషాపరమైన సామర్థ్యాన్ని మరింత పెంచుకుంటూ, సంగీతం, కళా సాంస్కృతిక కార్యక్రమాలలో పూర్తికాలాన్ని వ్యయం చేస్తూ ఆయా రంగాల అభివృద్ధికి కృషి ఆరంభించారు. 1907లో కలకత్తా నగరంలో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ సమావేశాలలో ఆమె భాగస్వాములయ్యారు. ఆనాటి నుండి జాతీయోద్యమంలో చురుకైన పాత్ర నిర్వహించారు. స్వదేశీ ఉద్యమంలో ప్రధాన





పాత్ర పోషించారు. మహిళల సంక్షేమం, హరిజనుల అభివృద్ధి తదితర కార్యక్రమాల మీద షరీఫా హమీద్ అలీ దృష్టిసారించి అధిక సమయాన్ని ఆ రంగాలలో వ్యయం చేశారు.

మహిళలలో చైతన్యం కోసం, తల్లీ-బిడ్డలు తీసుకోవాల్సిన ఆరోగ్యపరమైన జాగ్రత్తల ప్రచారం కోసం పలు కార్యక్రమాలను చేపట్టారు. గ్రామీణ మహిళల సమస్యల పరిష్కారానికి ఆచరణాత్మక సలహాలు- సూచనలిచ్చి సమస్యల పరిష్కారానికి తోడ్పడ్డారు. మహిళలు తమ శక్తిసామర్థ్యాలను పెంపొందించుకునేందుకు వీలుగా వారి బిడ్డల బాగోగులు చూడడానికి నర్సరీలను ఏర్పాటు చేశారు. అఖిల భారత మహిళా కాన్ఫరెన్స్‌లో సభ్యత్వం స్వీకరించి ఆ కాన్ఫరెన్స్ శాఖలను పలు ప్రాంతాలలో ఏర్పరచి మహిళలను సంఘటిత పర్చారు. మహిళల వివాహవయస్సుకు సంబంధించి ఉనికిలోకి వచ్చిన **శారదా చట్టం** ప్రకారంగా మహిళల వివాహ అర్హత వయస్సును పెంచాలని డిమాండ్ చేశారు. ఈ డిమాండ్‌కు అనుకూలంగా మహిళల సంతకాల సేకరణ కార్యక్రమాన్ని పెద్దఎత్తున నిర్వహించారు. ముస్లిం మహిళలకు తగిన భద్రత ఇచ్చేలాగు ఆమె ప్రత్యేక **నిఖానామా** తయారు చేశారు. ఆ నిఖానామా ఈనాటికి పలు ప్రాంతాలలో అమలులో ఉంది.

1933లో జరిగిన రౌండ్ టేబుల్ సమావేశానికి హజరైన ముగ్గురు మహిళా ప్రతినిధుల బృందంలో సభ్యురాలుగా మహిళల స్థితిగతుల గురించి సంయుక్త పార్లమెంటరీ కమిటీ ఎదుట సాక్ష్యం చెప్పేందుకు ఆమె ఇంగ్లాండ్ వెళ్ళారు. పురుషులతోపాటుగా స్త్రీలకు సమాన ఓటింగ్ హక్కుల కోసం ఆమె తన వాదనను బలంగా విన్పించారు. 1937లో శాంతి, స్వేచ్ఛ ప్రధానాంశాలుగా జెకస్లోవేకియాలో జరిగిన అంతర్జాతీయ సమావేశానికి హాజరయ్యారు.

1940లో అఖిల భారత మహిళా కాన్ఫరెన్స్‌కు ఉపాధ్యక్షురాలిగా, ఆ తరువాత అధ్యక్షురాలిగా బాధ్యతలు నిర్వహించారు. అఖిల భారత మహిళల విద్యాసంఘం గవర్నింగ్ బాడీ చైర్మన్‌గా మహిళా విద్యాభివృద్ధికోసం ఎన్నో కార్యక్రమాలను నిర్వహిం చారు. ఆమె సమాజసేవకు గుర్తింపుగా ఐక్యరాజ్యసమితిలోని మహిళలకు సంబంధించిన విభాగంలో భారతదేశ ప్రతినిధిగా నియుక్తురాలయ్యారు. భారతీయ మహిళల సంక్షేమం కోసం మాత్రమే కాకుండా మహిళల హక్కుల పరిరక్షణకు ఆమె ఎంతో కృషి చేశారు

◆◆◆



## ప్రజల భవిష్యత్తు ప్రజలే నిర్ణయించుకోవాలని కోరిన

# బేగం అక్బర్ జెహాన్

### (1916-2000)

**స్వా**తంత్ర్యోద్యమంలో పాల్గొన్న మహిళలు తొలిదశలో భర్తల ప్రోత్సాహంతో రంగ ప్రవేశం చేసినా ఆ తరువాత ఉద్యమబాటలో ఎదురయ్యే పరిస్థితులను బట్టి తమ వ్యక్తిత్వాలను, సంపూర్ణ శక్తిసామర్ధ్యాలను ప్రదర్శించి చరిత్ర సృష్టించిన సంఘటనలు ఉన్నాయి. బేగం హసరత్ మోహాని, కుల్సుం సయాని, సాదత్ బానో కిచ్లూ, షంషున్నీసా అన్సారి ఈ కోవలోకి వస్తారు. ఆ కోవకు చెందిన కశ్మీరి మహిళ బేగం అక్బర్ జెహాన్.

అక్బర్ జెహాన్ 1916లో కశ్మీర్‌లోని గుజ్జర్ కుటుంబంలో జన్మించారు. ఆమె తల్లి గుజ్జర్ కమ్యూనిటీకి చెందిన ఆడపడుచు కాగా తండ్రి మైఖేల్ హ్యారి నిడోయ్ (Harry Nedou). తల్లి తండ్రులది ప్రేమ వివాహం. ఆమె తండ్రి మైఖేల్ హ్యారి నిడోయ్ క్రైస్తవ మతానికి చెందిన సంపన్న వ్యాపారి. ఆయన ఇస్లాం మతం స్వీకరించి తన పేరును షేక్ అహమ్మద్ హుస్సేన్‌గా మార్చుకున్నారు. షేక్ అహమ్మద్ హుస్సేన్ అక్బర్ జెహాన్ బేగం తల్లిని ప్రేమించి మరీ వివాహం చేసుకున్నారు. ఆ వివాహం వలన తల్లి సంబంధీకులైన గుజ్జర్ కమ్యూనిటీ ప్రజలు ఆగ్రహం వ్యక్తంచేసి వారికి దూరమయ్యారు. ఆ వ్యతిరేక పరిస్థితులలో కూడా ఆ దంపతులు ఎంతో ధైర్యంతో తమ జీవితాలను





ఉజ్వలంగా మలచుకున్నారు. ఆ దంపతుల తొలి సంతానంగా అక్బర్ జెహాన్ బేగం జన్మించారు.

అక్బర్ జెహాన్ బేగం మంచి కాన్వెంటు విద్యను గరిపారు. విద్యార్థిగా మంచి తెలివితేటలను ప్రదర్శించిన అక్బర్ జెహాన్ చక్కని సౌందర్యరాశిగా ప్రజల మనస్సులను దోచుకున్నారు. ఆమె అందంలో అగ్రగామి మాత్రమే కాకుండా ధైర్యసాహసాలలో కూడా అగ్రగణ్యురాలుగా ఖ్యాతిగాంచారు. చిన్నతనంతో తన తల్లికి సంబంధించిన గుజ్జర్ కమ్యూనిటీ ప్రజలు దూరం కావటం, తండ్రి పరదేశం నుండి వచ్చి కశ్మీరులో స్థిరపడిన వ్యక్తి కావటంతో ఆ కుటుంబం తొలిదశలో పలు ఇక్కట్లను ఎదుర్కొంది. తొలి సంతానంగా ఆ ఇక్కట్లును స్వయంగా అనుభవించిన అక్బర్ జెహాన్ బేగం ధైర్యశాలిగా స్వతంత్ర భావనలతో ఎదిగారు.

చిన్నవయస్సులో కరామత్ షా అను ఓ మత గురువుతో ఆమె తల్లితండ్రులు వివాహం జరిపించారు. ఆ వివాహం ఎక్కువ కాలం నిలబడలేదు. చివరకు అక్బర్ జెహాన్ బేగం భర్తను నుండి విడాకులు తీసుకున్నారు. ఆ తరువాత ఆమె 1932లో షేక్ ముహమ్మద్ ఇబ్రహీం కుమారుడు, **షేర్-యే-కశ్మీర్**గా ఖ్యాతిగాంచిన షేక్ ముహమ్మద్ అబ్దుల్లాను వివాహం చేసుకున్నారు. ఆమె వివాహాన్ని ప్రముఖ కవి డాక్టర్ ముహమ్మద్ ఇక్బాల్ తోడ్పాటుతో ముఫ్తీ జియాయుద్దీన్ నిర్వహించారు.

విద్యాధికుడైన డాక్టర్ అబ్దుల్లా తొలి నుండి ప్రజల సమస్యల పరిష్కారానికి కృషిచేయడానకి ఆసక్తి చూపారు. ఆయనలోని నాయకత్వ లక్షణాలు విద్యావంతులైన తన మిత్రులతో కలసి **రీడింగ్ రూం పార్టీ** అను సంస్థ ఏర్పాటుకు దారి తీశాయి. ఈ సంస్థ ద్వారా ప్రజల సమస్యల పరిష్కారానికి వ్యవస్థాగతంగా శ్రీకారం చుట్టారు. ఆ క్రమంలో కశ్మీర్ ప్రజల సమస్యలను బయటి ప్రపంచానికి తెలియచేసేందుకు రీడింగ్ రూం పార్టీ సభ్యులు కృషిచేశారు. ఆ ప్రయత్నాలు ప్రజల మన్నన పొందాయి, కశ్మీరేతర ప్రజల అభినందనలు డాక్టర్ అబ్దుల్లాకు దక్కాయి. ఆ అనుభవంతో 1932లో ఆయన ప్రత్యక్ష రాజకీయాలలోకి ప్రవేశించారు. ఆయన **ఆల్ జమ్ము అండ్ కశ్మీర్ ముస్లిం పొలిటికల్ కాన్ఫెరెన్స్** ఏర్పాటు చేశారు. ఆ పార్టీ పేరులో **ముస్లిం** అని పదం ఉన్నా, ఆల్ జమ్ము అండ్ కశ్మీర్ ముస్లిం పొలిటికల్ కాన్ఫెరెన్స్ కమ్యూనల్ పార్టీ ఏమాత్రం కాదన్నారు. కశ్మీర్ ప్రజల ఉద్యమం మతఉద్యమం కాదని ఇది రాజకీయ ఉద్యమమని ఆయన

అన్నారు. జమ్మూ-కశ్మీర్ ప్రజలందరి సమస్యల పరిష్కారం కోసం పోరాడుతుందని డాక్టర్ అబ్దుల్లా ప్రకటించారు.

'Muslim conference is not a communal organization and its existence will help all communities living in the State. The Kashmir agitation is not a communal movement but a political movement for redress of all people living in the state. We assure all our brethren whether they be Sikhs or Hindus, that we are ready to fight for their cause also ' - Encyclopedia of Muslim Biography, Ed. by Nagender Kr. Singh, APHPC, New Delhi, 2001, Page. 173)

ఆ ప్రకటన మేరకు అబ్దుల్లా బడుగు బలహీన వర్గాల పక్షాన నిలిచారు. మతంతో సంబంధం లేకుండా ఆల్ జమ్ము అండ్ కశ్మీర్ ముస్లిం పొలిటికల్ కాన్ఫరెన్స్‌లో అందరికి ప్రవేశం కల్పించారు, ఆ సందర్భంలో బేగం అక్బర్ జెహాన్ భర్త అబ్దుల్లాకు తోడుగా నిలిచారు. ఆ క్రమంలో మహాత్మాగాంధీ, మౌలానా ఆజాద్, పండిత నెహ్రూ, అలీ సోదరుల ప్రభావంతో 1938 ప్రాంతంలో అబ్దుల్లా తన ఆల్ జమ్మూ అండ్ కశ్మీర్ ముస్లిం పొలిటికల్ కాన్ఫరెన్స్ ను ఆల్ జమ్మూ అండ్ కశ్మీర్ నేషనల్ పొలిటికల్ కాన్ఫరెన్స్‌గా మార్చారు.

ద్వితీయ ప్రపంచ సంగ్రామం సందర్భంగా భారత జాతీయ కాంగ్రెస్ **క్విట్ ఇండియా** ఉద్యమానికి పిలుపునిచ్చింది. ఆల్ జమ్మూ అండ్ కశ్మీర్ నేషనల్ పొలిటికల్ కాన్ఫరెన్స్ కూడా క్విట్ ఇండియా తీర్మానానికి మద్దతు పలికింది. జాతీయ కాంగ్రెస్ నేతలను ప్రభుత్వం అరెస్టు చేయడాన్ని అబ్దుల్లా తీవ్రంగా ఖండించారు. జమ్మూ-కశ్మీర్‌లో క్విట్ ఇండియా నినాదం ప్రతిధ్వనించింది. ఈ సందర్భంగా డాక్టర్ అబ్దుల్లా మాట్లాడుతూ **ఇండియా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడుతుంది. ఇండియా భూభాగంలోని నాల్గవ వంతు కలిగి ఉన్న సంస్థానాధీశులు స్వరాజ్యం విషయంలో విద్రోహులయ్యారు. సంస్థానాధీశులు వెళ్ళిపోవాలన్న డిమాండ్ క్విట్ ఇండియా ఉద్యమానికి కొనసాగింపు మాత్రమే,** అని అన్నారు.

'India is fighting against imperialism. The rulers of the Indian States who posses' 1/4th of the country have always played the role of the traitors to the cause of Indian Freedom. The demand that the Princely States should quit is a logical extension of the policy of Quit India' - Encyclopedia of Muslim Biography: Page. 174)





1946 ప్రాంతంలో భారత దేశానికి బ్రిటీష్ ప్రభుత్వం పంపిన క్యాబినెట్ మిషన్ **ఫెడరల్ యూనియన్ ఆఫ్ ఇండియా** ను ప్రతిపాదించింది. ఇండియా నుండి బ్రిటీషర్లు వైదొలిగాక సంస్థానాధీశుల స్థానంలో ప్రజల ప్రభుత్వం ఏర్పడాలని డాక్టర్ అబ్దుల్లా ఆశించారు. ఈ మేరకు ప్రజలను చైతన్యవంతుల్ని చేయడానికి ఆయన ఉపక్రమించగా ఆయనతోపాటుగా బేగం అక్బర్ జెహాన్ ఉద్యమించారు. ఈ ఉద్యమాన్ని ఆ దంపతులు కశ్మీర్ సంస్థానం వరకు పరిమితం చేయలేదు. ఆనాడు ఇండియాలోని సుమారు 600 సంస్థానాలలోని ప్రజలను ఈ విషయమై చైతన్యపర్చేందుకు సిద్ధమయ్యారు. ఈ మేరకు డాక్టర్ అబ్దుల్లా క్యాబినెట్ మిషన్‌కు మహజరు కూడా సమర్పించారు. బ్రిటీషు ప్రభుత్వం అధికారంలో నుండి వైదొలిగాక ప్రభుత్వాధికారాన్ని ప్రజల పరం చేయాలని, సార్వభౌమత్వం ప్రజల చేతుల్లో ఉండాలని ఆ మహజరు కోరింది.

ఆ నేపథ్యంలో **క్విట్ కశ్మీర్** ఉద్యమానికి డాక్టర్ అబ్దుల్లా శ్రీకారం చుట్టారు. ఉద్యమం ఉధృతంగా సాగింది. అరెస్టుల పరంపరలో భాగంగా 1946 మే మాసంలో బేగం అక్బర్ జెహాన్ భర్త అబ్దుల్లాను ప్రభుత్వం అరెస్టు చేసింది. రాజద్రోహానికి పాల్పడ్డారన్న ఆరోపణల మీద తొమ్మిది సంవత్సరాల జైలు శిక్షను విధించింది.

ఆ సమయంలో బేగం అక్బర్ జెహాన్ రంగంలోకి దిగారు. అంతవరకు పరోక్షంగా భర్త అబ్దుల్లాకు సహాయకారిగా ఉన్న ఆమె ప్రత్యక్షరాజకీయాలలోకి ప్రవేశించారు. ఆమె స్వయంగా గ్రామాలకు గ్రామాలు పర్యటిస్తూ ప్రజలను కూడగట్టారు. బాధితులను ఆదుకున్నారు. ప్రజలలో భయాలను తొలగించి ఆశాజ్యోతులను వెలిగించారు. క్విట్ కశ్మీర్ ఉద్యమానికి ప్రజల మద్దతు సాధించేందుకు ఆమె నడుం కట్టారు. జనసమూహాలను ప్రభావితం చేయగల విధంగా చర్యలు తీసుకున్నారు. ఆ కారణంగా క్విట్ కశ్మీర్ ఉద్యమానికి ప్రజల నుంచి మంచి మద్దతు లభించింది. కశ్మీర్ ఉద్యమం సందర్భంగా ప్రజలను సమీకరించగల శక్తియుక్తులు, ఆమెలో నిబిఢీకృతమై ఉన్న శక్తి సామర్థ్యాలు బహిర్గత మయ్యాయి. డాక్టర్ అబ్దుల్లా జైలులో ఉన్న సమయంలో కశ్మీర్ వచ్చిన మహాత్మా గాంధీని ఆమె స్వయంగా కలుసుకుని చర్చించారు.

(' Her ability to mobilize people came to the fore during ' Quit Kashmir ' movement and subsequently when her husband was in prison in 1946-47 as she came out of the confines of home and visited villages of the state and burn the ' lamp of hope ' for the oppressed people.' - The Legend Makers Some Eminent



**కుమారుడు ఫరూఖ్ అబ్దుల్లా మంత్రివర్గంతో అక్బర్ జహాన్ బేగం**

Muslim Women of India, Gouri Srivastava, Concept Publishing Company, New Delhi, 2003, Page.108-109).

1947 జూన్‌లో లార్డు మౌంటుబాటన్ తన ప్రణాళికను వెల్లడించాడు. ఆ ప్రణాళిక ప్రకారంగా భారతదేశం రెండుగా చీలిపోవటం ఖాయమయ్యింది. ఆ సమయంలో పండిత నెహ్రూ సలహా మీద డాక్టర్ అబ్దుల్లాను ప్రభుత్వం విడుదల చేసింది. ఆయన విడుదల కాగానే కశ్మీరు సంస్థానం భవిష్యత్తును ప్రజలు నిర్ణయించాలి తప్ప సంస్థానాధీశులు నిర్ణయించటం సముచితం కాదని ప్రకటించారు. ఈ విషయంలో జాతీయ కాంగ్రెస్ నాయకులు ఆయనతో ఏకీభవించారు.

ఇండియా విభజన సందర్భంగా పాకిస్తాన్ నాయకుల ప్రేరణతో కశ్మీరును ఇండియా నుండి దూరం చేయాలని ప్రయత్నాలు ఆరంభమయ్యాయి. కశ్మీరులోని గిరిజన జాతులను రెచ్చగొట్టి జమ్మూ-కశ్మీరులోని కొన్ని ప్రాంతాల ఆక్రమణకు ప్రయత్నాలు సాగాయి. ఆ ప్రమాదకర పరిస్థితులలో డాక్టర్ అబ్దుల్లా, బేగం అక్బర్ జెహాన్ తమ నిర్ణయాల మీద స్థిరంగా నిలబడ్డారు. పాక్ ప్రేరిత ఆక్రమణదారులను తిప్పికొట్టేందుకు ప్రజలను కూడగట్టారు. ప్రజలను భయభ్రాంతున్ని చేయడానికి వ్యాపింపచేస్తున్న పుకార్లను ఖండిస్తూ అబ్లుల్లాతో పాటుగా అమె కూడా వీధుల్లోకి వచ్చి ప్రజలకు నచ్చచెప్పి భీతాహులు కాకుండా పరిస్థితులను అదుపులోకి తీసుకరావటంలో అమె తోడ్పడ్డారు.

ఆ సందర్భంగా డాక్టర్ అబ్దుల్లా మాట్లాడుతూ **ఈనాడు పాకిస్తాన్ నుండి**





**బయలుదేరిన ఆక్రమణదారులు శ్రీనగర్ నుండి కొన్ని మైళ్ళ దూరంలో ఉన్నారు. వాళ్ళు ఇస్లాం నినాదం చేస్తున్నారు. మీరు నావెంట ఉంటారో వారితో కలుస్తారో తేల్చుకోవాల్సింది మీరే.. నాతో ఉండాలనుకుంటే మనం హిందూ, ముస్లిం, శిక్కులంతా కలసి అన్నదమ్ముల్లా జీవించాలన్న సూత్రానికి బద్ధులై ఉండాలి. ఈ విధానం ఓ 'కాఫిర్'దిగా మీరు భావిస్తే, మీరు మీ ఆయుధాలను ముందుగా నామీద ప్రయోగించండి. మీరు 'కాఫిర్'ల మీద దాడులు, అత్యాచారాలకు పాల్పడదలిస్తే దానిని నా కుటుంబం నుండి ఆరంభించండి** అని అన్నారు.

('..Today the raiders from Pakistan are a few miles from Srinagar. Tehy are raising the slogan of Islam. It is open to you to be with them or to be with me...If you opt to be with me you must know that you have to live for all times on the principle that Hindus, Muslims and Sikhs are brothers. If that is the language of a Kafir you should raise your sword first against me. If you want to raid or rape ' Kafirs ' I am the first Kafir and you must start it from my place and my family. ' - Encyclopaedia of Muslim Biography, Page. 174)

ఆ తరువాతి కాలంలో వివాదాస్పద నిర్ణయాలు, ప్రకటనల మూలంగా డాక్టర్ అబ్దుల్లా అరెస్టులకు, జైలు శిక్షలకు గురవుతూ వస్తున్న సందర్భంగా బేగం అక్బర్ జెహాన్ అటు పార్టీ శ్రేణులను కాపాడుకుంటూ ఇటు కుటుంబీకుల పట్ల ఉన్న బాధ్యతలను సక్రమంగా నెరవేర్చుతూ అబ్దుల్లా గైర్హాజరిని వారి అనుభవంలోకి రానివ్వకుండా చూడటం లో ప్రధాన పాత్ర వహించారు. జమ్మూ-కశ్మీర్‌లో ఏర్పడిన రాజకీయశూన్యత నుండి కార్యకర్తలను కాపాడుకుంటూ వారిలో ధైర్యాన్ని ఆత్మవిశ్వాసాన్ని నింపారు. కశ్మీరు లోయలో శాంతిభద్రతల సమస్య తలెత్తకుండా ఆమె ఎంతగానో సహాయపడ్డారు.

( '..filled in the vacum and helped in maintaining peace in the vally and unity in the ranks of his followers. ' Encyclopaedia of Muslim Biography, Page. 173)

1947-48 నాటి భయానక పరిస్థితుల నుండి జమ్మూ-కశ్మీర్‌ను కశ్మీర్ ప్రజలను కాపాడేందుకు డాక్టర్ అబ్దుల్లా దంపతులు ముందుకు వచ్చారు. పాక్ ఆక్రమణదారులు కశ్మీరు ప్రజల మీద సాగిస్తున్న దాడులను ఖండించారు. ఆ దాడులలో గాయపడిన వారిని, ఆస్థిపాస్తులను కొల్పోయి నిరాశ్రయులై ప్రజలను ఆదుకునేందుకు

బేగం అక్బర్ జెహాన్ ప్రత్యేక చర్యలు తీసుకున్నారు. బాధితులకు స్వాంతన చేకూర్చేందుకు ఆమె తీసుకున్న చర్యలను మౌంటుబాటన్ భార్య ఎడ్వినా మౌంటు బాటన్ ప్రత్యేకంగా ప్రశంసించారు. (The Legend Makers Some Eminent Muslim Women of India, Page.108)

బేగం అక్బర్ జెహాన్ చాలా సందర్భాలల్లో డాక్టర్ అబ్దుల్లాకు సహాయసహకారాలు అందిస్తూ పరోక్షరాజకీయాలలో గడుపుతూ, సందర్భాన్ని బట్టి తన శక్తిసామర్థ్యాలు ప్రజల కోసం ప్రదర్శించారు. అతి క్లిష్ట సమయాలలో భర్తకు తోడుగా నిలిచారు. ఆ పరిస్థితులకు అతీతంగా కశ్మీరు ప్రజల మనస్సుల మీద ఆమెకున్న రాజకీయ పట్టు 1971 నాటి ఎన్నికలలో వెల్లడైంది. ఆ సమయంలో ప్రముఖ రాజకీయ నాయకుడు, బక్షీ గులాం ముహమ్మద్ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా శ్రీనగర్ పార్లమెంటు నియోజకవర్గం నుండి పోటీ చేశారు. ఆయనకు ప్రత్యర్థిగా స్వతంత్ర అభ్యర్థి షమీం అహమ్మద్ షమీం రంగంలో నిలిచారు. ఆ ఎన్నికల సమయాన ఆమె భర్త డాక్టర్ అబ్దుల్లా కశ్మీరులో లేరు.

ఆ ఎన్నికలో బేగం అక్బర్ జెహాన్ స్వతంత్ర అభ్యర్థి షమీం అహమ్మద్‌కు మద్దతు పలికారు. ఆ సందర్భంలో ఆమె చాలా విస్తృతంగా ఎన్నికల ప్రచారంలో పాల్గొన్నారు. ఆమె కృషివలన అంతగా పరిచయంలేని షమీంను ప్రజలు గెలిపించి రాజకీయ వస్తాదుగా పేర్గాంచిన గులాం ముహమ్మద్‌ను పరాజితుడ్ని చేశారు. ఆ చరిత్రాత్మక పరిణామాలకు బేగం అక్బర్ జెహాన్ కేంద్రబిందువు కావటం ద్వారా ఆమె వ్యక్తిత్వం పట్ల ప్రజలలో ఉన్న అభిమానం, ఆమెకున్న పలుకుబడి వెల్లడయ్యాయి.

1977లో జరిగిన ఎన్నికలలో ఆమె శ్రీనగర్ పార్లమెంటరీ స్థానానికి పోటీ చేశారు. ఆ ఎన్నికలో భారీ ఆధిక్యతతో ఆమె గెలుపొంది పార్లమెంటులో ప్రవేశించారు. కశ్మీరు ప్రజల నేతగా పార్లమెంటు సభ్యురాలుగా అక్బర్ జెహాన్ బహుముఖ పాత్ర నిర్వహించారు. మహిళల సమస్యల పట్ల ఆమె అధిక శ్రద్ధచూపారు. మహిళలలో చైతన్యం కోసం, మానసిక వికాసం, అభివృద్ధికోసం గాను అనేక సంస్థలను స్థాపించారు. పలు సంస్థలలో భాగస్వాములయ్యారు. మహిళాభివృద్ధి ప్రధాన ఆశయంగా స్థాపించిన **మర్కజ్-యే-బెహబూద్-యే-ఖవాతీన్** (Markaz-e-Behbood-e-Khawateen) లో ఆమె కీలక బాధ్యతలు నిర్వహిస్తూ మహిళలకు సేవలందించారు. ఈ సంస్థతో ఆమె అర్థ శతాబ్దంపాటు మంచి సంబంధాలు కలిగి ఉండి సామాజిక సేవా రంగంలో తనదైన చరిత్ర





సృష్టించుకున్నారు.

ఆమెలోని మానవతా భావనలు, సేవా దృక్పథం గుర్తించిన కశ్మీరు ప్రజలు ఆమెను ' మదర్-యే-మెహర్బాన్ ' (Madr-e-Meharban) అని సంబోధిస్తూ, ఆమెపట్ల వారితోగల ప్రేమాభిమానాలను చాటుకున్నారు. మదర్-యే-మెహర్బాన్ అంటే **'దయగల తల్లి** ' అని అర్థం.

ఈ మేరకు అటు భర్తకు రాజకీయాలలో తోడ్పాటు అందచేస్తూ, ఇటు కశ్మీరు ప్రజలను ముఖ్యంగా కశ్మీరు మహిళల సంక్షేమం కోసం చివరి శ్వాసవరకు క్రియాశీలకంగా శ్రమించిన బేగం అక్బర్ జెహాన్ 2000 సంవత్సరంలో కన్నుమూశారు.

◆◆◆

**మన..ముస్లిం మత పెద్దల తప్పు వొకటే. తమ స్త్రీలను చదువు సంధ్యల్లేని వాళ్ళుగా వుంచారు.లేకుంటే చదివించినా రాజకీయ కార్యక్రమాలకు పూర్తిగా దూరంగా వుంచారు. జాతి తల్లులలో రాజకీయ పరిజ్ఞానం లేనందున జాతి జనులలో కూడా రాజకీయాల పట్ల సరైన అవగాహనకు ఆస్కారం లేకుండా పోయింది...మీ ఆ చేష్టలకు ముగింపు పలికి భవిష్యత్తు గురించి జాగ్రత్త వహించండి. మీ చర్యల వలన కలిగిన నష్టాన్ని భర్తీ చేసుకోడానికి మార్గం వొక్కటే. అది మీ స్త్రీలను విద్యావంతుల్ని చేయడం. విజ్ఞానార్జన ద్వారా సరైన రాజకీయ దృక్పథం, మంచి అవగాహన వారిలో కలుగచేయడం. ఆ అవకాశాలను వారికి కల్పించటం.**

**-జాహిదా ఖాతూన్ షేర్వానియా.**

# అనుబంధం

**ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం సందర్భంగా భారతీయులను ఆకట్టుకు నేందుకు బ్రిటీష్ మహారాణి క్విన్ ఎలిజబెత్ ఓ ప్రకటన విడుదల చేసింది. ఆ ప్రకటనలోని ఆంతర్యాన్ని, అందులోని కుట్రని విడమర్చి వివరిస్తూ ఆయోధ్య రాణిమాత బేగం హాజరత్ మహాల్ 1858 నవంబరు 1న స్వదేశీయులకు చక్కని సందేశాన్ని ఇచ్చారు. ఆ సందేశం ఆంగ్ల అనువాదం ఈ క్రింది విధంగా ఉంది.**

## Proclamation of Begum Hazarath Mahal of Oudh issued on Novement1, 1858 response to the Proclamaton of Queen Elizabeth.

****

" At this time certain weak-minded, foolish people, have spread a report that the English have forgiven the faults and crimes of the people of Hindoostan. This appears very astonishing, for it is the unvarying custom of the English never to forgive a fault, be it great or small so much so, that if a small offence be committed through ignorance or negligence, they never forgive it. The proclamation of the 1st. November, 1858, which has come before us, is perfectly clear; and as some foolish people, not understanding the real object of the proclamation, have been carried away, therefore we, the ever-abiding





government, ***parents of the people of Oude***, with great cosideration, put forth the present proclamation, in order that the real object of the chief points may be exposed, and our subjects placed on their guard.

1. " It is written in the proclamation, that the country of Hindoostan, which was held in trust by the Company, has been resumed by the Queen, and that for the future the Queen's laws shall be obeyed. This is not to be trusted by our religious subjects; for the laws of the Company, the settlement of the Company, the English servants of the Company, the Governor General, and the judicial administration of the Company, are all unchanged. What, then, is there now which can benefit the people, or on which can rely?

2. " In the proclamation it is written, that all contracts and agreements entered into by the Company will be accepted by the Queen. **Let the people carefully observe this artifice.** The company has seized on the whole of Hindoostan, and, if this arrangement be accepted, what is there new in it? **The Company professed to treat the Chief of Bhurtpur as a son, and then took his territory; the chief of Lahore was carried off to London**, and it has not fallen to his lot to return; the Nawab Shumshoodeen Khan, on one side, they hanged, and on the other side, they salaamed to him; the Peishwa they expelled from Poona Sitara, and imprisoned for life in

Bithoor; their breach of faith with Sultan Tippoo is well known; the Rajah of Benaras they imprisoned in Agra. Under pretence of administrating the country of the Chief of Gwalior, they introduced English customs; they have left no means or traces of the Chiefs of Behar, Orissa, and Bengal; they gave the Rao of Furruckabad a small monthly allowance, and took his territory. Shahjehanpore, Bareilly, Azimgurh, Jounpore, Goruckpore, Etawah, Allahabad, Futtehpore, &c.**Our ancient possessions they took from us on pretence of distributing pay; and in the 7th. Article of the treaty, they wrote, on oath, that they would take no more from us.** If, then, the arrangemenys made by the Company are to be accepted, **what is the difference between the former and the present state of things?** These are old affairs, but recently, in defiance of treaties and oaths, and notwithstanding that they owed us millions of rupees without reason, and on pretence of the misconduct and discontent of our people, they took our country and property, worth millions of rupees. If our people were discontented with our royal predecessor, Wajid Ali Shah, how comes it they are content with us? And no ruler ever experienced such loyalty and devotion of life and goods as we have done. What, then is wanting that they do not restore our country? Further, it is written in the proclamation, that they want no increase of territory, but yet they cannot refrain from annexation. If the





Queen has assumed the government, why does Her Majesty not restore our country to us when **our people wish it?** It is well-known that no king or queen ever punished a whole army and people for rebellion; all were forgiven; and the wise cannot approve of punishing the whole army and people of Hindoostan; for so long as the word punishment remains the disturbance will not be suppressed. There is a well-known proverb - "A dying man is desperate" (Murta kya na Kurta). **It is impossible that a thousand should attack a million, and the thousand escape.**

3. " n the proclamation it is written, that the Christian religion is true, but that no other creed will suffer oppression, and that the laws will be observed towards all. **What has the administration of justice to do with the truth or falsehood of religion?** That religion is true which acknowledges one God, and knows no other. Where there are three Gods in a religion, neither Mussulman nor Hindoo- nay, not even Jews, Sun-worshippers, or Fire-worshippers can believe it true. To eat pigs and drink- to bite greased cartridges, and to mix pig's fat with flour and sweetmeats — to destroy Hindoos and Mussulman temples on pretence of making roads to build churches- to send clergymen into streets and alleys to preach the christian religion — to institute English schools , and to pay a monthly stipend for learning the English sciences, while the places of

worship of Hindoos and Mussalmans are to this day entirely neglected; with all this, how can the people believe that religion will not be interfered with? The rebellion began with religion, and, for it, millions of men have been killed. Let not our subjects be decieved; thousands were deprived of their religion in the North-West, and thousands were hanged rather than abandoned their religion.

4. "t is written in the proclamation, that they who harboured rebels, or who were leaders of rebels, or who caused men to rebel, shall have their lives, but that punishment shall be awarded after deliberation, and that murderers and abettors of murderers shall have no mercy shown them, while all others shall be forgiven. **Any foolish person can see, that under this proclamation, no one, be he guilty or innocent, can escape.** Everything is written, and yet nothing is written; but they have clearly written that they will not let off any one implicated; and in whatever village or estate the army may have halted, the inhabitants of that place cannot escape. We are deeply concerned for the condition of our people on reading this proclamation, which palpably teems with enmity. We now issue a distinct order, and one that may be trusted that all subjects who may have foolishly presented themselves as heads of villages to the English, shall, before the 1st. of January next, present themselves, in our camp. Without doubt their faults shall





be forgiven then, and they shall be treated according to their merits. To believe in this proclamation **it is only necessary to remember that Hindoostanee rulers are altogether kind and merciful. Thousands have seen this, millions have heard it. No one has ever seen in a dream that the English forgave an offence.**

5. " In this proclamation it is written, that when peace is restored, public works, such as roads and canals, will be made in order to improve the condition of the people. It is worthy of a little reflection, that they have promised no better employment for Hindustanis than making roads and digging canals. If people cannot see clearly what this means, there is no help for them. Let no subject be deceived by the proclamation. "

(A True Translation)

**Secretary to the Chief Commissioner of Oude.**

**( Reproduced from FREEDOM STRUGGLE IN Utthara Pradesh, Page 465-68, Volume I, Publication bureau, Information Department, Utthara Pradesh, Eited by SAA Rizvi, ML Bhogra. Collected from : http//oudh.tripod.com/com/bhm/ bhmpric. htmon 19-09-2006 at Hyderabad)**

# ఆధార గ్రంథాలు-పత్రికలు



### ఆంగ్ల గ్రంథాలు :

01. Muslims In India (Two Volumes) Naresh Kumar Jain, Manohar, New Delhi, 1979.
02. Freedom Movement and Indian Muslims, Santomoy Ray, PPH, New Delhi, 1983.
03. Who is who Indian Martyrs (Three Volumes) Dr PN Chopra, Govt. of India Publications, New Delhi.1973
04. Freedom Movement In India (Four Volumes), Dr. Tara Chand, Govt. of India Publications, New Delhi, 1992.
05. Encyclopedia of Muslim Biography (Five Volumes), Nagendra Kumar Singh APHPC, New Delhi, 2001.
06. Muslims and India's Freedom Movement, Dr. Shan Muhammad, IOS, New Delhi, 2002.
07. Who is who of Freedom Struggle in Andhra Pradesh, (Three Volumes) Ed. by Prof. Sarojini Regani, Govt. of AP Publications, Hyderabd.1978
08. Brief History of Andhra Pradesh, Ed. by Mohd.Abdul Waheed Khan, State Archives, Govt. of AP, Hyderabd, 1972.
09. The Freedom Struggle in Hyderabad, (Four Volumes), Govt. of AP, Hyderabad, 1956.
10. Highlights of the Freedom Movement in Andhra Pradesh, Dr. Sarojini Regani, The Ministry of Cultural Affairs, Govt. of AP, Hyderabd,1972.
11. The History of the Indian National Congress, Bogharaju Pattabhi Seetharamaiah, Madras, 1935.
12. History of The Deccan ( Two Volumes), J D E Gribble, Mittal Publications, New Delhi, 1990.





13. Secluded Scholars, Gail Minault,OUP, New Delhi,1999.
14. Women Pioneers, Ed. By Sushila Nayar & Kamala Mankekar, NBT, India, 2002.
15. The Legend Makers Some Eminent Muslim Women of India, Gouri Srivastava, Concept Publishing Company, New Delhi, 2003.
16. Eighty Fifty Seven, Dr.Surendranath Sen, Govt. of India Publications, New Delhi, 1957.
17. Aruna Asaf Ali, GNS Raghavan, NBT, India, 1999.
18. Freedom Fighters of Indian Mutiny 1857, MP Srivasthava, Ghugh Publications, Allahabad, 1997.
19. Saifuddin Kitchlew, Toufique Kitchlew, NBT, India, 1996.
20. Collected Works of Mahathama Gandhi, Publication Division, Govt. Of India, New Delhi.
21. 20 Great Women of India, AP Sarma, Prashant Publications, Gurgaon, 2003.
22. The Story of my Experiments with truth, MK Gandhi, Navajeevan, Ahmedabad, 1927.
23. Hasrath Mohani, Mujafar Hanafi, Tras. by Khadija Azeem, NBT, India, 2004.
24. They too fought for India's Freedom, Ed. by Asghar Ali Engineer, Hope India, Gurgaon, 2006.
25.. Prominent Muslim Women in India (Bibliographical Dictionary)-Al Kabir Al Kausar, Life and Light Publications, New Delhi, 1982.
26. India Wins Freedom - Maulana Abul Kalam Azad, Orient Longman 1995, Delhi.
27. Great Woman of India, Ed. by Swami Madhavananda, RC Maujumdar, Advitha Assrama, Callcutta, 1993.
28. From Plassey to Partition, Sekhar Bandyopadhyay, Orient Longman, New Delhi, 2004.
29. Muslims and the Congress, Mushirul Hasan, Manohar, 1979.
30. Understanding The Muslim Mind, Rajmohan Gandhi, Penguin Books, New Delhi, 1987.
31. Eminent Muslim Freedom Fighters (1562-1947) , G.Allna, Low Price Pub-

lications, NewDelhi,1993

32. 100 Great Muslim Leaders of the 20th Century, IOS, New Delhi, 2005.
33. The Muslim Elite, Ali Ashraf, Atlantic Publishers & Distributors, New Delhi,1982
34. Muslim In India,S.Abul Hasan Ali Nadwi, Islamic Research and Publications, Lucknow, 1980
35. Freedom Struggle, Bipin Chanda, NBT, New Delhi, 1972
36. Farooq Abdullah, Aditya Sinha, UBS Publishers, New Delhi,1996.
37. The Price of partition, Rafiq Zakaria, BVB, Mumbai, 1998.
38. Sayyid Ahamad Khan, KA Nizami, Govt. Of India publications, New Delhi, 1980.
39. From Pluralism to Separatism, Mushirul Hasan, OFP, New Delhi, 2004
40. Telangana peoples Struggle and its lessons, P.Sundaraiah, Foundations Books, New Delhi.
41. Rise of Muslims Indian Politics, Rafiq Zkaria, Somaiya Publictaions Bombay, 1986.
42. The Indian Muslims, Munshi Manoharlal, New Delhi, 1967

**ఆంగ్ల పత్రికలు :**

01. The Voice of People Awakening, Feb. 1998 Issue, Mumbai
02. Radiance, Views Weekly, 31Aug.-6.Sept, 2003 Special, Delhi
03. Indian Express, Daily, 13-8-1995, Vijayawada
04. Aman, Ed. by Dr. Asghr Ali Engineer, Aug. 1994

**తెలుగు గ్రంథాలు :**

01. భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర, కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం, విజయవాడ, 1984
02. తెలంగాణా పోరాటంలో స్త్రీల వీరోచిత పాత్ర, పుచ్చలపల్లి సుందరయ్య, ప్రజాశక్తి బుక్ హౌస్, హైదరాబాదు, 1999.
03. స్వతంత్ర భారత స్వర్ణోత్సవ సావనీర్–రాయలసీమలో స్వాతంత్ర్యోద్యమం, స్వతంత్ర





భారత స్వర్ణోత్సవ సావనీరు కమిటి, అనంతపురం, 1998.

04. పశ్చిమగోదావరి జిల్లా స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, మంగళంపల్లి చంద్రశేఖర్, 1992.
05. ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ, సంపాదకులు : కొడాలి ఆంజనేయులు, తెలుగు అకాడమీ, హైదరాబాదు, 1978.
06. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లింలు, సయ్యద్ నశీర్ అహమ్మద్, ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్, 1999.
07. స్వాతంత్ర్యోద్యమంలో కమ్యూనిస్టు దేశభక్తులు, సంపాదకులు : పరకాల పట్టాభి రామారావు, విజయవాడ.
08. స్వాతంత్ర్య సమర చరిత్ర, ముక్కామల నాగభూషణం, విజయవాడ, 1990
09. 1857 స్వరాజ్య సంగ్రామం, వి.డి.సావర్కార్, నవయుగభారతి, హైదరాబాద్, 2001.
10. సత్యశోధన లేక ఆత్మకథ, మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ, తెలుగు సేత : వి. రాధాకృష్ణమూర్తి, నవజీవన్, ఆహమదాబాద్, 1993.
11. భారత స్వతంత్ర పోరాటం, బిపన్ చంద్ర, ప్రజాశక్తి, హైదరాబాద్, 2006.
12. తోడేళ్ళ పాలుచేశారు, హిందీమూలం : ప్యారేలాల్, తెలుగు సేత : జి కృష్ణ, గాంధీ సాహిత్యప్రచురణాలయం, హైదారాబాద్, 1969.
13. ఆబుల్ కలామ్ ఆజాద్, అర్షమల్సియాని, భారత ప్రభుత్వ ప్రచురణలు, న్యూఢిల్లీ, 1983.
14. తెలుగు తీర్పు, కె.శ్రీనివాసరావు, ప్రజాశక్తి ప్రచురణలు, హైదరాబాద్, 2003.
15. ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గాలు, యం. సత్యనారాయణ.
16. మనకు తెలియని మన చరిత్ర (తెలంగాణా రైతాంగ పోరాటంలో స్త్రీలు), స్త్రీశక్తి సంఘటన, హైదరాబాద్, 1986.
17. తెలంగాణా పోరాట స్మృతులు, ఆరుట్ల రామచంద్రారెడ్డి, డాక్టర్ ఆరుట్ల కమలాదేవి – రామచంద్రారెడ్డి ట్రస్టు, హైదరాబాద్, 2005.
18. తెలంగాణా వైతాళికులు, యం.యల్. నరసింహరావు, కాకతీయ విజ్ఞాన సమితి, హైదరాబాద్, 1976.
19. తెలుగువెలుగులు, మోనికా బుక్స్, హైదారాబాద్, 2002

